# కళాంజలి




మహానుభావా! నీ చల్లనిచూపులో
వర్షించే ఆశీస్సు లేనిదే ఈ పరిశ్రమలో
మూడు వందల చిత్రాల రచయితగా
మాకు స్థానం లేదు. ఈ సిద్ధాంత వ్యాస రచనా లేదు
కళ్లు తెరవగానే కనిపించే కలియుగదైవానివి నువ్వు
ఈ పుస్తకం మా అమ్మకు అంకితమయినా
నా జన్మ మాత్రం నీకే అంకితం!



ఎడమవైపు నుండి పరుచూరి వెంకటేశ్వరరావు, పరుచూరి రాఘవయ్య,
బేబీ రత్నసరోజిని, పరుచూరి హైమవతమ్మ, కీ.శే. పరుచూరి కుటుంబరావు,
నేలమీద పరుచూరి గోపాలకృష్ణ – 1948లో



హిమబిందు, పరుచూరి గోపాలకృష్ణ, విజయలక్ష్మి
హరిప్రియ, నాగ సుషమ

# తెలుగు సినిమా సాహిత్యం
## కథ - కథనం - శిల్పం

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి
పిహెచ్ డి పట్టా పొందిన సిద్ధాంత గ్రంథం

డా. పరుచూరి గోపాలకృష్ణ ఎం ఏ, పిహెచ్ డి

వీ-టెక్ పబ్లికేషన్స్
షాప్ నెం 14, సొసైటి షాపింగ్ కాంప్లెక్స్
ఫిలిం నగర్, హైదరాబాద్-500033

**TELUGU CINEMA SAHITHYAM**
**KATHA - KATHANAM - SILPAM**

*Written by*
**Dr PARUCHURI GOPALA KRISHNA, M A , Ph D**



*Publishers*
**V-Tech Publications**, Film Nagar, Hyderabad Ph 23548999

*First Edition*
**December, 2003**

*Cover Design*
**Chandra**

*Sole Distributors*
**Visalaandhra Publishing House**
Abids, Hyderabad

**Visalaandhra Book House**
Hyderabad Vijayawada, Visakhapatnam, Guntur, Tirupathi, Hanamkonda, Anantapur, Kakinada

*DTP*
**V-Tech Informatics**, No 14, Society Complex,
Film Nagar, Hyderabad

*Printing*
**Charita Graphics**, Alwal, Secunderabad

Price **Rs 200/-** **US $12**

# హృదయాంజలి



అమ్మా! ఇది నీ కళ్లల్లో ఆనందం చూడటానికి
నీ కొడుకు చేసిన అయిదేళ్ల కృషి!
ఇది నీ ఆశయం కోసం చేసింది.
అందుకే నీకే అంకితమిస్తున్నా
నాన్నతో కలిసి అందుకో!



# స్మృత్యంజలి



కీ.శే. పరుచూరి కుటుంబరావు. 18.4.1945 – 4.2.2002

చిన్నీ! నేను డాక్టర్‌ని అయ్యాను అన్న రోజు అమ్మ కళ్ళల్లో నీళ్ళు.
ఒక కంటిలో ఒక కొడుకు సాధించిన విజయానికి గుర్తుగా ఆనందబాష్పాలు!
రెండో కంటిలో ఒక కొడుకు ఇది చూడలేకపోతున్నాడన్న విషాదాశ్రువులు!!
ఎక్కడున్నావో! ఆనందిస్తున్నావు గదూ!!

Jnanpith Awardee
**Dr C NARAYANA REDDY,**
M A Ph D D Litt
Chairman,
**Andhra Pradesh State**
**Cultural Council**






# ఆశీరభినందనలు

కథ ఎప్పుడు పుట్టింది? మాటలు నేర్చిన ఆదిమానవుడితోపాటే ఆ దశలోనే 'అనగనగా ఒక రాజు' లాంటి చిన్న కథలు పుట్టాయి అనంతరం 'కథాసరిత్సాగరం' లాంటి బృహత్ కథలు ఉదయించాయి కథ నిడివి చిన్నదే కావచ్చు కానీ, దాన్ని దృశ్యాలను బట్టి, సంఘటనలను బట్టి విస్తరింపచేసి రాస్తే అది కథనరీతికిందికొస్తుంది ఆ కథన విధానాన్నే సినీ పరిభాషలో స్క్రీన్‌ప్లే అంటున్నారు

ఒక కథను నాటకీకరించి ఆకాశవాణిలో ప్రసారం చేస్తే అది శ్రవ్య నాటకమవుతుంది రంగస్థలంపైన ప్రదర్శిస్తే అది దృశ్య నాటకమవుతుంది అదే కథను కథనాత్మకంగా చూపిస్తే తెరపైని నాటకమవుతుంది అదే స్క్రీన్‌ప్లే తెరపైన ప్రదర్శించే ఆ రూపకానికి కథనమే ఆయువుపట్టు కథ వుంది కథనముంది అంతటితో సరిపోదు ఒక సినిమా కళ్లకు కట్టేట్టు, మనసును ఆకట్టుకునేట్టు ఉండాలంటే శిల్పం అవసరం అదే కథన శిల్పం

కొన్ని కథల్లోని పాత్రల్లో కేవలం మథనం ఉంటుంది అది చాలదు అందుకు తగ్గ దృశ్యరూపక కథనం ఉండాలి సినీ సంభాషణల రచయితగా శిఖరస్థాయికి చేరిన డా॥ పరుచూరి గోపాలకృష్ణ తన పిహెచ్‌డి [illegible] ఎన్నుకున్న అంశం తెలుగు సినిమా సాహిత్యంలోని 'కథ, కథనం, శిల్పం' సంభాషణల రచన అచ్చమైన సృజనాత్మక ప్రక్రియ అది లోకాన్ని వడబోస్తే కలిగిన అనుభవాల సశక్తమైన ఆవిష్కరణ సృజనాత్మక రచయితగా ఇన్నాళ్లుగా చేయితిరిగిన డా॥ గోపాలకృష్ణ ఇప్పుడు పరిశోధన వ్యాసంగాన్ని చేపట్టాడు

కథారీతులకు సంబంధించిన అనేక ప్రామాణిక గ్రంథాలను అధ్యయనం చేశాడు స్క్రీన్‌ప్లే గురించి అవసరమైన అవగాహనను పెంపొందించుకున్నాడు సినీ రంగ ప్రముఖుల అనుభవాలను సేకరించుకున్నాడు ఒక నిర్దిష్ట ప్రణాళిక ప్రకారం ఈ సిద్ధాంత గ్రంథాన్ని రూపొందించాడు ఇది చలనచిత్ర రంగానికి సంబంధించిన ఒక ప్రామాణిక గ్రంథంగా గణుతికెక్కుతుందనే విశ్వాసం నాకుంది ఉత్తమ [illegible] కావలసిన సమాచార సమీకరణం, వస్తు విశ్లేషణం, రచనా చణత్వం త్రిపుటిగా కైవసం చేసుకుని ఈ గ్రంథాన్ని రచించిన డా॥ పరుచూరి గోపాలకృష్ణకు, ఈ సిద్ధాంత పర్యవేక్షకుడిగా వున్న విద్వద్విమర్శకుడు, వక్తృ శిరోమణి ఆచార్య ఎల్లూరి శివారెడ్డికి నా ఆశీరభినందనలు

చిన్న కొసమెరుపు పరిశోధకుడూ, పర్యవేక్షకుడూ ఉభయులూ ఎం ఏ తెలుగు తరగతుల్లో నా విద్యార్థులే పైగా ఇద్దరూ సహాధ్యాయులే ఇక నాకు కలిగేది ద్విగుణీకృత హర్షమని వేరే చెప్పాలా?

2 12 03

**Prof. E SIVA REDDY,**
M A Ph D (Tel) M A (Sanskrit)
Dept of Telugu,
Univ College of Arts & Social Sciences
Osmania University
Hyderabad-500 007






# వచఃశిల్పి

డా॥ పరుచూరి గోపాలకృష్ణ నాకు ఆత్మీయుడు, సహాధ్యాయి తమ కధా కధన సంభాషణ రచనా నైపుణ్యంతో చలనచిత్రాలకు సరికొత్త ఒరవడి పెట్టిన పరుచూరి సోదరుల్లో ఒకరు మూడు వందల చలనచిత్రాలకు సంభాషణలు సమకూర్చి, కొన్ని చిత్రాలకు దర్శకత్వం, కధ, గీత రచనా బాధ్యత వహించి తన విలక్షణత నిరూపించుకున్న అద్వితీయ రచయిత క్షుణ్ణ మార్గంలో కాకుండ విభిన్న రీతిలో చలనచిత్ర కధకూ, శిల్పానికి సంబంధించి సర్వాంగీణ కోణాలను ఈ సిద్ధాంతవ్యాసంగా రూపొందించిన రసభావవేత్త ఈ సిద్ధాంత వ్యాసరచన కోసం ఆయన చేసిన కృషి అనితరసాధ్యం ఇంత విషయసంగ్రహణ ఆయనకు తప్ప మరొకరికి సాధ్యపడదు విశ్లేషణపురస్సరంగా, సద్యోరమణీయంగా, సశాస్త్రీయంగా, అసిధారవంటి కొసమెరుపులతో చకచకా సాగింది ఈ సిద్ధాంత వ్యాసరచన చలనచిత్ర కధా శిల్పసుందరికి ప్రామాణికత, పఠనీయత రెండు కళ్లుగా సౌందర్యదీప్తి సంతరించిన రచన యిది చలనచిత్రాలకు, గీతాలకు సంబంధించిన సిద్ధాంత వ్యాసాలు కొన్ని వెలువడ్డా కధ, కధనం, శిల్పానికి సంబంధించి ఇది మొట్టమొదటి సిద్ధాంత వ్యాసం ఈ విషయంలో ఆయనా, నేనూ నన్నయ నారాయణభట్టు అంతటివాళ్లం కాకపోయినా సమయమూ, సందర్భమూ మాత్రం అలాంటివే నేను నా ఆత్మీయుని కృషికి సాక్షీభూతుడిగా వ్యవహరించటం మా స్నేహ మధురిమకు అబ్బిన పరిమళం అలాంటి సంభాషణ రచనాశిల్పి చలనచిత్ర కధా క్షీరోదధిని మధించి సాధించిన అభినవామృత కలశమిది! ఆస్వాదించండి

2 - 12 - 2003

# ముందుమాట

ఇది యజ్ఞం కాదు ఇది తపస్సు కాదు ఇది తపన! తల్లి కోరిక తీర్చాలన్న తపన! వయసు మీద పడుతోంది అయిదు పదులు దాటేశాయి నేనుండగా నీ పేరు ముందు డ్వాక్టర్ అని చూడలేనా అని ఎంతమంది తల్లులు ఎందరు కొడుకుల్ని అడిగారో తెలియదు గాని మాఅమ్మ నన్నుఅడిగింది తనకు ఏడు పదుల వయసు దాటాక అడిగింది ఈ పరిశోధనా యజ్ఞానికి పూనుకోవటానికి అసలు కారకురాలు ఆ అమ్మే! ఒకపక్క సినిమాలు, ఇంకోపక్క కార్మికసమాఖ్య కార్యక్రమాలు, ఇంకోవంక తెలుగు విశ్వవిద్యాలయ బాధ్యతలు చివరన అధికార భాషా సంఘం బరువు బాధ్యతలు- ఎన్నో ఎన్నెన్నో నా సంకల్పానికి మేరు పర్వతంలా అడ్డుపడ్డాయి

అయినా ఒక్కటే కోరిక, ఆ తల్లి కళ్ళల్లో ఆనందం చూడాలి పేద మధ్య తరగతి ఇల్లాలిగా, నలుగురు బిడ్డల తల్లిగా, ఆ బిడ్డలు చదువుకోకపోతే ఏమవుతారో అనుక్షణం విడమరిచి చెప్పే ఆదిగురువుగా, వ్యవసాయదారుడిగా ప్రారంభమైన నాన్న, పదేళ్ళకు ఒక వృత్తిలోకి మారుతుంటే చిరునవ్వుతో అనుసరిస్తూ తొలుత రైతు భార్యగా, తరువాత సూపర్‌వైజర్ ఇల్లాలిగా, ఆ తర్వాత వ్యాపారవేత్త సహధర్మచారిణిగా, ఇంకా ఆతర్వాత భర్తతో కలిసి సహోద్యోగినిగా ఎన్ని అవతారాలు ఎత్తిందో ఆతల్లి! 60 సంవత్సరాల దాంపత్య జీవితంలో తన కంటే తన భర్త, తన బిడ్డలే బాగుండాలని కోరుకున్న మహా ఇల్లాలు అందుకే అలిసిపోయిన ఆ ముఖంలో చిరునవ్వు చూడాలి నలతపడిన ఆకళ్ళల్లో మెరుపు చూడాలి కొడుకులు ఉద్యోగాలు సంపాదించినా, పేరుప్రఖ్యాతలు సంపాదించినా, లక్షలు సంపాదిస్తున్నా ఆ మనసుకి ఊరటలేదు! తన కోరిక ఒక కొడుకు ఇంజనీర్ కావాలని, ఇంకో కొడుకు డ్వాక్టర్‌కావాలన్న ఆశఎలాగూ నెరవేరలేదు ఎమ్ ఎ సాహిత్యం చదివాను కాబట్టి సిద్ధాంతవ్యాసం రాస్తే నా పేరు ముందు డ్వాక్టర్ అని వస్తుందమ్మా అని చెప్పిన ముప్ఫై ఏళ్ళ తరువాత అడిగింది, నేనుండగా నీ పేరు ముందు డ్వాక్టర్ అని చూడనా అని ఎంతమంది తల్లులకు ఆ ఓర్పు ఉంటుంది? కొనివ్వటానికి ఇది పట్టుచీర కాదు పట్టా! పి హెచ్ డీ పట్టా! అంత తేలిక కాదు అని ఆవిడకీ తెలుసు, అందుకే అన్నాళ్ళు ఎదురుచూసింది

ఆలస్యం అమృతం అన్న పెద్దలే, విషం అని కూడా చెప్పారు అందుకే విషం కాకముందే విషయం ప్రారంభించాలనిపించింది సరిగ్గా అప్పుడే పాతిక సంవత్సరాల క్రితం కలిసి చదువుకున మిత్రులందరం కలిసి భోంచేద్దాం, గురువులతో కలిసి కాలాన్ని గడుపుదాం అని శ్రీహరి చదువు అనంతరం ఉస్మానియా విశ్వవిద్యాలయం వసతిగృహంలో కలిసాం భోంచేసాం సాహితీల

ఎల్లూరి శివారెడ్డి, ఆవుల మంజులత, సరళకుమారి, ప్రమీలా రెడ్డి, బాలసుబ్బయ్య, లక్ష్మీనారాయణ, రత్న మోహినిఇంకా చాలా మంది సిద్ధాంతవ్యాసాలు రాసి డాక్టర్ పట్టాలు సాధించారు, నువ్వెందుకు చెయ్యకూడదు? అన్నారు చిన్న నాటి నుంచి సహాధ్యాయురాలు శిరీష, అంతేకాక సరస్వతి , లక్ష్మి, పద్మావతి, నాగమణి, నన్ను ఏరా అని సంబోధించే ఏకైక మిత్రుడు సీతారామిరెడ్డి అందరు వత్తిడి తెచ్చారు

అమ్మ కోరికను సన్నిహితులందరికి నేను చెప్పలేదు చెప్పకుండానే అడుగుతున్నారు, అలాగే అన్నాను పాతికేళ్ళుగా ప్రత్యేకశైలిలో ఉండే ఆత్మీయ మిత్రుడు ఆచార్య ఎల్లూరి శివారెడ్డిని నువ్వే నా గైడ్ వి అన్నాను ఇది స్నేహితులు కోసం, తల్లి కోసం చేస్తున్న సంకల్పం మీ అందరి అభినందనలతో పాటు గురువుల ఆశీస్సులు ఎలాగూ ఉంటాయని బలవంతం చేశాను, అంగీకరించాడు

ఏ సబ్జెక్ట్ మీద చెయ్యాలి? చేస్తున్న వృత్తికి దూరంగా పోకూడదు పాతిక సంవత్సరాలుగా సోదరుడు పరుచూరి వెంకటేశ్వరరావుతో కలిసి సుమారు మూడువందల చిత్రాలకు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, కొన్నింటిలో పాటలు రచించిన అనుభవంతో, నిత్యం సమాజంలో సినిమాల మీద జరుగుతున్న చర్చలు గమనించినప్పుడు, చాలామంది సినిమాని ఆస్వాదిస్తున్నారు గాని, అందులో ఉన్న కథ, కథనం, శిల్పం అనే గుణాలను మెచ్చుకోలేకపోతున్నారనేది అర్థం చేసుకున్నాను

"భావ స్థిరాణి జననాంతరసౌహృదాని" అన్న కాళిదాసు శ్లోకం ఎంతమందికి అర్థమవుతుంది? అదే ఆత్రేయ గారు "ఈనాటి ఈ బంధమేనాటిదో ఏనాడు పెనవేసి ముడివేసెనో" అంటే పల్లెప్రజల పెదాలమీద కూడా నాట్యంచేసాయిగదా ఆ పదాలు

అందుకే తెలుగు సినిమా సాహిత్యం మీద అయితే బాగుంటుంది అని శివారెడ్డి సూచించాడు పాతికేళ్ళ కింద మేము వచ్చినప్పుడు గాని, ఇప్పుడు గాని సినిమా కథ అంటే ఇది అని గాని, స్క్రీన్‌ప్లే అంటే ఇది అని గాని, ఇదమిత్థంగా రాసిన వారు లేరు రాయలేక కాదు ఎందుకో రాయలేదు పుంఖాను పుంఖాలుగా లక్ష్యాలున్నాయి తప్ప లక్షణాలు లేవు అప్పుడనిపించింది - నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ తలుచుకుంటే భాగవతం ఏనాడో రాసి ఉండేవారు, కేవలం ఆ భాగ్యం నన్ను వరించటానికే మహానుభావులు ఈ అవకాశం నాకు వదిలిపెట్టారు అని పోతనగారు చెప్పినట్టే , సినీ కథా, దర్శకబ్రహ్మలైన సదాశివబ్రహ్మం, పింగళి నాగేంద్రరావు, సముద్రాల రాఘవాచార్య, బి ఎన్ రెడ్డి, కె వి రెడ్డి, కమలాకర కామేశ్వరరావు, ఆదుర్తి, కె ఎస్ ప్రకాశరావు, విక్టరీ మధుసూధన రావులాంటి హేమాహేమీ లెవ్వరూ సినిమా కథ ఇది, సినిమాలో స్క్రీన్‌ప్లే అంటే ఇది అని నిర్వచించకుండా అదేదో తెరమీద మాత్రం చూపించి, లక్షణం రాసే అదృష్టం నాకు వదిలిపెట్టారు

చేతిలో గీతలు చూసి హస్తసాముద్రికం చెప్పినట్టు, తెరమీద బొమ్మలు చూసి కథ, కథనం, శిల్పం అంటే ఏమిటో రాయాల్సి వచ్చింది సినిమా జాతి మనిషిని గనుక నాకు వస్తుసేకరణ సులభంగా లభించి ఉంటుంది అనుకుంటే అది సమంజసం కాదు సెన్సారు బోర్డు వారిని ఆశ్రయించి, కొన్ని వేల చిత్రాల వివరాలు సేకరించి, ఎన్నో సంవత్సరాలుగా చలన చిత్రాల మీద సమీక్షలు ప్రచురిస్తున్న సితారలు , ఇంకొన్ని సినిమాపత్రికలు సేకరించి, ఆ సమీక్షలన్నీ చదివి, కథ, అభినయం, సంభాషణ మొదలైన స్క్రీన్‌ప్లే అంశాల గురించి వారేం భావించారో దర్శించి,

కొన్ని వేల చిత్రాలను చూసి (కొన్ని క్యాసెట్లు అద్దెకు తెచ్చి, కొన్ని కొని, కొన్ని ఈ టీవి, జెమినీ వారి సౌజన్యంతో చూసి, ఎక్కడా లభించనివి ప్రసారం అయ్యే సమయంలో అది అర్ధరాత్రయినా, అపరాత్రయినా ఆగి చూసి) ఆయా చిత్రాలలోని కథలను, కథనాలను పరిశీలించటం జరిగింది, లభించని కొన్ని చిత్రాల వివరాల కొరకు పూనా వెళ్ళాలనుకున్న సమయంలో, ఆర్కీవ్స్ తగలబడిపోవటం వల్ల ఈ పరిశోధన మరింత జాప్యమైంది

కథనం, స్క్రీన్‌ప్లే, విషయంలో ఆంగ్లభాషాపుస్తకాలను ఆశ్రయించవలసి వచ్చింది కొన్ని గ్రంధాలు అమెరికాలోని చికాగోనుంచి, న్యూయార్కు నుంచి, న్యూజెర్సీనుంచి తెప్పించుకోవలసి వచ్చింది కొన్నిపుస్తకాలు మదరాసులో లభించాయి అంతేగాక అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో న్యాయ నిర్ణేతగా ఉన్నప్పుడు చాలామంది పెద్దలఅనుభవాలు అడిగి తెలుసుకోవటం జరిగింది చెన్నైలో జరిగిన స్క్రీన్‌రైటర్స్ అంతర్జాతీయ సెమినార్లో పాల్గొని, దక్షిణ భారత రచయితల అనుభవాన్ని రికార్డ్ చేసుకోవటం జరిగింది కె బాలచందర్, పి వాసులాంటి ప్రముఖులందరూ వారివారి అనుభవాలు చెప్పటం, జిమ్ విల్సన్‌గారు వారి అభిప్రాయాలు చెప్పటం కూడా జరిగింది ఆ అనుభవసారం కూడా ఈ సిద్ధాంతవ్యాసంలో చోటు చేసుకుంది ఫిలింన్యూస్ ఆనందన్ (చెన్నై) గారితో నాకు పరిచయం లేదు మా రెండో అన్నయ్య పరుచూరి కుటుంబరావు (చిన్ని) ఎంతో శ్రద్ధ తీసుకుని ఆ వివరాలన్నీ సేకరించి పంపాడు

ఇలా ఒక్కొక్కటిగా సమాచార సేకరణ పూర్తి కావటానికి సుమారు రెండు సంవత్సరాలు పట్టింది ఈ మధ్యలో ప్రీ పి హెచ్ డి పరీక్షలు రాయాల్సి వచ్చింది సినిమా కథ గురించి కాదు, సాహిత్యం లో కథ గురించి అనేక కథల సంపుటాలు కొని, నవలలు కొని, సాహిత్య వనంలో కొన్ని మాసాలు బాటసారినై, కథల పరీక్షలో 83 మార్కులు తెచ్చుకున్నాక ధైర్యం వచ్చింది ఈ సిద్ధాంత వ్యాసం రాయగలనని

ఏ సినిమా చూస్తున్నా సినిమాలో రసానుభూతిని అనుభవించటం మానేసి, ఇందులో కథ ఏమిటి అని వెతకటం ప్రారంభించాను పాతికేళ్లగా రచయితగా ఉన్న నాకు కథంటే ఏమిటో తెలుసు, స్క్రీన్ ప్లే అంటే ఏమిటో తెలుసు కాని కథంటే ఇది అని స్క్రీన్ ప్లే అంటే ఇది అని సిద్ధాంతీకరించాక అది అందరి ఆమోదం పొందాలి కదా! అందుకే ఆ పరిశీలన పత్రికలో చదివేది కథే, ఇప్పుడు చూస్తున్నది కథే కదా! మరింక సినిమా కథ గురించి ప్రత్యేకంగా రాసేదేమిటి? ఇలా ఆలోచిస్తుండగా ఒకరోజు రక్కున స్ఫురించింది, అవును సాహిత్యకథ చదువుతాం - సినిమాకథ చూస్తాం అని ఆ తరువాత అనిపించింది పాఠకులు అనేకులు ఉండవచ్చు, కాని గదిలో కూర్చుని పాఠకుడు చదువుకునేటప్పుడు ఒక్కడే సినిమా హాలులో సినిమా ఒక్కడు చూడడు, అనేకులు చూస్తారు ఇలా ఆలోచించుకుంటూ పోతూ ఉండగా సినిమా కథకి కొన్ని ప్రత్యేక లక్షణాలు కనిపించాయి

అలా ప్రారంభమైన పరిశోధన ఆచార్య ఎల్లూరి శివారెడ్డి గారి చొరవతో ఒక ఏడాది పొడిగించబడి, ఇక ఆరునెలల కాలం ఉంది అని గడువు గుర్తుకు వచ్చాక, అన్నయ్య వెంకటేశ్వరరావు దగ్గరకి వెళ్ళి అమ్మ కోరిక తీర్చాలి అంటే ఈ ఆరు నెలలు నేను సినిమాలకు అంతగా పనిచేయలేను,

కాదు అంటే సిద్ధాంత వ్యాస రచన వదిలేయాల్సి వస్తుంది, ఏం చెయ్యమంటావు? అని అడిగాను నీ పని కూడా నేనే చేస్తాను అమ్మ కోరిక తీర్చు అన్నాడు నా భార్య విజయలక్ష్మికి ఈ సంగతి చెప్పి ఈరోజు లగాయితు ఆరు నెలల పాటు మేడ మీద నాసిద్ధాంత వ్యాస రచన సాగుతుంది, నువ్వుగాని, మనుమడు భువనసాయి కృష్ణగాని పైకి రాకూడదు, భోజనం కోసం నేనే కిందకి వస్తానని చెప్పాను అప్పుడే అమెరికా నుంచి మూడవ కుమార్తె హరిప్రియ, తన కుమార్తె తన్వితో వచ్చింది నా కూతురు తెలుగులో మాట్లాడటం లేదు, అది తెలుగు మాట్లాడాకే నేను అమెరికా వెళతాను అంది అప్పుడొక విషయం చెప్పాను "అమ్మా! వజ్జలచిన సీతారామ శాస్త్రి గారు వ్యాకరణ సంహితా సర్వస్వం రాసే రోజుల్లో రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతోందని ఆయనకు తెలియదట అంత ఏకాగ్రతతో ఈ ఆఖరి భాగమైన శిల్పాన్ని రాయబోతున్నాను, దయచేసి ఎవరూ నా ఏకాగ్రతకు భంగం కలిగించవద్దు అని" అందరూ అంగీకరించారు

కార్మిక సమాఖ్య బాధ్యతలు శిష్యుడు శివకృష్ణ, తమ్ముడు ఓ కళ్యాణ్, టి ప్రభాకర్ చూసుకున్నారు ఇంటి బాధ్యతలు ఇల్లాలు చూసుకుంది సినిమా బాధ్యతలు అన్నయ్య చూసుకున్నాడు అమెరికానుంచి పెద్దమ్మాయి హిమబిందు ఫోన్ చేస్తే అమ్మతో మాట్లాడేది తప్ప నా ఏకాగ్రతకు భంగం కలిగించలేదు రెండో అమ్మాయి నాగ సుషమ, కూతురు ఉజ్జయిని, కొడుకు కార్తీక్‌తో వచ్చినా కంటిచూపుతో పలకరించి వెళ్ళేది అందరి సంకల్పం నేను అమ్మ కోరిక తీర్చాలి! ఈ గ్రంథం పూర్తిచేయాలి అంతే! అందరి ఆశీర్వాద బలమే ఇది

పాతాళ భైరవి, మాయాబజార్, అనార్కలి, భీష్మ, రోజులు మారాయి, బడిపంతులు, శంకరాభరణం, సాగరసంగమం, బొబ్బిలిపులి, స్వాతి, కలికాలం, శుభలగ్నం, అన్నమయ్య ఈ సినిమాలన్నీ ఇంతకుముందు చూసినవే కాని ఇప్పుడు చూస్తున్నది ప్రేక్షకుడి కళ్ళుకాదు, పరిశోధకుడి కళ్ళు బందిపోటు, పాడిపంటలు, అల్లూరి సీతారామరాజు, కురుక్షేత్రం చూస్తున్నప్పుడు గాని గుర్తుకు రాలేదు - తెలుగు సినిమా వైవిధ్యాలలో జానపద, సాంఘిక, చారిత్రాత్మక, పౌరాణిక ప్రక్రియలన్నింటిని రాసిన *లివింగ్ లెజెండ్* త్రిపురనేని మహారథే కదా అని!

ఖైదీ, బొబ్బిలిబ్రహ్మన్న, ప్రతిధ్వని, కర్తవ్యం, అసెంబ్లీరౌడీ, గణేష్, సమరసింహారెడ్డి, నరసింహనాయుడు, ఇంద్ర అన్నీ స్వకపోల కల్పితాలే కాని అగ్ని పురాణంలో కథానిక లక్షణానికి, ఖైదీ కథ అక్షరాలా అతికిపోతుందని ఇప్పుడు చూస్తుంటే తెలిసింది అలాగే అసెంబ్లీరౌడీ లో భాషా సీన్, పోలీస్‌స్టేషన్ సీన్, మంత్రి ఇంట్లో సీను ఒక శూన్యాన్ని నింపే శిల్పంలో భాగం పంచుకున్నాయన్నది లోతుగా చూస్తే తెలిసింది

ముత్యాలముగ్గు చిత్రానికి ఆపేరు ఎందుకు పెట్టారో బాపు రమణలను అడగకుండానే రాయాలనిపించింది , రాసాను ఈ గ్రంథంలో నేను రాసిన ప్రతి మాటతోను ప్రతి రచయితా ఏకీభవించాలని నేను కోరుకోవటం లేదు అంగీకరించనూ వచ్చు - లేదా కొత్త సిద్ధాంతాన్ని స్థిరీకరించనూ వచ్చు ఏదయినా నాకు ఆనందమే సినిమాకి రాసేది సాహిత్యమే కాదు అని వాదించే వాళ్ళకు, సినిమాకథని ఇన్నికోణాల్లో దర్శించవచ్చు అని ఎంతమంది చెప్తే నాకు అంత ఆనందం

నిజానికి ఇంకా చాలా రాయాలి ఉస్మానియావిశ్వవిద్యాలయంలో 350 పేజీలకు మించి

సిద్ధాంత వ్యాసం ఉండకూడదని నియమం ఉంది అందుకే అప్పుడప్పుడు నా కలంగొంతు నొక్కవలసివచ్చింది తాపీ వారి చిత్రాలు తీసుకున్నా, నరసరాజుగారి సరసవచోనిర్భరత్వాన్ని వెలార్చాలన్నా, పాలగుమ్మి పద్మరాజు రచనలో పల్లవించిన అందాలు విశదీకరించాలన్నా, ముళ్ళపూడి మాటలు అందుకున్నా, ఆత్రేయ ఆవేదనను అర్థం చేసుకోవాలని ప్రయత్నించినా, మహారథి రచనామర్మాన్ని విడమరిచి చెప్పాలన్నా, జంధ్యాల హాస్యాన్ని వడ్డించాలన్నా, సత్యానంద్ సెంటిమెంటల్ టచ్‌కి అర్థం అందించాలన్నా, మోదుకూరి జాన్సన్ ప్రతిభను వివరించాలన్నా, ప్రతివారి గురించి ఒకసిద్ధాంతవ్యాసం రాయాల్సిందే! అంతేకాదు జూనియర్‌సముద్రాల, మద్దిపట్ల సూరి, బొల్లిముంత శివరామకృష్ణ, పినిశెట్టి, అనిశెట్టి, గణేష్‌పాత్రో, సత్యమూర్తి, హరనాధరావు, ఆకెళ్ళ, సంజీవి, దివాకర్‌బాబు, తోటపల్లి మధు, సాయినాథ్, మరుధూరి రాజా, పోసాని కృష్ణమురళి, విజయేంద్రప్రసాద్, చిన్నికృష్ణ ఇలా ఎందరో ప్రముఖ రచయితల మేధాసంపత్తి ఇందులో సరిపడా వివరించబడలేదు ఆగి, పుస్తకాన్ని ముద్రణ వేయిద్దామంటే ఆత్మీయులు, పరిశ్రమపెద్దలు ఐదుసంవత్సరాలుగా ఈ పుస్తకం కోసం ఎదురు చూస్తున్నాం త్వరగా ముద్రించండి అన్నారు ఈ పుస్తకం ముద్రింపబడితే భావి రచయితలకు, దర్శకులకు ఉపయోగపడుతుందని పరీక్షకులు తెలియజేసారని ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారు చెప్పారు అందుకే స్వల్ప మార్పులతో ఈ పుస్తకాన్ని వెంటనే ముద్రించటం జరిగింది వీలువెంట దీనిని మూడు భాగాలుగా చేసి, తెలుగు సినిమా - కథ, తెలుగు సినిమా - కథనం ( స్క్రీన్‌ప్లే ), తెలుగు సినిమా - శిల్పం అని విస్తరించి రాయాలని, భాషా పరివర్ధనం చేయాలని సంకల్పం అమ్మ ఆశీస్సులు, భగవంతుడి కరుణ, నా చేత ఆ సంకల్పాన్ని త్వరగా పూర్తి చేయించాలని కోరుకుంటున్నాను

తెలుగు కవిత్వానికి ఆద్యుడు బాధ్యుడు నన్నయ్య, ఆధునిక కవిత్వానికి ఆద్యుడు శ్రీశ్రీ ఈనాడు తొలిసారిగా సినిమాసాహిత్యంలో కథ, కథనం, శిల్పాలకు, ఇవి నిర్వచనాలని వారితో పోల్చటానికి వీలులేని నేను రాసాను వారు పర్వతాలైతే పరమాణువులాంటి నేను రాసాను ఇది మహనీయులు నాకోసం వదిలిన సువర్ణావకాశం అని ఇంతకుముందే సెలవిచ్చాను సిద్ధాంతవ్యాస నిబంధనల మేరకు నేను గౌరవించే పెద్దల పేర్ల పక్కన గౌరవవాచకాలు వాడలేదు పెద్దలు గమనించాలి మీ ఆశీస్సులు నాకు కావాలి మీ సూచనలు నాకు కావాలి వాటికోసం ఎదురుచూస్తూ- సినిమాలోని కథావైవిధ్యం మీద, సంభాషణల పైన, పాత్రచిత్రణల గురించి, అభినయం గురించి కనీసం నూరుఅంశాలను ఎన్నుకుని సిద్ధాంతవ్యాసాలు రాసే అవకాశం ఉన్న హిందూమహాసముద్రం సినిమాసాహిత్యం ఆణిముత్యాలను వెలికితీయటానికి ఎందరో రావాలని కోరుకుంటున్నాను **చదివించిరి నను గురువులు** అని ప్రహ్లాదుడు చెప్పినట్టుగా నాకు చదువు చెప్పిన ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు, పల్లాదుర్గయ్య గారు, ఖండవల్లి లక్ష్మీ రంజనంగారు, పాటిబండ మాధవ శర్మ గారు, సి నారాయణరెడ్డి గారు, నాయని కృష్ణకుమారి గారు, జి వి సుబ్రమణ్యం గారు అందరికి ప్రణమిల్లుతూ, ప్రేక్షకలోకం, పాఠకలోకం, సినీసాహితీలోకం ఆశీర్వదించాలని కోరుకుంటూ

బుధజన విధేయుడు

డా పరుచూరి గోపాలకృష్ణ

# కృతజ్ఞతలు

ఈ పరిశోధనకు అవకాశం కల్గించిన ఉస్మానియా విశ్వవిద్యాలయం పాలక వర్గానికీ, అడుగడుగునా నన్ను ముదలకిస్తూ, అనువైన సూచనలిస్తూ, ఈ పరిశోధనా గ్రంథాన్ని సకాలంలో నేను పూర్తిచెయ్యటానికి కారకులై, సిద్ధాంతగ్రంథాన్ని పర్యవేక్షించిన ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికి కృతజ్ఞతలు

'గోపాలకృష్ణా అయ్యిందా' అంటూ ఆత్మీయంగా అనేక పర్యాయాలు అడిగిన గురుదేవులు డా సి నారాయణ రెడ్డి గారికి, అవసరమైన పుస్తకాలు అందించిన ఆచార్యపుత్రిక గంగకు, వేదగిరి రాంబాబు గారికి, వాసిరెడ్డి నవీన్‌గారికి, ఆవుల మంజులతగారికి, గొల్లపూడి మారుతీరావు గారికి కృతజ్ఞతలు

ఫాకల్టీఆఫ్‌ఆర్ట్స్ డీన్ ఆచార్య అదితిముఖర్జీ గారికి, ప్రస్తుత తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి, పాఠ్యప్రణాళికా సంఘాధ్యక్షురాలు ఆచార్య పి సుమతీ నరేంద్ర గారికి ధన్యవాదాలు

సినిమా ఒక సముద్రం వస్తుసేకరణకు నాకు సహాయపడిన పత్రికాధినేత శ్రీ రామోజీరావు గారికి, 'జెమినీ' కిరణ్ గారికి ప్రత్యేక కృతజ్ఞతలు ఈ పరిశోధనకుపయుక్తమైన వేలాది సినిమాల తాలూకు రచయితలు, దర్శకులందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు

జీవితంలో సగభాగం భార్యదయితే నా రచనలో సగభాగం ఎప్పుడూ మా అన్నయ్య పరుచూరి వెంకటేశ్వరరావుదే ఈ పరిశోధన నేను పూర్తి చేయటం కోసం, సినిమాల్లో నా వంతు కష్టం కూడా ఆయనే భరిస్తూ వచ్చారు ఆయనకు ఆత్మీయ కృతజ్ఞతలు

ఒకనాటి శిష్యులు ఈనాడు స్వయం ప్రతిభావంతులు అయిన ఎ కె ప్రభాకర్, సిహెచ్ పి సత్యనారాయణ, జె నాగేశ్వరరావులు పరిశోధన ఆఖరిదశలో తగు విధంగా సాయపడ్డారు వందలాది పేజీలను శ్రమకోర్చి డి టి పి చేసిన బి గౌతమ్ కుమార్, జె క్రాంతికుమార్‌లకు, ప్రూఫ్‌రీడింగ్ విషయంలో శ్రద్ధగాచూసిన వల్లూరు శివప్రసాద్‌కి ఆశీఃపూర్వక కృతజ్ఞతలు

ఈ పుస్తకం ముద్రణ విషయంలో సినిమాపట్టికలు అందించిన సూపర్‌హిట్ పత్రికవారికి, ఇతరత్రా సహకరించిన పి యన్ రాయ్, వెల్లంకి ప్రమీల, వి ఎస్ ఎస్ కుమార్‌బాబు, రాంబాబు, మధుసూదనరావ్‌లకు ధన్యవాదాలు

పరిశోధన మొదలుపెట్టిన దగ్గరనుంచీ, మీపేరుముందు డాక్టర్ అని ఎప్పుడు చూస్తాం అని అడుగుతూ ప్రోత్సహించిన నా పిల్లలు హిమబిందు, నాగసుషమ, హరిప్రియలకు ఆశీస్సులు

ఆఖరికి చెబుతున్నా, ఆద్యంతమూ నాపరిశోధనలో సహకరించి, ఆఖరి పేజీ రాయగానే కరచాలనం చేసి 'అమ్మయ్యా కాపలా కాయలేక పోతున్నాను' అని ఆత్మానందాన్ని పొందిన ఇల్లాలు, స్నేహితురాలు తనే అయిన నా సహధర్మచారిణి పరుచూరి విజయలక్ష్మికి అనురాగ కృతజ్ఞతలు

# విషయ సూచిక

# ప్రథమాధ్యాయం

# సినిమా ఆవిర్భావ - వికాసాలు

'సినిమాను తక్కువగా అంచనావేయకండి సినిమావాళ్ళు ఏదో ఒకనాడు మానవజాతికి శాసనకర్తలవుతారు' అని నోబెల్ బహుమతి గ్రహీత జార్జ్ బెర్నాడ్‌షా ఏబై సంవత్సరాలక్రితం చెప్పిన మాట పాక్షికంగానయినా నిజంఅని, రొనాల్డ్‌రీగన్ అమెరికాను పాలించినప్పుడు, అన్నాదొరై, కరుణానిధి, యమ్ జి రామచంద్రన్, జయలలిత, నందమూరి తారకరామారావు, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలను పాలించినప్పుడు ఋజువయ్యింది దేశాల్ని, రాష్ట్రాల్ని ఏలేనాయకుల్ని తయారు చేసిన కథానాయకుల్నేసృష్టించిన సినిమాకథ గురించి తెలుసుకోవటం చాలాఆసక్తికరంగా ఉంటుంది

**సినిమా :**

చలన చిత్రానికి ఆంగ్లంలో సినిమా, మూవీ, ఫిల్మ్ అనే పదాలు వాడుతూ ఉంటారు నిజానికి మొదటిరెండు తీయబడినచిత్రాలకు సంబంధించిన పర్యాయపదాలయితే, ఫిల్మ్ అనేది - చలనచిత్రం తీయటానికి ఉపయోగించే ముడిసరుకు కొరకు ఉపయోగించే పదం

మూవీ అనేపదం మూవింగ్ ఇమేజస్ కలిగిఉన్నది కాబట్టి వచ్చింది దానికి సమానార్థకంగా చలిస్తున్నచిత్రాలతో కూడినదికాబట్టి చలనచిత్రం అనేపదం పుట్టింది ఒకసెకనుకి ఇరవైనాలుగు బొమ్మలు ( ఫ్రేములు) కదులుతుంటే ఈనాడు జనం చూస్తున్న

సినిమా అవుతుంది అంతకంటే తక్కువ ఫ్రేములయితే కదలిక అసహజంగా ఉంటుంది చార్లీ చాప్లిన్ సినిమాలు, ఇప్పుడుచూసే స్వాతంత్ర్యోద్యమం తాలూకూ **డాక్యుమెంటరీలు** పద్దెనిమిది ఫ్రేముల చొప్పున కదలబట్టే గాంధీగారు చాలావేగంగా నడుస్తున్నట్టు కనిపిస్తుంది

అదే నలభై ఎనిమిది, తొంభైయారు అలా ఎక్కువ ఫ్రేములు నడిస్తే, **స్లోమోషన్** అంటారు అలాక్షణానికి కొన్నిచిత్రాలు ఒకపద్ధతిలో నడుస్తున్నప్పుడు ఆ కదలిక వెండితెరమీద సజీవమై కనిపించటమే సినిమా

ఈనాడు ప్రపంచంలో ఉన్న సుమారు ఏడువందల కోట్ల ప్రజలకు వినోదాన్ని అందిస్తున్న ఏకైక ప్రక్రియ **చలనచిత్రప్రక్రియ**, అదే సినిమా

**పుట్టుక :**

ఈ చలనచిత్రం అనేది ఎప్పుడుపుట్టింది? ఎలాపుట్టింది? ఎందుకుపుట్టింది అనే విషయాన్ని పరిశీలిస్తే సినిమాపండితులు ఇలాఅంటారు

> *"As several of the contributors paint out cinema was not invented It was the result of a complicated process which has begun about three centuries earlier, a process which mixed science, entertainment, popular culture and the other media, story telling, business and education in varying proportions "*[1]

నిజం!

అక్షరసత్యం! సినిమాని ఎవరూ కనిపెట్టలేదు ఒక విమానంలాగా, ఆకాశవాణిలాగా, రైలు ఇంజన్‌లాగా (పొగబండిలాగ) అది ఒకవ్యక్తిచేత ఒకరోజు కనిపెట్టబడిన వస్తువుకాదు కొన్ని వందల సంవత్సరాల పాటు రూపాంతరం పొందుతూ వచ్చిన **దృశ్యకావ్యప్రక్రియ**

మన తెలుగునాట **దృశ్య, శబ్ద, సంగీత** సమ్మిళితమైన వినోద ప్రదర్శన ప్రారంభమయ్యింది**కురవంజితో** మహారాజులు వేటకోసంవచ్చి, మధ్యాహ్నసమయంలో విశ్రాంతితీసుకొనే సందర్భంలో, విందుకుడుస్తూ వినోదాన్నిఆకాంక్షించేనేపథ్యంలో, ఆటవికులు, ప్రభువులను ప్రసన్నం చేసుకోవటంకోసం, ఆడుతూపాడుతూ, మృగాలవలెనర్తిస్తూ, డప్పులు, కొమ్ముబూరలతో వాయిద్యాలువాయిస్తూ, గానంచేస్తూ అడుగులువేసే ప్రక్రియ **కురవంజి**

*కురవంజి ఒక జానపద దృశ్యకావ్యం*[2] *కురవంజి అనగా* [illegible] *కూడిన అడుగు అడవులలో నివసించే కురవలనేవారి అడుగుకాబట్టి, దానిని* **కురవంజి** *అని కూడా పిలుస్తూ వచ్చారు* *గంతులు*, *చిందులు*, *గొండ్లి*, *అంజె అనేవి నృత్యవిశేషానికి సంబంధించిన పర్యాయపదాలు*

ఇలాంటి జానపద నృత్యవిశేషాలనుండి నేటి నాట్య, నాటక విధానాలకు ఎలా రూపాంతరం చెందాయో నాగభూషణశర్మ వివరిస్తున్నాడు

> *"Folk Art, the unassuming creative expression of millions of village people, is a treasure-house of their customs and group behaviour, beliefs and concerns, pains and pleasures, infact, their very ways of life*
>
> *"In the absence of classical forms of dance and drama for a considerably long period in history, the folk performing arts had filled in an important lacuna in the otherwise struggling lives of the people*
>
> *"Religious festivals attract a wider participation of people, not only in paying their grateful obeissance to the Gods and Godesses, but also expressing their gratitude through song, dance and drama"*[3]

అలా ప్రారంభమై పెరుగుతూవచ్చిన ఈ దృశ్యకావ్య వినోదప్రక్రియ అనేకవిధాలుగా రూపాంతరం పొందింది *యక్షగానం* అయ్యింది చెక్కబొమ్మలాట అయ్యింది **తోలుబొమ్మలాటగా** పరివర్తన పొందింది *హరికథగా*, *బుర్రకథగా*, *వీధినాటకంగా*, రంగస్థలనాటకంగా ఎదిగి, చలనచిత్రంగా సంపూర్ణత్వాన్ని సిద్ధింప జేసుకుంది 20వ శతాబ్దంలో సాంస్కృతిక విప్లవం సాధించిన ఒక ప్రక్రియ సినిమా అనికూడా అంటారు

కదిలేబొమ్మగా, గోడమీదబొమ్మగా (తెరలు లేనప్పుడు తెల్లటి గోడలమీద ప్రదర్శించేవారు), తెరమీదబొమ్మగా, రంగులబొమ్మగా, మాటలులేనిబొమ్మగా, మాట్లాడేబొమ్మగా రూపాంతరాలు పొందుతూ వందలకోట్ల ప్రజలను వినోదపరుస్తూ, చైతన్యవంతుల్ని, విజ్ఞానవంతుల్నిచేస్తూ ముందడుగు వేస్తున్నది సినిమా

## ప్రపంచ సినిమా

ప్రపంచంలో ఈ సినిమా ఎప్పుడు పుట్టింది?

ఒక వస్తువుగాని, ఒక ప్రాణిగాని అది కదిలే క్రమంలో ఛాయాచిత్రం తీసి, ఆ చిత్రాలన్నింటిని ఒకే క్రమంలో తెరమీద ప్రదర్శిస్తే ఆ వస్తువు లేదా ప్రాణి నిజంగానే

కదులుతున్న భావం ప్రేక్షకులకు కలుగుతుంది ఇది నిరూపించినవాడు, ఇంగ్లాండుకి చెందిన ఎడ్వర్డ్‌మైబ్రిడ్జ్ (1877)

ఈ సూత్రాన్ని ఆధారంచేసుకుని తొలిమూవీకెమేరాను అందించిన ఘనత ఇంగ్లాండుకి చెందిన ఫ్రీజ్ గ్రీన్‌కు దక్కింది 1887లో ఫ్రీజ్ గ్రీన్ అతివేగంగా ఫోటోలను తీయగలిగిన కెమేరాను కనిపెడితే ఈఫోటోలను ప్రదర్శించటంకోసం 1891లో థామస్‌ఆల్వాఎడిసన్, 1892లో ఎమిలీరేనాల్డ్‌లు రెండు రకాల ప్రొజెక్టర్లను కనిపెట్టారు 1895లో ఉడ్‌విల్ లాథమ్ అనే వ్యక్తి లాథమ్‌లూప్ సహకారంతో ఫిలింరీలును ఆపకుండా ప్రదర్శించే సౌలభ్యాన్ని కనిపెట్టాడు

ఈ పద్ధతిలో సినిమాలు నిర్మించవచ్చు అన్న మొట్టమొదటి ఆలోచన ఫ్రెంచిసోదరులైన లూమియర్ బ్రదర్స్‌కి వచ్చింది వారు 1894-95 సంవత్సరాలలో ఈ చలనచిత్ర ప్రక్రియకు శ్రీకారాన్ని చుట్టి, మొట్టమొదట ధనికవర్గాలను వినోదపరుస్తూ, ఆ వినోదానికి సుంకం అడగటం మొదలు పెట్టారు

ఫిబ్రవరి 21, శుక్రవారం, 1896న లండన్‌లో *రీజెంట్‌వీధిలో*, *గ్రేట్‌హాల్ ఆఫ్ పాలిటెక్నిక్ ఇన్‌స్టిట్యూషన్‌లో* ఈ ప్రదర్శన జరిగింది [3] చిత్రం పేరు *లీవింగ్ ద ఫ్యాక్టరీ*

సినిమా 1890లో ప్రారంభమయ్యిందన్న వాదనా ఉంది

> *"Cinema was born in the 1890s, the 'last machine' of victorian invention British inventors had been involved in experiments with photography and Thomas Edison's 'Peepshow' kinetoscope was developed in America with the assistance of Englishman WK Dickson The first public cinema exhibition in Britain is recorded as being organised by a representative of the french producers, the lumiere brothers at Malborough hall in regent street, london on 21st february 1896"* [4]
>
> *హాలీవుడ్‌లో 1927లో వార్నర్ బ్రదర్స్ నిర్మించిన జాజ్‌సింగర్ తొలిటాకీ చిత్రం ఈ చిత్రంలో నలభై శాతం మాత్రమే సంభాషణలు తరువాత వచ్చిన షోబోట్ పూర్తి శబ్దంకలిగిన తొలి చిత్రం ఈ చిత్రాలతోపాటు మెలడీ ఆఫ్ లవ్ అనే చిత్రం కూడా ఇండియాలో పలు చోట్ల ప్రదర్శించబడింది* [5]

అలా 107 సంవత్సరాలక్రితం ఇంగ్లాండులో పుట్టిన సినిమా, అమెరికా దేశంలో

అభివృద్ధి పొందింది హాలీవుడ్ కేంద్రంగా ప్రపంచవ్యాప్తంగా ప్రదర్శనకునోచుకునే సినిమాలు నిర్మించబడుతున్నాయి

అన్ని దేశాలలోకి ప్రవేశించినట్లుగానే చలనచిత్ర ప్రక్రియ భారతదేశంలోకి కూడా వచ్చింది

## భారతీయ సినిమా

1896 ఫిబ్రవరి 21న లండన్‌లో మొదటి చలనచిత్రప్రదర్శన జరిగితే, జులై 7, 1896న బొంబాయిలో వాట్సన్ హోటల్‌లో లూమియర్ సోదరులు ఆరు నిశ్శబ్దచిత్రాలను ప్రదర్శించారు

*1 ఎంట్రీఆఫ్ సినిమాటోగ్రాఫి 2 ఎరైవల్ ఆఫ్ ఎ ట్రైన్*

*3 ది సీ బాత్ 4 ఎ డిమాలిషన్*

*5 లీవింగ్ ద ఫ్యాక్టరీ 6 లేడిస్ అండ్ సోల్జర్స్ ఆన్ వీల్స్*

*ఈ ఆరుచిత్రాలు తక్కువ నిడివిగల చిత్రాలు ప్రతిరోజు నాలుగు ఆటల చొప్పున ప్రదర్శించారు అప్పుడు ఆ ప్రదర్శనలకు **విశ్వంలో వింతశతాబ్దపు మహాద్భుతం** అని పేరు పెట్టారు* [6]

1899లో ఇంగ్లీషువాళ్ళసహకారంతో, బొంబాయిలోనే *హరిశ్చంద్ర భట్ వడేకర్* రెండు చిన్నచిత్రాలను నిర్మించాడు, ప్రదర్శించాడు తొలి చలనచిత్రనిర్మాతగా తనపేరును సువర్ణాక్షరలిఖితం చేసుకున్నాడు

**దాదాసాహెబ్ ఫాల్కే (30 04.1870 – 16.02.1944)** 1913వ సంవత్సరం మే 3వ తేదీన తొలిసారిగా పాశ్చాత్యుల సహకారంలేకుండా *రాజాహరిశ్చంద్ర* అనే చిత్రాన్ని స్వదేశీ మేధస్సుతో నిర్మించి ప్రదర్శించాడు *ధండిరాజ్ గోవిందఫాల్కే*. ఈయన భారతీయ చలనచిత్ర పితామహుడుగా కీర్తి పొందాడు ఈయన పేరుతో దాదాసాహెబ్ ఫాల్కే అవార్డును భారత ప్రభుత్వం ఎన్నో సంవత్సరాలుగా ఇస్తోంది

> *"Dada Saheb's Raja Harishchandra is recognised as the first indigenously made story film It was released in Bombay in 1913, and was not only produced, directed, written and photographed by him, but also processed, printed and edited by him"* [7]

*నాసిక్‌లో పుట్టిన దాదాసాహెబ్‌ఫాల్కే నాసిక్‌లోనే తన 74వ ఏట ఫిబ్రవరి 16, 1944లో వెండి తెరనుంచి మబ్బుతెరలోకి నిష్క్రమించాడు మూవింగ్ పిక్చర్*

మాసపత్రికవారు నాసిక్‌లో వృద్ధాప్యంలో ఒంటరితనాన్ని సహవాసినిగా పరిశ్రమకు దూరంగా ఆయన జీవిస్తున్నప్పుడు మీ ఫోటో కావాలి అని రాస్తే,

"నేను ఏ పరిశ్రమకు జన్మనిచ్చానో ఆ పరిశ్రమ నన్ను మరిచిపోయింది మీరెందుకు జ్ఞాపకం చెయ్యాలని చూస్తున్నారు, మరిచి పోవటం ప్రపంచపు ప్రవృత్తి"[8] అని సమాధానం రాసాడట

నిజం ! సినిమా రంగులకల ! రంగులు కరిగిపోగానే కల చెదిరిపోతుంది !

ఈ పితామహుడు సుమారు వంద చిత్రాలు నిర్మించాడు 1969 ఆయన శతజయంతి సంవత్సరం కావటంతో భారతప్రభుత్వం ఆయన పేరుతో అవార్డును ప్రకటించి భారతచలన చిత్ర పరిశ్రమకు గణనీయమైన సేవచేసినవారికి అందిస్తూవస్తోంది

ఈ ప్రతిష్ఠాత్మకమైన అవార్డును ఈ కింది తెలుగువారు పొందారు

| | | |
|---|---|---|
| 1 | బి యన్ రెడ్డి | 1975 |
| 2 | ఎల్ వి ప్రసాద్ | 1983 |
| 3 | బి నాగిరెడ్డి | 1987 |
| 4 | అక్కినేని నాగేశ్వరరావు | 1991 |

అయితే 1912 మే నెలలోనే ఆర్ జి టోర్నే, అమెచ్యూర్ నాటక సంస్థ ప్రదర్శించిన మరాఠీ నాటకం - **పుండలిక్**ని నాటక ప్రదర్శనప్పుడే యధాతథంగా, వీడియో తీసినట్లుగా ఒక కెమేరాతో చిత్రీకరించి విడుదల చేసాడు అయితే ఆ చిత్రంకోసం కథ, **స్క్రీన్‌ప్లే,** మాటలు, **ఎడిటింగ్,** **ఆర్ట్** మొదలైన ప్రక్రియలేమీ లేవుగనుక ఇది మొదటి భారతీయసినిమాగా గుర్తింపబడలేదు

1913లో అలా చలన చిత్ర నిర్మాణం ప్రారంభమయినా అవి నిశ్శబ్దచిత్రాలు కావటంతో, మన భాష వినపడకపోవటంతో మనచిత్రాలు అని సగర్వంగా చెప్పుకోలేకపోయాం

*ఫిబ్రవరి 4, 1931న, బొంబాయి, ఎంపరిస్ థియేటర్‌లోనూ, కలకత్తాలోనూ రెండు చిన్న నిడివిగల టాకీ చిత్రాలను 'మదన్స్' అనువారు విడుదల చేసారు ఆ మరునాడు శ్రీకృష్ణ ఫిలిం అండ్‌కో 'రియాల్టో (Rialto) టాకీస్'లో వారి టాకీలను విడుదల చేసారు*[9]

బొంబాయికి చెందిన ఆర్దెషీర్ ఎమ్ ఇరాని, కలకత్తాకు చెందిన జె ఎఫ్ మదన్

ఇద్దరూ తమ టాకీ చిత్రాల నిర్మాణాన్ని గోప్యంగా ఉంచారు తొలిటాకీ చిత్ర నిర్మాతగా చరిత్ర పుటల్లో ఆర్దేషీర్ ఎమ్ ఇరానీ నిలబడిపోయాడు

*అందుకే భారతీయ తొలిభాషాచిత్రంగా ఆలమ్ ఆరా నేటికీ కీర్తించబడుతోంది* [10]

మొదటి భారత చలనచిత్రం అదే అంటే, ప్రపంచసినిమా 1896లో ప్రారంభమయితే 35 సంవత్సరాల తర్వాత తొలి భారతీయభాషాచిత్రం విడుదలయ్యిందన్నమాట

*అయితే అలా ప్రారంభమయిన భారత చలనచిత్ర పరిశ్రమ నేటికి అన్ని భాషలలో కలిపి 1931 నుండి 1998 వరకు 15,128 చిత్రాలు నిర్మించింది* [11]

## దక్షిణభారత సినిమా :

1913లోనే మద్రాసులో రఘుపతి వెంకయ్యనాయుడు గెయిటీ థియేటర్, 1914లో క్రౌన్‌టాకీస్, 1915లో గ్లోబ్(ఆ తర్వాత రాక్సీగా మారింది) థియేటర్లు నిర్మించిన ఉత్సాహంతో, ఆంగ్ల మూకీ చిత్రాలను ప్రదర్శించిన అనుభవంతోనే చిత్ర నిర్మాణంలోకి దిగాడు

1916లో ఆర్ నటరాజు మొదలియార్ అనే కార్లవ్యాపారి తనభాగస్వామి ఎస్ ఎం ధర్మలింగ మొదలియార్‌తో కలిసి **ఇండియన్ ఫిలింకంపెనీ** అన్న సంస్థను ప్రారంభించి, మద్రాసు, పరసువాక్కం **మిల్లర్స్ రోడ్‌**లో, దక్షిణ భారతదేశంలో ప్రప్రథమంగా **స్టూడియో** నెలకొల్పాడు అంతేకాకుండా బెంగుళూరులో ఒకలేబరేటరీ ఏర్పాటుచేసి, మద్రాసు **స్టూడియోలో షూటింగ్** జరిపి, బెంగుళూరుకు నెగిటివ్‌లుపంపి, *ప్రింట్లుతీసే* ఏర్పాటుచేసాడు ఆయన 35రోజుల్లో **కీచకవధ** నిర్మించాడు అదే దక్షిణభారత దేశంలో మొట్టమొదట నిర్మించబడినచిత్రం ఆతర్వాత దక్షిణాదిన నిర్మించబడిన మూకీచిత్రాలు 147 మొదలియార్ తర్వాత రఘుపతి వెంకయ్య, వారికుమారుడు ఆర్ ఎస్ ప్రకాష్ కూడా మూకీచిత్రాలు నిర్మించారు అయితే వీటిలో 1931లో నాగర్ కోయిల్‌లోని చిత్రా ఆర్ట్స్ ప్రొడక్షన్ నిర్మించిన **మార్తాండవర్మ** (దర్శకుడు పి వి రావు) మాత్రమే నేడు పూనాలోని **ఆర్కైవ్** (Archive)లో భద్రపరచబడి ఉంది

## తెలుగు సినిమా :

తొలి తెలుగు చిత్రం నిర్మించబడి సుమారు 81 సంవత్సరాలు గడిచింది రఘుపతి వెంకయ్య తనకుమారుడు ఆర్ ఎస్ ప్రకాష్ దర్శకత్వంలో, ఆయనే

కధానాయకుడుగా, మిస్ పెగీ కౌసెల్లో అనే ఆంగ్ల యువతి కధానాయికగా **భీష్మ ప్రతిజ్ఞ** అనే మొదటి మూకీచిత్రాన్ని నిర్మించాడు ఇది రమారమి 1922 ప్రాంతం

1926లో సి పుల్లయ్య కాకినాడలో తెలుగుగడ్డమీద **భక్తమార్కండేయ** చిత్రాన్ని నిర్మించాడు ఆచిత్రప్రదర్శన తెరమీదకాకుండా గోడమీద జరగటంతో గోడమీదబొమ్మగా ఈ కదిలేబొమ్మ పేరుతెచ్చుకుంది

అయితే ఈరెండుచిత్రాలలో పాత్రలు తెలుగుమాట్లాడటం ప్రేక్షకులు వినలేదు కాబట్టి ఇవి మొట్టమొదటి తెలుగుసినిమాలుగా ప్రఖ్యాతి కాంచలేకపోయాయి

తొలి భారతీయటాకీచిత్రం **ఆలమ్ ఆరా** నిర్మించబడిన 1931లోనే తొలి తెలుగుటాకీచిత్రం కూడా నిర్మించబడింది

> హెచ్ ఎం రెడ్డి బొంబాయిలో, 1931లోనే **భక్త ప్రహ్లాద** నిర్మించాడు
> సురభికమలాబాయి తొలి తెలుగుకధానాయికగా చిరస్థాయిగా నిలిచిపోయింది
> మునిపల్లె సుబ్బయ్య హిరణ్యకశిపుడి పాత్ర ధరించారు [12]

మార్చి 14న తొలి భారతీయచిత్రం విడుదలయితే, సెప్టెంబరు15వ తారీఖున అదే 1931లో తొలి తెలుగుచిత్రం విడుదలయ్యింది అంటే రెండుచిత్రాలకు వ్యత్యాసం కేవలం ఆరుమాసాలే

ఆంధ్రులది ఆరంభశూరత్వం అని ఎవరన్నారోగాని అదిమాత్రం సినిమావిషయంలో నిజంకాదు 1931లో ప్రారంభించి, నేటికి దాదాపు ఐదువేలచిత్రాలు (డబ్బింగ్‌తో సహా) నిర్మించి చలనచిత్ర నిర్మాణంలో తెలుగుపరిశ్రమ భారతదేశంలో అగ్రస్థానంలోఉంది

### తెలుగుసినిమావికాసం :

తెలుగుసినిమావికాసంకోసం తన సర్వస్వాన్ని త్యజించిన మహానుభావుడు రఘుపతి వెంకయ్యనాయుడు దాదాఫాల్కే తొలి భారతీయసినిమాకి పితామహుడయితే, రఘుపతి వెంకయ్యనాయుడు తెలుగుసినిమాకి పితామహుడు

> *భారతప్రభుత్వ సైనికశాఖలో సుబేదారుగా పనిచేసిన అప్పయ్యనాయుడు రెండవ కుమారుడు ఈ రఘుపతి వెంకయ్య ఆయన అన్న వెంకటరత్నం నాయుడు వీరు మచిలీపట్నం వాస్తవ్యులు* [13]

18వ ఏటనే కళాపిపాసతో, సౌందర్యోపాసనతో చెన్నపట్నంలో కాలుపెట్టిన రఘుపతి వెంకయ్యనాయుడు ఒకనాడు వార్తా పత్రికలు తిరగవేస్తూ క్రోనోమెగా ఫోన్ అన్న ఒక సినిమాటోగ్రాఫ్ యంత్రం కనిపెట్టబడిందని, దీనిమీద పిక్చరు ప్రొజెక్టు

అయ్యేటప్పుడు రికార్డెడ్ డిస్క్ సాయంతో, సందర్భశుద్ధిననుసరించి, సంగీతం, ఇతర శబ్దాలు వెలువడతాయని తెలుసుకున్నాడు

ఈ ఎక్విప్‌మెంట్ సృష్టి కర్తలు లండన్‌లోని గౌమాంట్ కంపెనీ అధినేతలని, బకింగ్‌హామ్ భవనంలో పంచమజార్జి, మేరీరాణిసమక్షంలో వీరు మొట్టమొదటి ప్రదర్శనఇచ్చారని, ఆప్రదర్శన చాలాసంతృప్తికరంగానూ, విజయవంతంగాను నడిచిందని తెలుసుకున్నాడు మద్రాసులోని జాన్ డికిన్‌సన్ అండ్ కంపెనీ వారిని కలుసుకుని తన స్టూడియోను తాకట్టుపెట్టి ఆరోజుల్లో 30,000 రూపాయలకు ఆ ఎక్విప్‌మెంట్ కొన్నాడు

విక్టోరియా పబ్లిక్ హాలులో మొదటి ప్రదర్శనను ఏర్పాటు చేసాడు మూాడునాలుగు వందల అడుగుల నిడివిగల లఘుచిత్రాలు పన్నెండింటిని ప్రదర్శింపచేసాడు అండర్ ది పనామా, స్ప్రింగ్ సాంగ్, సీ సర్పెంట్, ఫైర్‌మర్ సాంగ్, మికాడో మొదలయినవి ఆనాడు ప్రేక్షకులుచూసిన కొన్నిచిత్రాలు

1910లో రఘుపతి వెంకయ్యనాయుడు టూరింగ్ సినిమాను ప్రారంభించాడు ఆయన చర్యతో ఆకర్షితులైన కొందరు టూరింగ్ సినిమాను ఒక వ్యాపారసాధనంగా చేపట్టి ముమ్మరంగా ప్రదర్శనలుజరిపారు వారిలో, విజయవాడలో పోతిన శ్రీనివాసరావు (తెలుగునాట తొలిథియేటర్‌మారుతీ సినిమా 1921లో నిర్మించింది ఈయనే), బందరులో పి వి దాసు, ఏలూరులో మోతే కృష్ణారావు, విశాఖపట్నంలో జె కె మంగరాజు (తెలుగునాట క్వాలిటీ పిక్చర్స్ అనే తొలి పంపిణీ వ్యవస్థ వీరిదే 1936 ప్రాంతంలో స్థాపించబడిన ఈ సంస్థ దరిమిలా పూర్ణాపిక్చర్స్‌గా రూపాంతరం చెందింది ), కాకినాడలో పి పుల్లయ్య, బళ్ళారిలో గోపాలరావు, రాజమండ్రిలో నిడమర్తి సూరయ్య (ఆంధ్రప్రదేశ్ తొలి స్టూడియో దుర్గా సినీటోన్‌ని, రాజమండ్రిలో 1936లో నిర్మించాడు) మొదలైనవారు సినిమా తెలుగునాట పునాదులు వేసుకోవటంలో తోడ్పడ్డారు

మూకీచిత్రాలు ప్రజల ఆదరణపొందటానికి కరపత్రాలు పంచిపెట్టటం, థియేటర్లలో మేళతాళాలు, మధ్య మరో మంచి డాన్స్ కార్యక్రమాలు నిర్వహించటం లాంటివి చేసేవారు ఇవికాక సినిమాకథ చెప్పేందుకు వ్యాఖ్యాతలు ఉండేవారు ( జి వి ఎన్ శాస్త్రి, కస్తూరి శివరావు మూకీ సినిమాల వ్యాఖ్యాతలుగానే చలన చిత్ర జీవితం ప్రారంభించారు)

టెంట్ సినిమాలు 1913లో మొదలు పెట్టి, మద్రాసు, బెంగుళూరు, ఆంధ్రప్రదేశ్‌లలో కొన్ని ముఖ్యపట్టణాలు తిరిగాడు, అంతేకాకుండా శ్రీలంకకుకూడా తన టెంట్ సినిమాతో వెళ్ళిన ఘనత రఘుపతి వెంకటరత్నంనాయుడిదే

హెచ్ ఎమ్ రెడ్డి (హనుమంతప్ప మునియప్పరెడ్డి) తమిళ సినిమా *కాళిదాసు*కి కూడా దర్శకత్వం వహించాడు విచిత్రం ఏమిటంటే ఈచిత్రంలో సంభాషణలు తమిళంలోనూ, పాటలు తెలుగులోనూ ఉన్నాయి యల్ వి ప్రసాద్ చిన్నపాత్ర ధరించాడు

మొదటి ఏడుసంవత్సరాలకాలంలో అంటే 1937 వరకు 40 సినిమాలు నిర్మించటం జరిగింది వాటిలో చాలావరకు పౌరాణికాలు ఆ రోజుల్లో తెలుగునాట ప్రఖ్యాతివహించిన పౌరాణిక నాటకాలను యధాతథంగా వెండితెరమీదకు మలిచారు అంతేకాదు రంగస్థలంమీద ఒకవెలుగు వెలిగిన యడవల్లి సూర్యనారాయణ, బళ్ళారి రాఘవ, పసుపులేటి కన్నాంబ, అద్దంకి శ్రీరామమూర్తి, రామతిలకం, తుంగల చలపతిరావు మున్నగువారంతా వెండితెర వెలుగులుగా రూపాంతరం పొందారు

అయితే 1933లో వచ్చిన **చింతామణి** కాళ్ళకూరి నారాయణరావు రాసిన సాంఘికనాటకం ఆధారంగా నిర్మించబడింది పరిశ్రమలో **ప్రేమవిజయం** తొలి సాంఘికచిత్రంగా చెప్పబడుతున్నా సాంఘికప్రయోజనంతోకూడిన **చింతామణి** సాంఘికఛాయకలిగిన తొలిసందేశాత్మకచిత్రమే ద్వా నా శాస్త్రి కాళ్ళకూరి **చింతామణి** సాంఘికనాటకం అనే రాశాడు[14]

తెలుగులో తొలి బాలలచిత్రం - **ధృవ-అనసూయ** ఈస్టిండియా ఫిలింకంపెనీ తీసిన ఈ చిత్రానికి సి పుల్లయ్య దర్శకుడు 1936లో విడుదలయ్యింది

దర్శకుల రాజ్యంవచ్చింది గూడవల్లి రామబ్రహ్మం తన రక్తంలోఉన్న అభ్యుదయాన్ని 'సెల్యులాయిడ్' ద్వారా ప్రేక్షకలోకానికి అందించాడు 1938లో ఆయన దర్శకత్వంవహించిన **మాలపిల్ల** ఒకసంచలనం ఒక బ్రాహ్మణయువకుడు, ఒక అంటరానిఅమ్మాయిని పెళ్ళిచేసుకోవటం ఇతివృత్తం భీమవరపు నరసింహారావు సంగీతం, బసవరాజు అప్పారావు గీతాలు, గోవిందరాజుల సుబ్బారావు నటనాచాతుర్యం, కాంచనమాల ముగ్ధమనోహరత్వం, గూడవల్లి రామబ్రహ్మం దర్శకత్వప్రతిభ చిత్రానికి అఖండవిజయాన్ని చేకూర్చిపెట్టాయి

నేనుతక్కువతినలేదు అన్నట్లుగా హెచ్ ఎమ్ రెడ్డి తాగుడు ఎంత వ్యసనమో చూపిస్తూ *గృహలక్ష్మి* తీసాడు చిత్తూరు వి నాగయ్య ఈ చిత్రంద్వారా పరిచయమై, తరువాత తెలుగుచలనచిత్ర పరిశ్రమలో గాయకుడిగా, సంగీతదర్శకుడిగా, దర్శకుడిగా, నిర్మాతగా, నటుడిగా అనేక అవతారాలు ఎత్తాడు ఆంధ్రరాష్ట్రానికి తమ ఉత్తమచిత్రాలతో మేలుకొలుపు పాడిన బి ఎన్ రెడ్డి, కె వి రెడ్డి ఈచిత్రానికి సహాయదర్శకులుగా పనిచేసారు

తన అభ్యుదయదృక్పధాన్ని వదలని రామబ్రహ్మం 1939లో **రైతుబిడ్డ** చిత్రాన్ని నిర్మించాడు తెలుగులో మొట్టమొదట నిషేధించబడిన చిత్రం ఇదే జమిందారీవిధానానికి వ్యతిరేకంగా తీయబడిన ఈచిత్రంపెద్దలఆగ్రహానికి, ప్రభుత్వంఆగ్రహానికి గురయ్యింది

1939లోనే సి పుల్లయ్య వరకట్నసమస్యపై **వరవిక్రయం**, వితంతు పునర్వివాహంపై అదే సంవత్సరంవై వి రావు తీసిన **మళ్ళీపెళ్ళి**, ఆర్ ప్రకాష్ తొలినవలాచిత్రం **బారిష్టర్ పార్వతీశం** (1940), తెలుగుసినిమా సామాజికస్పృహపై దృష్టిసారించింది అని తెలియజేస్తాయి

అయితే 1947నుండి 68వరకు సుమారు 22 సంవత్సరాలపాటు ఒకరకంగా తెలుగుచలనచిత్రపరిశ్రమకు స్వర్ణ యుగం

చారిత్రాత్మకాలు, పౌరాణికాలు, జానపదాలు, సాంఘికాలు పుంఖానుపుంఖంగా తీయబడ్డాయి వినోదంప్రధానమయ్యింది మాస్‌ని ఆకర్షించటం ప్రధాన ఆశయం అయ్యింది

తెలుగుసినిమాపరిశ్రమకి రెండుకళ్ళులాంటి అక్కినేని నాగేశ్వరరావు, నందమూరి తారకరామారావు సినీవినీలాకాశంలో ధ్రువతారలయ్యింది ఈ రెండు దశాబ్దాలకాలంలోనే మధురగాయని భానుమతి, మరువలేని యస్ వరలక్ష్మి, జి వరలక్ష్మి, సినీకళామతల్లికి కళాంజలి పట్టిన అంజలి, మహానటి సావిత్రి, అపర సత్యభామ జమున, నటనా విశారద శారద, కళాభినేత్రి వాణిశ్రీ వారివారి నటనావైదుష్యంతో అఖిలాంధ్రప్రేక్షకమహాశయుల హృదయాలలో గూళ్ళు కాదు, కోటలు కట్టుకున్నారు ఆ 22సంవత్సరాలకాలం సినీ స్వర్ణయుగం

అక్కినేని బాలచంద్రుడిగా, గోవిందరాజుల సుబ్బారావు బ్రహ్మనాయుడిగా, పసుపులేటి కన్నాంబ నాగమ్మగా తెలుగు సినీచరిత్ర మరిచిపోలేని చారిత్రాత్మక చిత్రం **పల్నాటి యుద్ధం**, చిత్తూరు వి నాగయ్య నటప్రపూర్ణత్వానికి పరాకాష్ఠ **యోగివేమన** 1947లో, అక్కినేనిని తెలుగు ఆడపడుచుల కలలరాజుగానిలిపిన ***బాలరాజు*** 1948లో, ***గుణసుందరికథ, కీలుగుఱ్ఱం, లైలామజ్ను***, ఎన్ టి ఆర్‌ని తెలుగుతెరకు పరిచయంచేసిన **మనదేశం** చిత్రాలు 1949లో, యస్ వి రంగారావు, జానకిల అద్భుత నటనావైదుష్యంతో రూపుదిద్దుకున్న **షావుకారు**, సి హెచ్ నారాయణరావు **శ్రీ లక్ష్మమ్మకథ, పల్లెటూరి పిల్ల** 1950లో విడుదలయ్యాయి

1951లో నాటికినేటికీ మరువలేని మరపురానిచిత్రాలు **పాతాళభైరవి, మల్లీశ్వరి** విడుదలయ్యాయి శ్రీకృష్ణదేవరాయలకాలంలో జరిగినట్లుగా చెప్పబడిన **మల్లీశ్వరి** అందులో కథానాయకుడు చెక్కిన శిల్పాలంతభద్రంగా, కథానాయిక గాత్రమాధుర్యమంతశ్రావ్యంగా ఉంటుంది ఇప్పటికీ విడుదలయిన మొదటివారం హాలునిండినది అన్నబోర్డుతోఉంటుంది **పాతాళభైరవి** తెలుగుపరిశ్రమ నిర్మించిన జానపదచిత్రాలలో ఇది మకుటాయమానమైనది పాతాళభైరవి ప్రతినాయకుడిగా ఎస్ వి రంగారావు చెప్పిన 'సాహసం సాయరా డింభకా- రాజకుమారి లభించునురా' అన్న మేనరిజం, 'నిజంచెప్పమంటారా అబద్ధం చెప్పమంటారా' అన్న ఎన్ టి ఆర్ మేనరిజం, 'తప్పుతప్పు రాణిగారి తమ్ముణ్ణి' అన్న రేలంగి మేనరిజం, 'జై పాతాళభైరవి' - 'నరుడా ఏమి నీ కోరిక' అన్న మాటలు ఈనాటికీ ప్రాచుర్యం పొంది ఉన్నాయి అంతేకాదు పద్మాలయావారు సుమారు నలభైఏళ్ళతర్వాత **పాతాళ్ భైరవి** అని హిందీలో పునర్నిర్మిస్తే పాతచిత్రం ఎంత విజయవంతమయ్యిందో అంతవిజయవంతమై కథాబలం, పాత్రలబలం సినిమాకి ఎంతఅవసరమో నిరూపించింది

అక్కినేని **దేవదాసు**, ఎన్ టి ఆర్ పిచ్చి **పుల్లయ్య**, జమున తొలిచిత్రం **పుట్టిల్లు**, జానపదచిత్రం **అగ్గిరాముడు**, ఛాలెంజింగ్‌గా యాంటికార్టెక్టర్‌ని ఎన్ టి ఆర్ పోషించిన **రాజు – పేద** (అందాల నటుడు వికారంగా కనబడతాడు కూడా ఇందులో), **విప్రనారాయణ**, **సోషల్ సెటైరికల్** చిత్రం **పెద్దమనుషులు**, యస్ వి ఆర్ మహానటుడని నిరూపించిన **బంగారుపాప**, అంజలీదేవి నటజీవితంలో మరపురాని **అనార్కలి**, సావిత్రికి స్త్రీల హృదయాలలో ప్రత్యేకస్థానం సంపాదించిపెట్టిన **అర్ధాంగి**, అన్నపూర్ణావారి తొలి చిత్రం **దొంగరాముడు**, నవ్వులహరివిల్లు **మిస్సమ్మ**, ప్రయోజనాత్మకచిత్రం **కన్యాశుల్కం**, అభ్యుదయాత్మకచిత్రం **రోజులు మారాయి, హరిశ్చంద్ర**, స్త్రీల చెంగులు కన్నీటితో తడిపిన **ముద్దుబిడ్డ**, చారిత్రాత్మకచిత్రం **తెనాలి రామకృష్ణ**, ఎన్ టి ఆర్ అంధుడిగా అద్భుతంగా నటించిన **చిరంజీవులు** 1952-56 మధ్య విడుదలయిన చిత్రాలు

1953 అలాగే 1957 కూడా తెలుగుసినీపరిశ్రమ మరువలేనిసంవత్సరాలు తెలుగులో తొలిసారిగా ఒక మహిళాదర్శకురాలు భానుమతి దర్శకత్వంవహించిన *చండీరాణి* 1953లో విడుదలయ్యింది మాచిత్రం వందరోజులు, రెండొందలరోజులు, ఒక సంవత్సరంగా ఆడుతోంది అని ఈ మధ్య కొత్తనిర్మాతలు

అంటుంటే, నా చిత్రం ఐదుదశాబ్దాలుగా ఆడుతోంది అని నాగిరెడ్డి సగర్వంగా చెప్పుకునే చిత్రం 1957లో రిలీజయ్యింది ఆ చిత్రం - **మాయాబజార్**

నిజం! ఆంధ్రప్రదేశ్‌లో ఏదో ఒకఊళ్ళో **మాయాబజార్** ఆడనిరోజులేదు ఎన్ టి ఆర్ భవిష్యత్తులో పౌరాణికబ్రహ్మగా విశ్వరూపం ధరించటానికి మొదటిమెట్టు ఈ చిత్రంలో శ్రీకృష్ణుడి పాత్రధారణే ఎన్నోఇళ్ళల్లో మాయాబజార్‌లోని శ్రీకృష్ణుడి కేలండర్‌ని దేవుడి పటాలమధ్య పెట్టుకున్నమాట అక్షరసత్యం శశిరేఖాభిమన్యులుగా సావిత్రి, అక్కినేని, ఘటోత్కచుడిగా ఎస్ వి ఆర్ ల నటన నభూతోనభవిష్యతి

ఈ సంవత్సరంలోనే ఎన్ టి ఆర్ నిర్మించి నటించిన **పాండురంగమహాత్మ్యం** (శ్రీమతి విజయనిర్మల తొలి చిత్రం ఇదే బాలకృష్ణుడిగా నటించింది ) మాతాపితసేవయే మాధవసేవ అని చాటిచెప్పింది ప్రతినాయకిగా జి వరలక్ష్మినటించిన ***దొంగల్లో దొర***, అన్నపూర్ణవారి ***తోడికోడళ్ళు*** ఈ ఏడాది విడుదలయినవే కారులో షికారు కెళ్ళే పాలబుగ్గల పసిడిచాన అన్న ఆత్రేయ ఆవేదన ఇందులోనిదే

ఎన్ టి ఆర్ రావణాసురుడిగా, అక్కినేని నారదుడిగా నటించిన ***భూకైలాస్***, అభ్యుదయాత్మకమైన ***ముందడుగు***, సెమీమైథలాజికల్ చిత్రం - **చెంచులక్ష్మి**, బాల్యవివాహంమీద తీసిన ***మాంగల్యబలం***, పి ఎ పి వారి ***ఇల్లరికం***, జానపదచిత్రాలు ***బాలనాగమ్మ***, ***రేచుక్క-పగటిచుక్క***, కైకాల సత్యనారాయణ కథానాయకుడిగా ***సిపాయికూతురు*** 1958-59 సంవత్సరాలలో విడుదలయ్యాయి

అంతర్జాతీయచలనచిత్రోత్సవంలో పాల్గొన్న తొలితెలుగుచిత్రం శంభు ఫిలింస్ ***నమ్మినబంటు***, ***మహాకవి కాళిదాసు***, ఎన్ టి ఆర్, కాంతారావుల ***భట్టివిక్రమార్క*** 1960లో అద్భుత విజయాలు సాధించాయి ***భక్తశబరి*** చిత్రంతో శోభన్‌బాబు కథానాయకుడిగా పరిచయమయ్యాడు

1960 ఎన్ టి ఆర్ ఒక సాహసంచేసిన సంవత్సరం నాలుగుకోట్లమంది తెలుగుప్రజల హృదయంలో రాముడిగా, కృష్ణుడిగా ఆరాధింపబడుతున్న సమయంలో ఈ రావణాసురుడివేషం ఏమిటి? అని తమ్ముడు నందమూరి త్రివిక్రమరావు లాంటివాళ్ళు వద్దనిచెప్పినా, శ్రేయోభిలాషులు కంగారుపడ్డా, కంగారుపెట్టినా తనునమ్మిందేసిద్ధాంతంఅన్న మొండిపట్టుదలతో ఎన్ టి ఆర్ నిర్మించిన, నటించినచిత్రం ***సీతారామకళ్యాణం***! 1961లో విడుదలయ్యింది (పేరు వేసుకోలేదు - ఆయనే దర్శకుడుఅని పరిశ్రమకు తెలుసు) అప్పటివరకు రావణపాత్రలో ఎస్ వి ఆర్‌ను చూసినకళ్ళతో మరొకర్నిచూడలేం అనుకునేవారు కాని ఎన్ టి ఆర్ రావణపాత్రపోషణ

అనితరసాధ్యం అని నిరూపించింది ఆ పాత్రధారణ మరొకపద్ధతిలో చెయ్యవచ్చుని ఋజువు చేసింది

అక్కినేని **వెలుగునీడలు** విజయం సాధించింది భానుమతి, అక్కినేని నటించిన శరత్ ***బాటసారి***, స్వర్ణోత్సవంజరుపుకున్న ఎన్ టి ఆర్ జానపదం ***జగదేకవీరుని కథ***, అవిటివాడుగా ఎన్ టి ఆర్ నటించిన ***కలిసివుంటే కలదుసుఖం***, నూతన సాంఘికచిత్రాల వరవడికి శ్రీకారం చుట్టిన పి ఏ పి వారి ***భార్యభర్తలు***, **మేకప్**కళకు ప్రతిష్టపెంచిన ఎన్ టి ఆర్ '***భీష్మ***', సి నారాయణరెడ్డిని పరిశ్రమకు పరిచయం చేసిన ***గులేబకావళికథ***, నలభైఏళ్ళునిండినా మరపురాని విజయావారి ***గుండమ్మకథ***, గుమ్మడి వెంకటేశ్వరరావు నటనకు కలికితురాయి **మహామంత్రి తిమ్మరుసు**, అన్నాచెల్లెళ్ళఅనుబంధానికి ప్రతీక, సాంఘికచిత్రాలలో ఎన్ టి ఆర్‌కి పెద్దకుర్చీవేసిన ***రక్త సంబంధం***, అభిమానుల కన్నులపంట ***శ్రీకృష్ణార్జున యుద్ధం***, మొట్ట మొదటి పూర్తి రంగుల చిత్రం **లవకుశ** **(*పూర్తి గేవా కలర్*)**, జానపదచిత్రాలలో కమ్యూనిజం నింపిన ***బందిపోటు*** **(*క్లయిమాక్స్ రీల్‌కలర్*)**, ఎన్ టి ఆర్, ఎస్ వి ఆర్, సావిత్రి నటత్రిమూర్తులుగా భాసించిన ***నర్తనశాల***, పునర్జన్మసిద్ధాంతాన్ని నమ్మించిన **మూగమనసులు**, చారిత్రాత్మకచిత్రాలలో వెలలేని మాణిక్యం ***అమరశిల్పి జక్కన్న***, శతచిత్ర నిర్మాత దగ్గుబాటి రామానాయుడు తొలిచిత్రం ***రాముడు-భీముడు***, కోడూరి కౌసల్యాదేవి నవలా చిత్రం ***డాక్టర్ చక్రవర్తి***, దొంగకొడుకు దొంగకావాలనిలేదు అని నిరూపించిన ***మంచి మనిషి***, బొబ్బిలిచరిత్రకు గీటురాయి ***బొబ్బిలియుద్ధం***, 1961-64 వరకు విడుదలయిన చిత్రాలు

అయితే 1965 కూడా తెలుగుచలన చిత్ర పరిశ్రమ మరిచిపోలేని సంవత్సరమే ఎందుకంటే ఈనాటి తమిళనాడుముఖ్యమంత్రి జయలలిత నటించిన **మనుషులు - మమతలు**, ఈ రోజు **సూపర్‌స్టార్**గా త్రిశతచిత్ర కథానాయకుడిగా వెలుగొందుతున్న ఘట్టమనేని శివరామకృష్ణ (కృష్ణ) తొలిచిత్రం **తేనెమనసులు** ఈసంవత్సరంలోనే విడుదలయ్యాయి ఆదుర్తి అందించిన అపూర్వకానుక కృష్ణ

శోభన్‌బాబు నటజీవితంలో మరిచిపోలేనిది, విక్టరీ మధుసూదనరావు దర్శకత్వ ప్రతిభకు మచ్చుతునక అయిన ***వీరాభిమన్యు***, పదికాలాలపాటు గుర్తుండే **పాండవవనవాసం**, ఈ సంవత్సరమే ప్రజలకు కనువిందు చేసాయి అక్రమసంతానంగా భానుమతి చేసిన అల్లరికి ప్రతీక జగపతివారి **అంతస్తులు** అలరించింది

ఆంధ్రప్రేక్షక హృదయాలలో సుయోధన సార్వభౌముడిగా ఎన్ టి ఆర్ అచ్చుపోసుకున్న ***శ్రీకృష్ణపాండవీయం*** 1966వ సంవత్సరంలోవిడుదలయ్యింది

రావణపాత్రలాగానే ఎన్ టి ఆర్ ఈ సుయోధన పాత్రధారణకూడా అపూర్వం, అనితరసాధ్యమయ్యింది '*చిలకా-గోరింక*' చిత్రం ద్వారా రెబల్ స్టార్‌గా పేరుగాంచిన కృష్ణంరాజు పరిచయమయ్యాడు ఆంధ్ర **జేమ్స్‌బాండ్‌**గా కృష్ణకు ప్రత్యేకగుర్తింపు తెచ్చిన '***గూఢచారి 116***', కస్తూరి శివరావుచేతిలో పరాజయింపాలయి, ఎన్ టి ఆర్ కథానాయకుడిగా విజయవంతమయిన, **పరమానందయ్యశిష్యులకథ**కూడా ఈ సంవత్సరపు కానుకలే

1967 ఒక ప్రత్యేకతను సంతరించుకుంది పొట్టివాడయినా గట్టివాడనిపించుకున్న కథానాయకుడు చంద్రమోహన్‌ని '*రంగుల రాట్నం*' చిత్రం పరిచయం చేసింది పరిశ్రమకు అద్భుత పౌరాణికచిత్రం **భక్తప్రహ్లాద**, జానపదచిత్రం **కంచుకోట**, ప్రయోగాత్మకచిత్రం **సాక్షి**, ఉమ్మడికుటుంబవ్యవస్థను గౌరవించే **ఉమ్మడికుటుంబం** ఈసంవత్సరమే విడుదలయ్యాయి

అక్కినేని అపూర్వప్రయోగం **సుడిగుండాలు**, అన్నాచెల్లెళ్ళ అనురాగానికి ప్రతీక తమ్మారెడ్డి కృష్ణమూర్తి నిర్మించిన ***బంగారుగాజులు***, రాజబాబు ఏకపాత్రాభినయంలా సాగిన **సర్కార్ఎక్స్‌ప్రెస్**, సస్పెన్స్ ప్రధానంగాసాగిన **నేనంటేనేనే**, చైల్డ్ సెంటిమెంట్‌ని పుష్కలంగాపండించిన **పాపకోసం** 1968 సంవత్సరంలో విడుదలై ప్రఖ్యాతిగాంచాయి

ఈ విధంగా ఈరెండుదశాబ్దాలకాలంలో, పౌరాణిక, జానపద, చారిత్రాత్మక, సాంఘిక చిత్రాలు నిర్మించబడటమేకాక పలుచిత్రాలు విజయవంతమై భవిష్యత్తుకి బంగారుబాటవేసి, తరువాతి రెండుదశాబ్దాలు ఇంతింతై వటుడింతై లాగా మూడుపువ్వులు, ఆరుకాయలుగా తెలుగు సినిమాపరిశ్రమ వర్ధిల్లటానికి కారణభూతమయ్యాయి

1969 నుండి అడపాదడపా **మనుషులుమారాలి** లాంటిఅత్యున్నత కళావిలువలుగల చిత్రాలు నిర్మించటం జరిగింది కళ కళకోసంకాదు, కాసుకోసం అన్ననినాదం వివాదంలేకుండా ప్రధానమయ్యింది 1969 నుండి 1977 వరకు విడుదలయిన చిత్రాలను పరిశీలిస్తే ఒక బి ఎన్ రెడ్డి, ఒక కె వి రెడ్డి, ఒక సి పుల్లయ్య లాంటి మహా దర్శకులచేతిలో చెక్కబడినఅపురూపశిల్పాలు కంటికికనిపించని నల్లపూసలైపోయాయి

ఈకాలంలోనే విశ్వనాధసత్యనారాయణ ఏకవీర నిర్మించబడింది సి నారాయణరెడ్డి తొలిసారిగా సంభాషణలు రచించాడు బాపు కళాసృష్టి **బుద్ధిమంతుడు**, కృష్ణ, శోభన్‌బాబుల కథాచిత్రం **మంచిమిత్రులు**, ఎన్ టి ఆర్ **వరకట్నం** అద్భుతమైన విజయాలు సాధించాయి

ఎన్ టి ఆర్ నిర్మించి, నటించిన **తల్లా-పెళ్ళామా** అన్నది విజయవంతం అవటమేకాక ఆనాడు జై తెలంగాణ ఉద్యమానికి వ్యతిరేకంగా **తెలుగుజాతి మనది నిండుగ వెలుగుజాతి మనది జై విశాలాంధ్ర**, అనే పాటతో అతిసాహసంగా ప్రతిఘటనలను ఎదుర్కొని ఐకమత్యమేమహాబలంఅని నిరూపించింది ఎన్ టి ఆర్ చిరస్మరణీయుడు గీతరచయిత సి నారాయణరెడ్డి అభినందనీయుడు **జై జవాన్, మళ్ళీపెళ్ళి, మరోప్రపంచం** లాంటి వినూత్నకధాంశాలతో తీసినచిత్రాలు పరాజయంపాలై కమర్షియల్‌పంధానే శ్రీరామరక్ష అనేనమ్మకాన్ని కలిగించాయి

1971 బాక్సుఆఫీసుని బద్దలుకొట్టినచిత్రం **దసరాబుల్లోడు** తొలిసారిగా జగపతి రాజేంద్రప్రసాద్ తనే దర్శకత్వంవహించినచిత్రం ఫక్తు మసాళాచిత్రం అక్కినేని నటజీవితంలో, డి రామానాయుడు చిత్రజీవితంలో, మరిచిపోలేని **ప్రేమనగర్,** కె ఎస్ ప్రకాశరావు ప్రేక్షకులకు అందించిన కానుక కండక్టరుకొడుకు కలక్టర్‌అవుతాడా? అన్నప్రశ్నకు సమాధానం **తాసిల్దారుగారి అమ్మాయి,** స్త్రీసమస్యాత్మకచిత్రాలు **మనసూ మాంగల్యం, పవిత్రబంధం** ఈసంవత్సరం విడుదలయ్యాయి

తల్లిదండ్రుల్ని చెరొక బిడ్డ పంచుకున్న **బడిపంతులు,** అందరినీ అలరించిన **బాలభారతం, యాంటి లేడీకార్రెక్టర్‌లో** జమున, **యాంటీహీరోకార్రెక్టర్‌లో** శోభన్‌బాబు ప్రేక్షకులని అలరించిన ఉత్తమచిత్రాలు **పండంటి కాపురం, మానవుడు-దానవుడు,** బాపు కళాసృష్టి **సంపూర్ణ రామాయణం**, రాజనాల జన్మచరితార్ధంచేసిన **శ్రీకృష్ణాంజనేయ యుద్ధం** 1972లో విడుదలయ్యాయి

అయితే 1973వ సంవత్సరం పరిశ్రమ ప్రజలకు ఒక అపూర్వ దర్శకుణ్ణి, రచయితను కానుకగాఇచ్చింది *గిన్నిస్‌బుక్‌ఆఫ్ వరల్డ్‌రికార్డ్స్‌*లో తనపేరు నమోదుచేయించుకున్న దాసరినారాయణరావు ఆ కానుక ఆయన తొలిచిత్రం **తాత-మనవడు** విజయం పరిశ్రమ ముక్కుమీద వేలువేసుకునేలా చేసింది హీరోలేకుండా సాంకేతికనిపుణులే నిజమైనహీరోలు అని నిరూపించిన దాసరికి ప్రజలు పట్టం కట్టారు

1973లోనే కోర్టు విధించే శిక్షకంటే తనకుతాను విధించుకునే శిక్ష గొప్పదని, ఉపయోగకారి అని **నేరము-శిక్ష** నిరూపించింది దుర్మార్గులలో సత్ప్రవర్తన రావాలన్న ఆశయంతో తీసిన **మాయదారి మల్లిగాడు** చిత్రం విజయవంతమయ్యింది ఈ చిత్ర రచయిత సత్యానంద్ *గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌*లో తన పేరు ఖరారుచేయించుకున్న

విజయనిర్మల మహిళాదర్శకురాలిగా తీసిన మొదటి చిత్రం **మీనా** అంజలీదేవి **భక్తతుకారాం** అలరించింది నాయకుడే కాసేపు ప్రతినాయకుడిగా కనిపించే **దేవుడు చేసిన మనుషులు**తోపాటు ఈ సంవత్సరం చెప్పుకోదగ్గ మరొకచిత్రం **శారద.** చనిపోయిన తనభర్త బతికేఉన్నాడన్న అపోహతో బతికే ఒకస్త్రీమూర్తి దయనీయగాధ మురళీమోహన్ తొలిచిత్రం **జగమేమాయ,** ఉత్తమ కధాచిత్రం **జీవనతరంగాలు** ఈసంవత్సరపు కానుకలే బాపు కళాఖండం **అందాలరాముడు** ఇందులోనే నూతన్‌ప్రసాద్, వరప్రసాద్‌గా తొలిసారి పరిచయమయ్యాడు

తెలుగుతేజానికి, తెలుగుఆత్మగౌరవానికి ప్రతీకగా నిలచి, స్వేచ్ఛ కోసం ప్రాణాలు అర్పించిన మహానుభావుడు అల్లూరి సీతారామరాజు ఈ చారిత్రక పురుషుడి చరిత్రను 1974లో ప్రప్రధమంగా **స్కోప్** చిత్రంగా నిర్మించిన ఘనత పద్మాలయావారిది **అల్లూరి సీతారామరాజు** పాత్రకు ప్రాణప్రతిష్ఠచేసి, యావదాంధ్రప్రేక్షకలోకంతో జేజేలు పలికించుకున్నాడు కృష్ణ

అంతేకాక ఇదేసంవత్సరం **దేవదాసుని** మళ్ళీతీసి కలకలం పుట్టించాడు అక్కినేని నాగేశ్వరరావు నటించిన దేవదాసు మళ్ళీ విడుదలై ఉదయంఆటలతో వందరోజులు ఆడటం విశేషం

కోటి సూర్యప్రభ నాయికగా నిర్మించబడిన **నీడలేని ఆడది** హిందీచిత్రం **జరూరత్** స్ఫూర్తితో తీసింది తనను ప్రేమించినవాడికోసం శీలాన్నయినాఇచ్చేయవచ్చు అన్నభావనను ప్రేక్షకులు ఆశీర్వదించి విజయవంతం చేసినచిత్రం

ఎ వి ఎం వారి **నోము** పాముకధ తెలుగు చలనచిత్ర చరిత్రలో పాముని నమ్ముకుని దెబ్బతిన్న నిర్మాతలు తక్కువమంది బయటపాము కాటేస్తుందేమోగాని, సినిమాపాము మాత్రం విషంకక్కదు, కనకవర్షంకురిపిస్తుంది అన్ననిజాన్ని ఋజువు చేసిన చిత్రం నోము మహానటి జయసుధ ప్రతినాయకురాలు ఈ చిత్రంలో ఎన్ టి ఆర్ **నిప్పులాంటి మనిషి** విజయవంతమై హిందీ నుంచి రీమేక్‌లు ప్రారంభమయ్యేలా చేసింది అంతేకాదు ఉత్తమకధా చిత్రాలు, **ఖైదీబాబాయ్, బంట్రోతు భార్య, ఓ సీతకధ,** వాణిశ్రీ నటజీవితంలో మైలురాయి **కృష్ణవేణి,** ఎన్ టి ఆర్ వివాదాత్మక చిత్రం **తాతమ్మకల**కూడా ఈసంవత్సరమే విడుదలఅయ్యాయి

వినోదపుపన్ను మినహాయింపు పొందిన తొలితెలుగుచిత్రం **తీర్పు,** పౌరాణికచిత్రం **యశోదకృష్ణ,** ఆత్రేయను బూత్రేయ అని కొందరు విమర్శించిన **ఎదురులేని మనిషి,**

కె విశ్వనాథ్ **జీవనజ్యోతి**, దాశరధి చిల్లరదేవుళ్లు, మోదుకూరిజాన్సన్ **సోగ్గాడు** 1975లోనే విడుదల అయ్యాయి **బాబు** చిత్రంద్వారా శతచిత్రదర్శకుడు కె రాఘవేంద్రరావు పరిచయమయ్యాడు

బాపు, రమణల అపూర్వసృష్టి **ముత్యాల ముగ్గు**, రామాయణానికి ఒకవిధమైన సాంఘిక అనుకరణ హనుమంతుడుప్రత్యక్షమవటంలాంటి **సోషియోఫాంటసీ** లక్షణాలతోపాటు రావుగోపాలరావుని నటవిరాట్‌గా నిరూపించిన చిత్రం సంభాషణలు చిత్రాన్ని ఆడించగలవని నిరూపించిన చిత్రం పాటలకాసెట్‌తోపాటు మాటలకాసెట్లు ఎక్కువ అమ్ముడుబోయిన చిత్రం **ముత్యాల ముగ్గు**

దాసరి సృష్టి *స్వర్గం-నరకం*, మోహన్‌బాబుని వెండితెరకు పరిచయంచెయ్యటమే గాక, కాపురంలో స్వర్గాన్ని పండించుకున్నా, నరకాన్ని నిండించుకున్నా మనచేతుల్లోనే ఉంది అన్న కధాంశంతో నిండిన చిత్రం అందరూ కొత్త తారలతో తీసినా విజయవంతమైన ప్రయోగం నవలాచిత్రాలలో మకుటాయమానం రంగనాయికమ్మ **బలిపీఠం**, దాసరి చేతిలో శృతి సరిచేయబడ్డ మధురవీణ, 1975లో ప్రేక్షకులు మెచ్చినచిత్రం

బాపు, కృష్ణంరాజుల కలయికలో అద్భుత కళాఖండం *భక్త కన్నప్ప*, చారిత్రాత్మకచిత్రం *వేములవాడ భీమకవి* , కె బాలచందర్ *అంతులేనికధ*, కొల్లేటిఅందాలు చూపించే *కొల్లేటి కాపురం*, *మహాకవి క్షేత్రయ్య*, సంప్రదాయవాదులు కనుబొమ్మలు ముడివేసే *మాంగల్యానికి మరోముడి*, తాతామనవళ్ళ సరికొత్తసరసాల *మనుషులంతా ఒక్కటే*, నవలాచిత్రం *సెక్రటరీ*, బాపు కళాఖండం *సీతాకళ్యాణం*, వేటూరి ఖ్యాతి పెంచిన *సిరిసిరిమువ్వ* 1976లోనే విడుదలఅయ్యాయి

పరిశ్రమట్రెండ్ (విధానం) మార్చిన *అడవి రాముడు* 1977లో కె రాఘవేంద్రరావు, ఎన్ టి ఆర్ ల కాంబినేషన్‌లో వచ్చింది ఊహతెలిసిన ప్రతిమనిషి ఈ వినోదాత్మక చిత్రాన్ని చూసే ఉంటారని నా ఊహ చిత్రవిజయానికి కధావిలువలు అక్కర్లేదని, కేవలం *గ్లామర్*, వినోదం, చక్కటి సంగీతం, హాస్యం చాలని అప్పటికి కొత్తదర్శకుడు కె రాఘవేంద్రరావు కొత్తసిద్ధాంతాన్ని (ఫార్ములా) ప్రవేశపెట్టాడు రెండుదశాబ్దాలుగా ఆ సిద్ధాంతాన్నేనమ్ముకుని చిత్రాలుతీస్తున్నాడు ఎందరో ఆయననుఅనుకరిస్తున్నారు ఈచిత్రం విజయంతర్వాత, ఎన్ టి ఆర్ అత్యధిక పారితోషికం తీసుకునే కధానాయకుడిగా ఎవరికీఅందనంత ఎత్తుఎదిగాడు ఉత్తమకధాచిత్రం అమరదీపంకూడా ఈదర్శకుడే తీసాడు

ఎన్ టి ఆర్ , అక్కినేని, శివాజీ గణేశన్‌ల అపూర్వ కలయికలో వచ్చిన చారిత్రాత్మక చిత్రం **చాణక్య చంద్రగుప్త** నిరాశపరిచింది దాసరి **చిల్లరకొట్టు చిట్టెమ్మ, ఊరుమ్మడి బతుకులు,** ( సాంఘిక నాటకాలను సినిమాలుగా తీసినచిత్రాలు) స్త్రీ సమస్యాత్మకచిత్రాలుగా సంచలనంసృష్టించాయి ఉత్తమ సందేశాత్మకచిత్రం **తరంమారింది,** తొలి బ్లాక్అండ్‌వైట్ స్కోప్‌చిత్రం దేవతరాదీవించండిపేరు తెచ్చుకున్నాయి

పౌరాణికాలకు కాలంచెల్లిపోయిందని ప్రజలు, పరిశ్రమ అనుకుంటున్న సమయంలో, పద్మాలయావారు **కురుక్షేత్రం,** రామకృష్ణా సినీ స్టూడియోస్‌వారు **దానవీర శూరకర్ణ,** ఏకకాలంలో నిర్మించి, ఏకముహూర్తంలో విడుదల చెయ్యటంతో ప్రజలలో విపరీతమైన ఉత్కంఠ ఏర్పడింది

ఉన్నత సాంకేతికవిలువలతో, అపూర్వ నటీనటులకలయికతో అనితరసాధ్యంగా కృష్ణ నిర్మించిన **కురుక్షేత్రం** అనుకున్నంత విజయం సాధించలేదు ఒంటిచేత్తో అన్నిపనులు చూసుకుంటూ, మూడుపాత్రలు తానేధరించి ఎన్ టి ఆర్ నిర్మించిన **దానవీర శూరకర్ణ** రికార్డులు బద్దలుకొట్టింది కారణం కొండవీటి వెంకటకవి రచనాచమత్కారం, ఎన్ టి ఆర్ నభూతోనభవిష్యతిగా పోషించిన సుయోధన పాత్రధారణ, వినూత్నమైన వాచికం ( డిక్షన్) నాటికీ నేటికీ ఎన్ టి ఆర్ కీర్తిప్రతిష్ఠలను అజరామరం చేసాయి

'దేవాంతకుడు' చిత్రానికి కవలసోదరుడివంటి **యమగోల** ( సోషియోఫాంటసీ) ఈ సంవత్సరమే విడుదలై చక్రవర్తిని సంగీత చక్రవర్తిని చేసింది

పృధ్వీరాజ్‌కపూర్ పద్ధతిలో ఎన్ టి ఆర్ వాచికం అనుసరించిన **అక్బర్ సలీం అనార్కలి,** దాసరి ప్రయోగాత్మక చిత్రం **దేవదాసు మళ్ళీ పుట్టాడు,** కుంతీకర్ణుల కధకు సాంఘికరూపం **కటకటాల రుద్రయ్య,** స్నేహంవిలువ పెంచిన **సావాసగాళ్లు,** ఈరోజు మెగాస్టార్‌గా చెట్టంత ఎదిగిన చిరంజీవి తొలిచిత్రం **ప్రాణం ఖరీదు,** అవార్డు చిత్రం **ఒక ఊరి కధ** 1978లో విడుదలఅయ్యాయి

**చలిచీమలు** పరుచూరిసోదరుల మొదటిచిత్రం బలవంతమైన సర్పాన్ని చలిచీమలు పట్టిచంపగలవు అన్న సిద్ధాంతాన్ని సినిమాకు అన్వయించుకుని, రాజకీయం, చట్టం, న్యాయం అనే మూడునీతులు, మూడుకోతులుగా, చెడువిను, చెడుచెప్పు, చెడుకను అన్నట్లుగా మారిపోయినవైనాన్ని ఈసోదరులు తమ కలం బలంతో నిరూపించటానికి చేసిన, చేస్తున్న ప్రయత్నం ఎందరో వర్ధమాన రచయితలకు ఆదర్శప్రాయమయ్యింది

ఆంధ్రుల కలలరాణి శ్రీదేవి అందాలు పరిచిన **పదహారేళ్ళ వయసు**, నటులకంటే జంతువులమీద ఎక్కువ నమ్మకంపెట్టుకున్న చిన్నప్పదేవర్ నిర్మించిన **పొట్టేలు పున్నమ్మ**, విజయబాపినీడు **బొమ్మరిల్లు**, కె బాలచందర్ **మరోచరిత్ర**, శోభన్‌బాబు **మల్లెపువ్వు**, కె విశ్వనాథ్ **సీతామాలక్ష్మి** ఈసంవత్సరం విజయవంతమైన కొన్నిచిత్రాలు విజయచందర్ క్రీస్తుగా నటించిన **కరుణామయుడు** అఖండవిజయాన్ని సాధించింది అన్నిమతాలవారి ఆదరణకు నోచుకుని, కళకు కులమేగాదు మతంకూడా లేదనినిరూపించింది ప్రజల అభిమానంతో కనకాభిషేకం పొందలేని **శ్రీరామ పట్టాభిషేకం** ఈ సంవత్సరమే విడుదలయ్యింది

సింగీతం శ్రీనివాసరావు దృశ్యకావ్యం **అందమైన అనుభవం**, కె రాఘవేంద్రరావు కమర్షియల్ బొనాంజా **డ్రైవర్‌రాముడు**, దాసరి ప్రతిష్ఠకు పరీక్ష **గోరింటాకు**, కె బాలచందర్ అపూర్వసృష్టి **గుప్పెడు మనసు**, బోయినసుబ్బారావు అన్నాచెల్లెళ్ల అనుబంధాన్ని అపురూపంగా చూపించిన **బంగారు చెల్లెలు**, ఇద్దరుపెళ్ళాల ముద్దులగోల **కార్తీక దీపం**, మహాభారతాన్ని సోషలైజ్‌చేసిన పరుచూరి బ్రదర్స్ **కలియుగ మహాభారతం**, విధివంచిత వితంతువుకథ **కమలమ్మ కమతం**, మధ్యతరగతి ఇల్లాలికోరికలు గుర్రంఎక్కకూడదని చాటిచెప్పే **కోరికలే గుర్రాలయితే**, అద్భుతసందేశాన్ని అందించిన **కుక్కకాటుకి చెప్పుదెబ్బ**, **తాయారమ్మ - బంగారయ్య**, **నగ్నసత్యం**, **నీడ** 1979లో చెప్పుకోదగినచిత్రాలు

ఇద్దరు కథానాయకుల **మండే గుండెలు**, కె విశ్వనాథ్ రూపొందించిన **ప్రెసిడెంట్‌పేరమ్మ**, జనంమెచ్చిన **పునాదిరాళ్ళు** ( విడుదలయ్యింది ప్రాణంఖరీదయినా చిరంజీవి తొలిసారి మేకప్ వేసింది ఈ చిత్రంలోనే అంటారు), ఎన్ టి ఆర్ మరోప్రయోగం **శ్రీమద్విరాటపర్వం**, భారతీరాజా **తూర్పువెళ్ళేరైలు**, కె రాఘవేంద్రరావు **వేటగాడు**, విజయబాపినీడు **విజయ**, **వియ్యాలవారి కయ్యాలు**, **యుగంధర్**, **రంగూన్‌రౌడి**, **హేమాహేమీలు** 1979లో విడుదలైన మరికొన్ని ముఖ్యమైనచిత్రాలు

అర్థమొగుడుకావాలన్న కొత్త ప్రతిపాదనతో వచ్చిన **మొగుడుకావాలి**, ఎ వి ఎమ్ వారి పాముచిత్రం **పున్నమినాగు**, ప్రజాస్వామ్యానికి ఘోరీకడుతున్నారు అని చాటిచెప్పిన సాంఘిక నాటకానికి చిత్రరూపం **సమాధికడుతున్నాం చందాలివ్వండి**, స్వాతంత్ర్యసమరోద్యమం పునాదిగా దాసరితీర్చిదిద్దిన **సర్దార్ పాపారాయుడు**, పగాప్రతీకారంతో కూడిన **శివమెత్తిన సత్యం**, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం నేపథ్యంలోనిర్మించిన అభ్యుదయాత్మకచిత్రం **మాభూమి**, యువతరానికి మార్గనిర్దేశం

వేసిన **యువతరం కదిలింది,** ఉత్తమ కథాచిత్రం కుక్క, సంచలనచిత్రం **శంకరాభరణం,** స్త్రీలు మెచ్చిన **ఏడంతస్తుల మేడ** 1980లో విడుదలయిన చిత్రాలు

1981లో కె బాలచందర్ కన్నీటితోకాకుండా **కామెడీతో** మిళితంచేసి నిరుద్యోగ సమస్యను చెప్పిన **ఆకలిరాజ్యం,** మాదాల రంగారావు సారధ్యంలో నిర్మాణమయిన **ఎర్రమల్లెలు,** ప్రేక్షకుల్లో, పరిశ్రమలో, ఒక సంచలనం సృష్టించి, అభ్యుదయాత్మక చిత్రాలవరవడికి, రచయితలు ఆ మార్గంలో ఆలోచించటానికి ముఖ్య కారణమయ్యాయి

ఒకకంట అభ్యుదయాన్ని ఆశీర్వదిస్తూ, మరొక కంట ప్రేమను అభినందించిన సంవత్సరం కూడా ఇదే దాసరి, అక్కినేని అపూర్వకలయికలోవచ్చిన **ప్రేమాభిషేకం** విజయఢంకా మోగించింది భారతీరాజా **సీతాకోకచిలుక,** చెల్లెలి సెంటిమెంట్‌తో **వారాలబ్బాయి,** చట్టంలోని లొసుగులను చూపించిన **చట్టానికి కళ్లులేవు,** ఆలోచింపజేసిన **న్యాయంకావాలి** ఈసంవత్సరం కానుకలు

1931 నుండి 1981 వరకు అంటే 50 సంవత్సరాలు నిండిన తెలుగు సినీ కళామతల్లి రాశిపెంచుకుని వాసితగ్గించుకున్నది

1947 నుండి 68 వరకు 22 సంవత్సరాలలో 570 చిత్రాలు విడుదలయితే, 1969 నుండి 1981లోపు అంటే పదమూడుసంవత్సరాలలో 1020 చిత్రాలు విడుదలయ్యాయి అంకెలో ద్విగుణీకృతం అయ్యింది తప్ప ఆశయంలో కాలేదు

ఆ 22సంవత్సరాలలో ఉత్తమకళాఖండాలు దోసిళ్ళకుదోసిళ్ళు లభిస్తే ఈ 13సంవత్సరాలలో పెద్దరైతు నూర్చివెళ్ళిపోయిన కుప్పలో పరిగ ఏరుకున్నట్టు అక్కడొక్కటి, అక్కడొక్కటి ఉత్తమచిత్రాలు లభించాయి

స్వర్ణయుగంఅంతరించి మధ్యయుగంప్రారంభమయ్యింది నిర్మాతలు, నటీనటులు, సాంకేతికనిపుణులు 50 ఏళ్ళు నిండాయని **గోల్డెన్ జూబ్లీ** ఉత్సవాలు చేసుకున్నారే గాని, గోల్డు వన్నెతరిగిపోతున్న నిజాన్ని గమనించలేకపోయారు

పరుచూరి బ్రదర్స్ తెలుగు చలన చిత్ర పోకడను మరోమలుపుతిప్పారు అని సినీ పండితులు వక్కాణించిన చిత్రం **మరోమలుపు** 1982లో విడుదలఅయ్యింది అంటరానితనం, తీవ్రవాదం, కళాశాలల్లో అవకతవకలు, మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా తెలుగునాట సంచలనంసృష్టిస్తూ శివకృష్ణ అనే నటుడు, వేజెళ్ళ సత్యనారాయణ అనే దర్శకుడు, పరుచూరి సోదరులు ఒక సుస్థిర స్థానం సంపాదించుకునేలా చేసినచిత్రం **మరోమలుపు** డాక్టర్ ప్రభాకరరెడ్డి రచించిన *గృహప్రవేశం*

కొత్తకధలకు కొత్తకధ మానభంగంచేసినవ్యక్తికే పెళ్ళిజరిపించటం, ఆ రాక్షసుడు రాముడుగా మారటం ఇతివృత్తం

కోడిరామకృష్ణ, గురువు దాసరికి తగ్గ శిష్యుడిగా దర్శకత్వం వహించిన **ఇంట్లోరామయ్య - వీధిలో కృష్ణయ్య**, రచయిత గొల్లపూడి మారుతీరావుని నటుడిగా పరిచయంచేసినచిత్రం కె రాఘవేంద్రరావు సంచలనచిత్రం **జస్టిస్ చౌదరి**, దాసరి **బొబ్బిలి పులి**, ఒకటి ఉత్తమనటనకు, రెండవది ఉత్తమకధకు ప్రతీకలుగానిలిచాయి సరిహద్దులో దేశానికి ముప్పుతెచ్చే శత్రుసైనికుణ్ణి చంపినప్పుడు పరమవీరచక్ర ఇచ్చిన ప్రభుత్వం, అంతర్గతశత్రువుని చంపినప్పుడు ఎందుకు శిక్షిస్తున్నారు అని దాసరివేసిన సూటిప్రశ్నకు ప్రేక్షకులు సానుకూలంగాస్పందించారు

వేజెళ్ళ సత్యనారాయణ దర్శకత్వంలో, గుమ్మడినటనావైదుష్యానికి ప్రతీకగానిలిచిన **ఈ చరిత్ర ఏ సిరాతో** సంచలన విజయం సాధించింది నివురుగప్పిననిప్పులాఉన్న రిజర్వేషన్ సమస్య ఇందులో ప్రస్తావించబడింది నిరుద్యోగం, రైతులు, కవుల కలలకలాలు అన్నింటినీ స్పృశించి, దానికి సమాధానం, ఈచరిత్ర ఎర్రసిరాతో అనటంతో చిత్రం ముగుస్తుంది

క్రాంతికుమార్ **ఇది పెళ్ళంటారా?** శాడిస్టు భర్తకధ దాసరి **మేఘసందేశం** జాతీయస్థాయిలో పేరుప్రఖ్యాతులు సాధించింది ఉత్తమ కధాచిత్రాలు ***ధర్మవడ్డీ, బంగారుభూమి, తరంగిణి***, రాజశేఖర్ తొలిచిత్రం ఎందేమాతరం గుర్తుండే చిత్రాలు

కృష్ణ కధానాయకుడిగా పద్మాలయావారు నిర్మించిన **ఈనాడు** చిత్రం రాజకీయ సంచలనానికి కారణమైంది కొత్తగా రాజకీయాలలోకివచ్చిన ఎన్ టి ఆర్ పెట్టిన తెలుగుదేశంపార్టీ రాష్ట్రంలో విజయంసాధించటానికి ఈచిత్రం కారణమైందని అప్పట్లోచెప్పుకొన్నారు రాజకీయస్పృహ పుష్కలంగాఉన్న పరుచూరి సోదరులు ఈ మళయాళ పునర్నిర్మాణ చిత్రానికి అచ్చమైన తెలుగుదనం సంతరించిపెట్టారు పట్నంమీదమోజుతో ఇద్దరుఇల్లాళ్ళు పట్నంవెళ్లి ఇక్కట్లుపడే విచిత్రకధాంశంతో **పట్నంవచ్చిన పతివ్రతలు**కూడా ఈసంవత్సరమే విడుదలఅయ్యింది

కులాంతర వివాహ ప్రాతిపదికమీద, చెడిపోయిన అమ్మాయిని చెలిగా తెచ్చుకునే కధాంశంతో సత్యానంద్ రచించిన ***త్రిశూలం*** విశాఖపట్నంలోమాత్రం 300 రోజులు ఆడి, ఉత్తమప్రేక్షకులం మేమే అని విశాఖవారుసగర్వంగా చెప్పుకునేలాచేసింది **కొత్తనీరు** రుచితెలియకుండానే ఎండిపోయింది తెలుగుదేశ విజయానికి రహదారివేసిన **నాదేశం** కూడా ఈసంవత్సరాంతంలోనే విడుదలయ్యింది

1983 దాసరి రాజకీయవ్యంగ్యచిత్రం **ఎమ్ ఎల్ ఏ ఏడుకొండలుతో** ప్రారంభమయ్యింది మధ్యతరగతిజీవితాల సాధకబాధకాలను చర్చించిన పరుచూరిసోదరుల **ఇదికాదు ముగింపు**, సామ్యవాదం ముసుగులో మసాలాచిత్రం అని సితార విమర్శించిన **ముందడుగు**, ఒక్క వారమే ఆడినా పదికాలాలపాటు ప్రేక్షకులు గుర్తుంచుకోవలసిన **ఈ దేశంలో ఒకరోజు**, సంపాదిస్తున్న ఆడపిల్ల ఇంటినుంచి వెళ్ళిపోతే ఆకుటుంబం ఆర్ధికపరిస్థితి ఆ పిల్లతో ఎలా చెలగాటం ఆడుకుంది అనే అంశంతో నిర్మించిన **ఈపిల్లకు పెళ్ళవుతుందా?** అద్భుతమైన పేరుప్రఖ్యాతులు సంపాదించుకున్నాయి పరుచూరి సోదరులలో చిన్నవాడు, ఈ సిద్ధాంత వ్యాస రచయిత, పరుచూరి గోపాలకృష్ణను నటుడిగా పరిచయం చేసిన తొలిచిత్రం **ఈపిల్లకు పెళ్ళవుతుందా!**

ఈనాడు తెలుగుదేశంప్రభుత్వం మానసపుత్రికగా కనిపిస్తున్న రైతుబజార్‌ని 19సంవత్సరాలక్రితమే పరిచయం చేస్తూ, పరుచూరి సోదరులు రైతుసమస్యలను చర్చించినచిత్రం **ప్రజారాజ్యం**

చిరంజీవి నటజీవితాన్ని అందలంఎక్కించిన **ఖైదీ**, ఉరిశిక్ష గురించి చర్చించిన **అభిలాష**, బాపు **మంత్రిగారి వియ్యంకుడు**, పెట్టుబడిదారీవిధానానికి, అభ్యుదయానికి, అన్నకుచెల్లికి మధ్య జరిగిన సంఘర్షణాత్మకచిత్రం **చండశాసనుడు**, చారిత్రాత్మకచిత్రం **ఆంధ్రకేసరి**, కె విశ్వనాథ్ నాట్యప్రధానచిత్రం **సాగరసంగమం**, దాసరి **బహుదూరపు బాటసారి**, **పండంటి కాపురానికి పన్నెండు సూత్రాలు** ఉత్తమచిత్రాలుగా నిలిచాయి

విద్యాలయాలమీద పెట్టుబడిదారుల పట్టుని ప్రశ్నించిన **రోజులుమారాయి**, సీలింగ్‌యాక్ట్‌మీద పరుచూరిసోదరులు తొలిసారిగా దర్శకత్వంవహించిన **కాయ్ రాజా కాయ్** 1984లో విడుదలఅయ్యాయి

1984 మే మాసంలో విడుదలయిన **బొబ్బిలి బ్రహ్మన్న** స్లాబ్‌పద్ధతిలో ఒకచిత్రం ఎంతవిజయం సాధిస్తుందో చూపించింది సుకన్యోపాఖ్యానం ప్రాతిపదికగా రచింపబడిన ఈ కల్పితగాధ యధార్ధగాధ అన్నంత నమ్మకాన్ని ప్రజలకు కలిగించింది ఆహార్యంలో, వాచికంలో, అభినయంలో అత్యున్నత ప్రమాణాలు చూపించి, తన నటజీవితంలో ఒక మరుపురాని, మరువలేని చిత్రంగా మలచుకున్నాడు కృష్ణంరాజు సమాస భూయిష్టమైనసంభాషణలను పండితులు, పామరులు ఒకే విధంగా ఆదరించారు

ఎన్ టి ఆర్ కలల పంట, జీవితాశయం **శ్రీమద్విరాట్ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర**, చరిత్ర సృష్టించింది పార్లమెంట్‌గొప్పదా? కోర్టుహాలు గొప్పదా? రాజకీయమా?

న్యాయమా? అని డి రామానాయుడు నిర్మించిన **కథానాయకుడు** విజయవంత మయ్యింది **వేజెళ్ళ** మార్చండి మన చట్టాలు, **ఈ చదువులు మాకొద్దు,** క్రాంతికుమార్ **స్వాతి,** వంశీ **సితార** ప్రేక్షకుల్లో కలకలం తెచ్చిన చిత్రాలు బి నరసింగరావు **రంగులకల** కూడా విడుదలయ్యింది

**అగ్నిపర్వతం, చట్టంతోపోరాటం** చిత్రాలతో ప్రారంభమయ్యింది 1985 చెట్టుచాటునుంచి చంపబడ్డ వాలిలాగా, రథంఎత్తుకుంటున్నప్పుడు తెగటార్చబడిన కర్ణుడిలాగా, తొడలువిరగగొట్టబడ్డ సుయోధనుడిలాగా, తను అధర్మవిజితుడనన్న అంతర్మధనంతో నలిగే జమదగ్నిపాత్రను అగ్నిపర్వతంలో కృష్ణ అపూర్వంగాపోషించాడు

విజయం సాధించకపోయినా వరకట్నసమస్య విశ్వరూపాల్ని ప్రదర్శించిన **శ్రీకట్నలీలలు, వేజెళ్ళ అపనిందలు ఆడవాళ్ళకేనా, మాపల్లెలో గోపాలుడు,** కోడిరామ కృష్ణ బూజుపట్టిన సంప్రదాయం మీద విజయంసాధించిన చిత్రం **ఓ తండ్రితీర్పు,** వానప్రస్థానికి దగ్గరైన తండ్రికథ

ఇరవైసంవత్సరాలుగా, ఇరవైచిత్రాలుగా నేను ఎదురుచూస్తున్న విజయం ఇన్నాళ్ళకు నాకు లభించింది అని ఎమ్ ఎస్ రెడ్డి పత్రికాముఖంగా చెప్పుకున్న ప్రతిష్ఠాత్మకచిత్రం **పల్నాటి సింహం** ఎ కోదండరామిరెడ్డి తన దర్శకత్వప్రతిభతో ఈకథ నిజంగా పలనాట జరిగిందేనన్న భ్రమ కలిగించాడు మరోనాయకురాలు నాగమ్మగా శారద పాత్రచిత్రణ ఈచిత్రానికి ఆయువుపట్టు

1985లో పరిశ్రమకు, ప్రేక్షకులకు సిహెచ్ రామోజీరావు అందించిన మహత్తరకానుక **ప్రతిఘటన** రౌడీయిజానికి వ్యతిరేకంగా ఒక యువతిపోరాటం ప్రధానాంశంగా టి కృష్ణ, హరనాధరావుల కలయికలో వచ్చిన ఈ చిత్రం స్క్రీన్‌ప్లే రచనకు ఒక నిఘంటువులాటిది సామాజికస్పృహ కలిగించే కధాంశంతో, సంభాషణలతో కూడిన అత్యుత్తమచిత్రం తెలుగులో త్రి డి చిత్రనిర్మాణం ఈ సంవత్సరమే ప్రారంభమయ్యింది **సాగర్** తొలితెలుగు త్రి డిచిత్రం

దర్శకుడిగా బి గోపాల్ తొలిచిత్రం **ప్రతిధ్వని,** కె విశ్వనాధ్ ఆణిముత్యం **స్వాతిముత్యం,** మొట్టమొదటి 70 ఎమ్.ఎమ్ చిత్రం **సింహాసనం,** బాల్యవివాహంతో నడిచిన **సీతారామకల్యాణం,** హంతకుడనితెలిసీ విడుదలచేసిన జడ్జీకథ **ఖైదీ రుద్రయ్య,** ఏడోనెలలో పుట్టినబిడ్డ అక్రమసంతానం కాదు అని నిరూపించే వినోదాత్మకచిత్రం **అనసూయమ్మగారి అల్లుడు,** డి వి నరసరాజు విచిత్రసృష్టి **కారుదిద్దిన కాపురం,** అరుణత్వంతోనిండిన **అరుణ కిరణం,** ఆర్ నారాయణమూర్తిని దర్శకుడిగా ఆవిష్కరించిన **అర్ధరాత్రి స్వతంత్రం,** నాగార్జునను కథానాయకుడిగా పరిచయంచేసిన

విక్రమ్, వెంకటేష్ తొలిచిత్రం **కలియుగ పాండవులు**, చారిత్రాత్మక చిత్రం **తాండ్రపాపారాయుడు**, అబద్ధపుసాక్ష్యాల చుట్టు అల్లబడిన **జైలుపక్షి**, అన్నాచెల్లెళ్ళ అనురాగానికి ప్రతీక శివకృష్ణ **ఆడపడుచు**, వేశ్యలజీవితంమీద రావెూజీరావు వ్యర్థప్రయత్నం **పూజకు పనికిరాని పువ్వు**, కోడిరామకృష్ణ **తలంబ్రాలు** 1986లో చెప్పుకోదగినచిత్రాలు

**దొంగమొగుడు** లాంటి మాస్ కథతో ప్రారంభమయ్యింది 1987 పడమటి **సంధ్యారాగం** లాంటి దేశాంతర ప్రేమకథను, **అహనాపెళ్ళంట**లాంటి నవ్వులపంటను పండించటమేగాక టాకీయుగం ప్రారంభమయ్యాక సింగీతం **పుష్పకవిమానం** అనే మూకీచిత్రం తియ్యటం విశేషం **మండలాధీశుడు**లాంటి రాజకీయచిత్రం, భారతీరాజా **ఆరాధన**, అన్నపూర్ణావారి **కల్లెక్టర్‌గారి అబ్బాయి** మంచిచిత్రాలు పున్నమివెన్నెలలు కురిపించలేకపోయినా, పనిమనిషిలోని నాట్యకళాపిపాస చూసి ఒకకళాశాల ఉపన్యాసకుడు, ఆమెకు చేయూతనివ్వటం ద్వారాపొందిన అనుమానాలూ - అవమానాలూ, అనుభూతులతో నిండినచిత్రం **కార్తీకపౌర్ణమి** నల్లపూసలు **సీరియల్‌**గా ఆంధ్రజ్యోతిలో అత్యంత ప్రాచుర్యంపొందింది, ప్రేక్షకుల నిరాదరణకు గురయ్యింది

> *అందుకే పోరంకి దక్షిణామూర్తి అన్నట్టు - సాహిత్యంలో బాగున్నకథ, సినిమాలో పరాజయం పాలవ్వచ్చు*[15] అన్నది అక్షర సత్యం

కె విశ్వనాథ్ **శృతిలయలు**, నలుగురు అక్కాచెల్లెళ్ళ కథ **లాయర్ భారతీదేవి** ( స్త్రీల కష్టాలు ఎక్కువగా ఉన్నాయని ఈ చిత్రానికి ఎ సర్టిఫికెట్ ఇచ్చారు) , **పి ఎ పి** వారి పల్లెటూరికథ **ప్రెసిడెంట్‌గారి అబ్బాయి**, నేరస్తులు ఎల్లవేళలా నేరస్తులుగానే మిగిలిఉండరాదని చెప్పిన **ముద్దాయి**, క్రాంతికుమార్, మానభంగానికి గురయిన యువతిమీద తీసిన **శారదాంబ**, ఏడులక్షలమంది ఓటర్లలో **ఎమ్ పీగా** ఓడిపోయినా ఒకవ్యక్తి అడ్డదారిన రాజ్యసభద్వారా **ఎమ్ పి** అయి, 70కోట్లమందికి మంత్రిఅవటం ప్రజాస్వామ్యమా? అని భారతఓటర్ల ఓటువిలువను గుర్తుకుతెచ్చిన 'ఈతరం'వారి **ప్రజాస్వామ్యం**, కోడిరామకృష్ణ **ఇంటిదొంగ, ఆహుతి** ఈ సంవత్సరం చెప్పుకోదగ్గ చిత్రాలు

1988 పరిశ్రమకు అంతకలిసి వచ్చిన సంవత్సరం కాదు **బడి, ఊరేగింపు, ఆలోచించండి, మా తెలుగు తల్లి, కళ్ళు** లాంటి అభ్యుదయాత్మకచిత్రాలన్నీ పెట్టుబడిని తిరిగి తెచ్చిపెట్టలేకపోయాయి కె విశ్వనాథ్ **స్వర్ణకమలం**కూడ వికసించలేదు సత్యానంద్ తొలిసారిగా దర్శకత్వంవహించిన **ఝాన్సీరాణి** అతనికి అదే మొదటి, ఆఖరి దర్శకత్వ చిత్రంగా మిగిలిపోయింది

అత్తకుయముడు-అమ్మాయికిమొగుడుతో 1989 శుభారంభం చూసింది అన్నాచెల్లెళ్ళ అనురాగానికి పరాకాష్ఠ, చెల్లెలిశవానికి ఎండ తగులుతోందని అన్న గొడుగుపట్టేటంత పిచ్చిప్రేమతో తీసిన **ముద్దులమావయ్య**, ఆడవాళ్ళకోసం అనాధాశ్రమం స్థాపించి అభ్యుదయమార్గంలో పయనించాలన్న **రక్తకన్నీరు**, ఆర్ నారాయణమూర్తి **భూపోరాటం** గుర్తుంచుకోదగ్గ చిత్రాలు కేంద్రప్రభుత్వ అవార్డులు పొందిన **దాసి** చిత్రాన్ని దూరదర్శన్ ద్వారానే ప్రేక్షకులు చూడగలిగారు

'ప్రతిఘటన' తరువాత రామోజీరావు నిర్మాతగా తీసిన **మౌనపోరాటం** సంచలన విజయం సాధించింది ఒక గిరిజనయువతి, **ఫారెస్ట్ ఆఫీసర్** చేతిలో మోసగించబడి, మౌనపోరాటంద్వారా అతన్ని ఎలాగెలుచుకుంది అన్నదే ఈ చిత్రకథ ఈ సినిమా విడుదలయ్యాక మోసగించబడ్డ చాలామంది యువతులు మౌనపోరాటం చేసారు

కృష్ణతీసిన సంచలన రాజకీయ చిత్రం **సాహసమే నావూపిరి**, కొందరికి మోదాన్ని, కొందరికి ఖేదాన్ని కలిగించింది కోడిరామకృష్ణ రాజశేఖర్ద్వారా ప్రయోగించిన, మాస్ చిత్రాలు అనే మదేభం కుంభస్థలాన్నికొట్టిన **అంకుశం**, పరిశ్రమలో ట్రెండ్‌సెట్టర్ అయ్యింది

దీని వెనుకేవచ్చిన రామ్‌గోపాల్‌వర్మ **శివ** సినిమా మీడియాలో శబ్దానికిఉన్న ప్రాధాన్యాన్ని సూచించింది ఈ రెండుచిత్రాలు విడుదలయ్యాక తెలుగుపరిశ్రమలో ఈపాత్రకు ఈనటుడు కావాలని, ఈపాత్రకు ఈమాటకావాలని దర్శకులు, నిర్మాతలు అడగటం తగ్గించారు **భారతనారి** యువతరం బాబూరావు, హరనాధరావుకలంద్వారా చేసిన మరోప్రయోగం వెళ్ళిపోతున్న 89కి **కొడుకు దిద్దిన కాపురం, ఇంద్రుడు చంద్రుడు** శుభంఅని వీడ్కోలు పలికాయి

ఒక బిడ్డను మాబిడ్డఅంటే మాబిడ్డఅని ఇద్దరు తల్లిదండ్రులు కోర్టుకెక్కిన **జడ్జిమెంట్**తో 1990 ప్రారంభమయ్యింది ఓంకార్ **బంట్రోతు భార్య** అడుగుజాడల్లో రాసిన **పోలీసుభార్య** మంచిచిత్రం భార్యాభర్తల అనురాగ ఆవేదనలకి, అధికారులకీ అనధికారులకీ మధ్యఉన్న అంతరాలకీ చక్కటి సమన్వయంతోపాటు రిజర్వేషన్‌మీద చురకలుకూడా ఉన్నాయి

ఒకేరోజు మోహన్‌గాంధి దర్శకుడిగా రెండు ఉత్తమచిత్రాలు విడుదలయ్యాయి ఒకటి ఘనవిజయం సాధించింది రెండవది ఘోరపరాజయాన్ని చవిచూసింది జయపజయాలు పక్కకుపెడితే ఐ పి ఎస్ స్థాయినిపెంచి, **పోలీసుడిపార్ట్‌మెంట్** మీద

గౌరవంపెంచే **కర్తవ్యం** విజయశాంతి నటజీవితానికి కీర్తికిరీటంతోపాటు భారతప్రభుత్వ ఊర్వశిఅవార్డును తెచ్చిపెట్టింది రెండవది ఊర్వశి శారద, యమున అద్భుతంగా నటించిన కరుణరసాత్మక చిత్రం **ఆడది ఆడలేదు**!

చిరంజీవి మొట్టమొదటి కౌబాయ్‌చిత్రం **కొదమసింహం**, సంవత్సరంపాటు నడిచిన వెంకటేష్ **బొబ్బిలిరాజా**, 'మనుషులు మారాలి' తర్వాత అంతటి కరుణరసాన్ని పండించిన **పుట్టింటి పట్టుచీర**, వైద్యవృత్తిమీద గౌరవంపెంచే **డాక్టర్ భవాని**, సమస్యాత్మకచిత్రం **మాస్టారి కాపురం**, ఒకకొడుకుని ఒకకొడుకు చంపితే బతికిఉన్న కొడుక్కి ఉరిశిక్ష వేయాలావద్దా? అన్న తండ్రికథతో శోభన్‌బాబు హీరోగా డి వి ఎస్ రాజు నిర్మించిన **దోషి-నిర్దోషి** ఈ సంవత్సరం ఉత్తమచిత్రాలు మాస్‌సినిమా బలంచూపిన **లారీడ్రైవర్**‌తో 1990 ముగిసింది

సత్యమూర్తి సృష్టించిన అద్భుత పాత్రల సమ్మేళనం ***శత్రువు***తో 1991 ప్రారంభమయ్యింది అతనుతీర్చిదిద్దిన కోట శ్రీనివాసరావుపాత్ర అతను జీవితంలోమరిచిపోలేనిది

స్టువర్టుపురందొంగల నేపథ్యంలో తీసిన **స్టువర్టుపురం దొంగలు**, **స్టువర్టుపురం పోలీస్ స్టేషన్** రెండూ పరాజయమై, ప్రజలకు, ప్రేక్షకులకు, దొంగలమీద సానుభూతి ఉండదని నిరూపించాయి

ఒకజైలర్ తనజైల్లోఉన్న యువకుడి ప్రేమకుఖైదీ అయ్యి, అతనిప్రేమనుగెలిపించిన **ప్రేమఖైదీ** ఇ వి వి ని తెలుగువెలుగుల దర్శకుడిగా పరిచయంచేసింది ఈతరం బాబూరావు ***ఎర్రమందారం*** సినీసాహిత్యంలో పూసిన ఎర్రమందారమే రాయలసీమకక్షల నేపథ్యంలోనిర్మించిన ***కడప రెడ్డెమ్మ***, తీవ్రవాదం నేపథ్యంలోతీసిన **పీపుల్స్ ఎన్‌కౌంటర్** మరువలేనివి

బాపు ఆవిష్కరించిన **పెళ్ళిపుస్తకం** ప్రతిపేజీ చదువుకోదగ్గది 300 చిత్రాలకు పైగా ప్రతినాయక పాత్రలలో నటించినా, నిజంగా మోహన్‌బాబుని కథానాయకుణ్ణి చేసిన **అసెంబ్లీ రౌడీ**, ఒకచిత్రానికి, సంభాషణల విలువెంతో వర్ధమానరచయితలకు సూచించిన చిత్రం ఎన్ టి ఆర్ నిర్మించి, నటించి, దర్శకత్వం వహించిన **బ్రహ్మర్షి విశ్వామిత్ర** సాంకేతికంగాకూడా పెద్ద పేరుతెచ్చుకోలేదు కథాసంవిధానం దెబ్బతింది

కన్నతండ్రినే ***నువ్వు చచ్చిపోయావనుకుని మాకు జీవితభీమాడబ్బులు ఇస్తున్నారు నువ్వునిజంగావెళ్ళిపో నాన్న*** అని కొడుకు, కూతురు తండ్రినికోరుకునే ***కలికాలం***, సింగీతం సోషియోఫాంటసీ చిత్రం ***ఆదిత్య 369*** చెప్పుకోదగ్గచిత్రాలు

యధార్థగాధకు చిత్రరూపం సర్ప్రయాగం, సెక్షన్ 498ఎ ని మార్చాలన్న ప్రయత్నం, రాజశేఖర్ నటవైదుష్యానికి పరాకాష్ఠ ఆగ్రహంతోపాటు ఈసంవత్సరం గ్యాంగ్‌లీడర్, పెద్దింటల్లుడు, కూలీనెం-1, రౌడీగారి పెళ్ళాం, భారత్‌బంద్, ఎదురింటి మొగుడు-పక్కింటి పెళ్ళాం, క్షణక్షణం, నాగమ్మ, కొబ్బరిబోండాం, అగ్నినక్షత్రం, అమ్మరాజీనామా లాంటి ఎన్నో విజయవంతమైనచిత్రాలు విడుదలై పరిశ్రమకు పచ్చనికాలం వచ్చిందని నమ్మించాయి

1992లో సూరిగాడు, చంటి, పెద్దరికం, అక్కమొగుడు, రైతుశ్రేయస్సుకోసం తీసిన వందర్ ఇండియా చెప్పుకోదగ్గ చిత్రాలు అయితే విలువలతోకూడిన ఉన్నతమైనచిత్రం అంకురం 'పోలీస్‌లాకప్'లో బంధించబడిన ఒక ఖైదీకోసం, అతని బిడ్డకోసం ఒకయువతి చేసిన పోరాటం యావదాంధ్ర ప్రేక్షకలోకాన్ని ఆకర్షించింది భద్రంకొడుకో, యజ్ఞం, మృగతృష్ణ, డ్యాక్టర్‌అంబేద్కర్ గుర్తుంచుకోదగిన చిత్రాలు

1993లో, ఏనుగుపిల్లతో రాజేంద్రప్రసాద్ చేసినఅల్లరి రాజేంద్రుడు-గజేంద్రుడిగా పేరుతెచ్చుకుంది పిల్లల్నికనాలంటే భయపడే చిట్టెమ్మకధ చిట్టెమ్మ మొగుడిగావచ్చి దెబ్బతింది

విజయశాంతి ప్రధానపాత్రధారిణిగా ఎ ఎం రత్నం నిర్మించిన ఆశయం ఉత్తమ కధాచిత్రంగా ప్రభుత్వ నందిఅవార్డు పొందింది నిజమైనరాజకీయానికి స్వచ్ఛమైన నిర్వచనం చెప్పిన ఈచిత్రం ప్రేక్షకులనుంచి కంటే పత్రికల ప్రశంసలు ఎక్కువపొందింది

ఎన్ టి ఆర్ 300వచిత్రం మేజర్ చంద్రకాంత్, తెలుగుప్రేక్షకుల్లో దేశభక్తిని పెంపొందించింది ఎన్ టి ఆర్ నటజీవితానికి శతదినోత్సవంతో వీడ్కోలుపలికింది

ఎన్ టి ఆర్ ఆఖరిచారిత్రాత్మకప్రయోగం శ్రీనాధకవిసార్వభౌమ, టి సుబ్బిరామిరెడ్డి భగవద్గీత ఫలవంతం కాలేదు కన్నీరు పెట్టటం చేతకాని వారిచేత కూడా కంటినిండా నీరు కురిపించి, గుండెనిండా బాధనింపినచిత్రం మాతృదేవోభవ భర్త చనిపోయాక తను చనిపోతానని తెలిసిన ఒకతల్లి తనబిడ్డల్ని ఒక్కోఇంట్లో దత్తత ఇచ్చుకుంటూవెళ్ళే సన్నివేశాలతో బహుశా తెలుగుచలనచిత్రసీమలో కరుణరసాత్మకంలో అతిరసాత్మకచిత్రంగా ప్రఖ్యాతిపొందుతుందేమో!

1994 మహారధి రైతురాజ్యస్థాపనకోసం రాసిన రైతుభారతం చెప్పుకోదగ్గచిత్రం చాలా సంవత్సరాలతర్వాత తండ్రిబాటలో తనయుడునడిచి, నటించిన, తొలి జానపద చిత్రం, బాలకృష్ణ నటించిన భైరవద్వీపం - కాలంమారింది తప్ప ప్రేక్షకులఅభిరుచి మారలేదని నిరూపించింది

పరుచూరిసోదరులు దర్శకత్వం వహించిన **మరో క్విట్‌ఇండియా** అవినీతిపరులారా ఈ స్వేచ్ఛా భారతంలో మీకుచోటులేదు, క్విట్‌ఇండియా అనే సందేశంతో ముగుస్తుంది

'యమగోల', 'యముడికి మొగుడు' చిత్రాలవలె, ఎస్ వి కృష్ణారెడ్డి సృష్టించిన మరొక **సోషియో ఫాంటసీ యమలీల** తల్లిసెంటిమెంట్, యముడిసెంటిమెంట్ ఆలీని హీరోగా నిలబెట్టాయి ఈ సంవత్సరం చెప్పుకోదగ్గ మరోచిత్రం ఆర్ నారాయణమూర్తి **ఎర్రసైన్యం,** ఈచిత్రం ఎన్నో ఎర్రసినిమాల నిర్మాణానికి కారణంఅయ్యింది భూమికోసం, చెల్లికోసం ఒక పేదవాడు ఎర్రజెండాను అడ్డంపెట్టుకుని చేసిన పోరాటం **ఎర్రసైన్యం**

సింగీతం శ్రీనివాసరావు చేసిన మరొక ప్రయోగం **మేడమ్,** చారిత్రాత్మక చిత్రంగా భ్రమింపజేసే **బొబ్బిలి సింహం,** మొగుణ్ణి కోటి రూపాయలకు అమ్ముకునే **శుభలగ్నం** గుర్తుంచుకోదగ్గ చిత్రాలు ఇ వి వి **ఆమె,** ఆమెలకే కాక ఆయనలకు కూడా కనువిప్పు కలిగించే చిత్రం

1995లో వేళ్ళమీద లెక్కపెట్టే ఉత్తమచిత్రాలు వచ్చాయి కె విశ్వనాథ్ **శుభసంకల్పం** వాటిలో ఒకటి 65 సంవత్సరాల తెలుగుచలన చరిత్రరికార్డులను తిరగరాసిన **పెదరాయుడు** ఈ సంవత్సరమే విడుదల అయ్యింది సౌందర్య తొలిసారి **మేకప్** వేసిన చిత్రం **అమ్మోరు,** మూడు సంవత్సరాల తర్వాత ఈ సంవత్సరం విడుదలై, మూఢవిశ్వాసాలను మూటకట్టింది కేవలం మూడు నాలుగు చిత్రాల విజయంతో తెలుగుచలనచిత్రపరిశ్రమ కుంగిపోయిన సంవత్సరం 1995

1996 ఉత్తమకథాచిత్రం **వంశానికొక్కడు**తో ప్రారంభమయ్యింది తండ్రి చేసిన నేరానికి కుమారుడు శిక్షవేసి, ఏ ఇంటిబిడ్డను తండ్రి చంపించాడో, ఆ ఇంటికి తను దత్తతగా వెళ్ళటమే, తండ్రికి కోర్టువిధించే శిక్షకంటే గొప్పదిఅన్న **వంశానికొక్కడు,** అశేషప్రేక్షకుల నీరాజనం అందుకుంది

రాఘవేంద్రరావు, సత్యానంద్‌ల **పెళ్ళి సందడి** రాష్ట్రమంతా ఒకటే సందడిచేసి ప్రేమకథా చిత్రాలకి కొత్తకోణం చూపించింది రాఘవేంద్రరావు, పరుచూరిసోదరుల **సాహసవీరుడు-సాగరకన్య** మత్స్యకన్య కథగా సోషియో ఫాంటసీ నిర్మాణంలో నూత్నవిధానం చూపించింది

బాలకృష్ణ తండ్రి అడుగుజాడల్లో నడవాలనిచేసిన మరొకప్రయత్నం పౌరాణికచిత్రం **శ్రీకృష్ణార్జునవిజయం** ఎన్ టి ఆర్ ఏనాడు కృష్ణుడు, అర్జునుడిగా ఒకేచిత్రంలో నటించలేదు ద్విపాత్రాభినయంలో సుభద్ర మధ్యలోఉంటే ఒకరిలో అన్నను, ఒకరిలో ఆయనను చూడాలి ఇది సాహసం ఆ సాహసం విజయవంతంకాలేదు సంభాషణ బలంతో నడిచిన చిత్రం **నాయుడుగారి కుటుంబం** ఈ చిత్రం ముహూర్తం జరిగినప్పుడు

పత్రికాసమావేశంలో నా 'ప్రేమ్‌నగర్' చిత్రం తరువాత **డైలాగులు** నాకు అంతబాగా నచ్చినచిత్రం అని శతచిత్ర నిర్మాత డి రామానాయుడు చెప్పిన చిత్రం 250 చిత్రాలు రాసిన తర్వాత పరుచూరిసోదరులు మొదటిసారిగా సంభాషణలకు నంది**అవార్డు** పొందిన చిత్రం **నాయుడుగారి కుటుంబం**

రామ్‌గోపాల్‌వర్మ ప్రయోగం **దెయ్యం** సహజంగానే ఆకర్షించలేకపోయింది ఈ సంవత్సరం కూడా పరిశ్రమ పట్టుమని పదివిజయాలనుకూడా చవిచూడలేదు

1997, చిరంజీవి నటజీవితానికి కొత్త శ్రీకారాన్నిచుట్టిన **హిట్లర్‌**తో ప్రారంభమయ్యింది ఈ సంవత్సరమే కమ్యూనిస్టు *గవర్నమెంట్* వస్తే ఈ చిత్రం స్క్రిప్టుని **టెక్స్ట్ బుక్**గా పెడతారు అని సాటి రచయిత తనికెళ్ళభరణి ప్రశంసలుపొందిన, పరుచూరిసోదరుల అభ్యుదయాత్మక చిత్రం, **అడవిలో అన్న** సంచలనం సృష్టించింది

ఎన్ టి ఆర్ పరమపదించిన తర్వాత రామకృష్ణా సినీస్టూడియోస్ రామకృష్ణా హార్టీకల్చరల్‌స్టూడియోస్‌గామారి పరంపరగా కాపాడుకొస్తున్న వారి **బేనర్**విలువను పెంచిన **పెద్దన్నయ్య,** బాలకృష్ణ నటనాబలానికి, శరత్ దర్శకత్వప్రతిభకు మధ్య జరిగిన క్షీరసాగర మథనం

ఈ సంవత్సరం విడుదలయిన మరొక అభ్యుదయాత్మక సంచలనచిత్రం **ఒసేయ్ రాములమ్మ** శబ్దాలయ థియేటర్స్ అందరూ బాలలతోచేసిన అద్భుతప్రయోగం **రామాయణం** ఎన్ టి ఆర్ మనుమడు శ్రీరాముడిగా నటించటం విశేషం

భారవి, రాఘవేంద్రరావుల అపూర్వసృష్టి **అన్నమయ్య** తరిగిపోతున్న తెలుగుసినిమా విలువల్ని పెంచినచిత్రం ఇది ప్రేమను ఫ్యాక్షనిజం నేపథ్యంలో చూపించిన వినూత్నచిత్రం, నూతనదర్శకుడు జయంత్ ప్రయోగం **ప్రేమించుకుందాం రా!** ఐ ఎ ఎస్ విలువల్ని చాటిచెప్పిన చిత్రం **కలెక్టర్‌గారు,** చెడిపోయినఅమ్మాయి మెడలో తాళికట్టాలిఅనే **పెళ్ళి చేసుకుందాం** ఉత్తమకథాచిత్రం రోజామూవీస్‌వారి **మానాన్నకుపెళ్ళి** శీర్షికకు తగినచిత్రం సాయికుమార్ **సైనికుడు** ఈ సంవత్సరం అంతంలోవచ్చిన ఉత్తమకథాచిత్రం

1997-98లో చలనచిత్రపరిశ్రమ దృష్టిదోషం తగిలేంత విజయాలు చవిచూసింది లేచిపోయిన పెళ్ళాంకథ **దీర్ఘ సుమంగళీభవ,** తమిళనాటనుంచి అరువుతెచ్చుకున్న **సూర్యవంశం** గుర్తుపెట్టుకోదగ్గవి ఈ సంవత్సరం అంతర్జాతీయంగా చర్చకువచ్చినచిత్రం *గణేష్* కాలిపోతున్న వైద్యవిధానాన్ని దర్శకుడు తిరుపతిస్వామి తూర్పారపట్టిన *గణేష్* వైద్యసమూహంలో చర్చనీయాంశమయ్యింది

**శ్రీసీతారాముల కల్యాణం చూతమురారండి** అక్కినేనినటించిన మరో కుటుంబగాధా చిత్రం ఇ వి వి **కన్యాదానం,** తనభార్యను దానంచెయ్యటం అనే వినూత్నకధాంశంతో నడిచింది

**తొలిప్రేమ** సంచలన విజయం సాధించి ప్రేమకు తొందరపాటుకంటే వేచిచూడటమే మేలన్న సందేశాన్నిచ్చింది పరిటాల శ్రీరాములు నిజజీవితస్ఫూర్తితో సృష్టించబడిన **శ్రీరాములయ్య** నందమూరి హరికృష్ణ నటపునర్జన్మకు శ్రీకారంచుట్టింది ప్రేమకధలో మరొక విభిన్నచిత్రం **ప్రేమంటే ఇదేరా!, మనసిచ్చిచూడు,** ప్రేమమార్గంలో నడిచినచిత్రాలు దాసరి **కంటే కూతుర్నేకను,** కృష్ణవంశీ **అంతఃపురం** ప్రజాదరణపొందాయి

1999లో **సమరసింహారెడ్డి, స్నేహం కోసం, దేవి, స్వయంవరం, తమ్ముడు** చెప్పుకోదగ్గ చిత్రాలు కృష్ణ కుమారుడు మహేష్‌బాబు **రాజకుమారుడు**తో కధానాయకుడిగా పరిచయం అయ్యాడు

2000వ సంవత్సరంలో సంచలన విజయంసాధించిన **కలిసుందాం రా!, బద్రి, క్షేమంగావెళ్ళి లాభంగారండి, నువ్వు వస్తావని,** తేజను దర్శకుడిగా పరిచయంచేసిన చిత్రం పరిశ్రమకు ఊపిరిఅందించాయి దేవుడున్నాడా, లేడా అన్న కధాంశంతో **రాయలసీమ రామన్నచౌదరి,** దళితులకు రాజ్యాధికారం ఇవ్వాలన్నఅంశంతో **జయం మనదేరా,** మతసామరస్యం కావాలంటూ **ఆజాద్** విడుదల అయ్యాయి **నువ్వే కావాలి** ప్రేమకధాచిత్రాల ట్రెండ్ మొదలుపెట్టింది **చిరునవ్వుతో** చిత్రంతో రామ్‌ప్రసాద్ దర్శకుడిగా పరిచయమయ్యాడు

**నరసింహనాయుడు** 2001 సంక్రాంతి సంచలనంఅయ్యింది **మృగరాజు, దేవీ పుత్రుడు** నూతనకధాంశాలు ప్రదర్శించాయి **ఖుషి** ప్రేమకధాచిత్రాలలో రికార్డుస్థాయి కలెక్షన్లు సాధించిపెట్టింది పల్లెటూరివాతావరణంతో **మురారి,** అంధురాలికధతో **ప్రేమించు,** ఆదర్శవంతమైన కధానాయకపాత్రతో **సింహరాశి** విడుదలఅయ్యాయి ఎన్ టి ఆర్‌ని కధానాయకుడిగా పరిచయంచేసిన **నిన్ను చూడాలని,** వి ఎన్ ఆదిత్యను దర్శకుడిగా పరిచయంచేసిన **మనసంతా నువ్వే,** రాజమౌళిని దర్శకుడిగా పరిచయంచేసిన **స్టూడెంట్ నెం. 1** ఈ సంవత్సరమే విడుదలయ్యాయి

**సీమసింహం**తో ప్రారంభమయ్యింది 2002 కౌబాయ్ చిత్రం **టక్కరి దొంగ,** ప్రేమకధాచిత్రం **నువ్వు లేక నేను లేను,** వి వి వినాయక్‌ని దర్శకుడిగా పరిచయంచేసిన

ఆది, తేజ సంచలనవిజయం **జయం,** చిరంజీవి స్వామినా చూపించిన **ఇంద్ర,** కృష్ణకుమార్తెను నిర్మాతగా, నటిగా పరిచయం చేసిన **షో,** నందమూరి హరికృష్ణ కీర్తిని పెంచిన **లాహిరి లాహిరి లాహిరిలో** మొదలైన చిత్రాలు విడుదల అయ్యాయి

ఏమయినా 1999లో **సమరసింహారెడ్డి,** 2000లో **నువ్వే కావాలి** చిత్రాలు విడుదలై సినిమా రంగంలో ఫ్యాక్షన్, ప్రేమకథాచిత్రాలయుగాన్ని నడుపుతున్నాయి 72సంవత్సరాల చలనచిత్ర చరిత్రలో వచ్చినమార్పులు, ఎదుగుదల ఒకసారి పరిశీలించాలి

మూకీగా ప్రారంభమయినచిత్రాలు టాకీగామారాయి నిశ్శబ్దచిత్రాలు శబ్ద చిత్రాలవటంతోపాటు ఎవరి పాటలు వాళ్లు పాడుకోవటంనుంచి నేపథ్యగానాలు ప్రారంభమయ్యాయి పౌరాణికాలలోనుంచి సాంఘికచిత్రాలు- అందునా సామాజిక స్పృహగల సమస్యాత్మకచిత్రాలనిర్మాణం ప్రారంభమయ్యింది జానపద, చారిత్రాత్మక చిత్రాల నిర్మాణం ప్రారంభమయ్యింది ***బ్లాక్ అండ్ వైట్*** చిత్రాలనుంచి ***కలర్***చిత్రాల నిర్మాణంప్రారంభమయ్యింది ***గేవా, ఈస్ట్‌మన్, ఫ్యూజీ*** అనే రకరకాల కంపెనీల రంగులచిత్రాల నిర్మాణానికి దారితీసింది 35 ఎమ్ ఎమ్ నుంచి 1974 వచ్చేసరికి **స్కోప్**చిత్రాల నిర్మాణం ప్రారంభమయ్యింది **స్కోప్** నుంచి 70ఎమ్ ఎమ్ చిత్రాలనిర్మాణం ప్రారంభమయ్యింది ***డిజిటల్‌డాల్బీ సౌండ్ సిస్టమ్*** ప్రారంభమయ్యింది *గ్రాఫిక్స్* తెలుగుసినిమాని ప్రభావితంచెయ్యటం మొదలయ్యింది ఎ(ర)సినిమాల నిర్మాణం అందునా తీవ్రవాదాన్నిసమర్ధిస్తున్న చిత్రనిర్మాణం పుష్కలంగా మొదలయ్యింది

అయితే సినిమా కథలు, పాటలు, కథనాలూ, సాహిత్యం కిందకు వస్తాయా అని కొందరికి అనుమానం కలగవచ్చు సమాజశ్రేయస్సుకి ఇతిహాసాలు, పురాణాలు, కావ్యాలు, నాటకాలు ఎలా ఉపకరించాయో అలాగే పైచెప్పిన ప్రక్రియలస్ఫూర్తితో ఇతివృత్తాలను, కథామూలాలను, సమకాలీన సామాజిక స్థితిగతుల ఆధారంగా తయారుచేసుకొన్న కథాంశాలతో నిండిన సినిమాసాహిత్యంకూడా ఉపకరించింది

## సినిమా – సామాజిక ప్రభావం:

సినిమా చూడటంవల్ల ప్రేక్షకులు రెండుగంటల కాలక్షేపాన్ని అనుభవిస్తారా? లేక ఆ చిత్రంలోని అంశాలు వారి మీద ప్రభావం చూపిస్తాయా అని ప్రశ్నించుకుంటే సినిమాప్రభావం సమాజంమీదఉంది అని మేధావిలోకం ముక్తకంఠంతో అంగీకరిస్తోంది

*"The motion film Industry is the greatest enemy of civilization, greater even than liquor traffic For a genaration it has been the universal school of crime in all nations, creating the international ill will of foreign peoples againest the united states and seriously interfearing with our commerce abroad"* [16]

ప్రపంచనాగరికతకు చలనచిత్ర పరిశ్రమ గొప్పశత్రువు, మద్యంకంటేకూడా ప్రమాదకరమైనశత్రువు అని సినిమాపుట్టిన 30సంవత్సరాలకే చెప్పారంటే 103 ఏళ్ళు నిండిన సినిమాప్రభావం ప్రజలమీద, ప్రపంచనాగరికతమీద ఎంతపడిఉండాలి?

*"The recent trends in Telugu Cinema inspite of such occasional experiments in classicism, remain much to be desired the proliferation of meaningless violence resulting more out of private revenge, and inept humour produced for its own sake are the ailments that make today's Telugu Cinema a lay-man's delight and a discriminating viewer's agony"* [17]

పుట్టిన మానవసంతతికి మొత్తం ఈ ప్రపంచంసమానం సూర్యుడుసమానం, వర్షంసమానం, నదులుసమానం, సముద్రం సమానం, చూసేదృష్టినిబట్టి ఏదయినాఉంటుంది సినిమాచూసి చెడిపోవాలని ఏముంది? బాగుపడగూడదా! మంచిగ్రహించి చెడును వదిలెయ్యవచ్చుగా!

ఆ మాటకొస్తే రామాయణం మహాకావ్యం రాముడంతటివాడే పెళ్ళాన్ని అనుమానించాడు నేనెంత అనేనీతిని సామాన్యుడుగ్రహిస్తే రామాయణ కావ్యప్రయోజనం దెబ్బతిన్నట్టేకదా?

ధర్మరాజంతటివాడే జూదమాడాడు నేనెంత అని ఒక జూదరి భార్యతో నిన్ను పందెంకాస్తాను పదఅంటే పంచమవేదం పనిఅయిపోయినట్టేగదా!

రాముడు ఏపరిస్థితిలో, ధర్మరాజు ఏపరిస్థితిలో ఆపనులు చేసారో ముందు అర్థంచేసుకోవాలి ఆసందర్భాలు వాళ్ళజీవితంలోకి రాకుండా సరిచూసుకోవాలి

ఒక కావ్యానికిగాని, ఒక నాటకానికి గాని, ఒక ఇతిహాసానికి గాని, ఒక సినిమాకి గాని నాయకుడు మానవమాత్రుడుఅయినా మనందరికంటే ఉన్నతలక్షణాలు కలిగిఉంటేనే అతడు నాయకుడవుతాడు ఎఱ్ఱన్న ఊరక కల్గునే బ్రాహ్మణ్యగౌరవంబు అని అరణ్యపర్వంలో ధర్మవ్యాధుడితో కౌశికుడికి చెప్పించిన పరమార్థం ఇదే ఒక సినిమానటుణ్ణి ఈరాష్ట్రప్రజలు ఎందుకు ముఖ్యమంత్రిని చేసారు? వాళ్ళను ఆదుకునే నాయకలక్షణాలు ఆయనలోచూసారు

భార్యాబిడ్డల్ని అమ్ముకునే పరిస్థితివచ్చినా ఆడినమాటతప్పని హరిశ్చంద్రుడు కృతయుగానికి, తండ్రిమాట, ప్రజలమాట జవదాటనివాడుగా శ్రీరాముడు త్రేతాయుగానికి, ధర్మంతప్పకుండా అన్నదమ్ములకలయికలో అతిజాగ్రత్తగా నడిచిన ధర్మరాజు ద్వాపరయుగానికి నాయకులుగా, మూలపురుషులుగా నిలిచారు కాబట్టి సినిమాచూస్తే చెడిపోతారు అన్నభావం తప్పు సినిమాచూస్తే ఎంతచెడిపోతారో, పురాణం, ఇతిహాసం విన్నా, కన్నా అంతే చెడిపోతారు

ఆస్కార్ వైల్డ్ చెప్పినట్లు మనంచూసే కన్నుబట్టే ఏదయినాఉంటుంది ఏసినిమాఅయినా చెడుచెయ్ అనేసందేశంతో ముగిసిపోదు చెడుచేసినవాళ్ళు ఎలాశిక్షించబడతారోచూపిస్తూ ముగిసిపోతుంది ఆశిక్ష ఆతప్పుకిపడుతుంది అనితెలిసిన తర్వాతకూడా ఆతప్పేచేయడం వైయక్తికం స్వయంకృతఅపరాధం

సిగరెట్‌తాగితే మీ ఆరోగ్యం పాడవుతుంది (Cigarette smoking is injurious to health) అని సిగరెట్ పెట్టెమీద వేసిఅమ్మినా, అది కొనితాగేవాడికే శిక్ష ధూమపానంమూలంగా వచ్చే సకల అవలక్షణాలు అతనిశరీరంలోకి ప్రవేశిస్తాయి

అయితే సినిమాల మూలంగా మాఫియా, మధుపానం, విచ్చలవిడి శృంగారం, దొంగనోట్లు, రౌడీయిజం, గూండాగిరి, రాజకీయఅవినీతి పెరిగిపోతున్నాయన్నది చాలామంది మేధావుల వాదన! బాధ!

ఆంగ్లేయుడు మనల్ని పరిపాలించినప్పుడు మనకు అంటని పాశ్చాత్యసంస్కృతి ఇప్పుడు యువతరాన్ని పట్టి పీడిస్తోంది విషసంస్కృతి వచ్చేసింది వర్షపునాట్యాలు (రెయిన్ డాన్స్) డిస్కోథెక్కులు, అమ్మాయిరానంటే కాల్చిచంపటాలు ఇవన్నీ సినిమాలు నేర్పుటంలేదు

తొండముదిరితే ఊసరవెల్లి, మానవుడు ముదిరితే మృగం, నిజం! చరిత్ర పునరావృతమైనప్పుడు బట్టలులేని పాతరాతియుగంసంస్కృతి, వావివరసలు లేని మాతృస్వామ్య వ్యవస్థ లక్షణాలు నేటియువతరాన్ని పట్టిపీడించటానికి సినిమాయే కారణం కాదు

ప్రపంచంలో అతిపెద్ద కమ్యూనిస్టుదేశం ముక్కలుకావటానికి, అవినీతి పరులైన నాయకులని తెలిసీ వాళ్ళనే మళ్ళీమళ్ళీ ఎన్నుకోవటానికి, రౌడీలు గూండాలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోకి ప్రవేశించటానికి, నిరుద్యోగసమస్య పెరగటానికి, జనాభానియంత్రణ జరగకపోవటానికి, ఒకమతంవారు మరొకమతంవారిని సజీవదహనం చెయ్యటానికి, ఒకమతానికి సంబంధించిన పవిత్రప్రదేశాలను కూల్చివెయ్యటానికి, ఫ్యాక్షనిజాలతో బాంబుదాడులుచేసి చంపుకోవటానికి, దేనికీ వీటిలో ఏఒక్కదానికీ సినిమా కారణంకాదు

మారుతున్న కాలం కారణం!
మారిపోతున్న మానవతావిలువలు కారణం!
సినిమా వినోదాన్నిస్తుంది!
విజ్ఞానాన్నిస్తుంది
వివేచనను ఇస్తుంది
విమర్శనుస్వీకరించి ముందడుగువేస్తుంది

*"Cinema is an entertainment industry, an art form, and a means of thought and pleasure It is a social phenomenon, bearing the marks of ongoing struggles over the control of public life, personal freedoms and artistic achievement"* [18]

షోమా ఎ చటర్జీ సబ్జెక్ట్ సినిమా ఆబ్జక్ట్ ఉమన్ అనే తన పుస్తకానికి ఆముఖం రాసుకుంటూ 'Practising film feminism' అనే వ్యాసంలో డాక్టర్ ఆండ్రీస్లేన్ అన్నారు, దానిని నేను ఇంటర్నెట్‌లో చూసాను అనిచెప్పారు

నిజం! సినిమా ఒక వినోదపరిశ్రమ ఒక కళారూపం ఆహ్లాదాన్ని, ఆలోచనను పెంపొందించే ప్రక్రియ సాంఘికస్పృహతో నడుస్తున్న ప్రపంచపుపోకడలతో, పోరాటాలతో, ప్రజాజీవితానికి, వారి వ్యక్తిగతస్వాతంత్ర్యానికి, సృజనాత్మకవిజయాలకు ఒకదర్పణం సినిమా

## ఉపసంహారం

ఈ విభాగంలో సినిమా అంటే ఏమిటి? అది ఎలా పుట్టింది, ఎప్పుడు పుట్టింది, ఎందుకు పుట్టింది, ప్రపంచసినిమా, భారతీయసినిమా, తెలుగుసినిమా ఎప్పుడెప్పుడుపుట్టాయి, తెలుగుసినిమా ఎలావికసించింది దానికి ఎవరెవరుకారకులయ్యారు? సాంకేతికంగా తెలుగుసినిమా ఎంతపెరిగింది అనేఅంశాలేకాక సినిమాఅనేది ప్రపంచనాగరికతకు గొప్పశత్రువు అనే మిధ్యావాదాన్ని ఖండించటం జరిగింది

# ద్వితీయాధ్యాయం

# తెలుగు సినిమా సాహిత్యం – కథ

కథ అంటే ఏమిటి?

ఇంగ్లీషులో **షార్ట్ స్టోరీ** (Short story)గా పిలువబడే ఈ ప్రక్రియ ప్రపంచ సాహిత్యానికే మకుటాయమానంగా ఉంది

కథ చెబుతాను 'ఊ' కొడతావా?

ఈ మాట తెలుగునేలమీద పుట్టిన ప్రతి పసిపిల్లా, పిల్లాడూ వినకుండా అయిదో సంవత్సరం దాటరు అంటే అతిశయోక్తికాదు ప్రపంచంలోఉన్న అన్ని భాషలవాళ్ళు కథలు చెబుతారు, కథలు రాస్తారు, కథలు చదువుతారు ఇంత ఇష్టాన్ని పసిబిడ్డనుండి పళ్ళూడిన ముదుసలి వరకు కలిగిస్తున్న ఈ ప్రక్రియ ఎప్పుడు ఎలా పుట్టింది?

## కథ–పుట్టుక.

లిపి పుట్టకముందు ఇంకా చెప్పాలంటే భాషపుట్టక ముందే కథ పుట్టింది ఆదిమకాలంలో స్త్రీలు, పురుషులుకూడా వేటకువెళ్ళేవారు పులినో, ఎలుగునో, ఎనుబోతునోవేటాడేవారు అది ఒక సాహసకృత్యం ఆ కృత్యాన్ని అనుభవించినవాళ్ళు, అది చూడనివాళ్ళకు, గుహలోనే ఉండిపోయినవాళ్ళకు వివరించి చెప్పే ప్రయత్నమే కథగా అవతరించింది ఉన్నది ఉన్నట్టుగా చెబితే అది కథకాదు కొంతవాస్తవం, కొంతకల్పన, కొంత అతిశయోక్తి కలిపి చెప్పే తాపత్రయం మారుపేరే కథ

కధకు అభినయంతోడయితే పుట్టే సాహిత్యప్రక్రియ పేరే సినిమాకధ ఈ సినిమాకధ పుట్టుపూర్వోత్తరాలు చర్చించే ముందు అసలు సాహిత్యంలోకి ఈ కధారచన ఎలాపుట్టుకొచ్చిందో వివరించాల్సిఉంది

"మానవుని ఊహ ఏనాడు రెక్కవిప్పుకొన్నదో ఆనాడేపుట్టింది కధ ',[1] అంటాడు పోరంకి దక్షిణామూర్తి వాస్తవం

కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళ కాదేది కవితకనర్హం అని శ్రీశ్రీ గీతంకోసం అంటే,దానికి బుక్కులురాసి మరీ చూపించాడు రాచకొండ విశ్వనాధశాస్త్రి ప్రకృతి మొత్తం వస్తువయ్యింది, ప్రవృత్తి మొత్తం ఇతివృత్తమయ్యింది జగత్తు కధగా మారింది చెట్టుకధ, పుట్టకధ, గుట్టకధ, గుట్టుకధ, రట్టుకధ, విట్టుకధ, బెట్టుకధ, తిట్టుకధ, పిట్టకధ, మెట్టుకధ, గిట్టుకధ, అదీఇదీ ఏముంది, ప్రియురాలి కోసం ఒకకధ, శ్రామికురాలికోసం ఒకకధ, కర్మకొకటి, మర్మానికొకటి - ఇలా పుంఖానుపుంఖంగా కధలు పుట్టుకొచ్చాయి

ప్రకృతిలో తనకు అర్ధంకాని ప్రతివిషయాన్ని గురించి మానవుడిమస్తిష్కం రకరకాల ఊహలుచేసి, ఆ ఊహలకు ఊపిరిపోసి, ఆ ఊపిరికి అక్షరరూపం ఇస్తే మనహృదయాలలో అచ్చయ్యిందే అచ్చమైన కధ

## భారతీయ కధలు . మూలాలు

మానవుడి ఊహకి ప్రతిరూపంగా చెప్పుకుంటున్న కధకు బీజం ఎక్కడ పడింది? ఎలా ఆవిష్కరించబడింది ? భారతీయులు బ్రహ్మనాలుగు ముఖాలుగా భావించే నాలుగు వేదాలలో,[2] ఋగ్వేదంలో తొట్టతొలుత ఈ కధాబీజాలు కనపడతాయి ముఖ్యంగా -

క యమయమీ సంవాదం

ఖ ఊర్వశీ పురూరవుల సంవాదం

గ బృహస్పతి గోగ్రహణం

క వివస్వానుని కుమార్తె యమీవైవస్వతి ఆమె అన్న యముడు చెల్లెలు అన్ననే మోహించింది తనను ప్రేమించమంది కామించమంది తనతో కలిసి సంతానాన్నిమ్మని కోరింది అది తప్పు అనాచారం అని చెప్పి నిరాకరిస్తాడు ఈ సర్వజగత్తును సృష్టించిన బ్రహ్మకు తను సృష్టించిన సరస్వతి కూతురే గదా! తండ్రి కూతురుతో కాపురం చేస్తే లేని తప్పు అన్నతో చెల్లి చేస్తే ఎక్కణ్ణించి వస్తుంది అని ప్రశ్నించింది

ఇది కథగాదు యమివ్యథ అయితే ఈ బాధలో ఒక గాథ కనిపిస్తోంది మాతృస్వామ్యవ్యవస్థ నుంచి సమాజం పితృస్వామ్యవ్యవస్థవైపుకు ప్రయాణం ప్రారంభించిన సమయంలో, మాతృస్వామ్యవ్యవస్థ అవశేషాలను సూచిస్తోంది యమిఆవేదన

మాతృస్వామ్య వ్యవస్థలో స్త్రీ అధికారి స్త్రీ రాణి, స్త్రీ రాజు స్త్రీ సర్వస్వం తనే వేటాడింది తనే కూటమిని పోషించింది ఆ సమయంలో ఆమె కంటికినచ్చిన మగవాడు ఆమెతో రతిలో పాల్గొన వలసిందే అన్నకావచ్చు, తండ్రికావచ్చు, ఆఖరికి తనకొడుకు, తుదకు మనమడయినా కావచ్చు వావివరసలు లేని పాతరాతియుగపు అలవాటు అదే యమి ప్రశ్నిస్తోంది పితృస్వామ్యవ్యవస్థ ప్రారంభపు నీతిని యముడు చెబుతున్నాడు

స్త్రీకి శారీరకమైన కొన్నిఅవస్థలు ఆనాటిరాజ్యాధికారం నుంచి దూరంచేసాయి మాసం మాసం వచ్చే ఋతుకాలం, నాలుగయిదురోజులపాటు ఇబ్బంది పెట్టిఉంటుంది గర్భం దాల్చినప్పుడు శరీరశ్రమ గర్భవిచ్ఛిత్తికి కారణమై ఉంటుంది బిడ్డకు జన్మనిచ్చినప్పుడు అయిదారు మాసాలు శరీరం స్వాధీనంలో ఉండకపోవటమేగాక, బిడ్డకు పాలిచ్చి పెంచాల్సిన బాధ్యత ఉంటుంది, ఇవన్నీ గమనించిన మగవాడు అధికారం చేజిక్కించుకున్నాడు, ఈ స్త్రీ నాది అన్నాడు, పలుపుతాడుతో కట్టేసుకున్నాడు ఈనాడు పసుపుతాడుతో కట్టేసుకుంటున్నాడు పితృస్వామ్య వ్యవస్థ కుటుంబ వ్యవస్థకు దారితీసింది నా భార్య, నా బిడ్డ అని గిరిగీసుకుబతికేఅవకాశం వచ్చింది మాతృస్వామ్య వ్యవస్థలో పుట్టినబిడ్డకు తండ్రెవరో తెలియదు పితృస్వామ్య వ్యవస్థలో - పుట్టినబిడ్డకు చిరునామా దొరికింది ఆ చిరునామా మూలంగా మేనిసంబంధాల అనుబంధాలలో తండ్రి, అన్న, అక్క, చెల్లి అన్న వావివరసలు పుట్టుకొచ్చాయి అదే యమయమీ సంవాదం భారతీయులకు తెలియచేసిన ధర్మం

ఖ ఊర్వశీపురూరవులకథ మక్కికిమక్కి పితృస్వామ్యవ్యవస్థ లక్షణాలను పుణికి పుచ్చుకుంది స్త్రీని ఇంట్లోపెట్టి, మగవాడువెళ్ళి సంపాదించుకుని వచ్చే ఆచారం ఈనాటికి నూటికి తొంబైతొమ్మిది పాళ్ళు నడుస్తూనే ఉంది ఈ నాటికీ మధ్యతరగతిస్త్రీ, నువ్వు తెస్తేనే వండుతా, పోషించలేనివాడివి ఎవరు కనమన్నారు వంటి మాటలు భర్తమీద ప్రయోగిస్తోందంటే, అధికారం కోల్పోయిన అక్కసూ, పితృస్వామ్యవ్యవస్థ నేర్పిన నిర్లిప్తతే కారణం

ఈ కథ ఈ విషయాన్నే సూచిస్తోంది ఊర్వశి మీద ప్రేమతో పురూరవుడు సైనికోచితమైన కార్యాలన్నీ మరిచిపోతున్నానంటే, ఊర్వశి అతన్ని వెళ్ళిపొమ్మంటుంది

ఆనాటినుంచి నేటి వరకు స్త్రీకి సాధించిపెట్టగల మగడు, సంపాదించిపెట్టగల మగవాడు కావాలి దీనికి సరైన సమాధానం రామాయణ కర్త వాల్మీకి కథే! నీపాపంతో నాకు సంబంధంలేదంటేనే కిరాతకుడు వాల్మీకి అయ్యాడుగదా!

గ బృహస్పతి గోగ్రహణం ఈ కథ వేళ్ళూనుకుపోయిన పితృస్వామ్య వ్యవస్థకు గుర్తు బృహస్పతి గోవులను వలుడనే అసురుని భటులు తీసుకుపోతే, ఇంద్రుని సాయంతో బృహస్పతి దేవగణాలతో వెళ్ళి వాడిని చంపి, గుహను భేదించి గోవులను విడిపించుకు వచ్చాడు ఆనాడు ప్రధాన సంపద గోసంపదేకదా మగటిమి చూపించి సంపద తెచ్చాడు

ఈ మూడు కథాబీజాలు చూస్తుంటే ఒకటి చక్కగా అర్థమవుతోంది కావ్యానికి ప్రయోజనం ఉంది అన్నది అక్షరసత్యం ఆయాకాలాల్లో ధర్మాలను కథలరూపంలో చెప్పి ప్రజలకు అర్థమయ్యేలా చేసారు అన్నది నిజం ఎప్పటికప్పుడు మానవ నాగరికత మారిపోతున్న తరుణంలో ప్రజలను ఈ కథలే ధర్మంవైపుకి నడిపించుకువస్తున్నాయి ఆధునిక కథానికాసాహిత్యానికి ఆద్యమైన **దిద్దుబాటు** కూడా పితృస్వామ్యవ్యవస్థకు లోబడిఉండటం గమనార్హం

వేదాలలోనేకాదు, పురాణాలలో, ఇతిహాసాలలో, ఉపనిషత్తులలో అనేకమైన కథలు ప్రచారంలో ఉండటం ఎరిగినదే అయితే యావత్ ప్రపంచాన్ని ఆకట్టుకొన్న గొప్ప కథకుడు, బృహత్కథారచయిత గుణాఢ్యుడు

**బృహత్కథ :** బృహత్కథను రచించింది గుణాఢ్యుడు ఇతడు ఆంధ్రుడవటం ప్రతి తెలుగువాడికి గర్వకారణం రామాయణాన్ని రచించిన వాల్మీకి ఎంత గొప్పవాడో, మహాభారతాన్ని రచించిన వ్యాసుడు ఎంత ఉత్కృష్టుడో అంతటివాడు ఈ గుణాఢ్యుడు నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ తెలుగు వారి కవిత్రయం అయితే - వాల్మీకి, వ్యాసుడు, గుణాఢ్యుడు భారతీయులకు కవిత్రయం

క్రీ శ 12 వ శతాబ్దపు వాడైన గోవర్ధనాచార్యుడు (ఆర్యసప్తశతికారుడు) గుణాఢ్యుడి గురించి ఇలా అంటున్నాడు

*అతి దీర్ఘజీవి దోషాద్వ్యాసేన యశోప హారితం హంత*

*కైర్నో చ్చేత గుణాఢ్యః స ఏవ జన్మాంతరాపన్నః*[3]

వ్యాసుడు చిరకాలం జీవించి అతడే గుణాఢ్యుడుగా జన్మించాడనే కీర్తిని పోగొట్టుకున్నాడు

ఈయన జీవితకాలం గురించి భిన్న కథనాలున్నాయి అతను శాతవాహన రాజు ఆస్థానంలో ఉండేవాడని అందరూ అంగీకరిస్తారు ఏ శాతవాహన రాజు అన్నదే వివాదం వేబర్‌గుణాఢ్యుని క్రీ శ 2వ శతాబ్దం వానిగా అంగీకరించాడని, బ్యూలర్ క్రీ శ 1 లేక 2 వ శతాబ్దమని భావించాడని, స్పెయర్ క్రీ శ 5వ శతాబ్దం వానిగా తలంచాడని, చెబుతూ వి ఏ స్మిత్ నిర్ణయించిన క్రీ శ ప్రథమ శతాబ్దం కాక క్రీ పూ 1వ శతాబ్దం సమంజసమైందని[4] ముదిగొండ గోపాలరెడ్డి, సుజాతా రెడ్డి దంపతులు వారి సంస్కృత సాహిత్యచరిత్రలో తెలియజేసారు

కథాసరిత్సాగర కథను బట్టి గుణాఢ్యుడు 'శ్రుతార్థ' అనే బ్రాహ్మణకన్యకు, కీర్తిసేనుడనే నాగరాజుకు గాంధర్వ వివాహఫలితంగా జన్మించాడని తెలుస్తున్నది ప్రతిష్ఠాన రాజ్యంలోని సుప్రతిష్ఠా నగరం అతని నివాస స్థానం అని కూడా అభిప్రాయపడ్డారు

ప్రపంచానికి బృహత్కథను అందించిన గుణాఢ్యుడు దాన్ని పైశాచీభాషలో రాయటానికి ఒకకథ ఉంది అనేకసంవత్సరాలుగా అనుశ్రుతంగా చెప్పబడుతున్న ఆ కథ ఇది

> *శాతవాహన మహారాజు కుంతలుడు రాణీగారితో కలిసి జలక్రీడలాడుతూ నీళ్ళతో ఆమె మొఖాన కొట్టసాగాడు దానికి రాణి 'హే రాజన్ మోదకైస్తాడయ' అని వారించింది ప్రాకృతంలో తప్ప సంస్కృతపరిజ్ఞానం లేని కుంతలుడు మోదకాలు అంటే లడ్డూలనుకొని తెప్పించి కొట్టసాగాడు రాణీగారు పగలబడి నవ్వి నేను - 'మా ఉదకైః తాడయ' అంటే నీళ్ళతో కొట్టవద్దు అన్నాను అని చెప్పగానే తలకొట్టేసినంత పని అయ్యి, ఆస్థాన పండితుడయిన గుణాఢ్యుని ఆశ్రయిస్తే ఆరు వసంతాల్లో సంస్కృతంలో ప్రావీణ్యం వచ్చేలా చేస్తానని మాటిచ్చాడు కాని రాజాస్థానంలోనే ఉన్న శర్వవర్మ అనే పండితుడు తాను ఆరుమాసాల్లోనే రాజుని సంస్కృతజ్ఞుని చేస్తానన్నాడు ఒక వేళ నీవలా చేయగలిగితే నేను సంస్కృత, ప్రాకృత, దేశ భాషలను త్యజిస్తానని గుణాఢ్యుడు శపథం చేసాడు శర్వవర్మ కాతంత్రవ్యాకరణం రాసి అన్నమాట ప్రకారం రాజుకి ఆరుమాసాల్లోనే సంస్కృతం నేర్పాడు శపథం ప్రకారం మూడు భాషలను విసర్జించి గుణాఢ్యుడు భూతభాష అయిన పైశాచిలో బృహత్కథ రాసాడంటారు*

అయితే ఉత్సుకతను రేకెత్తించే గుణాఢ్యుడికథ అంతటితో పూర్తి కాలేదు పైశాచి భాషలో తాను రాసిన బృహత్కథను శిష్యులయిన గుణదేవ, నందిదేవుల సలహా ప్రకారం శాతవాహన రాజుకి చూపిస్తే, అది పైశాచిభాషలో ఉండటంవల్ల ఆయన దాన్ని నిరాకరించాడు ఆ బాధలో వింధ్యాటవికి వెళ్ళి ఒక పెద్ద చితిని పేర్చి ఒక్కొక్క

తాటాకును తీసి పెద్దగా చదువుతూ మంటలో వేయసాగాడు తప్పు తెలుసుకొని వచ్చిన శాతవాహన రాజు ఆ ఘోరాన్ని ఆపాడు ఆరువంతులకు పైగా దగ్ధం అయిపోగా ఒక్క వంతు అంటే నరవాహనదత్తుడి వృత్తాంతంఉన్న లక్ష పద్యాలు మాత్రం మనకు దక్కాయి ఏకారణం చేతో పైశాచి భాషలో రాయబడ్డ అసలు బృహత్కధ నేటికీ లభించటం లేదు అందుబాటులో ఉన్నదల్లా బృహత్కధా శ్లోకసంగ్రహం, బృహత్కధామంజరి, కధాసరిత్సాగరం అనే మూడు సంక్షిప్త సంస్కృతానువాద రూపాలు మాత్రమే

ఈ బృహత్కధ సంస్కృతంలోకి, ప్రాకృతంలోకి, పర్షియన్ భాషలోకి అనువదించబడింది క్రీ శ 2వ శతాబ్దంలో పెరుంగదై పేరుతో తమిళభాషలోకి, క్రీ శ 516 ప్రాంతంలో చైనా, టిబెట్ భాషల్లోకి అనువదించబడింది తరువాత ఇంగ్లీషు, జర్మనీ, ఫ్రెంచి మొదలైన యూరోపియన్ భాషల్లోకి కూడా అనువదించబడింది అంతటి గుణాఢ్యుడు మన ఆంధ్రుడంటే మరి ఆనందమే గదా

కధలుగా అందరి నోటా నానినవి, బేతాళుడు చెప్పిన 25 కధలు, సాలభంజికలు (విక్రమార్క సింహాసనం చేరటానికి మెట్లుగా ఉన్నవి) చెప్పిన 32 కధలు మొదటి దానిని బేతాళపంచవింశతి అని, రెండోదానిని సింహాసన ద్వాత్రింశిక అని అంటూ ఉంటారు శుకసప్తతి కధలు, పంచతంత్ర కధలు కూడా ప్రాచుర్యం పొందాయి

> *బృహత్కధ యొక్క కాశ్మీర పార ప్రతుల్లో బేతాళ పంచవింశతి కధలున్నాయని*
> వింటర్ నిట్జ్ అభిప్రాయం

ఇవి క్షేమేంద్రుని బృహత్కధామంజరి, సోమదేవుని కధాసరిత్సాగరంలో కూడా చోటు చేసుకున్నాయి

ఈ కధలన్నీ తాంత్రికమతప్రభావంతో పుట్టాయి బౌద్ధ, శైవ, జైన మత ప్రభావాలు ఈ కధల మీద కనిపిస్తాయి

**బేతాళ పంచవింశతి** • బేతాళుడు మానవేతరశక్తులు గల దయ్యం కామరూపుడు ఇతణ్ణి లొంగదీసుకుంటే సిద్ధులు వస్తాయని నమ్మకం విక్రమసేనుడనే ఒక మహారాజు దగ్గరకు ఒక యోగి వచ్చి ఒక పండునిస్తాడు అందులో ఒక మణి ఉందని, బేతాళుని లొంగదీసుకుని వచ్చి తనకు అప్పచెబితే, ఆ మణి ఇస్తానని చెబుతాడు అప్పుడు పుట్టినవే ఈ ఇరవై అయిదు కధలు బేతాళుని భుజాన వేసుకుని వస్తుంటే అతను ఒక కధ చెప్పి, చివరిలో ఒక సమస్యాత్మకమైన ప్రశ్న వేసి దీనికి సమాధానం తెలిసీ చెప్పకపోతే నీతల వేయి ముక్కలవుతుందంటాడు రాజు 24 ప్రశ్నలకు సమాధానం చెబుతాడు చెప్పగానే మళ్ళీ బేతాళుడు వెళ్ళి చెట్టుకి వేలాడుతూ

ఉంటాడు 25వ కథ చివరిలో అడిగిన ప్రశ్నకు, రాజు సమాధానం తెలియక చెప్పలేదు బేతాళుడు లొంగుతాడు ఆ రాజు విక్రమసేనుడు కాదు, విక్రమాదిత్యుడని ఒక మతం ఈ కథల్లో కుతూహలం ఎక్కువ చోటు చేసుకుంటుంది

**సింహాసనద్వాత్రింశిక .** సింహాసనద్వాత్రింశికలో విక్రమాదిత్యుని వీర, శూర పరాక్రమాల గురించి చెబుతూ నీకు అంతటి శక్తియుక్తులుంటే ఈ సింహాసనం ఎక్కు అని ఒక్కొక్క సాలభంజిక ఒక్కొక్కకథ పూర్తి చేస్తూ ఉంటుంది క్రీ శ 11వ శతాబ్దంలో భోజరాజు గొప్పదనం కోసం, అతని కథలే రాయబడ్డాయని సంస్కృత సాహిత్యచరిత్రకారుల నమ్మకం

**శుకసప్తతి :** శుకసప్తతిలో చిలుక చెప్పిన 70 కథలుంటాయి తన యజమాని దేశాంతరం పోతే, ఆయన భార్య ప్రభావతి, ఆ దేశ రాజు కబురంపగా అలంకరించుకుని వెళ్ళబోతుంటే, పర పురుష గమనం ఎంత నీచమైనదో చెబుతూ, 70 రాత్రులు ఆమెను కాపాడుతుంది యజమాని తిరిగివస్తాడు మాతృస్వామ్యవ్యవస్థలో విశృంఖల శృంగారం చేసిన స్త్రీని కట్టడి చెయ్యటానికి పుట్టిన పుంఖానుపుంఖమైన పతివ్రతల కథలు మనకు తెలుసు అలాంటి ప్రయత్నమే ఈ శుకసప్తతి

**జాతకమాల .** ఇందులో బోధిసత్త్వుని పూర్వజన్మ కథలుంటాయి బౌద్ధమతం, బౌద్ధధర్మం ప్రచారానికి అనేక కథలు రాయబడ్డాయి ఆర్యశూరుడు సంకలనం చేసిన ఈ జాతకమాలలో 500 కథలున్నాయి క్రీ శ 400 సంవత్సరం ముందు రచించబడిన ఈ గ్రంథం, క్రీ శ 434 లో చైనా భాషలోకి అనువదించబడింది బుద్ధుడు పుట్టిన భారతదేశంలోకంటే పక్కనున్న చైనా, టిబెట్లలో బౌద్ధం ఆదరణీయం కావటం మనం గమనించవచ్చు శిబి చక్రవర్తి కథ, శరీరాన్నే కోసి ఇచ్చేటంతటి దానతత్పరతకు ఉదాహరణ భారతంలో కర్ణుని మించిన దానం! కవచ కుండలాలు శరీరాన్నుంచి కోసి ఇవ్వటం వేరు, శరీరమే కోసి ఇవ్వటం వేరు కదా! ఆలంకారిక శైలిలో ఉన్న ఈ జాతకమాలలో బౌద్ధధర్మానికి సంబంధించని జానపద కథలు కూడా ఉన్నాయి

**నీతి కథలు పంచతంత్రం :** పంచతంత్రానికి మూల గ్రంథం ఇది అని ఇదమిత్థంగా తెలియదు క్రీ శ 400 పూర్వం జరిగి ఉంటుందని భావిస్తున్నారు మౌర్య చంద్రగుప్తుడి మంత్రి, గురువు అయిన చాణుక్యుడే దీనికి కర్త అని చాలామంది అభిప్రాయం ఈ పంచతంత్రంలోని కథలు కొన్ని క్షేమేంద్రుడి బృహత్కథామంజరి, సోమదేవుని కథాసరిత్సాగరంలో చోటు చేసుకున్నాయట విష్ణుశర్మ అనే పండితుడు క్రీ శ 8వ శతాబ్దం ప్రాంతంలో ఈ పంచతంత్రం రచించాడని కొందరి భావం పంచతంత్రం ప్రతులు ఎన్ని

లభించినా, కర్తృత్వం విషయంలో సందిగ్ధత పోలేదు ఇవి అన్నీ ముందు మౌఖికరూపంలో ప్రచారంలో ఉండి, తరువాత విష్ణుశర్మ చేత గుది గుచ్చబడ్డ గ్రంథంగా మారి ఉండవచ్చు

హిందూమతప్రభావం ఎక్కువగా కనిపించినా, అహింస, పరోపకారం అనే ముఖ్య బౌద్ధ మత సిద్ధాంతాలు అక్కడక్కడా గోచరించటం వల్ల బౌద్ధ, జైనమత ప్రభావం కూడా ఈ గ్రంథం మీద ఉన్నది

ప్రధానంగా ఇది ఉపదేశ గ్రంథం దీనిలోని కథల ద్వారా రాజనీతి, లోకజ్ఞానం, వ్యవహార కుశలతలు ప్రచారం చెయ్యాలన్నది ప్రధానోద్దేశం ఈ కథలు పెద్దలను, పండితులను ఎంతగా అలరిస్తాయో, పామరులను, పసిపిల్లలను కూడా అంతగా అలరించటం విశేషం

పదాలు నేర్చిన ప్రతిబాలుడు పంచతంత్రం చదవకుండా ప్రాథమిక పాఠశాల వీడడు అన్నది నూరుపైసల నిజం

ఈ పంచతంత్రంలోని పాత్రలెన్నో పక్షులు, జంతువులు కావటం ఒక విశేషం వాటన్నింటికి మానవభాష ఆపాదించి, జంతువుకున్న పాటి జ్ఞానం మనకు లేకపోతే ఎలా? అన్న నీతిని పంచటానికే ఈ గ్రంథం రాయబడి ఉంటుంది

మూర్ఖుని మూర్ఖత మాన్పవచ్చునా? అన్నాడు భర్తృహరి మాన్పవచ్చును అని ప్రయత్నం చేసాడు పంచతంత్రకారుడు

**జానపద కథ :** ఈ **జానపదం** అనే మాట నిజసాహిత్యంతోపాటు సినిమా సాహిత్యంలోనూ చోటు చేసుకుంది ఎన్ని సంవత్సరాలు గడిచినా జానపదులంటే ఎవరు? అన్న ప్రశ్న అలాగే మిగిలిఉంది చలనచిత్రాల వరకు మాత్రం జానపద సినిమాలంటే మహారాజులకాలం నాటి కథలతో, వేష భాషలతో ఆచారవ్యవహారాలతో తియ్యబడిన సినిమాలే

సాహిత్యపరిభాషలో జానపదులంటే ఏమినిర్వచనాలు ఇచ్చారో పరిశీలించాల్సి ఉంది ఆంగ్లంలో *Folk-Lore* అనే పదం ఈ జానపద విజ్ఞానం అనే పదానికి సమానార్థకంగా వాడబడుతోంది *W J Thoms* మొట్టమొదట *1846*లో ఈ 'ఫోక్‌లోర్' పదాన్ని జానపదుల కోసం వాడాడని[6] ఆర్వీయస్ సుందరం చెప్పాడు

కాని ఆ మతంతో ఆయన అంగీకరించకుండా ఈ కింది విధంగా ప్రతిపాదించాడు ప్రసిద్ధ జానపద విద్వాంసుడైన అలన్ డండెస్ ప్రకారం జానపదులంటే ఏదైనా ఒక్క విషయంలోనైనా భావసామ్యం కలిగిన జనసముదాయం వీరు ఒకభాషకు

*సంబంధించినవారు కావచ్చు ఒక ప్రదేశంలో నివసిస్తున్నవారు కావచ్చు ఒకే జాతికి, ఒకే మతానికి, వృత్తికి సంబంధించిన వారు కావచ్చు అయితే ఈ జనసముదాయం తమదే అని చెప్పుకోగల్గిన కొన్ని సంప్రదాయాలను కలిగి ఉండాలి జానపదులను పైన చెప్పిన ఆధునిక దృక్పథంతో నిర్వచిస్తే సమాన సంప్రదాయాలు కలిగిన ఆటవికులైనా, గిరిజనులైనా, గ్రామీణులైనా నగర వాసులైనా జానపదులే అవుతారని చెప్పవచ్చు*[7]

సాహిత్యపరంగా వీరి అభిప్రాయం సరైనదయినా సినిమాసాహిత్యం మాత్రం వీరి ఉద్దేశంతో ఏకీభవించదు పైన చెప్పిన జానపదసినిమా విషయంలోనే కాక, ఈ నాటికి ఫోక్‌లోర్ లేదా జానపద బాణీ పాట అంటే తప్పనిసరిగా పల్లెవాసులు, కొండవాసులు, లంబాడీలాంటి తండాలదే అయి ఉంటుంది ఆహార్యం కూడా జానపదులు అనగానే చిలకకట్టు, పంచె, చిత్రవిచిత్ర గ్రామీణ పద్ధతుల్లోనే ఉంటుంది అయితే ఇక్కడ **జానపదుల్ పురీజనుల్** అని ఎఱ్ఱాప్రగడ అరణ్యపర్వంలో చెప్పిన నిర్వచనం కూడా మదిలో కదులుతోంది

మనకి ప్రస్తుతం **జానపద కథ** ముఖ్యం కాబట్టి, జానపదకథలు, రీతులు పరిశీలించవలసి ఉంది జానపదకథలు అనగానే ప్రతి తెలుగువాడికి ముందు గుర్తుకువచ్చే కథలు పేదరాసిపెద్దమ్మ కథలు అమ్మమ్మ, నాయనమ్మ, తాతయ్య, ఒళ్ళో కూర్చోపెట్టుకుని చెప్పే కథలన్నీ జానపద కథలే

అనగనగా ఒకరాజు, ఆ రాజుకి ఏడుగురు కొడుకులు, ఏడుగురు వేటకు వెళ్ళారుఅంటూ సాగే కథ, హిమాలయ పర్వతం అంత పాతది గంగానది అంత స్వచ్ఛమైనది బంగాళాఖాతం లోతు తెలియనట్లు , ఈకథ ఎన్ని వేలసంవత్సరాలుగా పరంపరితంగా చెప్పబడుతోందో తెలియదు గాని, మునిమనవణ్ణో, మనవణ్ణో, మునిమనుమరాలినో, మనుమరాళ్ళనో ఒళ్ళో కూర్చోబెట్టకొని ఈ కథ చెప్పని ముత్తాతలు, ముత్తమ్మలు, తాతలు, అమ్మమ్మలు, నాయనమ్మలు తెలుగునేల మీద మాత్రం లేరు గాక లేరు

*పురాణాలలో, ఇతిహాసాలలో కథలు ధర్మంకోసం నిర్దేశింపబడితే ఈ జానపదకథలు మాత్రం వినోదంకోసం, కాలక్షేపంకోసం ఉత్సాహాన్ని కలిగించటం కోసం పుట్టాయి ఇందులో కూడా అద్భుతమైనవి, రోమాంచితమైనవి, నీతియుక్తమైనవి కూడా ఉన్నాయి ఈ జానపద కథలకు ఎందరో ఎన్నెన్నో లక్షణాలను ఆపాదించినా ఆక్సెల్ ఓల్రిక్ (Axel Olrick) ఈ క్రింది లక్షణాలను నిర్దేశించాడు*[8]

1 కథ ముఖ్యమైన క్రియాంశంతో ప్రారంభం కాదు హఠాత్తుగా ముగిసిపోదు

2 పునరావృతి సామాన్యంగా అన్ని చోట్లా కనిపిస్తుంది లదే కథకు నిండుదనాన్నిస్తుంది ఈ పునరావృతి ఒక్కొక్కసారి మూడు సార్లుండవచ్చు

3 మామూలుగా ఒక్కొక్కసారి ఇద్దరు వ్యక్తులు మాత్రం ఒక దృశ్యంలో కనిపిస్తారు ఇంకా ఎక్కువగా ఉన్నా ఇద్దరు మాత్రం క్రియాశీలురై ఉంటారు

4 విభిన్న పాత్రల కలయిక కనిపిస్తుంది ఉదాహరణకు నాయకుడు ప్రతినాయకుడు, శిష్టుడు- దుష్టుడు

5 ఒక రకమైన పాత్రలు రెండు ఉంటే, వాళ్ళు చిన్నవాళ్ళుగా గాని లేక అశక్తులుగాకాని చిత్రింపబడతారు ఒకవేళ ఇద్దరూ శక్తిగల వాళ్ళు అయితే విరోధులయ్యే అవకాశం ఉంది

6 దుర్బలులైన వాళ్ళు మంచివాళ్ళుగా ఉంటారు సోదరులలో చిన్న వాళ్ళు మామూలుగా జయం సాధిస్తారు

7 పాత్ర చిత్రణ సరళంగా ఉంటుంది కథకు నేరుగా సంబంధించిన పాత్రలు, సంఘటనలు మాత్రమే చిత్రితమవుతాయి పాత్రలకు, కథకు అతీతమైనవేవీ కనిపించవు

8 కథా వస్తువు సరళంగా ఉంటుంది ఏకకాలంలో ఒకే కథ వివరింపబడి ఉంటుంది రెండుగాని అంతకంటే ఎక్కువగాని కథలు ఏకకాలంలో చెప్పవలసివస్తే అప్పుడది సాహిత్య సంబంధమైన కథను (*Literary tale*) పోలుతుంది

9 మామూలుగా అన్ని విషయాలూ సరళంగా ఉంటాయి వైవిధ్య భరితంగా తీర్చి దిద్దాలనే ప్రయత్నం కనిపించదు

జానపద కథలలో మనుషులు, దేవతలు, దెయ్యాలు, జంతువులు అన్నీ పాత్రలే। మనకు పద్నాలుగులోకాలుంటే జానపద కథలో స్వర్గం, పాతాళం, భూలోకం ఎక్కువగా చోటుచేసుకుంటూ ఉంటాయి ఉత్కంఠ, విస్మయం ప్రధానలక్షణాలై ఉంటాయి గాల్లో ఎగిరేగుఱ్ఱాలు, చాపలు, చెప్పులువేసుకుంటే మనుషులు కనిపించకుండా పోవటాలు, ఈనాటి దూరదర్శనయంత్రాల్లాటి అద్దాలు, ఆ అద్దాలలో మాంత్రికుడికి కావలసిన రాజకుమార్తె కనిపించటాలు, ఆకుపసరు పూసుకుని మాయమైపోవటాలు లాంటి విచిత్ర సన్నివేశకల్పనలతో అడుగడుగునా జనప్రియత్వమే ముఖ్యోద్దేశంగా వీటి రచన సాగిపోతుంది

సామాన్యంగా ప్రతి జానపద కథ, అనగనగా ఒక ఊళ్ళో అనో, అనగనగా ఒక పేదరాశి పెద్దమ్మ ఉందనో, అనగనగా ఒక భూతం అనో, అనగనగా ఒక రోజు అనో ప్రారంభించి, కథ కంచికి, మనం ఇంటికి, ఇక పడుకో అని ముగిస్తారు మన తాతలు

ఆంధ్రుల జానపద విజ్ఞానాన్ని అద్భుతంగా రచించిన ఆర్వీయస్ సుందరం జానపద కథలను ఈ కింది విధంగా వర్గీకరించాడు [9]




అని వర్గీకరించాక తెలుగు కథలను ఈ కింది విధంగా వర్గీకరించాడు

ఈ సిద్ధాంతవ్యాసానికి జానపదసాహిత్యంలో కాక సినిమాసాహిత్యంలో కథ గురించి పరిశీలించవలసిఉన్నందువల్ల, సినిమాకథలకోసం సినిమారచయితలు ఏ ప్రత్యేక లక్షణాలు ప్రదర్శించారో దర్శించటం ఉచితం

ఎప్పుడు ఎక్కడ పుట్టిందో తెలియని ఈ జానపదకథాసాహిత్యం, దాదాపు అజ్ఞాత కర్తృత్వమే కాని ఈ సాహిత్యం వల్ల నాటి ఆచారవ్యవహారాలు, వేషభాషలు, సంస్కృతీ సంప్రదాయాలు, చరిత్ర తెలుసుకోవచ్చు

**నేటి కథ:** మనిషి ఆయుష్షు నూరేళ్ళే! కథ ఆయుష్షు కొన్ని లక్షల సంవత్సరాలు! ఏనాడు పుట్టిందో తెలియని కథ నేటికీ సమాజాన్ని ఆనందపరుస్తోంది, ఆశ్చర్యపరుస్తోంది, విజ్ఞానాన్ని అందిస్తోంది

కథానిక స్వరూప స్వభావాలను ఎందరో రచయితలు, లాక్షణికులు నిర్వచించారు అయితే ఇప్పటికీ కథానిక తొలి నిర్వచనంగా లభిస్తున్నది, అగ్ని పురాణంలోని ఈ కింది రెండు శ్లోకాలే

భయానకం సుఖపరం గర్భేచ కరుణోరసః
అద్భుతోంతే సుక్లుప్తార్థో నోదాత్తా సా కథానికా॥ 12 337 అగ్ని పురాణం
ఆఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథా తథా
కథానికేతి మన్యంతే గద్య కావ్యంచ పంచధా॥ 12 337 అగ్ని పురాణం

పద్యకావ్యంనుంచి వేరయిన లక్షణం కలిగిన గద్యకావ్యలక్షణాలు కలిగిన కావ్యభేదాలు అయిదు

1 ఆఖ్యాయిక

2 కథ

3 ఖండకథ

4 పరికథ

5 కథానిక

పై అయిదింట్లో నేడు వివిధపత్రికలలో, సినిమాసాహిత్యంలో కథగా గుర్తింపబడినది కథానిక

సుఖపరమైన భయానక రసంతో ప్రారంభమై, నడుమ కడుపులోనుంచి కన్నీళ్ళు తెప్పించే కరుణరసప్రధానమై, క్లుప్తంగా ఉండి, అనుదాత్తమయిన పాత్రలతో కూడినట్టి, అద్భుతరసంతో ముగిసిపోయేది కథానిక అని అగ్నిపురాణం చెప్తోంది

దాని కంటే ప్రాచీనమైన లక్షణం ఇంతవరకు లభించలేదు అంతే కాదు ఇంతకంటే ఉన్నతంగా కథానికలక్షణం చెప్పబడలేదు

సుఖపరమైన భయానకం అంటే ఆంగ్లంలో **అరెస్టింగ్** అనే పదానికి దగ్గరగా ఉండే అర్థం కళ్ళు వెడల్పవుతూ, గుండె స్పందనలో మార్పుతెస్తూ ఆ మార్పు బాధాకరంగా కాకుండా తియ్యగా ఉంటూ, కథలోకి పాఠకుడు లేదా ప్రేక్షకుడు లీనమైపోగానే వాళ్ళ కష్టాన్ని తన కష్టంగా భావిస్తూ కన్నీళ్ళు పెట్టేస్తూ, అనుదాత్తమయిన పాత్రలు కాబట్టి తమజీవితాలతో అన్వయించేసుకుంటూ, ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠతో పరాకాష్ఠకు చేరి, ఊహించని ముగింపుతో ఉక్కిరిబిక్కిరి చేసి రసానందాన్ని అనుభవింపజేసేది కథానిక

అగ్ని పురాణం కాక, ఈ కథకు నిర్వచనాలు చాలా చెప్పబడ్డాయి అందులో ప్రామాణికమైన నిర్వచనం పోరంకి దక్షిణామూర్తి సిద్ధాంత వ్యాసంలోనిది ఆయన తన కథానిక - స్వరూప, స్వభావాలు అన్న సిద్ధాంత వ్యాసంలో కథకు కొన్ని కొత్త లక్షణాలు చెప్పాడు

*"ఏకాంశ వ్యగ్రమై స్వయం సమగ్రమైన కథాత్మక వచన ప్రక్రియ కథానిక"* [10]

ఏకాంశవ్యగ్రత, స్వయంసమగ్రత కథానిక ముఖ్య లక్షణాలు అన్నది ఆయన ఉద్దేశం

కథ ఒక్క అంశం మీదే రాయబడాలి, ఆ చిన్నఅంశమైనా స్వయంసమగ్రంగా ఉండాలి

ఈ రెండు వాక్యాలు అనల్పార్థాన్ని సూచిస్తాయి ఆ అంశం ఎక్కణ్ణించి లభిస్తుంది?

అస్పష్టమైన జీవితాన్ని ఏదో ఒక వ్యూహంనుంచి అర్థం చేసుకోవటంలో లభించవచ్చు

మనసుస్పందించటానికి కారణమైన సంఘటనలో దొరకవచ్చు

సమస్యల్ని నలుగురిదృష్టిలోకి తేవాలన్న తాపత్రయంలోనుంచి క్షీరసాగరమథనంలో అమృతంలా లభించవచ్చు

మధ్యతరగతి జీవనపరిస్థితుల్లోనుంచి ఉబికి రావచ్చు

సమాజానికి ఆత్మానందం కలిగించటంకోసం మంచి కల్పనలో దొరకవచ్చు

బడుగుజనం చిందించే కన్నీటిబొట్టులోనుంచి దొరకవచ్చు

మంచిని పెంచే ప్రయత్నంలో ఒకబీజం లభించవచ్చు

మనిషికి మనిషికి మధ్య గొప్పవిశ్వాసాన్ని పెంపొందించాలన్నదీక్షలో ఒకమూలం లభించవచ్చు

శ్రమజీవుల విముక్తికోసం కదిలినకలం ఒలికించినసిరానుంచి రాసి గల అగ్నికణం లభించవచ్చు

స్త్రీసమస్యకోసం, సమర్ధన కోసం మంచి అంశం దొరకవచ్చు

దేవుడున్నాడు అనే సిద్ధాంతం, లేడు అనే రాద్ధాంతం సృష్టించటం కోసం ఒక వస్తువు లభించవచ్చు

ఆలోచనల అంతరార్థాలను అక్షర రూపంలో ప్రదర్శించాలన్న ఆవేశంలో ఇంకొక అంశం దొరకవచ్చు

విశ్వశ్రేయస్సు కోసం ఉదయించే దివ్యఆవేశం అందించే స్ఫూర్తిలోనుంచి ఒక కలికితురాయి జనించవచ్చు

ప్రేమలో నుంచి

ద్వేషంలో నుంచి

ఈర్ష్యలో నుంచి

త్యాగంలోనుంచి

ధర్మంలో నుంచి

సహనంలో నుంచి

ఉద్భవించే వినూత్నమైన ప్రతిఆలోచనా కథావస్తువు కావచ్చు

మనిషి తనజీవితంలో అనుభవించిన అవస్థ లేదా అతనిపరిధిలోకి వచ్చిన అనుభవం, అతని జీవితంలో జరిగిన విచిత్రం, భార్యకు అర్థంకాని భర్తమనస్తత్వం, భర్తకు అంతుచిక్కని భార్య అంతరంగంకూడా కథావస్తువులే

ఈనాటి రచయితలందరికీ సబ్జక్టు మేటర్ మానవుడే అన్నాడు చలం అంతేకాదు చలం కథల్లో విలన్ సంఘం కమ్యూనిస్టు కథల్లో విలన్ కాపిటలిజం కాని ఈనాటి కథల్లో హీరోయే విలన్ అంటాడు ***రౌడీ నెంబర్ 1, స్టేట్ రౌడీ, గూండా, రాక్షసుడు, కిరాతకుడు*** మొదలైన మకుటాలుగల చలనచిత్రకథల్లో నాయకుడు - నాయకుడా? అని చలం ప్రశ్నిస్తున్నట్టుంది

అసాధారణ వ్యక్తుల వివరాలు వింటానికి బాగుంటాయి చదివేటప్పుడు పాత్రతో సంలీనం చెందటం జరగదు ఎందుకంటే ఆ పాత్ర తన పరిధిలోది కాదు అని తెలుసుకున్న ప్రేక్షకుడు తదనుగుణమైన రసోద్రేకాన్ని పొందడు, రసాస్వాదన చెయ్యలేడు

అందుకే కథాంశం సహజంగాఉండాలి పాఠకుడికి, ప్రేక్షకుడికి నమ్మకం కలిగించే విధంగా ఉండాలి అది తన కథో, తనపక్కింటి వాడి కథో అనిపించాలి అపూర్వమైన ఇతివృత్తాలు అద్భుతాన్ని అందించగలవుగాని ఆత్మీయతను కలిగించలేవు కథానిక లక్షణం చెబుతూ నవ్యసాహిత్య చరిత్రకారుడు కురుగంటి సీతారామయ్య అగ్నిపురాణ నిర్వచనాన్ని మనసుకి ఎక్కేలా ఈ కింది విధంగా చెప్పాడు

> *కథానిక బాహ్య లక్షణాలు రెండు (1) కథ సుదూరముగ సాగిపోక పొందికగా ఉండవలె (2) పెద్ద సమాసాలు, వర్ణనలతోనూ కథాశరీరము బిగిసిపోకూడదు అభ్యంతరలక్షణాలుమూడు (1) పఠితను భయసంభ్రమాశ్చర్యాలలో ముంచే విచిత్ర సంఘటనలుండవలె (2) కథాగర్భములో హృదయము కరిగించేసన్నివేశము కూర్చవలె (3) పాఠకులు అనుకొనని కొత్త మళుపులతో కథ తమాషాగా ముగిసిపోవలె ఇది కథానికా లక్షణము* [11]

కథకుడికి జీవితంపట్ల అవగాహన ఉండాలి తనకు నచ్చిన కోణంవైపుకు సంపూర్ణంగా మొగ్గిపోకుండా జరిగిన సంఘటనకు న్యాయమూర్తిలాగా ఉండాలి, తనకు నచ్చనికోణాన్ని ద్వేషించే మనస్తత్వం ఉండకూడదు అన్నింటిమీద సమానమైన సానుభూతితో ఆలోచిస్తే, మస్తిష్కంలోనుంచి ఆకథాంశం మహత్తరమైనకథగా ఉదయిస్తుంది

దక్షిణామూర్తి చెప్పినట్లే జి నాగయ్య కూడా తన తెలుగుసాహిత్యసమాలోచనలో-

> *"కథానికలోని కథలో ఏకత్వము, పరిపూర్ణత్వము ఉండును అవసరమైనదేదో కొరవడినట్లుగాని అనవసరమైనది చోటు చేసుకొన్నట్లుగాని అనిపించరాదు"* [12]
>
> అని వివరించాడు

ఒక కథలో రెండుఅంశాలు ఉండవచ్చు కాని ఆ రెండింటికీ మరలా ఏకాంశ వ్యగ్రత లేకపోతే ఎలపటుఎద్దు తనపక్కకి దాపటుఎద్దు తనపక్కకి లాగినట్టు పాఠకుడి ఏకాగ్రతను భంగం చేసే ప్రమాదం ఉంది

చిన్నకథ గురించి చెబుతూ రావూరి భరద్వాజ కథలబడి రచయిత బి ఎస్ రాములికి లేఖ రాస్తూ ఇలా అన్నాడు -

> *ఓ చిన్న సన్నివేశం ఆధారంగాను, ఓ జ్ఞాపకం ఆధారంగాను, ఓ వార్త ఆధారంగాను, ఓ స్పందన ఆధారంగాను, ఇంకా ఇలాంటివే ఎన్నో ఆధారం చేసుకుని మొలకెత్తుతుంది కాస్త కోపం, కాస్త కసి, కాస్త ఈర్ష్య, కాస్త అభిమానం, కాస్త అనురాగం, కాస్త రోతలాంటివి కూడా, చిన్న కథకు ఆధారం కావచ్చు* [13]

మధురాంతకం రాజారాం, సింగమనేని నారాయణలు కథానిక నిర్వచనాన్ని ప్రాచీన ప్రాచ్య లక్షణసమన్వితం చేసి ఇలాచెప్పారు

> *పాదాలు భూమిపైన ఆనకుండా గాలిలోనే తేలిపోయే ప్రాచీన కల్పనా కథకున్నూ, ఫోటో పట్టి పట్టినట్టుగా యథార్థ జీవిత విశేషాన్ని అక్షరబద్ధం గావించే స్కెచ్ కున్నూ మధ్యేమార్గంగా కథానిక తన మార్గాన్ని తాను మలచుకుంటూ సాహిత్య ప్రపంచంలో విస్తరిల్లింది* [14]
>
> *1928 ఆగష్టు భారతిలో దేవులపల్లి అప్పలనరసింహం, తను వేటూరి ప్రభాకర శాస్త్రిగారి వలన వినియుండటం వల్ల చిన్న కథలను గురించి రాసిన వ్యాసానికి* ***గద్య కథానకములు*** *అన్నమకుటం పెట్టామని చెప్పారుగాని, కథానిక కుర్చైకథ అయ్యింది తప్ప* ***కథానకము***గా *ప్రాచుర్యం పొందలేదు* [15]

మనస్సుని రంజింపచేయటానికి, ఉల్లాస పరచటానికి ఉద్దేశించబడిన ఈ ప్రక్రియ, వినోద విజ్ఞానాల మధ్య, సామాజికస్పృహ, తత్కాలసంతోషాల మధ్యన ఒంటిఆట ఆడబడుతూ సమయానుకూలంగా తన్నిన కోర్టు వైపుకి పరుగులు తీస్తోంది

> *"జీవితం బంగారంలాంటిదైతే అందులో మనకు కావలసినంత మాత్రమే తీసుకుని రమణీయంగా తయారుచేసుకునే ఆభరణం లాంటిది కథ"* [16]

అంటాడు మధురాంతకం రాజారాం

మనంమట్టి తీసుకుంటే మట్టిపాత్ర, బంగారంతీసుకుంటే బంగారుపాత్ర తయారవుతాయి పోరంకి దక్షిణామూర్తి ఇతివృత్తం గురించి చెబుతూ

> *సారె మీద కుమ్మరి పెట్టిన మట్టిముద్ద కథావస్తువు ఆ మట్టిముద్ద నొకముచ్చట గొలిపే పాత్రగా తీర్చిదిద్దటానికి ఆ కళాకారుడి చేతిలో భాసించేకల్పనా శిల్పమే*

ఇతివృత్తం ఆమృత్తికాఖండానికి ఈ మృణ్మయపాత్రకూ ఉండే భేదమే
కథావస్తువుకూ ఇతివృత్తానికీఉండే భేదం [17]

అని చెప్పాడు దీని మూలంగా అర్థం అయ్యేదేవిటంటే కథ తయారుచేయబడిన ఆభరణంలా, మృణ్మయ పాత్రలా సిద్ధంగా ఉండదు దొరికిన ముడిసరుకుతో నీ కల్పనాశిల్పాన్ని రంగరించి రూపొందించే ఒక మహత్తరమైనప్రక్రియ కథానికారచన

అయితే లభించినప్రతి అంశం ఇతివృత్తంగా ఎదిగి, వస్తువుగావూరి కథగా రూపాంతరం పొందదు ఉదాహరణకు -

ఒక పత్రికలో రాయబడ్డ ఎడిటోరియల్ కథ కానేరదు

ఒక జోక్ కథ కాలేదు

ఒక వార్త కథ కాదు

వార్తాపత్రిక కథ కాదు

దూరదర్శన్ చెప్పే వార్త కథ కాదు

జీవితంలో ఒక అనుభవపు తునక కథ కాదు

పత్రికలో రాయబడ్డ ఎడిటోరియల్ చదువుతున్నప్పుడు అందులో లభించే ఒకవాక్యం ఇచ్చే బీజం కథగా పెరగవచ్చు వార్త చదివిన అనుభూతి మనసులో మథింపబడి కథగా రూపాంతరం చెందవచ్చు పైన చెప్పినవన్నీ స్వయంసమగ్రాలు కావు

జరిగింది జరిగినట్టురాసే వ్యక్తి విలేకరిఅవుతాడుగాని, రచయిత కాలేడు ఆ జరిగిన దానిలో జరగనివి కొన్ని, జరుగుతున్న వాస్తవమంత విశ్వసనీయంగా పొందుపరచి కళ్ళ ముందు పెట్టిన కొత్తరూపం కథ

అనేకుల అభిప్రాయాలను పరిశీలించాక కథ అంటే ఇది అనిపిస్తోంది

**నీ అనుభవాన్ని అందంగా అనుభూతిని కలిగించేలా చెప్పటమే కథ!**

ప్రతి మనిషికీ జీవితంలో ఎన్నోసంఘటనలు ఎదురవుతాయి అందరూ స్పందిస్తారు కొందరు కాగితంమీద రాసిపెడతారు

ఆ జరిగిన సంఘటనను అందంగా చెప్పాలి

మాటల్లో అందం
వర్ణనలలో అందం
వివరణలలో అందం
మౌనంలో అందం
పాత్రచిత్రణలో అందం

సన్నివేశ కల్పనలో అందం
ఎత్తుగడలో అందం
నడకలో అందం
ముగింపులో అందం

ఈ అందమే రసానందం అందిస్తుంది అదే ఆనందో(బహ్మ అన్న (పాజదువు అంతర్బుద్ధి అయితే సాహిత్యంలో నిత్యం కనిపిస్తున్న ఈ కథే సినిమాకథా?

నవల కథను చెబుతుంది
నాటకం కథను చెబుతుంది
ఏకాంకిక కథను చెబుతుంది
సినిమా కథను చెబుతుంది

కాబట్టి ఎక్కడయినా కథ కథే! కాని సినిమాసాహిత్యంలో కథ స్వల్పమార్పులో ఉంటుంది

## సాహిత్య కథ : సినిమా కథ :

సినిమాకి కథానిక రాయరు నవల రాయరు నాటిక రాయరు ఏకాంకిక రాయరు నాటకం రాయరు దృశ్యమాలిక రాస్తారు ఒక రకంగా సన్నివేశాల కూర్పు సినిమా కథ పత్రికా సాహిత్యంలో కథకీ, సినిమాసాహిత్యంలోకథకీఉన్న మౌలిక భేదాలు -

| | సాహిత్యకథ | | సినిమాకథ |
|---|---|---|---|
| 1 | సాహిత్యకథ చదువుకున్న వాళ్ళకి పరిమితం | 1 | సినిమాకథ చదువుకున్న వారితో పాటు అవిద్యావంతుల్ని కూడా అలరిస్తుంది |
| 2 | సాహిత్యకథ సహజత్వానికి దగ్గరగా ఉండాలి | 2 | సినిమాకథలో అసహజత్వం తప్పని సరి |
| 3 | సాహిత్యకథలో నాయకుడు వాస్తవికతకు దగ్గరగా ఉంటాడు | 3 | సినిమాకథలో కథా నాయకుడు కలల్లో రాకుమారుడు |
| 4 | సాహిత్యకథలో సంభాషణకు అంత (పాధాన్యత లేదు | 4 | సినిమాకథలో సంభాషణ తప్పక అవసరం |
| 5 | సాహిత్యకథను పాఠకుడు ఒక్కడే దర్శిస్తాడు | 5 | సినిమాకథను దర్శించేవాళ్ళు అనేకులు |

పై విషయాలను వివరంగా పరికిస్తే అనుభూతి విషయంలో ఒక పత్రికలో కథకి, తెరమీద కథకు చాలా తేడా ఉంటుంది చదువుకున్నవాడు పురాణం చదివి అనుభూతిని పొందగలడు కాని పామరుడు పురాణం చూస్తేనే ఆ అనుభూతిని పొందగలడు సాహిత్యం సామాన్యంగా చదువుకున్న వారికే పరిమితం గనుక, ఒక కథ రాసే ముందు రచయిత చదువుకున్న వాళ్ళను, తెలివిగల వారిని (Intellectuals) దృష్టిలో పెట్టుకోవాలనిపిస్తుంది చాలా తెలిసిన మనిషిని ఆకట్టుకోవటం అంత తేలికైన ప్రక్రియ కాదు అతనికి తెలియనిది చెప్పాలి, తెలిసేలా చెప్పాలి, తెలిసీ తెలియని విధంగా చెప్పాలి అలౌకికఆనందాన్ని కలిగించాలి చిత్ర విచిత్రమైన నడకలో ఆ నాలుగు పేజీల నిడివి నడపాలి ఊహించనివిధంగా ముగించి కాస్సేపు అతని ఊపిరి నిలపాలి

అదే సినిమా కథకుడికి కొంచెం కష్టం తక్కువ అతనికి పాఠకులు లేరు ప్రేక్షకులేఉన్నారు ఆ ప్రేక్షకులలో కోట్లమంది అక్షరజ్ఞానంలేనివాళ్ళు ఇంతఇస్తే అంత ఆనందించేవాళ్ళు అయితే సినిమాకథకుడికి ప్రేక్షకులవిషయంలో చిన్న చిక్కుఉంది

సాహిత్యకథలో పాఠకుడు రవీంద్రభారతిలో కూర్చున్న ప్రేక్షకుడివంటివాడు మొదటి వరస నుంచి ఆఖరి వరస వరకు ఒకే రకమైన తరగతి అది అదే సినిమాహాలులో కూర్చున్న ప్రేక్షకులు అలా కాదు, నాలుగు తరగతుల ప్రేక్షకులు, పైగా స్త్రీ పురుష విభాగంతో ఎనిమిది తరగతుల ప్రేక్షకులు సాహిత్యకథలో ఒక వర్గాన్ని సంతృప్తి పరిచి బయటపడగలిగిన రచయిత సినిమా కథ రాసే ముందు, **మాస్, క్లాస్, యూత్, క్లాస్ లేడీస్, మాస్ లేడీస్, యంగ్ గాల్స్,** కాలేజీ అబ్బాయిలు, అమ్మాయిలు, వయోవృద్ధులు - ఇలా ఎనిమిది తరగతుల ప్రేక్షకుల అభిరుచుల్ని దృష్టిలో పెట్టుకోవాలి వీరిలో సగం మందికి కథ నచ్చకపోతే, **'బాక్స్'** కథ కంచికి వెళ్ళిపోతుంది

సాహిత్యకథ నచ్చకపోయినా ఆ పత్రికలో అచ్చయిన మిగతా కథలు బాగున్నా, శీర్షికలు బాగున్నా, **సీరియల్స్** బాగున్నా పత్రిక బతికేస్తుంది తెరమీద కథనచ్చకపోతే జీవితంలో మళ్ళీ నిర్మాత చిత్రాన్ని నిర్మించలేడు

రెండో విషయానికి వచ్చేసరికి - సహజత్వం నిజానికి సినిమాకి సహజత్వం కావాలి, కాని మితిమీరిన సహజత్వం, సినిమాలో వినోదంపాలుని తగ్గించి, ప్రేక్షకుల నిరాదరణకు గురయ్యే ప్రమాదం ఉంది

తెలుగు కథానికాసాహిత్యచరిత్రలో దిగ్గజాలుగా నిలబడ్డ కొడవటిగంటి కుటుంబరావు, రా వి శాస్త్రి, చాగంటి సోమయాజులు, కాళీపట్నం రామారావు,

మునిమాణిక్యం నరసింహారావు, చలం, మధురాంతకం రాజారాం, విశ్వనాథ సత్యనారాయణ ఒక రకంగా అష్టదిగ్గజాలే ఆంధ్ర కథా సరస్వతి ఆస్థానాన్ని అలంకరించిన అష్టదిగ్గజాలు సమకాలీన సమాజంలోనుంచి సమస్యలను తీసుకుని, వాటికి నగిషీలు చెక్కి, నాణ్యతపెంచి నలుగురు మెచ్చే విధంగా రూపుదిద్దిన మహనీయులు

సహజత్వం అంటే? సినిమాల్లో చూపిస్తున్నట్లు -

క ఒక నాయకుడు పదిమందిని కొట్టలేడు

ఖ ఒక యువతి తన భర్తనో, తను ప్రేమించినవాణ్ణో త్యాగం చెయ్యలేదు

గ అన్నా చెల్లెళ్ళ సంబంధం - **అన్నయ్య సన్నిధి, అదే నాకు పెన్నిధి** లాగా ఉండదు

ఘ సినిమాల్లో చూపించినట్లుగా భార్యభర్తల అన్యోన్యత వచ్చని మన కాపురంలా ఉండదు

ఙ పోలీసులు నూటికి నూరుపాళ్ళు నిజాయితీగా ఉండరు

చ న్యాయవ్యవస్థ ధర్మదేవత రెండుకళ్ళులా లేదు

ఛ రాజకీయం అందరికీ అందుబాటులో ఉండదు

పై విషయాలన్నీ వాస్తవానికి దూరంగా ఉన్నాయి వాటిని అలారాస్తేనే సినిమాకథ జనరంజకం అవుతుంది

తప్పకుండా నిజాన్నినిజంగా రాస్తే సాహిత్యంలోకథ, పై విధంగారాస్తే సినిమాకథ! ఎందుకింత తేడా? రెండూకథలే వ్యత్యాసం కేవలం పాఠకులు- ప్రేక్షకుల మధ్య ఉన్నదే

సినిమాహాలులో కూర్చున్న మధ్యతరగతిఅమ్మాయికి, అక్కినేని నాగేశ్వరరావులాంటి అందమైన డబ్బున్న కుర్రవాడు తనను అభిమానిస్తే బాగుండు, ఆ సినిమాలోలాగా తనకు ఒకవ్యక్తి అలా తారసపడి తనను మేడలోపెట్టి కారుల్లో తిప్పితే బాగుండునన్న ఆశ! ఊహ! ఆ ఊహేతమే మళ్ళీ మళ్ళీ హాలుదగ్గరకు తీసుకు వస్తుంది

అదే పేదవాడి విషయానికొస్తే ఎన్ టి రామారావులాగా తానే తోటరాముడై, కోటపాకి, రాజకుమారిని పొందాలన్న కల ! అందుకనే సినిమా కథ కలలను, కోరికలను రెచ్చగొట్టే విధంగా, వాళ్ళకు అందని ద్రాక్ష పళ్ళను అందించి, అవి తియ్యగా ఉన్నాయని నమ్మించే విధంగా ఉంటుంది ఉండాలి కాగితంమీద కథ చదివే పాఠకుడు అవాస్తవికంగా నడిచే ఇతివృత్తం చూస్తే చదవబుద్ధి కాక పుస్తకం పక్కన పెడతాడు

అయితే -

దీనికి బాధకం మొదలయ్యింది అరవయ్యవదశకంలో పత్రికల్లో వచ్చేకథలు

ముఖ్యంగా పెద్దకథలు వారం వారం వచ్చే సీరియల్స్ తెరమీద కథల్లాగా తయారు అయ్యాయి నిజానికి తెరమీదకి వచ్చాయి కూడా

కోడూరి (ఆరెకపూడి) కౌసల్యాదేవి, యద్దనపూడి సులోచనారాణి, డ్యాక్టర్ చక్రవర్తి, సెక్రటరీ లాంటివి అవే అయితే ఆ చర్య సార్వత్రికం కాలేదు

నాయకుడి ప్రసక్తివస్తే కాగితంమీద నాయకుడికి, తెరమీద నాయకుడికి అనల్పమైన వ్యత్యాసంఉంది కాగితంమీద కథల్లో నాయకుడు భార్యాబిడ్డల్ని పోషించలేని N G O కావచ్చు, ఉద్యోగందొరక్క వీధుల్లో గడ్డంపెంచుకుతిరిగే నిరుద్యోగి కావచ్చు, గిట్టుబాటుధరదొరక్క, చేసిన అప్పులు తీర్చలేక ఆత్మహత్య చేసుకునే రైతు కావచ్చు, ప్రమాణాలు సృష్టించటానికి ఆరాటపడే ఉపాధ్యాయుడు కావచ్చు ముఖ్యంగా ఈ కథలో నాయకులు రాజీపడి బతకటానికో, నిరాశావాదానికి గుర్తి అయి ఆత్మహత్యలు చేసుకోవటానికో సిద్ధపడిఉంటారు

తెరమీద కథలో నాయకులు అలా ఉండరు ఉదాత్తమయిన పాత్రలయిన పురాణ పురుషుల్లాగా అసాధ్యాన్ని సుసాధ్యం చేస్తుంటారు రాముడు రావణాసురుణ్ణి వధించినట్టు, భీముడు కీచకుణ్ణి వధించినట్లు, కృష్ణుడు కంసుణ్ణి వధించినట్టు ముగింపులో ధర్మ సంస్థాపన చేస్తారు

సాహిత్యకథ ముగింపులో ధర్మమేగెలవక్కరలేదు సినిమాకథ ముగింపులో గెలిచి తీరాలి కాబట్టి ఈ నాయకుడు సహజంగా కంటి ముందు కనిపించే సగటు మనిషిలా ఉంటే, ఆ నాయకుడు కంటికి కనిపించని హెర్క్యులస్‌లా, రాబిన్‌హుడ్‌లా ఉంటాడు

అసమర్ధ నాయకుడిలో ఐక్యం కావటానికి పాఠకుడి అంతరంగం అంగీకరించదు కాని అతి సమర్ధ సినిమాకథానాయకుడిలో తాదాత్మ్యం చెందటం ప్రేక్షకుడికి చిటికెలో జరిగే పని

రెండు కథల్లోనూ, మౌలికంగా, స్ఫుటంగా, వ్యత్యాసం కనిపించేది సంభాషణరచనలో

ఒక్క సంభాషణ కూడా రాయకుండా కాగితం మీద కథ రాయవచ్చు తెర మీద కథలో రాయకూడదు అలా రాస్తే అది 'టాకీయుగం సినిమా' కాదు, 'మూకీయుగం సినిమా' అవుతుంది మూగ సినిమాలు అలరించినప్పటికీ, ప్రపంచమంతటా సినిమా ప్రక్రియకు అనూహ్యమైన ఆదరణ ప్రారంభమయ్యింది శబ్దచిత్రాలు ప్రారంభమయ్యాకే నిశబ్ద చిత్రాల సార్వభౌముడు 'చార్లీ చాప్లిన్' టాకీలు ప్రారంభమయినప్పుడు, విపరీతంగా మధనపడ్డాడని చెబుతారు

ఈ విషయంలో కూడా పాఠకుడు - ప్రేక్షకుడి మధ్య ఉన్న వ్యత్యాసమే కారణమవుతోంది నిజానికి సినిమా దృశ్యకావ్యం కంటికి కనిపిస్తున్నప్పుడు సంభాషణ రాయటం అనవసరం ఒక పాత్ర తెరమీదకు వచ్చినప్పుడు ఇంకో పాత్ర చదువుకుంటూ ఉంటుంది 'చదువుకుంటున్నావా అమ్మా' అని అడిగితే, ఆ రచయిత సినిమారచనకు పనికి రానట్టే కాఫీ తీసుకొచ్చి, కాఫీ తాగండి అని చెప్పటాలు, అన్నంతింటుంటే వచ్చి చూసి అన్నంతింటున్నారా అని అడగటాలు అన్నీ దోషాలే అయితే అన్నంతింటున్నారా? అనగానే, 'లేదు గడ్డితింటున్నాను' అని, వినోదాత్మకంగా చెప్పించదలచుకుంటే అలాంటి సంభాషణలు రాయవచ్చు, పొడిగించవచ్చు

సంభాషణల రాతలో కూడా, కాగితంమీదకథలో, నిత్యసత్యాలకు ప్రతీకలైన నిజమైన అతి సహజమైన సంభాషణలు ఉంటాయి సినిమాలో సంభాషణలు అసహజంగా ఉంటాయి లేనిపోని హీరోయిజాన్ని అంటగట్టి మాట్లాడే విధానం, **కంపోజ్** చెయ్యబడ్డ సంభాషణలు కూడా ఉంటాయి వీటి గురించి విపులంగా 'కథనం' అనే అంశంలో, సంభాషణల ప్రక్రియలో చర్చించటం యోగ్యంగా ఉంటుంది

రెండు కథల్లో అతి ముఖ్యమైనది దర్శనం ఈదర్శనం పాఠకుడికి ఒక రకంగా అందుతుంది ప్రేక్షకుడికి మరోరకంగా అందుతుంది సాహిత్యంలోకథ, రచయిత రాస్తాడు అది పాఠకుడు చదువుతాడు (ఎడిటర్ తాలూకు బ్లూ పెన్సిలింగ్ అప్పుడప్పుడూ ఉండవచ్చు) ప్రత్యక్షసంబంధం రచయితకు పాఠకుడికి మధ్యే రచయిత ఏం రాస్తాడో పాఠకుడు అది చదువుతాడు ఆ వాతావరణాన్ని చదువుతూ, మెల్లగా కథలో లీనమై తత్పర మైన అనుభూతి ఐక్యాన్ని పాఠకులు పొందుతుంటారు పాఠకుణ్ణి స్పందింపచేయలేకపోతే, కథారచయితే నూటికినూరుపాళ్ళు బాధ్యత వహించాల్సి ఉంటుంది

అదే తెరమీదకథ విషయానికొస్తే రచయిత రాసిందే అక్కడ ఉండదు కథ కాగితం మీద ఉన్న సమయంలోనే నిర్మాతకు, దర్శకుడికి, కథానాయకుడికి, కథానాయికకు నచ్చాలి, నచ్చకపోతే వారి వారి ఇష్టానుసారంగా కథను మార్చాలి అంటే రచయిత భావ స్వాతంత్ర్యం 'అరయంగా కర్ణుడీల్గె నార్వురిచేతన్' అన్నట్లు, నలుగురి సంతోషానికి బలైపోవాలి మార్పులు చేర్పులు పొందిన కథ కూడా సరాసరి పాఠకుడిలాగా ప్రేక్షకుడికి అందదు మధ్యలో దర్శకుడు, నటీనటులుంటారు

అతని గుండెల్లో అగ్ని పర్వతాలు బద్దలవుతున్నాయి అంటాడు సాహితీ రచయిత పాఠకుడు తనకు నచ్చినంత పర్వతాన్ని బద్దలు కొట్టుకుని అనుభూతి పొందుతాడు

అదే మాట తెరమీద కథలో ఉంటే, ఆ దర్శకుడు అగ్నిపర్వతం బద్దలయ్యే ఎఫెక్టు తెచ్చే షాటు పెట్టాలి, తదనుగుణంగా నటుడు నటించాలి లేకపోతే అగ్నిపర్వతం కాదుకదా గులకరాయి కూడా బద్దలుకాదు కాబట్టి ఇక్కడ ప్రేక్షకుడి అనుభూతి దర్శకుడి దర్శకత్వప్రతిభ, నటీనటుల నటనావిన్నాణం మీద ఆధారపడు తుంది అంతేకాదు ఆషాట్‌లో కెమేరా సరిగ్గా పనితనం చూపించలేకపోయినా అనుకున్న అనుభూతిని సాధించలేకపోయినట్లే

కెమేరా మాట్లాడుతుంది[18]

ఇది నావాక్యంకాదు ఆంధ్రసాహిత్యచరిత్రను అకుంఠితదీక్షతో పధ్నాలుగు భాగాల్లో ఆంధ్రావని కందించిన నిరంతరకృషీవలుడు, మరణంతో మాత్రమే విశ్రాంతితీసుకున్న మహానుభావుడు ఆరుద్రది

మల్లీశ్వరిచిత్రానికి సమీక్షరాస్తూ, 'తెలుగు స్వతంత్ర' అనే పేరుగల పత్రికలో ఆరుద్ర ఆ మాటవాడాడు దర్శకుడు క్లోజ్‌షాట్‌కు బదులుగా దూరపుషాట్‌వాడినా, నటుడు ఇవ్వవలసిన సాత్వికాభినయానికి మారుగా వేరే అభినయం ఇచ్చినా, కెమేరా యంత్రంలో కాంతి నటీనటుల హావభావాలను ప్రేక్షకుల కంటికి స్ఫుటంగా కనిపించే విధంగా చేయలేకపోయినా, రచయిత తప్పు లేకుండా ఆ కథలోని రసాన్ని ప్రేక్షకుడు ఆస్వాదించలేకపోతాడు సాహిత్యంలో కథారచయితదే సమస్త బాధ్యత సినిమారచయిత సమష్టిబాధ్యతలో ఉంటాడు! సాహిత్యకథారచయిత వాలుకి ఈదుకెళ్ళే ఈతగాడిలా ఉంటే, సినిమారచయిత ఎదురీదే గజఈతగాడిలా ఉండాలి!

సాహిత్య కథలో, లాక్షణికులు కథలో బీజం, ఇతివృత్తం, వస్తువు, పరమార్థం ఉండాలన్నారు అవి సినిమాకథకూ కావాలి కాకపోతే సినిమాకథ నిర్వచనం మారుతుంది

వల్లంపాటి వెంకట సుబ్బయ్య మంచి కథకునాలుగు లక్షణాలు[19] అని అంటాడు

1 క్లుప్తత

2 అనుభూతి ఐక్యత

3 సంఘర్షణ

4 నిర్మాణ సౌష్ఠవం

హితశ్రీ, కథ ఏకరసప్రతిపాదకం - కథ వివరించేది ఒక్క అంశాన్నే కనుక ఒకటికంటే ఎక్కువ రసాల్ని సృష్టించే అవకాశంలేదంటూ, కథావస్తువులో సాధారణంగా

1 ఆరంభము

2 యత్నము

3 సంఘర్షణ

4 ఉత్కర్ష

5 ముగింపు

అనే భాగాలను గుర్తించవచ్చు[20] అంటాడు

చిన్నకథని ఒక యంత్రం కింద తీసుకుంటే -

1 కథావస్తువు

2 ఎత్తుగడ

3 నిడువు

4 వాతావరణ సృష్టి

5 పాత్రల చిత్రణ

6 శైలి

7 గమనం

8 సంభాషణలు

9 పతాక స్థాయి

10 ముగింపు

అందులోని ముఖ్యభాగాలు అంటాడు[21] తాళ్ళూరి నాగేశ్వరరావు

కథానిక తీరుని క్లుప్తంగా ఇలా కూడా నిర్వచించుకోవచ్చు

1 ఒకరకమైన ఎత్తుగడ

2 నడక తీరు

3 ముగింపు

4 కొన్ని పాత్రలు, పాత్రచిత్రణ

5 వాటి పోషణ

6 వస్తువిన్యాస వైశిష్ట్యం

7 ఏదో ఒక జీవితసత్యప్రతిపాదన

8 అన్నింటినీ మించి వ్యక్తీకృత

9 విజ్ఞానమో, వికాసమో, వినోదమో, కలిగించగల చిన్నకథే కథానిక[22]

కధానిక ముఖ్యలక్షణాలుగా, మల్లాది రామకృష్ణ శాస్త్రి కధలమీద సిద్ధాంతవ్యాసం రాసిన గుమ్మా శంకరరావు[23] ఈ కింది వాటిని తెలియజేస్తున్నాడు

1 సంక్షిప్తత
2 ఏంకాశ వ్యగ్రత
3 నిర్భరత
4 స్వయం సమగ్రత
5 సంవాద చాతుర్యం
6 ప్రతిపాద్య ప్రణవత
7 ప్రభావాన్వితి

ఈ లక్షణాలన్నింటిని పరిశీలించి, పోరంకి దక్షిణామూర్తి త్రిమితీయ[24] విశ్లేషణం చేసాడు

"కధానికను త్రిమితీయం (three-dimensional)గా విశ్లేషించవచ్చు ఇవి

1 వస్తుగత విభాగం
2 రూపగత విభాగం
3 సంవిధాన విభాగం

రచనకు మూలభూతమై ప్రేరక బీజంతో మొదలుకొని పరమార్ధ సంసిద్ధి పర్యంతం సాగే అంతః స్రోతస్విని వస్తుగత విభాగం ఆదినుంచి అంతంవరకు వివిధావయవ సుసంఘటితమైన కధాశరీరం రూపగత విభాగం, అవయవ సుసంఘటన కావించి, సౌష్ఠవం చేకూర్చి, సౌందర్యం పోషించే వివిధాంశసమాహారం సంవిధాన విభాగం"

వస్తుగత విభాగంలో

1 కధాబీజం
2 కధావస్తువు
3 ఇతివృత్తం
4 పరమార్ధం అని నాలుగు విభాగాలుగా పునర్విభజించి,

రూపగత విభాగాన్ని

1 ఎత్తుగడ
2 నడక
3 విషమస్థితి

4 పట్టు లేదా పరాకాష్ఠ

5 విడుపు లేదా చరమసీమ

6 ముగింపు అన్న ఆరుభాగాలుగా విభజించి

సంవిధాన విభాగాన్ని

1 పాత్ర

2 సంఘటన

3 సంఘర్షణ

4 సన్నివేశం

5 కథనం అన్న అయిదువిభాగాలుగా మరలా విభజించాడు

ఈ విశ్లేషణను సూక్ష్మంగా పరిశీలించి, ఈ కథాలక్షణాన్ని మానవ శరీరంతో పోల్చుకుంటే - వస్తుగత విభాగం మానవప్రాణంతో సమానం, రూపగత విభాగం మానవుడి అంగాలతో సమానం, సంవిధానవిభాగం మానవుడి ప్రవర్తనతో సమానం

ప్రాణం లేనిదే ఆ మనిషి శరీరం తగలబెట్టటానికి తప్ప దేనికీపనికిరాదు (ఎక్కడో లెనిన్ మహాశయుడి లాంటి ఏకైక నాయకుడి శరీరం ఇంకా రసాయనాల సాయంతో రష్యనులు నిత్యదర్శనం చేసుకోవటం తప్ప) కాబట్టి కథలో మెరుపుతీగలాంటి బీజం, వస్తువుపెరిగి ఇతివృత్తంగామారి లోకకల్యాణంకోసం ఒక పరమార్థాన్ని అందించి తీరాలి

అలాగే రూపగతవిభాగంలో అంగాలవిషయం ఏఅంగంలేకపోయినా మానవుడు అవిటివాడయినట్లు, కథాంగాలు సమర్థంగా లేకపోతే ఆ కథకి కుంటితనమే గతి మూడవదైన సంవిధాన విభాగంలో, మానవుడిజీవితంలో జరిగేసంఘటనలే కథలోసన్నివేశాలై, అవి రమణీయకతను ఆపాదించుకుంటే, రమ్యమై 'కావ్యం యశసే, అర్థకృతే' అన్న సూక్తిని నిజం చేస్తాయి

కథలో పాత్రపడిన సంఘర్షణ మానవ శరీరం నిజజీవితంలో పడే సంఘర్షణే ఈ విభాగమే రచయితకు ఒక సవాలులాటిది కథ పాత్రను నడిపించాలా! పాత్ర కథను నడిపించాలా? అన్న ప్రశ్న వేసుకుంటే, కథే పాత్రలను నడిపించాలి

కాని, సినిమాకథలోమాత్రం పాత్రే కథను నడిపిస్తుంది నాటకం ముఖ్యలక్షణమైన నాయకుడు గాని, నాయకుని ప్రసక్తి గాని, ప్రతి అంకమునందుండవలెను అన్న సూక్తిని, తు చ తప్పకుండా, సినిమాకథలో **హీరో**(కథానాయకుడు)గాని అతని ప్రసక్తిగాని నడిచిన సందర్భాలే ఎక్కువ

పైన చెప్పుకున్న విభాగాలన్నింటిని దృష్టిలో పెట్టుకుంటే, ఉత్తమసాహిత్యానికి

సంబంధించిన కథానికారచనను సమర్థవంతంగా పూర్తి చెయ్యవచ్చు గాని, ఒక అద్భుతమైన సినిమాకథనుమాత్రం రాయలేము ఇది వాస్తవం

## సినిమాకథ – ప్రత్యేక లక్షణాలు

సినిమాకథనురాసే ముందు, పై చెప్పిన లక్షణాలతో పాటు ఈ కింది లక్షణాలను కూడా సినిమాసాహిత్యప్రపంచంలోకి అడుగుపెట్టిన నూతనరచయిత గమనించి తీరాలి

1 వినోదం
2 వ్యాపార దృక్పథం
3 అనుభూతిఐక్యత
4 యుక్తి - కల్పన - యోజన
5 అద్భుత శక్తులు
6 తెలుగుదనం
7 ప్రేక్షకుడు

పై ఏడు విషయాలను దృష్టిలో పెట్టుకోకుండా ఏ సినిమాకథ రాసినా అది విజయవంతం కావటం అటుంచి అసలు వెండితెర మీదకే వెళ్ళదు కాగితం మీదే మిగిలిపోతుంది

కథానికలక్షణాలతోపాటు ఈ లక్షణాలను సైతం సినిమాకథారచయిత ఎందుకు గుర్తు పెట్టుకోవాలి?

కథ + నాటకం కలిస్తే అది సినిమాకథ అవుతుంది

| | | | |
|---|---|---|---|
| 1 | సాహిత్యకథ చదువుతారు | - | సినిమాకథ చూస్తారు |
| 2 | చదివే పాఠకుడికి కదిలే ఆలోచన ఆధారం | - | చూసే ప్రేక్షకుడికి కదిలే బొమ్మ ఆధారం |
| 3 | పాఠకుడికి వర్ణన, పాత్రలు, వాతావరణం ఆలంబన | - | ప్రేక్షకుడికి ఛాయాగ్రహణం, ప్రకృతి, ధ్వని, సంగీతం, ఆంగిక, ఆహార్య, వాచిక సాత్వికాభినయాలు ఆలంబన |

*Story is to movies as melody to music*[25] అన్నాడు రిచర్డ్ వాల్టర్ తన 'స్క్రీన్ రైటింగ్'లో

సంగీతానికి మాధుర్యం ఎలాంటిదో సినిమాకి కథ అలాంటిది అని ఎంత స్ఫూర్తిమంతమైన పోలిక!

మంచికథ ఒక్కటే సినిమాకథగా సరిపోదు దాన్ని వెండితెర మీద విజయవంతం చెయ్యాలంటే పై ఏడు విషయాలు తత్కధాంగాలై ఉండాలి

**1** వినోదం **:** సినిమాకథ రాసేరచయిత ముందు త్రిమూర్తుల్లాగా మూడుపదాలు ప్రత్యక్షమవుతాయి

విజ్ఞానం  వికాసం  వినోదం

ఈ మూడింటిలో, ఏ దేవుణ్ణి నమ్ముకోవాలి అంటే నిస్సంశయంగా మూడవ వాడైన వినోదం అనే దేవుణ్ణే

వినోదం ఎందుకు కావాలి అని చెప్పేముందు అనుశ్రుతంగా వస్తున్న ఒక కథ చెప్పుకోవాలి ఇది మౌఖికప్రచారంలో ఉంది కాబట్టి కర్త, కర్మ, క్రియ తెలియరాలేదు

ఒక గొప్ప హాలీవుడ్ వ్యాపారాత్మక దర్శకుడు, మన తెలుగు సినిమాప్రపంచంలో కె రాఘవేంద్రరావులాంటివాడు అతను గొప్పసినిమాలు తీసాడు కాని విమర్శకులు అభూత కల్పనలతో సినిమా తీసి విజయవంతం చెయ్యటం కాదు, అతిసహజంగా సినిమాతీసి విజయవంతం చేసి చూపించమన్నారు ఆ సవాలును అంగీకరించిన ఆ దర్శకుడు ఒకచిత్రం తీసాడు విడుదలయ్యింది ఎలాతీసాడో చూద్దామని క్రిక్కిరిసి కూర్చున్నారు ప్రేక్షకులు

బస్సు వెళుతోంది వెళుతోంది వెళుతోంది వెళుతోంది అలా వెళ్ళి వెళ్ళి ఒక స్టాప్‌లో ఆగింది అందులోనుంచి ఒక మధ్యవయస్కురాలు దిగింది రోడ్డుక్రాస్‌చేసుకుంటూ ఒక కొట్టులోకి వెళ్ళి కాఫీగింజలు కావాలని అడిగింది అవి తీసి, తూచిఇవ్వటానికి ఎంతసమయం ఖర్చుయిపోతుందో అంతసేపు కెమేరా పాతేసివుంది తీసుకుని మళ్ళీ రోడ్డుదాటింది రోడ్డు దాటటానికి ఎంతసమయం పడుతుందో అంతసమయం తీసుకుంది ఇంటికి చేరింది తలుపు తీసింది లోపలకు వచ్చి కాఫీగింజలు దంచటం మొదలు పెట్టింది కొన్ని గింజలు దంచుకుని కాఫీ కలుపుకుని తాగింది ఇదంతా నిమిషం నిమిషం కాలంతో సమానంగా నడుస్తోంది ప్రేక్షకులకు సహనం చచ్చిపోతోంది సరిగ్గా ఆ సమయంలో కాలింగ్‌బెల్ మోగింది అమ్మయ్య అని ప్రేక్షకులు ఊపిరి పీల్చుకున్నారు వచ్చి తలుపుతీసింది ఒక పెద్దమనిషి నిలబడి ఉన్నాడు ఇద్దరూ లోపలకు వచ్చారు -'Do you want coffee'(మీకు కాఫీ కావాలా?) అని అడిగేసరికి ఒక్కసారిగా ప్రేక్షకులంతా లేచి నిలబడి 'నో' అని అరిచారట - అక్కడ సినిమాకథను ఆపి, తెరమీదకు ఆ దర్శకుడు వచ్చి, ఈమాట మీరు

అంటారని నాకు తెలుసు, సహజమైనసినిమా అంటే ఇలాగే ఉంటుంది, మీరు డబ్బుపెట్టి ఇక్కడికి వచ్చేది కొన్ని గంటలు వినోదం కోసం గాని, నిజాయితీగా ఉండే సినిమా చూసి నలిగిపోవటానికి కాదు, ఇక చూడండి - అని తన పద్ధతి సినిమా చూపించాడు

*జేమ్స్‌బాండ్ చిత్రాల నిర్మాత Albert Broccoli తన చిత్రాల ప్రచారం ఇలా చేస్తాడు "Not macbeth, just entertainment"*[26]

దీని అర్థం మాక్‌బెత్‌లో వినోదం లేదనికాదు మాక్‌బెత్ ఎంత పరిపుష్టంగా ఉంటుందో అంత ఊహించుకుని నా సినిమాకి రావద్దు, చూసిన కాస్సేపు ఉత్సాహాన్ని, ఉద్వేగాన్ని, ఉల్లాసాన్ని అనుభవించి వెళ్ళదలచుకుంటే రండి అన్న ఆహ్వానం అది

విజ్ఞానం చెప్పదలచుకుంటే వార్తాచిత్రాలున్నాయి **డాక్యుమెంటరీ** అంటేనే **ఎడ్యుకేటివ్** విజ్ఞానం అసలుండకూడదని కాదు, ఆయుర్వేదంబిళ్ళలాగా చేదుమాత్రను తేనెతో మింగించినట్లు వినోదాన్ని మిళితం చెయ్యటం

వినోదం అంటే కథాంశంమొత్తం వినోదాత్మకంగా ఉండాలని కాదు ఒక పాత్ర ద్వారా వినోదాన్ని అందించవచ్చు సంభాషణలద్వారా వినోదాన్ని అందించవచ్చు కన్నుల పండుగ చేసే '**సెట్టింగుల**'తో వినోదపరచవచ్చు నటనతో వినోదపరచవచ్చు అద్భుతమైన నటనకు ప్రేక్షకుల స్పందన చప్పట్ల రూపంలో వచ్చిందంటే, వినోదం పుష్కలంగా అందినట్టే

సినిమా చూసి బయటకు వెళ్ళే ప్రేక్షకుడు, కడుపు నిండా మృష్టాన్నభోజనంచేసి, తాంబూలం వేసుకొని వెళ్ళినంత అనుభూతితో వెళ్ళాలి ఇంటికి వెళ్ళగానే చిత్రకథ గురించో, చిత్రంలోని పాత్రల గురించో, సన్నివేశం గురించో ఇంట్లోవాళ్ళకి చెప్పాలి అదే సంపూర్ణమైన వినోదం, ఆ ప్రేక్షకుడికి అందించిన అనుభూతి **అడవిరాముడు, వేటగాడు** చిత్రాలు ఈ లక్షణానికి చక్కని ఉదాహరణలు

**2 వ్యాపార దృక్పథం .** సాహిత్యపత్రికకు కథను రాసేరచయిత వ్యాపారదృక్పథాన్ని దృష్టిలో పెట్టుకోనక్కర్లేదు ఈ కథ మూలంగా, ఆ పత్రిక వ్యాపారం రాత్రికి రాత్రి పెరిగిపోదు, తరిగిపోదు కాని సినిమా కథ రాసే రచయిత, తన నిర్మాత ఎన్ని కోట్లు వెచ్చించి ఈ చిత్ర కథను సినిమాగా నిర్మిస్తున్నాడు, అతడు తను పెట్టిన రూపాయి తిరిగి తెచ్చుకోవాలంటే, నా కథలో ప్రజాకర్షకమైన, ప్రేక్షకాదరణీయమైన సన్నివేశాలు, ఎన్ని రాసుకోవాలి అని ఆలోచించాలి

అంతేకాక సాహితీకథారచయితకు లేని నిబంధన, సినీసాహితీకథకుడికి ఇంకొకటుంది అది కథా నాయకుణ్ణి బట్టి కథను రాసుకోవటం ప్రేక్షకుల్లో ఒక్కొక్క

కధానాయకుడి మీద, ఒక్కొక్క భావన (Image) ఉంటుంది ప్రేక్షకుల్లో వారిపై ఎటువంటి దృష్టి ఉంది, అని పరికించి తదనుగుణంగా రాసుకోకపోతే, కధ కష్టాలపాలే!

నందమూరి తారకరామారావుని, **సర్దార్ పాపారాయుడిగా** చిత్రించిన దాసరి నారాయణరావు, అక్కినేని నాగేశ్వరరావుతో, **ప్రేమాభిషేకం** చేయించాడు తప్ప, ఈయనే **బొబ్బిలిపులి**అనలేదు అంటే దాసరి నారాయణరావు రచయితగా ఆలోచించిన **వ్యాపారదృక్పధం,** ఆ నిర్ణయం తీసుకొనేలా చేసింది

వ్యాపారం కోసం కధ ఎందుకు? అంటే కళ కళ కోసం ప్రారంభమై, ఈ రోజు **'కాసు'** కోసమే నడుస్తున్న చరిత్రను పరికించవచ్చు

మిగతాపరిశ్రమలకు సినిమాపరిశ్రమకు తేడాఉంది అలాగే పత్రికలకూ, సినిమాకు తేడా ఉంది వారం వారం 'స్వాతి' వస్తుంది వారం వారం సినిమా మొదలవ్వాలని లేదు ఎందుకంటే 'స్వాతి' అనే పత్రిక పెట్టుబడి ఉంది అది ప్రతి వారం వచ్చి తీరాలి సినిమా అలా కాదు సినిమా నిర్మాత డబ్బు బ్యాంకులో ఉంటుందితప్ప, పరిశ్రమలాగా ఫ్యాక్టరీ మీదో, పత్రిక మీదో పెట్టుబడిగా పెట్టుబడి ఉండదు ఆ నిర్మాతకు తాను నిర్మించదలచుకున్న సినిమాతాలూకు కధనచ్చితే, ఆ కధకు ఫలానా దర్శకుడు న్యాయంచేస్తాడన్న విశ్వాసంకుదిరితే, ఈ కధానాయకుడి మూలంగా అమ్ముడుపోతుందన్న నమ్మకంకలిగితే, అప్పుడు బ్యాంకునుంచి డబ్బుతియ్యటం మొదలుపెడతాడు లేకపోతే ఆ కధ పనికిరానికధగానే మిగిలిపోతుంది

(ఆత్రేయ పనికిరానిపాటలు అని ఒకచిట్టా దాచిపెట్టేవాడు అందులోనుంచి అప్పుడప్పుడు నిర్మాతల అభిరుచినిబట్టి తీసి ఇస్తుండేవాడట అందులో చరిత్రకు ఎక్కిన పాటలెన్నోఉన్నాయి ) అలాగే డి వి నరసరాజు రాసుకున్న *రాముడు-భీముడు* కధ, ఏ నిర్మాతా అంగీకరించకపోతే మూల పెట్టేసాడు అప్పుడే కొత్తగా పరిశ్రమకువచ్చిన డి రామానాయుడు కధ అడిగితే, చాలామంది వద్దన్న కధ ఒకటుంది వింటారా, అని **రాముడు-భీముడు** కధ చెప్పటం, అది ఆయనకు నచ్చటం, అదే తొలిచిత్రంగా తన చలనచిత్రజీవితాన్ని ప్రారంభించి, నూరోచిత్రం తీస్తూ 'గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' లోకి ఎక్కి ప్రఖ్యాతి వహించాడు అంటే నందమూరి తారక రామారావు లాంటి గొప్ప కధానాయకుణ్ణి రాజనాలలాంటి ప్రతినాయకుడు కొరడాతో కొట్టటం ఏమిటి అని ప్రతినిర్మాత నిరాకరిస్తే, అదే అద్భుతమైన వ్యాపారదృక్పధంగలఅంశం అని నమ్మి, ఆ కధను గౌరవించిన డి రామానాయుణ్ణి ప్రజలు ఆదరించారు

ఈ వ్యాపారదృక్పధం అనేది సినిమాసాహిత్యంలో, కధకు ఎంత ముఖ్యమన్నది, పై విషయం మూలంగా అర్ధం చేసుకోవచ్చు

3 అనుభూతిఐక్యత దీన్ని ఆంగ్లంలో **వాయురిజమ్** అంటారు అంటే చీకట్లో కూర్చుని తెర మీద జరుగుతున్న దృశ్యాన్ని చూడటం తెరమీదఉన్నవాళ్ళకు వీళ్ళుచూస్తున్నసంగతి తెలియదు అవి కదిలేబొమ్మలు తప్ప, చూసే బొమ్మలు, వినేబొమ్మలు కావు

సినిమా చూడటం మొదలు పెట్టిన ప్రేక్షకుడు మెల్లగా ఆ చిత్రకథలో లీనమై, అందులో ఉన్న అనేక పాత్రల్లో తన జీవితానికి, తన మనస్తత్వానికి, తన అంతరంగానికి దగ్గరగా ఉన్న పాత్రల్లో **సంలీనం** చెంది, ఆ పాత్ర నవ్వితేనవ్వి, ఏడిస్తేఏడుస్తాడు అంటే కథతోపాటు ఆ పాత్ర ధరించిన నటుడి నటన కూడా అనుభూతిఐక్యతకు ఆస్కారం ఇస్తుంది

విచిత్రమేవిటంటే ఆనాటికి ఎంతో ప్రజాదరణఉన్న నటో, నటుడో మరణించిన సన్నివేశంలో హాల్లోవున్నప్రేక్షకులు జేబురుమాళ్ళు తడుపుకుంటూ ఉంటారు వాళ్ళకు తెలుసు సౌందర్యో, రోజానో చనిపోలేదు, అలా నటిస్తున్నారని, కానీ వెక్కి వెక్కి ఏడుస్తారు కాగితం మీద కథానాయికానాయకుల్లో ఎవరన్నా మరణించిన సన్నివేశం రాస్తే, ఆ పాత్ర నిజంగా చనిపోయిందన్న అనుభూతి కలుగుతుంది కాని తెరమీద ఆ పాత్ర నిష్క్రమణ కన్నీటి పర్యంతం అయ్యిందంటే, అది కథ + నటన కలిసి చేసిన అద్భుతవిన్యాసం

మహానటి సావిత్రితో అయినా కథ, కథనం బాగాలేని చిత్రంలో కన్నీళ్ళు పెట్టించే నటన చేయించటం అసంభవం అంటే కథ గొప్పతనం, సన్నివేశకల్పనాచాతుర్యం, సంభాషణశిల్పం కలిసి ఆ సన్నివేశాన్ని అద్భుతంగా పండిస్తాయి

ఈ అనుభూతిఐక్యత అనేది రకరకాల ప్రేక్షకులు రకరకాల పాత్రల ద్వారా పొందుతారు కాబట్టి, చిత్రకథారచయిత, కథాంశం ప్రతిప్రేక్షకుణ్ణి అలరించే రీతిలో, సార్వత్రికమైన 'అనుభూతిఐక్యత' పొందే విధంగా రూపొందించుకోవాలి లేకపోతే చిత్రంవిడుదలయ్యాక - ఆ పాత్ర భలేబాగుంది అని ఊరుకుంటారు

ఏకలవ్య చిత్రం విడుదలయినప్పుడు ద్రోణాచార్యుడిపాత్ర భలే గాఉంది అంటే తప్పుజరిగినట్లు! ప్రేక్షకుడు డబ్బుఇచ్చి వచ్చింది ఏకలవ్యుడికోసం గాని, ద్రోణాచార్యుడికోసం కాదు అన్న నిజం తెలుసుకోవాలి

ఈ 'అనుభూతిఐక్యత'ను ప్రేక్షకుడికి అందించే ప్రయత్నంలో, కథారచయిత ముందు ఆయా అనుభూతుల్ని అనుభవించాలి

'రసముయన్నిష్ఠము' అంటే నాట్యప్రపంచం నమ్మిన సిద్ధాంతం, 'రసం సామాజిక నిష్ఠం' అనే కదా! మరి చిత్రకథారచయితే మొదటిప్రేక్షకుడు కావాలి

'కవయః క్రాంత దర్శనః' అన్న సూక్తిని నిజం చెయ్యాలి చిత్రదర్శకుడికంటే ముందే చిత్రాన్ని దర్శించేది కథారచయితే

తాను రాసేకథ క్లుప్తమే అయినా, క్లుప్తంగారాసి నాలుగుపేజీలు అందిస్తే చాలదు దానికి కథాసంవిధానం చేసితీరాలి దీన్ని ఆంగ్లంలో treatment అంటారు ఆ కథాసంవిధానరూపం, దృశ్యమాలిక లేదా Scenic Orderగా తయారవుతుంది

ఆ తర్వాత దృశ్యమాలికకు సంభాషణలు రాయటం జరుగుతుంది ఆ ప్రక్రియ కథనం, అంటే స్క్రీన్‌ప్లే ప్రక్రియకు చెందుతుంది ఇవన్నీ చేసుకుంటున్నప్పుడు రచయిత మథనపడతాడు ప్రసవంజరిగేసమయంలో స్త్రీ ఎన్నిపురిటినొప్పులు అనుభవిస్తుందో, సినిమాకథను రూపొందించటంలో చిత్రకథారచయిత అన్ని నొప్పులుపడతాడు పడాలి!

ఏ ఒక్కపాత్రమీదా ప్రత్యేకమైనఅనుభూతిని పెంచుకోకూడదు ఏ పాత్రను రూపొందిస్తున్నప్పుడు ఆ పాత్రలో పరకాయప్రవేశం చేసి, పాత్రధర్మాన్ని అనుసరించి ఆ పాత్రను క్షుణ్ణంగాదర్శించి, ఆ సన్నివేశాన్ని ఆత్మీయంగాపరిశీలించి, తాను ఆ పాత్రగామారి, ఆ సంఘటనకు బాధ్యుడుగా తయారై అనుభూతిఐక్యతను తను ముందుపొందుతూరాయాలి

ఈ లక్షణానికి అక్షరాలా అతికేది నరసింహనాయుడు చిత్రంలో రైల్వేస్టేషన్ పోరాట దృశ్యం

నరసింహనాయుడి సహాయం అక్కర్లేదని నరసింహనాయుడి అన్నలు, వదినలు, అతన్ని నిందించి, నిరాకరించి రైల్వే స్టేషన్‌కి వెళ్ళిపోయారు

తండ్రిని తీసుకుని పుట్టింటికి పంపించివేసిన భార్య దగ్గరకు బయలుదేరాడు నరసింహనాయుడు ప్రతినాయకుడు కుటుంబం మొత్తాన్ని చంపెయ్యటానికి సిద్ధపడ్డాడని ప్రేక్షకులకు ఇప్పటికే ఎస్టాబ్లిష్ చెయ్యటం జరిగింది ప్రేక్షకులకు ఉత్కంఠ !

ఇప్పుడు ఈ ఉత్కంఠని ప్రేక్షకుడికంటే ముందు రచయిత అనుభవించాలి ఏ అన్నా, వదినల కోసం నరసింహనాయుడు, కట్టుకున్న భార్యనే కాదు పొమ్మన్నాడో, వాళ్ళను అవమానించిందని పుట్టింటికి పంపాడో, ఆ అన్నావదినల ప్రాణాలు పోతున్నాయని అతనికి తెలియాలి? ఎలా?

నరసింహనాయుడికి అన్న ఒక సెల్‌ఫోన్ ఇచ్చి ఉంటాడు ఇంతకుమునుపు ప్రేక్షకులు ఆ సగంతి మరిచిపోయి ఉంటారు అందుకే గుర్తు చేయాలి అన్నలు వెళుతున్నప్పుడు ఆ ఫోన్ గురించి జ్ఞాపకం చేయటం జరిగింది సరిగ్గా ప్రమాదంలో ఉన్నప్పుడు, అన్న కొడుకు **బాబాయ్ దగ్గర సెల్‌ఫోన్ ఉందిగా** అని గుర్తు చేసి ఫోన్

చేస్తాడు అమ్మయ్యా నరసింహనాయుడు వస్తాడు, కాపాడుతాడు అన్న ఆనందం రచయిత అనుభవించి ఆ అనుభూతిని ప్రేక్షకుడికి అందేలా చెయ్యాలి

ఆ తర్వాత ఈ పోరాట దృశ్యంలో వీర, రౌద్ర, భయానక, కరుణరసాలు నడుస్తూ ఉంటాయి నరసింహనాయుడు అన్నల్ని కాపాడుతున్నప్పుడు, ప్రత్యర్థుల మీద చూపించే రౌద్రం, వాళ్ళను తెగటార్చటంలో చూపించే వీరం, ఈ దృశ్యాన్ని చూస్తూ పరుగులు తీసే రైలు ప్రయాణీకులు అనుభవించే భయానకం, తన వీపులో గొడ్డలి దిగబడినా, **నాకేం ఫర్వాలేదు, మీరు జాగ్రత్తగా వెళ్ళండి** అని నరసింహనాయుడు చెబుతున్నప్పుడు అన్నా, వదినలు అనుభవించిన కరుణరసం అన్నీ రచయిత అనుభవించి ఈ దృశ్యాన్ని రాయాలి

చలనచిత్ర చరిత్రలో ఒక పోరాట దృశ్యం చూస్తూ హర్షంతోపాటు, కన్నీటి వర్షం కూడా కురిసిన దృశ్యం బహుశా ఇదే కావచ్చు ఈ సిద్ధాంత వ్యాస రచయిత ఈ దృశ్యాన్ని రాస్తున్నప్పుడు చివరిలో కంటనీరు చూసి, దర్శకుడు బి గోపాల్ ఇదేమిటి అని ప్రశ్నిస్తే - ఇప్పుడు నా కళ్ళవెంట వచ్చిన నీళ్ళు రేపు ప్రేక్షకుల కంట వస్తే ఈ దృశ్యం పండినట్లు - నిర్మాత సంచి ధనంతో నిండినట్లు అన్న మాటలు నిజమై, నరసింహనాయుడు చిత్రం రికార్డులు సృష్టించి చారిత్రాత్మక విజయం సాధించింది

అంటే ముందు తనమనస్సులో నటిస్తూ, మస్తిష్కంతో రాస్తూ, ద్విపాత్రాభినయం చేస్తూ, ఏకకాలంలో రెండువిద్యలను అపూర్వంగా గౌరవిస్తూ, మహత్తరంగా నటుడిపాత్ర, రచయిత పాత్ర పోషించాలి అప్పుడే మొట్టమొదటిప్రేక్షకుడిగా ఆ కథ ప్రేక్షకులకు అనుభూతి కలిగించగలదో లేదో తెలిసిపోతుంది

ఎన్నో చిత్రాలు రచన జరిగేటప్పుడు, ఈ కథను సినిమాగా తియ్యాలా, అన్న ప్రశ్న ఈ సిద్ధాంతవ్యాసకర్త తనకుతాను వేసుకుని నిర్మాతకు వేసి, ఫలితం వచ్చాక, ముందే అనుకున్నాం కదా అనుకున్న సందర్భాలు అనేకం

అందుకే దేవానంద్‌లాంటి **సీనియర్** నటుడు "Success is not eternal" అన్నాడని చెబుతారు ఇది విజయవంతంఅవుతుందని తెలిస్తే అందరూవిజయవంతమైన కథలే రాయించుకుంటారు గదా!

**అడవి రాముడు** ఎందుకు అంతవిజయంసాధించిందో ఇప్పటికీ అర్థంకానివారు పరిశ్రమలో ఉన్నారంటే, ప్రేక్షకుల్లో ఇంకెంతమంది ఉండిఉంటారు!

ఏవయినా నిన్ను కదిలించనిది ప్రేక్షకుల్ని కదిలిస్తుందనుకోవటం పొరపాటు కాబట్టే అనుభూతిఐక్యత ప్రేక్షకుడికంటేముందు, సినిమాకథారచయితకు అవసరం అన్న నిజం తెలుసుకోవాలి

4 యుక్తి-కల్పన-యోజన : *"Film is the single most contrived enterprise in the history of the Universe"* [27] అంటాడు రిచర్డ్ వాల్టర్

ఓటర్లను నమ్మించి, **బూత్**కి వచ్చి ఓటు తనకే వేసేలా చెయ్యటానికి రాజకీయనాయకుడు ఎన్నియుక్తులుపన్నాలో, ఎన్నికల్పనలు చెయ్యాలో, ఎంతయోచించాలో అంతకష్టం సినిమాకథారచయితకూఉంది

సినిమాహాలుదాకా ప్రేక్షకుడురావటానికి, కథానాయకుడి ముఖమో, కథానాయిక అంగ సౌందర్యమో, దర్శకుడి మీద ఉన్న అంచనానో కారణంకావచ్చు కాని హాలులోపలకువెళ్ళాక వాళ్ళు కదిలేబొమ్మలు మాత్రమే కదిలించేదిమాత్రం కథారచయిత కల్పనాచాతుర్యమే

అనుక్షణం మారిపోయే ప్రేక్షకుల అభిరుచికి అనుగుణంగా, ఇంట్లోకి దొంగ దూరిపోయినట్టు, ప్రేక్షకుల మనసుల్లోకి దూరిపోయి, వాళ్ళ అభిమానాన్ని దొంగిలించుకురావాలి ఆ అభిమానధనమే, మళ్ళీ నిర్మాత మరోచిత్రం తియ్యటానికి 'ఇంధనం' అవుతుంది

ఆ కాలంలో ఎటువంటి కథల్ని ప్రేక్షకులు ఆదరిస్తున్నారో దాన్ని యుక్తిగా రాసుకోవటం, నిత్యం చిత్రాల్లో చూసే **రొటీన్**దృశ్యాలు కాకుండా, ఆ పాతసారాని కొత్తసీసాలో పోసి, ఇది అపూర్వ కల్పన, ఇంతకు ముందు ఏ చిత్రకథలోనూ లేదు అన్న నమ్మకాన్ని కలిగించటం, ఇంకా ఏఏ అంశాలు చొప్పిస్తే ఈ చిత్రకథ బహుళాదరణీయమవుతుంది అని యోచించటం అవసరం

కథ రాసుకొనేముందు నేను మంచి కథరాసుకోవాలి అనుకున్నప్పుడే, ఇవాళ ఏఏ నటీనటుల గుర్రాలు బాగా పరుగెత్తుతున్నాయి అని గమనించి, వాళ్ళ అవసరాన్ని కథకు కల్పించి, **వాల్‌పోస్టర్**చూడగానే, ప్రేక్షకుణ్ణి సినిమాహాలుకి పరుగెత్తుకువచ్చేలాచెయ్యాలి ఆ సమయానికి బాగా పేరు పొందిన నటీనటుల్ని, సినిమాపరిభాషలో **హాట్‌కేక్స్** అంటారు ఆ **హాట్‌కేక్స్** లేకుండా రాసిన కథ **హాట్**గా ఉండదు చల్లారిన కేక్‌లా ఉంటుంది

అంతేకాదు ఆ సమయానికి **హాట్ కేక్**లా ఉండే సంఘటనలుంటాయి ఎవరు ముందు తన కథలో వాటిని కూర్చుకుంటే అతను యుక్తివంతుడు ఉదాహరణకు **కార్గిల్ యుద్ధం, ఫిలిమ్‌నగర్** బాంబు పేలుడుసంఘటన

సినిమాకథారచయితకు సమాజమే శ్రీమదాంధ్ర భారతం దాన్ని కవిత్రయం

రాసి అక్కడ పెట్టేసారు కాని ఈ సినిమాపుస్తకాన్ని - కాలం రోజూ కొత్తకలాలతో రాస్తూ ఉంటుంది అభ్యాసము కూసువిద్య అని తెలుసుకున్న సినిమాకథారచయిత, అతివేగంగా తనకథలో ఆ అంశాలను పొందుపరచి ప్రేక్షకులను ఆకట్టుకోవాలి

అయితే ఆ సంఘటన యధాతధం కాకుండా రచయిత కల్పనాశక్తితో మరోరూపం పొందాలి **జేమ్స్‌బాండ్‌**ని కల్పించిన '**ఇయాన్ ఫ్లేమింగ్**'ని ఎవరు మరిచిపోతారు?

అసలు జేమ్స్‌బాండ్‌లాంటి గూఢచారి ఈ ప్రపంచం మొత్తంలో దుర్భిణి వేసినా కనిపించడు గదా! కాని ఉన్నాడన్న భ్రమను కల్పించిందెవరు? **ఇయాన్ ఫ్లేమింగే!** మన దేశానికే అంతగొప్ప గూఢచారి ఉంటేబాగుండు, ఈ కష్టంలో అంతగొప్ప జేమ్స్‌బాండ్ వచ్చి నన్ను కాపాడితే బాగుండు అని, హాలుబయటకువచ్చాకకూడా ప్రేక్షకుడిస్మృతిపధంలో కదులుతోందంటే, అది సినిమాకథారచయిత కల్పనాచాతుర్యమే

కాబట్టి ప్రేక్షకులహృదయాలలో తీవ్రమైనముద్రవేయగల పాత్రల, సన్నివేశాల కల్పన యోచించి యుక్తివంతంగా చెయ్యాలి సినిమాకథారచయిత, అన్నది వాస్తవం

**5. అద్భుత శక్తులు** సినిమారచయిత సినిమాకథ రాయాలంటే, తన శక్తిని మొత్తం అద్భుతంగా వినియోగించాలి ఒకకథ తను రాస్తున్నాడంటే, ఆ కథ రాసేముందు ఆ కథానాయకుడు కోట్లమందికినచ్చాలి కోట్లమందికి ఆ కథాంశం నచ్చాలి అన్న తాపత్రయం అనుక్షణం ఉపయోగించాలి

అద్భుతశక్తిని రచయిత చూపించాలంటే ఈ దృశ్యంలో ఈ సమస్యకు ఎలా పరిష్కారం చూపిస్తాడో అన్న విషయం ప్రేక్షకుడికీ అందకూడదు దృశ్యం ముగిసిపోయే వరకు సంభాషణగాని, భావం గాని కనీసం ఊహకు కూడా దొరకకూడదు ఉదాహరణకి బొబ్బిలి బ్రహ్మన్న చిత్రంలో ఈ దృశ్యం పరిశీలనార్హం

**బొబ్బిలి బ్రహ్మన్న**

బ్రహ్మన్న తీర్పుకి విరుద్ధంగా ప్రవర్తిస్తే గ్రామ బహిష్కారం, లేదా మరణ శిక్ష ధర్మపీఠంముందు ఉన్న కత్తితో శిక్ష అమలు బ్రహ్మన్న తన కుమార్తె వివాహం ఆమె మూలంగా కళ్ళుపోగొట్టుకున్న వ్యక్తితో జరగాలని తీర్పు చెబుతాడు కాని ఆయన తమ్ముడే ఆయన తీర్పుని ఎదిరించి ఇంతకు ముందు మీరు అమ్మాయి ప్రేమించిన వాడికిచ్చి పెళ్ళి చేస్తానన్నారు అంటాడు బ్రహ్మన్న ధర్మం చెబుతాడు తమ్ముడు అంగీకరించక అన్నకూతురికి ప్రేమించినవాడితో పెళ్ళి జరిపిస్తాడు తీర్పుని ఉల్లంఘించిన నేరానికి అతన్ని చంపెయ్యటానికి ధర్మపీఠం ఎదురుగా ఉన్న ఖడ్గాన్ని

తియ్యటానికి పూనుకుంటాడు బ్రహ్మన్న అప్పుడు భార్య గ్రామబహిష్కారం శిక్ష విధించవలసిందిగా ప్రాధేయపడుతుంది అంగీకరిస్తాడు

ఈ దృశ్యం తర్వాత తమ్ముడు, కొత్తపెళ్ళి కొడుకుని, పెళ్ళికూతుర్ని తీసుకుని బ్రహ్మన్న ఇంటికి వచ్చేదృశ్యాన్ని కథారచయిత పరుచూరి వెంకటేశ్వరరావు రాసినప్పుడు దర్శకుడు రాఘవేంద్రరావు, ఈ దృశ్యం ఎలాపీలవుతుంది? వస్తే చంపేస్తాడు గదా? అంటే రచయితలు ప్రయత్నించిచూస్తాం అనటం జరిగింది అనటం తేలికేగాని రాయాల్సి వచ్చేసరికి సర్వశక్తులూ ఒడ్డి ఆలోచించవలసివచ్చింది

సంభాషణ రచన పూర్తయి రాగానే, నాకు స్క్రిప్టు మొత్తం వద్దు, ఆ సీను చదవండి చాలు అన్నాడు రాఘవేంద్రరావు

బ్రహ్మన్న వాలు కుర్చీలో పడుకుని ఉన్నాడు అరచేతులు ఖడ్గం మూలంగా గాయం అయి ఉన్నాయి ఇంతలో గుమ్మంలోకి కొత్త దంపతులతో వచ్చాడు తమ్ముడు నమస్కారం బ్రహ్మన్నగారూ అనగానే ఆ శబ్దానికి పడగవిప్పిన తాచులా లేచాడు బ్రహ్మన్న చూసాడు ఆ చూపు దంపతుల మీద పడింది కుమార్తె మెడలో తాళి బొట్టు ఉంది అని నిర్ధారణ చేసుకున్నాడు అంతే! ఆవేశంతో లేచాడు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ రాసాగాడు భార్య సావిత్రి అల్లాడిపోతోంది

*ఏరా నా శాసనాన్ని ధిక్కరించావ్ ఆ జంటకు పెళ్ళి చేసావ్ గ్రామ బహిష్కారానికి అంగీకరించి ప్రాణాలు కాపాడుకున్నావ్ మళ్ళీ ప్రాణాలు పోగొట్టుకోటానికే ఈ గడపలో అడుగు పెట్టావ్!*

ఇక్కడిదాకా వర్ధమాన రచయిత కూడా రాయగలడు కాని ఈ ప్రశ్నకు సమాధానం రాయాలంటే సామాన్యమైన మేధస్సు చాలదు అద్భుత శక్తి కావాలి

*క్షమించండి బ్రహ్మన్న గారు మాది ఈ ఊరు కాదు మేం పొరుగూరి వాళ్ళం ఈ రోజు మా అన్నయ్యగారి అమ్మాయి పెళ్ళి జరిగింది. మీరు చల్లని దంపతులని తెలిసి మీ ఆశీస్సుల కోసం వచ్చాం* అన్నాడు

ఇప్పుడు నిరుత్తరుడవ్వటం బ్రహ్మన్న వంతయ్యింది మేం పొరుగూరు వాళ్ళం అంటున్నాడు ఏం చెయ్యాలి? అతనూ సామన్యుడు కాదు తీర్చాలి! అందుకే నవ్వి -

*ఆశీర్వదించటానికి ఈ చేతులు చల్లగా లేవు నాయనా రక్తంతోతడిసి వెచ్చగా ఉన్నాయి మీరువెళ్ళవచ్చు* అన్నాడు

*తమ్ముడు నిరుత్సాహపడినా ఆ చేతులయినా మాకు అభ్యంతరం లేదు మీరు ఆశీర్వదించండి* అన్నాడు

ఈయన కంటే ఆయన ముందు పుట్టాడు అందుకే చూడు బాబూ నీకు తెలియదేమో నాకూమార్తె, నా సోదరుడు ఈ రోజు ఒకేముహూర్తంలో మరణించారు ఈ ఇంట సూతకం, అశుభం జరిగిన ఇంట ఆశీర్వదించటానికి వీలు పడదు వెళ్ళి రండి అన్నాడు

కూతురు ఏడవసాగింది ఆమెను దగ్గరగా తీసుకుని పసుపు బట్టలతో కన్నీళ్ళు పెడుతోందమ్మా పసి బిడ్డ మీరయినా ఆశీర్వదించండి అని అడిగాడు

మెల్లగా భర్త దగ్గరకు వెళ్ళింది అనుమతి తీసుకుని ఆశీర్వదించటానికే అన్నట్లు వెళ్ళింది

ఆయన నా మెడలో తాళి కట్టిన మరుక్షణమే నా గోత్రం మారిపోయింది బాబూ ఆయన ఇంట సూతకం వస్తే నాకూ అంతేగా అంది నిరాశగా వెనుదిరిగారు చదవటం ఆపిన ఉత్తర క్షణంలో రాఘవేంద్రరావు హీరో కృష్ణంరాజుకి ఫోన్ చేసి ఈ రోజు నుంచి పెట్టుకుందామా మన సినిమా షూటింగ్ అని అడిగాడు

ఈ దృశ్యం ఏంచెబుతోందంటే కథ ఇలారాయాలని మనం రాసుకుంటాం తప్ప, ఇలారాయండి అని ప్రేక్షకుడు అడగడు అలాటప్పుడు ఇలాంటి చిక్కుముడులు సృష్టించుకుని ముందరి కాళ్ళకు బంధం వేసుకోటం దేనికి? అదే అద్భుతశక్తి సృష్టి! అలా ఛాలెంజ్‌ని ఆహ్వానించి సక్రమంగా పరిష్కరిస్తే ఆ పరిష్కారం రచయిత చేసినట్టుగా కాక, ఆ చిత్ర కథానాయకుడు చేసినట్టుగా భావించి ఆ హీరోని నెత్తిన పెట్టుకుంటారు

సాహిత్యకథ క్లుప్తమైనది నాలుగుపేజీలు చాలు ఒక సంఘటనచాలు కాని సినిమాకు సుమారు ఎనభైనుంచివందదాకా దృశ్యాలుకావాలి ( ఊరికిమొనగాడయితే 120 దృశ్యాలున్నాయి) ముప్పై, నలభై పాత్రలు ఎన్నో సన్నివేశాలు ఉంటాయి కథానాయకుడేమో వీరకృత్యమో, శూరకృత్యమో, సాహసకృత్యమో చేసే అద్భుతమైనశక్తి కలవాడై ఉంటాడు

సహజమైన కథలో కథానాయకుడు, నిత్య జీవితంలో తారసపడే సంఘటనలో చిక్కుకుని, గెలవటమో, ఓడిపోవటమో జరుగుతుంది కాని సినిమాకథలో నాయకుడు ఓడగూడదు గెలిచి తీరాలి అంటే ఒక అద్భుతమైనసమస్యను సృష్టించి, లక్షలాదిమంది ప్రేక్షకులు ఈ సమస్యను ఇతను ఎలా పరిష్కరిస్తాడని చెప్పి తల బద్దలు కొట్టుకొనేలా చేసి, కథానాయకుడు దానికి సమాధానం కనుక్కుంటే హాలంతా చప్పట్లమయం అంటే రచయిత మెదడుకి రావాల్సిన ఆ చప్పట్లు తాత్కాలికంగా ఆ పాత్రను పోషించిన నటుడు తీసుకుపోతున్నాడు

రామాయణం రాసిన వాల్మీకి రచయితగానే మిగిలిపోయాడు కానీ రాముడు నూరు కోట్ల భారతీయులకు ఆరాధ్య దైవం అయ్యాడు!

రచయిత తన సర్వశక్తులు కేంద్రీకరించి సృష్టించిన పాత్రలవల్ల, ప్రజలలో వారికివచ్చిన విపరీతమైన **ఇమేజ్** వల్ల, నందమూరి తారక రామారావు, ఎం జి రామచంద్రన్, జయలలిత లాంటి వాళ్ళు రాష్ట్రముఖ్యమంత్రులు కాగలిగారు తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు అని ప్రశ్నించాడు శ్రీశ్రీ వాస్తవం రచయిత ఉపయోగించే శక్తియుక్తులమీదే నటీనటుల ఇమేజ్‌లు పెరుగుతాయి తమతమ కథానాయకుల ఇమేజ్‌లకు సరిపడా కథలను సృష్టించగలడని నమ్మితేనే, ఆ కథారచయితను నిర్మాత కథకోసం కలిసే అవకాశాలు ఎక్కువగాఉన్నాయి

కనుక అద్భుత శక్తులను పాత్రలకు ఆపాదించాలంటే రచయిత శ్రమించాలి, పరిశ్రమించాలి

**6. తెలుగుదనం** · సినిమాకి కథరాసేముందు రాసేకథ తెలుగుసినిమాకథ అని, ఆ చిత్రాన్ని తెలుగుప్రేక్షకులే చూస్తారని తెలుసుకోవాలి

ప్రేక్షకుడికి ఇదేదో పొరుగురాష్ట్రంవారికథ అన్న అనుభూతి రానివ్వకూడదు వస్తే కథ ఎంతమంచిదయినా ప్రేక్షకుణ్ణి కోల్పోతుంది

**మేజర్ చంద్రకాంత్‌**లో నందమూరి తారకరామారావు ఛత్రపతి శివాజీ, అల్లూరి సీతారామరాజు, వీరపాండ్య కట్టబొమ్మన, సుభాష్ చంద్ర బోస్‌లా ఒక పాటలో నటించాడు అల్లూరి సీతారామరాజులా కనిపించినప్పుడు మిగిలిన మూడువేషాలకు కలిపివచ్చినన్ని హర్షధ్వానాలు వచ్చాయి అంటే, అల్లూరి సీతారామరాజు తెలుగువాడు కావటమే కారణం

ఎన్నో తమిళచిత్రాల కథలను తెలుగులో పునర్నిర్మాణానికి కొన్నప్పుడు, తెలుగు రచయితలతో ప్రతి నిర్మాత, దర్శకుడు, తెలుగు నేటివిటీ కోసం ప్రయత్నించండి అంటారు ఆ తెలుగుదనం లేకపోతే ఏమవుతుంది?

**చినరాయుడు**, **మొరటోడు నా మొగుడు** రెండూ తమిళచిత్రాల కథలే! అవి రెండూ తమిళంలో అమోఘమైన విజయాన్ని సాధించాయి తెలుగులో రెండూ దెబ్బతిన్నాయి ప్రేక్షకుల్ని కారణం అడిగితే రెండింటిలో కథానాయకులు, తమిళకథానాయకుల్లా పంచెను లుంగీలాగా కట్టారు, తెలుగుదనం లేదండి సినిమాలో అన్నారు

కాబట్టి సినిమాసాహిత్యంలో కథ రాయదలుచుకున్న రచయిత, ముందు తెలుగుభాషని, తెలుగువాతావరణాన్ని, తెలుగుసంస్కృతిని, తెలుగువేషాన్ని,

తెలుగుజాతీయాలను, నుడికారాలను, మొత్తంగా తెలుగుదనాన్ని కథలో చొప్పించటానికి ప్రయత్నించాలి లేకపోతే, కథబాగున్నా ప్రేక్షకాదరణకు నోచుకోకపోవచ్చు

ఇదే సిద్ధాంతం **కరుణామయుడి**కి వర్తించదు ఎందుకంటే క్రీస్తు తెలుగువాడుకాదు అని ప్రతిప్రేక్షకుడికి తెలుసు ఆ మహానుభావుడి చరిత్ర చూసితరించాలన్న కోరికతోనే వెళతారు తప్ప, చిత్రంలో వేషభాషలకోసం, ప్రాంతీయత కోసం వెళ్ళరు కనుక తెలుగు సినిమా కథలో తెలుగుదనం ముఖ్యాంశం

7 **ప్రేక్షకుడు** ఇదీ ఒక అంశమేనా అనిపిస్తుంది గాని అసలు సినిమాకథారచయిత కలం పట్టుకోగానే ముందు గుర్తుకుతెచ్చుకోవలసింది కథానాయకుణ్ణి కాదు, ప్రేక్షకుణ్ణి

నిర్మాత రచయిత దగ్గరకొచ్చినప్పుడు ఆడాళ్ళు బాగా ఏడవాలండీ, ఏడిస్తేనే డబ్బు, అట్లాంటి సీన్లు బాగారాయండి అంటాడు దర్శకుడు రచయితతో చర్చించేటప్పుడు సినిమాని బతికించేది మాసమ్మా, వాళ్ళను నవ్వించాలి, వాళ్ళను కవ్వించాలి, ఆ అంశాలు బాగా వచ్చేటట్లు చూడు అంటాడు మరో నిర్మాత **మిడిల్ క్లాస్ లేడీస్** టీ వీ లకు అతుక్కుపోయారండి, **యూత్** చూస్తున్నారు, **లవ్ స్టోరీస్** రాయండి, **పాప్ కారన్** తింటూ, ప్రేమకబుర్లు చెప్పుకుంటూ మన సినిమా పదిసార్లు చూస్తారు అని ఈ మధ్య అనటం మొదలు పెట్టారు

ఎవరుమాట్లాడినా కథ బాగారాయండి అని మాట్లాడకుండా, ఆడవాళ్ళను గుర్తుపెట్టుకోండి, కుర్రాళ్ళని గుర్తుపెట్టుకోండి, మాస్‌ని దృష్టిలోపెట్టుకోండి అంటున్నారంటే సారాంశం ప్రేక్షకుణ్ణి దృష్టిలోపెట్టుకోండి అని

సాహిత్యకథకు పాఠకుడు, సినిమాకథకు ప్రేక్షకుడు అని ఇంతకు ముందే చెప్పటంజరిగింది ప్రేక్షకుడికి, పాఠకుడికి ఉన్న మౌలికమైన భేదం ఏమిటి?

పాఠకుడు ఒక్కడే తన ఇంట్లో తను కూర్చుని, తనకు తానే రసానుభూతిని పొందుతూ, నచ్చితే మనసులో మెచ్చుకుంటూ, నచ్చకపోతే మనసులోనే నొచ్చుకుంటూ పత్రిక మూసి పక్కన పెడతాడు కాని ప్రేక్షకుడు అలాకాదు ఏ చిత్రాన్నయినా ఒక్క ప్రేక్షకుడు చూడడు కనీసం వెయ్యిమందికి పైగా ఏకకాలంలో చిత్రకథను అనుసరిస్తూ ఉంటారు అంటే ఒక సమూహం చూస్తూ ఉంటుంది ఆ సమూహంలో అనేక అభిరుచులున్న వాళ్ళేకాక, అనేక కులాలవాళ్ళు, మతాల వాళ్ళు, వర్గాలవాళ్ళు ఉంటారు ఏ చిన్న తేడావచ్చినా తెరలు చినిగిపోతాయి

*ఈ చరిత్ర ఏ సిరాతో* సినిమా తెనాలిలో చూస్తున్నప్పుడు రిజర్వేషన్ అంశం ప్రస్తావనకు వచ్చినప్పుడు రెండువర్గాల విద్యార్థులు కలబడటం ఈ సిద్ధాంతవ్యాసకర్త స్వీయానుభవం

కాబట్టి సినిమాకథను రాసుకొనేటప్పుడు ఇది కాగితంమీద కథకాదు, తెరమీదకథ, దీన్ని చదవరు, చూస్తారు, చూసేటప్పుడు రకరకాల అనుభూతులకు లోనవుతూఉంటారు, ఏ వర్గాన్ని, ఏ మతాన్ని, ఏ కులాన్ని, ఏ ప్రాంతాన్ని మానసికంగా బాధపెట్టకూడదు - అన్న నిజం తెలుసుకోవాలి

ప్రేక్షకుడికి నచ్చని సినిమారచయిత, సామాను సర్దేసుకుని ఊరికి బయలుదేరవచ్చు

సాహిత్య పరంగా అత్యుత్తమమనిపించుకొన్నకథ సినిమాపరంగా విఫలం కావచ్చు
సినిమా దృష్ట్యా విజయవంతమైనది సాహిత్యపరంగా పేలవం అయిపోవచ్చు [28]
అని చెప్పిన పోరంకి దక్షిణామూర్తి మాటలు అక్షరసత్యాలు

ఎందుకంటే మహానటి శారదకు ముచ్చటగా మూడోసారి ఊర్వశి **అవార్డును** తెచ్చిపెట్టిన **నిమజ్జనం** చిత్రం, ఎప్పుడు విడుదలయ్యిందోకూడా ప్రేక్షకులకు తెలియదు అంతెందుకు సాహితీప్రపంచాన్ని ఒకఊపుఊపి వదిలిన కా రా మాష్టారి **యజ్ఞం** సంగతేమిటి? కాబట్టి సినిమాకథకు కథాలక్షణం ఎంతముఖ్యమో, దానికంటే ప్రేక్షకుణ్ణి ఆకర్షించాలీ అనే ప్రత్యేకలక్షణం మరీముఖ్యం

ఈ సిద్ధాంతవ్యాసకర్త ఒక రోజు తిరుపతిలో ఒక సినిమాహాలు ముందు నిలబడి ఉన్నాడు ఆ సినిమా పేరు **మూగవాని పగ** అప్పటికే సినిమారచయితగాఉన్న అతను ఫలానా అని ప్రేక్షకులకు తెలియదు 'మోగన్‌బాబు చివరి దాకా మాట్లాడ్డా?' అని అడిగాడు, 'ఏం' అని ఒక ప్రేక్షకుడు అంటే, 'మోగన్‌బాబు మాట్లాడనికాడికి చినిమా చూట్టం దేనికి' అన్నాడు నివ్వెరపోవటం సినిమా రచయితవంతయ్యింది

అలాగే శ్రీదేవి, కృష్ణ కథానాయికా, నాయికులుగా నటించిన **జయం మనదే** చిత్రం విడుదలకు విశాఖపట్నం వెళ్ళి, సినిమా అయ్యాక, **సీరియస్ మూడ్‌లో** వెళుతున్న ఒకప్రేక్షకుడి దగ్గరకు వెళ్ళి 'సినిమా నచ్చలేదా' అంటే కోపంగా చూసి 'చీర కడితే శ్రీదేవే కావాలా? సుహాసిని లేదా' అన్నాడు అదొక అనుభవం

శోభన్‌బాబు ఒక చిత్రంలో మాంసాహారం తినాలి వద్దు శాకాహారం పెట్టండి అని, దృశ్యం మార్చమంటున్నాడు ఎందుకంటే, 'నన్ను అభిమానించే జనాల్లో చాలామంది శాకాహారులున్నారు ఈ దృశ్యంలో మాంసాహారం తింటే వాళ్ళు బాధపడవచ్చు' అన్నాడు

ఇలాంటి అనుభూతులు, అనుభవాలు కోకొల్లలు సినిమాకథారచయిత కథానాయకుడికోసం, సినిమావిజయంకోసం ఎన్నోసార్లు ఆలోచించి, ప్రేక్షకుడిఅభిరుచి, ప్రేక్షకుడిఅనుభూతి, ప్రేక్షకుడి సానుభూతిమీద పట్టు సాధించాలి

మదనపల్లిలో ఒక వృద్ధప్రేక్షకురాలు హీరో వెంకటేష్‌తో, 'నేను నీ సినిమా మొదటి ఆట చూస్తాను' అంటే, ఇంతవయసులో ఆ తొక్కిసలాటలో సినిమా చూడకపోతే రాత్రి ఆటకు వెళ్ళచ్చుగదా అంటే, 'అప్పటికి ఆడీఆడీ అలసిపోయి బాగాఆడలేవుగదా, అందుకని మొదటి ఆట చూస్తాను' అంటే 'తెల్లబోయాను' అన్నాడు అలాంటి ప్రేక్షకులుకూడా ఉన్నారని సినిమా కథారచయిత గుర్తుంచుకోవాలి

సినిమా పేరుని (శీర్షిక) బట్టి కూడా ఆ చిత్రాన్ని చూడాలో లేదో నిర్ణయంచేసుకుంటారు

*No Indian film can have a successful run in any part of India if it is not supplemented by vernacular titles* [29]

'ఇండియన్ సినిమా' గురించి రాసిన వ్యాసమాలికలో అది యస్ మెహరా అభిప్రాయం దేశీయత అనేది లేకపోతే ఏ సినిమా విజయవంతం కాదు అని బల్లగుద్ది చెబుతున్నాడు కాబట్టి ప్రేక్షకుడి ప్రతిఊహ, ఆలోచన పసిగట్టి తీరాలి

పైన చెప్పుకున్న ఏడువిషయాలు చిత్రకథకు ప్రత్యేకలక్షణాలు అవి అవగాహన చేసుకోకుండా, ఆకళింపు చేసుకోకుండా ఉత్తమసినిమాకథారచయిత కావటం అసంభవం ఇది సుమారు మూడువందల చిత్రాలకు కథ, సంభాషణలు సమకూర్చిన ఈ సిద్ధాంతవ్యాసకర్త స్వానుభవం

అయితే విలువలున్నకథలు వదిలేసి వలువలులేని ఇంతికథలే రాసుకోవాలా అంటే సమాధానం - కానే కాదు మంచికథ రాసుకోవాలి రాసుకొనే ముందు పై విషయాలు జ్ఞాపకం పెట్టుకోవాలి

అలా దృష్టిలో పెట్టుకుని నిర్వచించుకుంటే సినిమాకథ నిర్వచనం ఇలా ఉంటుంది

> అనేకాంశాలను ఏకోన్ముఖం చేసుకుని, స్వయం పరిపుష్టమై, సృజనాత్మకమై జనరంజకమైన నేపథ్య సంగీత, సాహిత్య, అభినయ, ఛాయాగ్రాహక ప్రక్రియ సినిమాకథ

సినిమాకథకు ఇది నిర్వచనం అని ఇంతవరకు ఎవరూ నిర్వచించలేదు సహరచయిత పరుచూరి వెంకటేశ్వరరావుని అడిగితే -

'రచయిత తన మెదడులో వండిన వంటకాన్ని ప్రేక్షకుడి కంటికి వడ్డించే విందుభోజనమే సినిమా కథ' అన్నాడు చమత్కారంగా సాహిత్యకథలో రచయిత మెదడు నుంచి పాఠకుడి మెదడుకి చేరే విందుభోజనం, ప్రేక్షకుడి విషయానికొచ్చేసరికి

వెందడంకి పనిలేకుండా నటులఅభినయం మూలంగా కంటికి విందుగా మారిపోతున్నమాట నిజం

సినిమాసాహిత్యానికి విలువలేమిటి అని భావించే చాలామంది **మౌనపోరాటం** లాంటి సినిమా కథలు సమాజానికి ఎంత మేలుచేసాయో, **ప్రతిఘటన**వంటి చిత్రకథలు ఎంత మేలుచేసాయో తెలుసుకుంటే, వారి మాటలను ఉపసంహరించుకుంటారు

## సినిమాకథ – వైవిధ్యం :

తెలుగుసినిమాసాహిత్యంలో, ముఖ్యంగా కథలు నాలుగు రకాలు

1 పౌరాణికాలు

2 చారిత్రకాలు

3 జానపదాలు

4 సాంఘికాలు

**1 పౌరాణికాలు** 1931లో తెలుగుసినిమానిర్మాణం మొదలయ్యిందే పౌరాణికకథతో **భక్త ప్రహ్లాద** తొలి తెలుగుశబ్దచిత్రం ఆ మాటకొస్తే తెలుగుసినిమాపుట్టాక, తొలిదశాబ్దంలో పరిశ్రమ ఆధారపడింది పౌరాణికకథలమీదే అప్పటికి తెలుగునాట బాగాప్రచారంపొందిన రంగస్థల పౌరాణికనాటకాలనే కథలుగా తీసుకున్నారు

మొదటి ఏడు సంవత్సరాలకాలంలో నిర్మించిన 40 చిత్రాలలో కేవలం ***చింతామణి, ప్రేమ విజయం, బాలయోగిని*** మాత్రమే సాంఘికచిత్రాలు మిగిలిన చిత్రాలన్నీ పౌరాణికాలే అంటే ఆనాటి తెలుగుసినిమానిర్మాణం మీద పురాణకథల ప్రభావాన్ని ఇక చెప్పనవసరం లేదు 1933లో **సావిత్రి** చిత్రాన్ని ఇద్దరు నిర్మాతలు, 1936లో **ద్రౌపదీ మాన సంరక్షణం** అని, **ద్రౌపది వస్త్రాపహరణం** అని రెండు సంస్థలవాళ్ళు నిర్మించారు తెలుగునాట ఆయా పద్యనాటకాలు అపూర్వమైన ఆదరణ కలిగిఉన్న నిజాన్ని తెలుసుకొని పురాణకథలనే ఎన్నుకొన్నారు

మహాభారతం, రామాయణం ఆనాటి తెలుగుసినిమాకథల ఖజానాలు **భక్త ప్రహ్లాద** అన్నా, **పాదుకా పట్టాభిషేకం** అన్నా, **సావిత్రి** అన్నా, **లవకుశ** అన్నా, **హరిశ్చంద్ర** అన్నా అన్నీ ఆ రెండు గ్రంథాలనుంచి సేకరించినవే తరువాత భాగవతం నుంచి **కృష్ణలీల**, శివపురాణం నుంచి ***మార్కండేయ, దక్షయజ్ఞం*** లాంటి చిత్రాలు నిర్మించారు

నందమూరి తారక రామారావు పురాణగాథలకు ప్రాచుర్యంతెచ్చిపెట్టాడు ఆయన నిర్మించిన ***సీతారామకళ్యాణం, శ్రీకృష్ణపాండవీయం, దానవీరశూరకర్ణ*** చిత్రాలలో ప్రతినాయకులే కథానాయకులుగా గోచరించేవిధంగా కథారచన సాగింది

**2 చారిత్రకాలు** తొలుత భక్తులైన రామదాసు, కబీరు, విప్రనారాయణ, పోతన వంటి వ్యక్తుల చరిత్రలను సినిమాలుగా నిర్మించటం జరిగింది కాని ***పల్నాటి యుద్ధం*** చిత్రమే నిజమైన తొలి చారిత్రక చిత్రంగా చెప్పుకోవాలి ***తెనాలి రామకృష్ణ, మహామంత్రి తిమ్మరసు, బొబ్బిలియుద్ధం*** లాంటి అనేక చారిత్రకాలు తదుపరికాలంలోవచ్చాయి ***చాణక్య చంద్రగుప్త*** నిరాశపరిస్తే ***అల్లూరి సీతారామరాజు*** ఆంధ్రప్రేక్షకహృదయాలలో సుస్థిర స్థానం సంపాదించుకుంది దాసరి ***విశ్వనాథనాయకుడు, తాండ్రపాపారాయుడు*** ప్రతిష్ఠాత్మక చారిత్రకచిత్రాలే కొద్ది చారిత్రక కథాచిత్రాలే విజయవంతం కావటం వల్ల, నిర్మాతలదృష్టి ఆ కథలమీద ఎక్కువపడలేదు

**3 జానపదాలు** తొలి జానపద చిత్రం ***కనకతార*** అయినా, మొట్టమొదట జానపద కథానాయకుడిగా తెలుగు ప్రేక్షకులు ఆరాధించింది అక్కినేనిని ఆ తర్వాత కాలంలో ఆయన సాంఘిక చిత్రాల వైపుకి మొగ్గు చూపటంతో ఎన్ టి ఆర్ కాంతారావు జానపద కథానాయకులుగా ఎక్కువగా నటించారు

అయితే అక్కినేని నాగేశ్వరరావు నటించిన ***బాలరాజు, కీలుగుర్రం*** ఆ రోజుల్లో సాధించిన అపూర్వవిజయానికి గుర్తుగామిగిలాయేతప్ప, మలివిడుదలలో ప్రేక్షకాదరణకు నోచుకోలేదు 1948లోనే విపరీతమైన పేరుప్రఖ్యాతులు సంపాదించిన ***గుణసుందరికథ*** కూడా స్వర్ణోత్సవం చేసుకున్న జానపదచిత్రమే ఈనాటి ప్రేక్షకులు పైచిత్రాలను టీ వీ ల్లో చూస్తున్నారు తప్ప, సినిమాహాళ్ళకు వెళ్ళి చూడటం లేదు

***పాతాళభైరవి*** మాత్రం ఆనాడు ఎంతప్రేక్షకాదరణపొందిందో నేటికీ అదేఆదరణ పొందుతోంది 1980వ దశకం వచ్చేసరికి జానపదకథాచిత్రాలనిర్మాణం బాగా తగ్గిపోయింది విజయాసంస్థ సింగీతం శ్రీనివాసరావు దర్శకుడిగా, రావి కొండలరావుతో రాయించుకున్న ***భైరవద్వీపం*** చిత్రం, 1995లో వచ్చిఉండకపోతే ఒక దశాబ్దకాలంపాటు తెలుగుప్రేక్షకులు జానపద కథాచిత్రాల రసానుభూతికి దూరంఅయిఉండేవాళ్ళే నేటి కథానాయకులు, నిర్మాతలు, దర్శకులు ఆ కథలమీద అసలు మక్కువ చూపించటం లేదు

**4 సాంఘికాలు** తెలుగుసినిమానిర్మాణంలో విస్తృతంగా పెరిగింది సాంఘికకథారచనే తొలి సాంఘికచిత్రంగా పేరుపొందిన ***ప్రేమవిజయం*** (1936) ఘోరపరాజయం పొందితే 1938లో వచ్చిన మలి సాంఘికచిత్రాలు ***గృహలక్ష్మి, మాలపిల్ల*** అద్భుతమైన విజయాలు సాధించి తెలుగుసినిమా కేవలం పౌరాణిక, చారిత్రక, జానపద కథలనే నమ్ముకో నక్కర్లేదు, సమకాలీన సమస్యలతో సాంఘికచిత్రనిర్మాణం చేస్తే ప్రేక్షకాదరణ ఉంటుంది

అని నిరూపించాయి సాంఘికసమస్యలను తీసుకుని, ఈ కింది విధంగా శాఖోపశాఖలుగా సాంఘిక కథ విస్తరించింది

1 వరకట్నం కథాంశంగా
2 బాల్యవివాహం కథావస్తువుగా
3 కన్యాశుల్కం సమస్యగా
4 విధవావివాహాలను ప్రోత్సహిస్తూ
5 పునర్వివాహం నేరంకాదంటూ
6 స్త్రీకి విద్య అవసరంఅంటూ
7 స్త్రీకి స్వేచ్ఛ కావాలంటూ
8 స్త్రీ శీలం మీద వాదనలతో
9 సతీ-సహగమనాన్ని విమర్శిస్తూ
10 కుల వ్యవస్థ మీద దాడి చేస్తూ
11 మద్యపానం ఇతివృత్తంగా
12 వెట్టిచాకిరీ నిర్మూలించాలంటూ
13 బాలకార్మిక వ్యవస్థ రద్దు కోరుతూ
14 రౌడీయిజాన్ని నిలదీస్తూ
15 ఫ్యాక్షనిజం వద్దంటూ
16 మతపోరాటం మన అభిమతం కాదంటూ
17 ఉమ్మడికుటుంబ వ్యవస్థ కావాలంటూ
18 ఆదర్శకుటుంబ వ్యవస్థ శ్రేయస్కరం అంటూ
19 స్వరాజ్య పోరాటాన్ని సమర్థిస్తూ
20 భూపోరాటం చెయ్యమని ఉద్రేకపరుస్తూ
21 సామ్యవాదం - కమ్యూనిజం --
22 దళితవాదాన్ని వివరిస్తూ --
23 స్త్రీవాద దృక్కోణాన్ని విశ్లేషిస్తూ --

ఒక్కొక్క సమస్యను సినిమాకథారచయితలు ఏ విధంగా మలచుకున్నారో ఈ కింద పరిశీలించటం జరుగుతోంది

**1 వరకట్నం** వరకట్నం ఒక సాంఘికదురాచారం దేశానికి స్వతంత్రంవచ్చింది లప్ప, ఈ వరకట్న దురాచారంనుంచి స్త్రీకి విముక్తిలభించలేదు భార్య, భర్తను కొనుగోలు చేసుకొనే ఈ నీచమైన ఆచారం, నశించాలనే ధ్యేయంతో రచింపబడిన సినిమాకథలు

నందమూరి తారకరామారావు **వరకట్నం** పేరుతోనే ఒక అద్భుతమైన విజయవంతమైన చిత్రం నిర్మించాడు ఈ అంశం ప్రధానంగా అనేకచిత్రాలు వచ్చాయి

సురేష్‌సంస్థ రామానాయుడు, పరుచూరి సోదరులు దర్శకత్వం వహించగా నిర్మించిన **శ్రీకట్న లీలలు**, పేద, మధ్య తరగతి, ధనిక వర్గం అన్నితరగతుల స్త్రీలు ఈ వరకట్న బాధితులే అని తెలియజెబుతుంది

**2 బాల్యవివాహం** ఆంధ్రరాష్ట్రాన్ని పట్టికుదిపిన అనేక సాంఘికదురాచారాలలో, బాల్యవివాహ వ్యవస్థ ఒకటి మరీ తెలంగాణాప్రాంతంలో నేటికీ కొన్ని గ్రామాల్లో, ఈ అనాచారం నడుస్తున్నది ఒకప్పుడు నిజాంపాలనలో తెలంగాణా ఉన్నప్పుడు, పుష్పవతులు కాకుండానే పెళ్ళిళ్ళు చేసే అలవాటు ప్రారంభమయ్యింది

ఆ ఆచారం చాలావరకు మరుగున పడిపోయినా కొన్ని దళిత కుటుంబాలలో, ఇంకా మైనారిటీ తీరని ఆడపిల్లలకు పెళ్ళిళ్ళుచేస్తూనేఉన్నారు

బాల్యవివాహాన్ని సమర్థిస్తూ **మాంగల్యబలం, సీతారామ కళ్యాణం** లాంటి చిత్రాలు వచ్చాయి

**3 కన్యాశుల్కం** వరకట్నానికి పూర్తిగా వ్యతిరేకమైన దురాచారం భర్తకు కట్నం ఇచ్చిన భార్య, నేను నిన్ను కొనుక్కున్నానని భయపెట్టలేదు గాని, ఓలి ఇచ్చి పేదపిల్లను కొనుక్కున్న వరుడు మాత్రం, భార్యను ఖరీదు చేసిన వస్తువులాగా చూసేవాడు

భార్యాభర్తలమధ్య పవిత్రమైన వివాహవ్యవస్థ కొనుగోళ్ళు, అమ్మకాలతో బలైపోవటం ఒక దురదృష్టకరమైన సంఘటన

నాటికీనేటికి ప్రఖ్యాతి వహించిన గురజాడ **కన్యాశుల్కం,** దీనికి మంచి ఉదాహరణ

**4 విధవావివాహం .** బాల్యంలోనే పెళ్ళిళ్ళు చేసి, పుష్పవతులు కూడా కాకముందే భర్తలు చనిపోతే, శిరోముండనం చేయించి మూల కూర్చోపెట్టే దురవస్థనుంచి, కందుకూరి వీరేశలింగం పుణ్యమా అని విధవలకు వివాహం అనే సంస్కరణ జరిగింది సమాజం పెరుగుతున్నంత వేగంగా మానవుల్లో సంస్కారం పెరగకపోవటమే పెద్దలోపం

1939లో **మళ్ళీ పెళ్ళి**, 1940లో **సుమంగళి** ఈ కథాంశాన్నే తీసుకుని చిత్రాలుగా నిర్మించారు సమాజశ్రేయస్సుకోసం సినిమా అని నాటి సినిమాకథారచయితలు, దర్శకులు, నిర్మాతలు నమ్మేవారు

విధివశాత్తు యవ్వనంలోనే మాంగల్యాన్ని కోల్పోయిన, సమాజ శాపం చేత జీవచ్ఛవంలా జీవిస్తున్న, దురదృష్టకర హిందూవితంతువులకు ఈ చిత్రం అంకితం (అది ఆంగ్లంలో ఉందని నాగయ్య దాని తెలుగు అనువాదాన్ని మాటల్లో వినిపిస్తాడు) అని ఆరోజుల్లోనే అన్నారంటే, సినిమా కేవలం వ్యాపారం మాత్రమే కాదనే దృక్పధం గట్టిగా ఉందన్నమాట

బి ఎన్ రెడ్డికి ఈ చిత్రనిర్మాణంమూలంగా కాస్త చేతులు కాలాయంటారు ఈ చిత్రం కంటే సగంఖర్చుతో తీసిన **మళ్ళీపెళ్ళి** ప్రేక్షకాదరణ బాగాపొందింది

**5 పునర్వివాహం** విధవావివాహం కంటే ఇది వేరయినది భర్త నుంచి వేరయిన స్త్రీ, పాశ్చాత్య నాగరికత పద్ధతిలో మరోపెళ్ళి చేసుకోవటం హిందూస్త్రీ భర్తకొట్టినా తిట్టినా పడి ఉండటానికి ప్రధానకారణం సాంఘిక అభద్రతాభావం ఒకసారి పెళ్ళి జరగటమే కష్టమవుతున్నటువంటి ఈ కాలంలో, భర్తను వదిలేసిన స్త్రీని, మరొక సంస్కారవంతుడు చేసుకుంటాడనుకోవటం దాదాపు ఎండమావిలో జలం దొరికిన విధంగానే

అయితే **చిలకమ్మ చెప్పింది, మన్నెంలో మొనగాడు** లాంటి కథాచిత్రాలు నిర్మాతల భయాన్ని, కథారచయితల అనుమానాలను పటాపంచలు చేసాయి చావో రేవో తాళికట్టినవాడితోనే కానక్కర్లేదు, ఆ చిత్రహింసలుభరిస్తూ జీవన్మృతురాలిగా బతికే కంటే, కోరుకున్నవాడితో మళ్ళీ కొంగుముడి వేయించుకోవచ్చు అని నిరూపించిన చిత్ర కథలు రచించటానికి **మాంగల్యానికి మరో ముడి** అన్న సాహసోపేతమైన మకుటాలు కూడా పెట్టటానికి ఈ కథాంశమే కారణం అయ్యింది

**6 స్త్రీ విద్య** 1950లో పాఠశాలల్లో ఎక్కడ చూసినా స్త్రీకి విద్య అవసరమా అన్న అంశమే వక్తృత్వ పోటీలలో ప్రముఖంగా ఉండేది మనసుపెట్టి ఆలోచించేవాళ్ళకు అది పరమమూర్ఖమైన ప్రశ్నగా కనిపించేది స్త్రీకి తిండి అవసరమా? స్త్రీకి బిడ్డ అవసరమా? స్త్రీకి నిద్ర అవసరమా? అని కూడా ప్రశ్నిస్తారేమో స్త్రీ మౌనంగా ఉంటే అని అనిపించేది

అయితే తనభార్యకు విద్యలేదు అన్న సాకుతో పరస్త్రీ వ్యామోహంలోపడ్డ సినిమా 1944లోనే వచ్చింది **తాసిల్దార్** చిత్రంలో కథానాయకుడు తనభార్య ఇంగ్లీషు మాట్లాడటంలేదని, నాట్యంచెయ్యటంలేదని మధనపడిపోయి, వేరే యువతితో పరిచయమై పెళ్ళిదాకా వెళ్ళి స్నేహితుడి సలహాతో మారిపోవటం ఆ కథాంశం

**చదువుకున్న అమ్మాయిలు** అన్నపూర్ణావారి ఆదర్శ కథాచిత్రమయితే, భర్తనే

చదివించుకొన్న అర్ధాంగి కధ తెలుగునాట ఎంతోమంది ఆడపడుచులు తమ భర్తల్ని తీర్చిదిద్దుకునేలాచేసింది

**పలనాటి సింహం** కధాబీజమే స్త్రీ విద్య నాగమణి పాత్ర ఐ ఎ ఎస్ చదవటం వల్ల రెండు కుటుంబాలు రక్తపాతానికి గురవుతాయి

**7 స్త్రీకి స్వేచ్ఛ** స్త్రీ వంటింటికి పరిమితం అనే ఛాందసపరుల భావజాలాన్ని దుమ్మెత్తిపోసే కధాంశం **పెళ్లాం చెప్తేవినాలి**లాంటి సినిమాలు ఈ కోవకు చెందుతాయి

**8 స్త్రీ శీలం** చిత్రకధల్లో 'స్త్రీ శీలం' చుట్టూ తిరిగిన కధలు అనేకం ఆ మాటకొస్తే రామాయణమే సీతాదేవి శీలంచుట్టూ తిరిగింది ఈ అంశంమీద అనేకచిత్రాలు వచ్చాయి **మౌనపోరాటం, స్త్రీ జన్మ** అనే చిత్రాలు చక్కటి ఉదాహరణలు

**9 సతీసహగమనం** పురాణకధలో తప్ప ఈ అంశం సాంఘికచిత్రంలోకి రాకపోవటం ప్రజల అదృష్టం కాని అలాంటి ప్రయత్నం సాంఘిక చిత్రాలలోకి తీసుకువచ్చే ప్రయత్నాలు జరిగాయి

**10 కుల వ్యవస్థ** ప్రపంచదేశాల్లో మరేదేశంలోనూలేని కులవ్యవస్థ ఒక్క భారత దేశంలోనే ఉంది విశ్వవిజ్ఞానగ్రంధం అయిన విశ్వవిజ్ఞానదర్శినిలో జి నరేంద్రదేవ్ ఇలా అంటున్నాడు

> *"భారతదేశంలో హిందూమతంలో తప్ప ప్రపంచంలో మరే మతంలోగాని, జాతిలోగాని, దేశంలోగాని కులాలు అనేవి లేవు భారతదేశంలోని 55 కోట్ల (ఇప్పుడు భారత జనాభా వంద కోట్లు) హిందూమతస్తులు 3 వేల కులాలుగా చీలిఉన్నారు"* [30]

ప్రపంచంలో సుమారు 170 దేశాలు, రమారమి ఏడువందలకోట్లమంది జనాభాలో ఒక్క భారతీయులకే, అందునా హిందువులకుమాత్రమే కులాలున్నాయంటే ఎంత తలవంపు తలవంపుమాట ఎలాఉన్నా తలలు నరుక్కునేది ఈ కులాల మూలంగానే ఇది మామూలు మనిషి చెప్పాడంటే పట్టించుకోకపోదురు ఆసేతుహిమాచలం ఆరాధించే శ్రీకృష్ణుడు అతి పవిత్రమైన భగవద్గీతలో ఇలా చెప్పాడని నాటికీ నేటికీ ప్రచారం జరుగుతోంది

> "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
> తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్"

జ్ఞాన యోగంలో పదమూడవ శ్లోకంగా చెప్పబడిన ఈ శ్లోకం, భగవంతుడు

చెప్పిందేనని మనం నమ్మినా, నాలుగుకులాలు మూడువేలకులాలుగా ఎలా మారిపోయాయి? ఇదే చారిత్రక మర్మం!

విచిత్రమేమిటంటే, సాత్త్వికగుణప్రధానులుగా చెప్పబడిన బ్రాహ్మణులు, రజోగుణ ప్రధానులైన క్షత్రియులు, రజస్తమోగుణ మిశ్రమగుణంగల వైశ్యులు, అన్ని వేల సంవత్సరాలుగా కన్యాకుమారి నుంచి కాశ్మీరు వరకు అదే మూడుకులాలుగా అలాగేఉన్నారు తమో గుణ ప్రధానులైన శ్రామిక వర్గానికి చెందిన శూద్రులు మాత్రమే, అప్పటినుంచి ఇప్పటి వరకు మూడువేల కులాలుగా విడిపోయారు ఈ పరిణామానికి అసలైన కారణం ఏమిటో ఎవరయినా పరిశోధిస్తే జాతికి మేలు జరుగుతుంది

ఇది సినిమా పుట్టక ముందునుంచే పుట్టిఉంది కనుక సినిమానిర్మాణం మొదలయినప్పుడు అందరూ పౌరాణికాలలోనే ఉన్న సమయంలో, అభ్యుదయవాది అయిన గూడవల్లి రామబ్రహ్మం **మాలపిల్ల** అన్న చిత్రాన్ని, సంస్కరణచిత్రంగా నిర్మించి, సంచలనం సృష్టించాడు అది అంత సంచలనవిజయంకూడా సాధించి పెట్టింది

ఒక బ్రాహ్మణయువకుడు ఒక మాలపిల్లను ప్రేమించి పెళ్ళి చేసుకోవటంవల్ల సందర్భించిన సంఘటనల సమాహారమే **మాలపిల్ల** మిలీనియమ్‌లోకూడా పరిష్కరింపబడని ఈ సమస్యను, 1938లోనే ఇతివృత్తంగా తీసుకోవటం గూడవల్లి రామబ్రహ్మంకే చెల్లింది నాటికీ నేటికీ ఈ సమస్య మీద పుంఖానుపుంఖంగా చిత్రాలు నిర్మించబడ్డాయి

**11 మద్యపానం** మద్యానికి బానిసలవ్వటం అనేది ఒక సాంఘికదుర్వ్యసనం అక్కినేని నాగేశ్వరరావు మధుపానంచేసే పాత్రలు నటించటానికి పెట్టిపుట్టాడు దేవదాసు చిత్రంలో 24 గంటలు తాగుతూ చివరకు ప్రేమకోసం మరణిస్తాడు అయితే తాగుడు వ్యసనం అని చెప్పటానికి అనేక చిత్ర కథల్లో కొంచెం కొంచెం స్థానం కల్పించారు గాని, ఆర్ నారాయణమూర్తి సారా వ్యతిరేక ఉద్యమంలాగా తీసిన *దండోరా* ఒక మంచి ఉదాహరణ బాధతో తాగడం, ప్రేమవిఫలమయితే తాగడంలాంటి అంశాలతో రచించిన కథలే ఎక్కువ

**12 వెట్టిచాకిరీ :** సాయుధ రైతాంగం తిరుగుబాటు తెలంగాణాలో జరుగుతున్నసమయంలో, ఒక్కొక్క భూస్వామికి వేల కొద్దీ, కొందరికయితే పదిలక్షలఎకరాలవరకూ ఉండేవి! భూములన్నీ భూస్వామివే అయినప్పుడు, కూలిమీదమాత్రమే ఆధారపడి లక్షలాదిమంది పేదప్రజలు, రైతుకూలీలు బతకవలసిన అగత్యం ఏర్పడింది

పైగా, భారతదేశం వ్యవసాయిక దేశమే అయినా, నారుమళ్ళు పోసి, పైరు వేసాక ఖాళీ! మళ్ళీ కోతలు, కట్టివేతలు, కుప్ప నూర్పిళ్ళు అంతే! సుమారు ఆరునెలలు అసలుపనిఉండదు! కొందరికయితే మూడునెలలే పని నాలుగయిదునెలల పనితో పన్నెండునెలలు బతకాలి ఎలా! అందుకే అప్పు చెయ్యటం ఆ అప్పు తీరక తండ్రి చేసిన అప్పు కొడుకు, కొడుకు వల్ల తీరకపోతే మనవుడు! ఇలా శ్రమతో ఋణం తీర్చుకోటానికి ప్రయత్నం అది విఫలం

భూస్వామ్యవ్యవస్థ మీద తిరుగుబాటుతో 1939లోనే రైతుబిడ్డ వచ్చినా అది వెట్టిమీదకాదు, సామ్యవాదం నేపథ్యంలో వచ్చింది వెట్టి చాకిరిని వివరించి చెప్పిన చిత్రాలు **ధర్మవడ్డీ, యజ్ఞం**

**13 బాలకార్మికులు** హిందూదేశంలో ఇంట్లో ఒక్కడుసంపాదిస్తే ఇంటిల్లిపాదీ కూర్చునితినే వ్యవస్థ పెరిగి, అనేక కుటుంబాలు ఉన్నతమధ్యతరగతి నుంచి, పేదమధ్యతరగతి స్థాయికి పడిపోయి, పేదలై నిరుపేదలై, కడుబీదలై, ఆడవాళ్ళను పనిలోకి పంపలేక పలక చేత పట్టాల్సిన పసిబిడ్డలతో పారా, పలుగూ పట్టించి పొలానికిపంపే దుస్థితికివచ్చారు

ఎన్ని యాక్ట్‌లు చేసినా నేటికీ కంటిముందు లక్షలాది మంది పసివాళ్ళు కాఫీకప్పులు కడుగుతూ కనిపిస్తూనే ఉన్నారు టి కృష్ణ **రేపటి పౌరుల్లో** ఈ విచిత్రాన్ని చాలా బాగా చూపించాడు చదువుకోవాల్సిన వయసులో పేకాటక్లబ్బుల్లో, మందుక్లబ్బుల్లో, వ్యభిచారగృహాలమధ్య సంచరిస్తున్న రేపటిపౌరులు ఏమవుతారు అని సూటిగా ప్రశ్నించటానికి సినిమాకథాంశాన్ని ఆయుధంగా వాడాడు

**14 రౌడీయిజం** సమాజానికి రౌడీలు చీడపురుగులులాంటివారని, వాళ్ళను ఏరిపారేసే వ్యవస్థరావాలని చాటిచెప్పే కథాంశంతోవచ్చిన **ప్రతిఘటన,** భారతదేశపు అన్నిభాషలలోను ప్రజాదరణపొందింది

**15 ఫ్యాక్షనిజం** · రాయలసీమలో ఎక్కువగా, పలనాడులో కొంచెంగా, కృష్ణాజిల్లాలో వాసనమాత్రంగా, రాజధానిలో రంగుమార్చుకుని నడుస్తున్న ఈ ఫ్యాక్షనిజాన్ని, భయపెట్టటానికే ఎక్కువ వాడుకున్నారు కాని, అఖండప్రజాదరణ పొందిన **సమరసింహారెడ్డి** చిత్రం ఫ్యాక్షనిజం వద్దన్న నీతితో ముగుస్తుంది

**16 మతపోరాటం** మతం మత్తుమందు కంటే ఎక్కువప్రభావాన్ని చూపిస్తుంది అనాదిగా సర్వమత సమానత్వాన్ని ప్రేమించే భారతదేశంలో మతంవద్దు అంటూ

రాయబద్ధ కధాంశాలెన్నో కాకపోతే చాలామంది నిర్మాతలు ఈ చిత్రాలు తీసి చేతులు కాల్చుకున్నారు **ఈశ్వర్ అల్లా** ఉదాహరణ

**17 ఉమ్మడికుటుంబ వ్యవస్థ** ఎడారిలో చెట్లు అక్కడొకటి అక్కడొకటి కనిపించినట్లు, ఈనాడు ఉమ్మడికుటుంబ వ్యవస్థ మచ్చుకికూడా కనిపించటం లేదు కాని ఆ కథాంశంమాత్రం ఆంధ్రరాష్ట్రంలో ఎన్నిసార్లు చిత్రకధగా వచ్చినా విజయమేగాని పరాజయాన్ని ఎరుగదు నాటి **ఉమ్మడికుటుంబం**నుంచి నేటి పెద్దన్నయ్య దాకా, ప్రతిఉమ్మడికుటుంబగాధాచిత్రం కనకవర్షం కురిపించినదే ఎన్ ఎ టి సంస్థలాగే పద్మాలయావారుకూడా, **పాడిపంటలు, పండంటి కాపురం** అంటూ ప్రేక్షకుల నీరాజనాలు అందుకున్నారు మనిషి, మనిషికి దూరమైపోతున్న ఈ రోజుల్లో, ఆ చిత్రకధలు ప్రజాదరణ పొందటం విచిత్రమే

**18 ఆదర్శకుటుంబ వ్యవస్థ** నటులుగా పరిశ్రమకు రెండుకళ్ళయిన నందమూరి తారక రామారావు, అక్కినేని నాగేశ్వరరావులు, **స్పర్ధయా వర్ధతే విద్యా** అన్న సూక్తిని నమ్ముకున్నవాళ్ళు నందమూరి తారకరామారావు **కలిసి వుంటే కలదు సుఖం** అంటే, అక్కినేని నాగేశ్వరరావు విడివిడిగా ఎవరి ఇళ్ళల్లో వాళ్ళు ఉంటేనే **ఆదర్శ కుటుంబాలు** నెలకొంటాయని చెప్పి విజయం సాధించారు

**19 స్వరాజ్య పోరాటం** 1950 నుంచి 60వదశకం వరకు గాంధీగారిబొమ్మ కనిపించినా, నెహ్రూగారి మాటవినిపించినా ప్రేక్షకులలో స్పందన కనిపించేది స్వరాజ్యం వచ్చి 50 సంవత్సరాలు పూర్తయి పోవటంతో, 20 సంవత్సరాలయువకులకు మనం 50 ఏళ్ళక్రితంబానిసలం అనే మాటే తెలియటం లేదు **మరోక్విట్ఇండియా, భారతీయుడు** ప్రజలకు ఆ స్ఫూర్తిని గుర్తుచేసి కీర్తిని సంపాదించుకున్నాయి

**20 భూపోరాటం** మానవుడి శరీరం పాంచభౌతికం

1 నిప్పు, 2 భూమి, 3 గాలి, 4 ఆకాశం, 5 నీరు

ఈ అయిదూ ప్రకృతిలో ఉంటాయి మానవశరీరంలో ఉంటాయి మనిషిని సృష్టించిన ప్రకృతి, మనిషికి అవసరమైన ఆ పంచభూతాలను ఉచితంగా ఇస్తోంది అగ్గిపెట్టె డబ్బులు పెట్టి కొంటున్నా, రాయికి రాయిని ఒరిపిడి చేస్తే వచ్చే నిప్పు ఉచితంగా లభ్యం అవుతుంది

ఏడువందల కోట్లమంది ప్రపంచ ప్రజలు, పైసాకట్టకుండా ప్రకృతిలో ఉన్న గాలిని పీల్చుకుంటున్నారు ఆకాశంలో ఉన్న చంద్రుడి కాంతికి, సూర్యుడి కిరణాలకు ఖరీదు

కట్టటం లేదు సూర్యుడి మూలంగా సముద్రజలంఆవిరై, మబ్బులుగామారి మళ్ళీవర్షంగా మారుతోంది సూర్యుడి కిరణాల మూలంగానే చెట్లు కిరణజన్యసంయోగక్రియ పొందుతున్నాయి ఆ చెట్లు మనంవదిలే కార్బన్‌డయాక్సైడ్ పీలుస్తూ, మనకి అవసరమైన ఆక్సిజన్, ప్రాణవాయువులను వదిలిపెడుతున్నాయి దానికీ డబ్బు కట్టటం లేదు

నీరు! ఆకాశంనుంచి వచ్చి, భూమిమీదపడి సముద్రగర్భంలో కలిసిపోయేలోపు, కాలవల్లో, చెరువుల్లో, నదుల్లో పరుగులుతీస్తున్న నీటిని కొనక్కర్లేదు (పట్టణాల్లోకి గ్రామప్రజలు ఈమధ్య విపరీతంగా వలసలు పెరిగి కొన్ని చోట్ల కొనవలసిన అవసరం ఏర్పడుతోంది)

లక్షలసంవత్సరాలు గడిచినా నిప్పు, గాలి, ఆకాశం, నీరు ఇంకా ఉచితంగానే దొరుకుతోందిగాని, భూమి మాత్రం గజాల లెక్కన కొనవలసివస్తోంది! ఎందుకు?

ఇన్ని యుగాలుగా ప్రపంచవ్యాప్తంగా భూమిమీద మనుషులు పెరిగారు తప్ప, భూమి పెరగలేదు అందుకే, ఆనాడే దుర్యోధనుడు సూదిమొన మోపినంతనేల కూడా ఇవ్వనన్నాడు ఎందుకంటే, భారతయుద్ధంలో చనిపోయిన సైనికులసంఖ్య డెబ్బైఆరుకోట్లకుపైగా ఉంది ఈ విషయాన్ని స్త్రీ పర్వంలో ధర్మరాజు ధృతరాష్ట్రుడికెరుక పరుస్తాడు -

*విను మెఱుక పడ్డవా రుత్తమ జనంబులు డెబ్బది యాఱుకోట్లు నిరువది వేలును, ముక్కడి మూక యిరువది నాలుగువేలు మూన్నూట యిరువండ్రుఁదెగిరని చెప్పిన*

అంటే 76 కోట్ల 44 వేల 320 మంది హతులయ్యారట! సైనికులే అంతమంది అయితే ఇక జనాభామాట ఏమిటి? స్త్రీలు, వృద్ధులు, పనివారు, యుద్ధం చేయరానివారు, చేయలేనివారు అంతాకలిపితే జంబూద్వీపంలోనే అంతజనాభా ఉన్నారా? లేక ఒకసారి 'చతుస్సముద్ర పర్యంతమయిన' అని, మరొకసారి 'సప్త సముద్ర పర్యంతమయిన' అని వాడుతూ ఉండటంవల్ల ప్రపంచం అంతా ఆ యుద్ధంలో పాల్గొన్నారా! ఆనాటికి భూమి ఎన్నిఖండాలుగా ఉందో, అన్నీ అనుమానాలే ఏమయినా కురుక్షేత్రం భూమికోసం జరిగిన పోరాటమే

ఈ భూపోరాటం మీద తొలిసారి తీసిన చిత్రం 1939లో వచ్చిన రైతుబిడ్డ ఆ రోజుల్లో చల్లపల్లిరాజాకి వ్యతిరేకంగా ఆ చిత్రం నిర్మించబడిందని చెప్పుకొనేవారట తొలిసారిగా నిషేధించ బడిన తొలి తెలుగుచిత్రం అదేకనుక, నిషేధానికి గురయిన తొలి తెలుగుచిత్రసినిమాకథ రైతుబిడ్డ గూడవల్లి రామబ్రహ్మంతో పాటు, రచనలో కొనసాగినవారు త్రిపురనేని గోపీచంద్ కొసరాజు రాఘవయ్య చౌదరి మాండలికాలు సమకూరిస్తే, గోపీచంద్, తాపీధర్మారావు, స్క్రీన్‌ప్లేలో తమ ప్రతిభ కనబరిచారు

'అలనాటి చలన చిత్రం' రచయిత కె ఎన్ టి శాస్త్రి ఈ సాహసం చేసిన గూడవల్లి రామబ్రహ్మం గురించి అన్నమాటలు ఆయనమాటల్లో చదివితే మనసుకు హత్తుకుంటాయి

> *"యాభై సంవత్సరాల క్రితం సరిగ్గా ఇదే రోజున అంటే ఆగష్టు 27, 1939 నాడు దక్షిణభారత చలనచిత్రరంగం ఒక విప్లవాత్మకమైన మార్పును కళ్ళజూసింది మామూలు వినోదభరిత సినిమాల మధ్యనుంచి ఒకవ్యక్తి బయటకువచ్చి సినిమాకు పరమార్థం వినోదం మాత్రమే కాదు, అంతకుమించిన ప్రయోజనం కూడా ఉండాలని ఎలుగెత్తి చెప్పాడు ఒక్క మాటలో చెప్పటమేకాదు అలాంటి సినిమాను తీసి చూపించాడు కూడా ఆ వ్యక్తి మరెవరో కాదు, గూడవల్లి రామబ్రహ్మం ఆ సినిమా పేరు రైతు బిడ్డ"*[31]

కళ కళకోసమే అని చాటిచెప్పే చిత్రాలు అనేకం వచ్చాయి అయితే నిజాంపాలన రోజుల్లో జరిగిన భూపోరాటం మీద చెప్పుకోదగ్గ మరో చిత్రం **మా భూమి**

మాదాల రంగారావు, ఆర్ నారాయణమూర్తి మొదలైన వాళ్ళు ఈ భూమికోసం పోరును ప్రధానంగా చేసి చాలా చిత్రకథలు సినిమా పరిశ్రమకు అందించారు

**21 సామ్యవాదం-కమ్యూనిజం** సామ్యవాద, అభ్యుదయవాద, తీవ్రవాద ప్రభావాలు తెలుగుసినిమా కథారచయితలమీద విపరీతంగాపడ్డాయి **రైతుబిడ్డ, రోజులుమారాయి** దగ్గర నుంచి ఈనాటి **రైతుభారతం, దళం** వరకు ఆ ప్రభావాలు నడుస్తూనే ఉన్నాయి

**22 దళితవాదం :** తెలుగుసాహిత్యంలో దళితవాదం పెరిగినట్టే చిత్రకథారచనలో కూడా దళితవాదం చోటు చేసుకోవటమేకాక **ఒసేయ్ రాములమ్మ**లాగా కనకవర్షం కురిపించాయి కూడా

**23 స్త్రీ వాదం .** స్త్రీ సమస్యలు వేరు - స్త్రీ వాదం వేరు ఒక ఆఫీసర్నినమ్మి మోసానికిగురైన గిరిజన యువతి, బిడ్డకి తండ్రిఎవరో తెలియజేయటం కోసం, తన వ్యక్తిగత సమస్య కోసం పోరాడితే, అది **మౌనపోరాటం** అయ్యింది భర్త లేకుండానే బిడ్డని కంటే తప్పేమిటి అని ప్రశ్నిస్తే, అది **అమ్మ** అయ్యింది మొదటిది స్త్రీ సమస్య అయితే - రెండోది స్త్రీ వాదం అవుతుంది స్త్రీకి సంబంధించిన లైంగిక స్వేచ్ఛ, పునరుత్పత్తిహక్కులు, శరీరరాజకీయాలు, ఇంటిచాకిరీ ఇవన్నీ ఆధునిక స్త్రీ వాదానికి మౌలికదృక్పథాలు ఈ దృక్పథాలని ఆధారంగాచేసుకొనికూడా ఎన్నోసినిమాలు వచ్చాయి **ఇల్లాలికోరికలు** - స్త్రీ లైంగికతని, **అమ్మ** - పునరుత్పత్తికి సంబంధించిన ఇతివృత్తాన్ని ఆధారం చేసుకొని వచ్చాయి

సమాజంలో సినిమాసాహిత్యంలో కథారచయితలకు గ్లామర్‌తప్ప గ్రామర్ లేదనుకునే చాలామందికి, శవసాహిత్యంలాగే, సినిమాసాహిత్యంకూడా కాలక్షేపానికే అనుకునే అమాయకులకు, చిత్రకథారచయితలు సమాజ శ్రేయస్సు కోసం ఎన్ని కథాంశాలను ఎన్నుకున్నారో గమనిస్తే, కనువిప్పు కలగకపోయినా జవాబు లభిస్తేవాలు

ఇక్కడ ఒక మంచిసందేశాన్ని సమాజానికి అందించాలని ఆస్తులుపొగొట్టుకున్న నిర్మాతలున్నారు

అభ్యుదయాత్మక అంశాలనే ప్రేక్షకులకులందించాలన్న తీవ్రప్రయత్నంతో కెరీర్‌లు పోగొట్టుకున్న దర్శకులున్నారు

తను చెప్పదలచుకున్నది చెప్పలేకపోతున్నానన్న బాధాతప్త హృదయంతో సినీజనారణ్యాన్ని వదిలేసిన 'నందు'లున్నారు

అల్లూరి సీతారామరాజు కథనం ఆంధ్రుల గుండెల్లో అచ్చుగుద్దిన మహారథులున్నారు

అసమదీయులు తసమదీయులను యాభైఏళ్ళుగా మరిచిపోనివ్వని పింగళి నాగేంద్రులున్నారు

వాఙ్మయం సముద్రమా? అయితే మా ఇంటి పేరే సముద్రం అన్న సీనియర్ సముద్రాల, జూనియర్ సముద్రాల ఉన్నారు

మధనపడితే మాటవస్తుంది, నామాట సినిమాకిపెట్టనికోట అని నిరూపించుకున్న మనసుకవి ఆత్రేయ ఉన్నాడు ఆంధ్రసాహిత్యక్షీరసముద్రాన్ని మధించటానికి కవ్వమైన ఆదిశేషుడు లాంటి ఆరుద్ర ఉన్నాడు ఆధునిక కవిత్వాన్ని శాసించిన శ్రీశ్రీఉన్నాడు అంతెందుకు సాహితీప్రపంచంలో కవిసార్వభౌములు సి నా రె , విశ్వనాథకూడా సినిమాసాహిత్యంలో ప్రవేశంఉన్నవారే!

ఎందరో! ఎందరో! మరెందరో లెక్కకు మిక్కిలి రచయితలు తెలుగుసినిమాసాహిత్యానికి అపూర్వమైన సేవలుచేసారు

ఒక్కొక్కరిమీద ఒక్కొక రకమైన ప్రభావం, ఆ ప్రభావం సినిమాకి, తద్వారా సమాజానికి ఉపయోగపడిన తీరుతెన్నులు పరికించాలంటే, తెలుగుసినిమాకథ, కథనంలో ఎన్ని పుంతలు తొక్కింది అనేది ముందు పరిశోధించాలి

# తృతీయాధ్యాయం

# తెలుగు సినిమా సాహిత్యం - కథనం (Screen Play)

కథ అందరూ చెబుతారు ఆ కథ కొందరు బాగా చెబుతారు కొందరు వాసిగా చెబుతారు కొందరు నాసిగా చెబుతారు ఎందుకని? ఎక్కడ వస్తోంది తేడా? చెప్పే తీరులో! ఒకే కథ ఒకరు చెబుతుంటే వినబుద్ధవుతుంది ఇంకొకరు చెబుతుంటే విసుగుపుడుతుంది ఒకరు రాస్తే చదవ బుద్ధవుతుంది వేరొకరు రాస్తే పుస్తకం మూసెయ్యబుద్ధవుతుంది వీటన్నింటికి కారణం కథనం! చెప్పే తీరు, రాసేతీరు మనిషికొక తీరునుంటుంది ఆ తీరుపేరు కథనం ప్రస్తుతం ఈ కథనంలో ఉన్న అంగాలేమిటి అనేది పరిశీలించాలి

సాహిత్య కథలో కథారచయిత కథాంగాల్ని రచించుకుంటాడు కాని సినిమా కథారచయిత కథాంగాల జోలికి రాడు ఏ దృష్టి కోణంలో కథ చెప్పాలి, పాత్రలు ఎలా ప్రవర్తించాలి? వాతావరణ సృష్టి, ధ్వనులు అన్నీ చిత్రకథారచయిత చూసుకుంటాడు సంభాషణలు కూడా వేరే రచయిత రాస్తాడు సంభాషణలు చిత్రకథలో భాగం అందువల్ల సినిమాల్లో కథాంగాలన్నీ కథనం అనే భాగంలోకి వస్తాయి

స్క్రీన్‌ప్లే అంటే ఏమిటి? సినిమాకి దిక్సూచీనా? కథాంశమా? సినిమాని బొమ్మల్లో గీసి చూపించటమా? సన్నివేశకల్పనా? దృశ్యమాలికా? ఊహలకలబోతా? ఆలోచనల వడబోతా?

నిర్వచనం :

స్క్రీన్‌ప్లే అంటే నవల కాదు, నాటకం కాదు, కథ కాదు దీని అర్థం సాహిత్యంలో లభించదు సిడ్ ఫీల్డ్ అనే ప్రఖ్యాత సినీచిత్రకథా రచయిత స్క్రీన్‌ప్లేని ఇలా నిర్వచించాడు

*Film is a visual medium that dramatizes a basic story line, it deals in pictures, images bits and pieces of film A screenplay is a story told with pictures, in dialogue and description, and placed with in the context of dramatic structure* [1]

అభినయించే, సంభాషించే, అర్థం చెప్పే బొమ్మలతో చెప్పబడిన ప్రణాళికాబద్ధమైన రచనే స్క్రీన్‌ప్లే అందుకే సాహిత్యంలో కథలో కథాంగాలు భాగమైతే సినిమాలో కథనంలో కథాంగాలతోపాటు కథ కూడా ఒక భాగమైపోతుంది

సాహిత్యంలో కథాంగాలలో భాగమైన 1 కథా సంవిధానం, 2 పాత్రలు, 3 నేపథ్యం, 4 దృష్టికోణం, 5 కంఠస్వరం సినిమాసాహిత్యంలో, కథనం, అంటే స్క్రీన్‌ప్లేలో అంతర్గతమైపోతాయి

నవలలో ప్రధాన పాత్ర లేదా కథానాయకుడి ఊహలు, ఆలోచనలు, చర్యలు, జ్ఞాపకాలు, కలలు, కోరికలు, ఆశలు, అత్యాశలు, నమ్మకాలు అన్నీ ఆ పాత్ర మెదడులో ఉంటాయి అవి పాఠకుడి మెదడులోకి సరఫరా అవుతూ ఉంటాయి

అదే నాటకాలలో అయితే ఆపాత్ర సంభాషణ రూపంలో తన భావావేశాలను పైకి చెబుతూ ఉంటుంది ఎదురుగా ప్రేక్షకులున్నారని తెలుసు తెలియనట్లు నటిస్తూ ఉంటుంది అది ప్రేక్షకులు ఆస్వాదిస్తూ ఉంటారు

అదే సినిమా ప్రక్రియ దగ్గరకు వచ్చే సరికి నాలుగు గోడలు దాటి నాలుగు దిక్కుల మధ్య ఉన్న ప్రకృతి మొత్తం వస్తువుగా ఉంటుంది పాత్రలు, వాటి సంభాషణలు, వాటి హావభావాలు, నిశ్శబ్దం, శబ్దం, ఒక్కొక్క ఫ్రేములో ఒక్కొక్కటిగా బంధింపబడి, కదిలే ఆ బొమ్మలు, మాట్లాడే ఆ బొమ్మలు, అభినయించే ఆ బొమ్మలు చెప్పే కథ, స్క్రీన్‌ప్లే లేదా కథనం అనబడుతుంది

కథ :

స్క్రీన్‌ప్లేలో కథ ఎలా చెప్పబడుతుంది? ఇంతకుముందు చెప్పుకున్నట్టు సినిమాకి కథ రాయరు నవల రాయరు నాటకం రాయరు దృశ్యమాలిక రాస్తారు దీన్ని ఆంగ్లంలో సీనిక్ ఆర్డర్ అంటారు ఈ సీనిక్ ఆర్డర్ 60 దృశ్యాలు కావచ్చు, 70, 80 అలా ఊరికి మొనగాడు సినిమాకి 120 దృశ్యాలతో కూడిన దృశ్య మాలిక ఉంది

ఈ దృశ్యమాలికను కథాచర్చలప్పుడు ఏకవాక్యంలో (Single Line)లో రాసుకుంటారు చర్చలు పూర్తయ్యాక విపులంగా ఒక పేజీ, పేజీన్నర నిడివిలో రాసుకుంటారు

ఏకవాక్య దృశ్యమాలికలో ఆ దృశ్యం ప్రధాన ఉద్దేశం రాయబడుతుంది విశదీకరణలో పాత్రలు, ప్రకృతి, ఆ దృశ్యం మొత్తంలో చెప్పదలచుకున్నదేమిటి? **'మూల సంభాషణ'** ( కీడైలాగ్) తో కూడిన వాక్యం, ఆ వాక్యం చదివితే ఆ దృశ్యంలో ఏం కోరుకుంటున్నాడో తెలిసిపోయేలా రాసుకుంటారు

అయితే దృశ్యమాలిక రాసుకోబడ్డ ఈ కథ, చిత్ర కథలో ( స్క్రీన్‌ప్లేలో) మూడు ప్రధాన భాగాలుగా ఉంటుంది

1 ఆరంభం (Beginning)

2 విశ్రాంతి లేదా సంధి (Intermission)

3 ముగింపు (Climax)

పాతరోజుల్లో సినిమానిడివి మూడుగంటలకు పైగా ఉండేది ఇరవైనాలుగు **రీళ్ళు** ఇరవైఒక్క **రీళ్ళు** అలా ఉండేది ఇప్పుడు పద్నాలుగు **రీళ్ళ**లోకి వచ్చేసింది

కథలో, కావ్యంలో భాగాలు, అధ్యాయాల్లాగానే సినిమాల్లో **రీళ్ళు** ఉంటాయి

ఒకటవ **రీలు** ఆరంభం అయితే ఏడవ **రీలు** విశ్రాంతి లేదా సంధి, పద్నాల్గవ **రీలు** ఆఖరికి ముగింపు దీని మొత్తం నిడివి కాలంగా పరిగణిస్తే రెండుగంటలపది నిమిషాలనుండి ఇరవై నిమిషాలలోపు ముగుస్తుంది అంటే సుమారు నూటనలభైనిమిషాలలో సినిమా పూర్తికావాలి

ఆ నూటనలభైనిమిషాలకాలంలో, సినిమా చూడటానికి వచ్చిన ప్రేక్షకుణ్ణి కట్టి పడేసుకోవటానికి, రానివాణ్ణి ఆకర్షించుకోవటానికి, సినిమాకథారచయిత ప్రత్యేకంగా తీసుకునే జాగ్రత్తే కథావిభాగం కథని ప్రధానంగా రెండు భాగాలు చేసుకుని విశ్రాంతికి ముందు, తర్వాత లాగా పైకి కనిపిస్తున్న కథాంశాన్ని నడపటంలోనే, స్క్రీన్‌ప్లే చాతుర్యం మొత్తం ఇమిడి ఉంది

ఈ కథను చిత్రించటానికి లేదా బొమ్మలతో ఆ కథ చెప్పటానికి కథానికలాగానే, నవలలాగానే రకరకాల దృష్టికోణాలుంటాయి

**సర్వసాక్షిదృష్టి కోణం (Writer's Point of View)** ఇది రచయిత దృష్టి కోణం ఈ విధానంలో తెర మీద కనిపించే, వినిపించే నటీ నటులతో పాటు కనిపించని దర్శకుడి కంటే ఎక్కువగా రచయిత కనిపిస్తాడు

ఉదాహరణకి **అనసూయమ్మగారి అల్లుడు** చిత్రాన్ని తీసుకుంటే - ఇది అనసూయమ్మ ఇల్లు అంటూ ప్రారంభమయ్యి, ఆమె భర్త, ఆమె కుమార్తె ఆమె సోదరుడు, వగైరా పాత్రల పరిచయాన్ని చేస్తూ **ఆమెకు ఇంత గోరోజనం ఉంది, ఆమె కూతురికింత గోరోజనం ఉంది** అంటూ వ్యాఖ్యానం వినిపిస్తుంది ఆ గొంతు రచయితదిలాగా ప్రేక్షకులకు అనిపిస్తుంది!

ఈ విధానాన్ని రచయిత, దర్శకులు దాసరి నారాయణ రావు, జంధ్యాల బాగా అనుసరించారు

అయితే కథానికల్లో, నవలల్లో ఈ విధానానికి ఉన్నంత ప్రాచుర్యం సినిమాల్లో తక్కువే ముఖ్యంగా నవలల్లో అయితే *రాజశేఖర చరిత్రము, మాలపల్లి, వేయి పడగలు,* ***అల్పజీవి, అసమర్ధుని జీవయాత్ర*** లాంటి నవలలు ఈ దృష్టికోణంలో రాయబడ్డవే సినిమా విషయానికొచ్చే సరికి రచయిత జోక్యం తగ్గిపోతుంది కళ, సంగీతం, ఛాయాగ్రహణం *ఎడిటింగ్* ఇత్యాది విభాగాలు *డామినేట్* చేస్తాయి అందువల్ల సర్వసాక్షి దృష్టికోణంలో నడిచే చిత్రంలో అప్పుడపుడు ప్రేక్షకుడు ఏకాగ్రతను కోల్పోయి అసహనానికి గురయ్యే అవకాశాలుంటాయి

ఉదాహరణకి మొన్న ఈ మధ్య విడుదలయిన ***రాయలసీమ రామన్నచౌదరి*** చిత్రాన్ని తీసుకుంటే సినిమా సినిమాలాగా కాకుండా, అందులో ప్రధాన పాత్రధారి అయిన మోహన్‌బాబు స్థాపించిన ***విద్యానికేతన్*** పరిచయంతో చిత్రం ప్రారంభమవుతుంది అతను ఈ సినిమాకి రచయిత కాకపోయినా అతని నిజజీవితంలోనివ్యక్తిత్వం సినిమా ప్రధానపాత్రవ్యక్తిత్వం వేరవటంవల్ల ప్రేక్షకుల్లో రసాస్వాదన లోపించింది

అంటే నిజజీవితంలో విద్యాదానం చేస్తూ, ఎందరో విద్యార్థులకు ఉచితవిద్య అందిస్తూ ఉన్నతమైన ఆశయాలతో విద్యాసంస్థను నడుపుతున్నవ్యక్తిగాపరిచయమైన మోహన్‌బాబు, ***రాయలసీమ రామన్నచౌదరి*** పాత్రలో భూములనుఆక్రమిస్తూ, దైవాన్నిదూషిస్తూ ప్రతికథానాయకుడిగా కనిపించాడు అది ప్రేక్షకులకు మింగుడు పడలేదు

అలాగే సర్వసాక్షిదృష్టికోణంలో రచయిత చొరబాటుని పాఠకుడు అంగీకరించినట్లుగా ప్రేక్షకుడు అంగీకరించలేడు తనకు రసభంగం కలిగిస్తున్నవిధంగా భావిస్తాడు

నిజానికి ఈ విధానంలో చిన్న అసహజత్వంఉంది 'కథ' చదువుతున్నప్పుడు కాస్సేపటికి కథ చదువుతున్నామన్న జ్ఞానం మర్చిపోయి, నిజ జీవితంలో ఒక సంఘటన తెలుసుకుంటున్నాం అన్న అలౌకికమైనఆస్వాదనలో పడిపోతారు సినిమాకూడా అంతే

**సీతారామకళ్యాణం** చూస్తున్నప్పుడు కొద్ది క్షణాలు ఎన్ టి ఆర్ గుర్తుంటాడు కాస్సేపటికి రావణబ్రహ్మే కనిపిస్తూ ఉంటాడు లేకపోతే కోట్లమంది ఆరాధించే ఆ మహోన్నతమైన వ్యక్తి, ప్రతినాయకుడిగా అలాగే కనిపిస్తే తెరలు చిరిగిపోయి ఉండేవి నిర్మాత ధనం కరిగిపోయి ఉండేది

అందుచేత నవలలో, కథలలోలాగా సినిమాల్లో ఈ సర్వసాక్షిదృష్టికోణం అంతగా ప్రాచుర్యం కాలేదు

**ఉత్తమ పురుష దృష్టి కోణం (Hero or Main Character's Point of View)** పేరు వూరినా ఇది కూడా ఒక రకంగా రచయిత దృష్టి కోణమే కాకపోతే ఒక కథానాయకుడు, లేదా ప్రధాన పాత్రధారి, లేదా ప్రధాన పాత్రధారిణి, లేదా ఆ కథకుమూలమైనవ్యక్తిలాగా రచయిత ప్రారంభిస్తాడు

బారిష్టర్ పార్వతీశం, మాది మొగల్తూరు లేండి అని ప్రారంభించినట్లుగా ప్రారంభమవుతుంది

ఇది సినిమాలలో అయితే ఫ్లాష్‌బ్యాక్ (Flash Back) రూపంలో ఎక్కువగా చెప్పబడుతుంది అయితే ఇందులో ఒకప్రమాదకరమైన ఇబ్బంది ఉంది అనాదిగా ఇదిఇబ్బంది అనితెలిసీ పట్టించుకోకుండా చాలాసినిమాలు నిర్మించటం జరిగింది అందులో చాలా విజయవంత మయ్యాయి కూడా

ఉదాహరణకు కథానాయకుడు చిరంజీవి చిత్రజీవితాన్ని మార్చివేసిన ఖైదీ చిత్రం

ఇది ముందు నాటకీయ దృష్టి కోణం (Director's Point of View)లో ప్రారంభమవుతుంది

కథానాయకుడు రోడ్డు మీద నడిచి వెళుతూ ఉంటాడు ఒక సర్కిల్ ఇన్స్పెక్టర్ జీపులో వెళుతున్న అతన్ని దాటి వెళ్ళాక వెనక్కు వస్తాడు పోలీసు జీపు వెనక్కి రావటంతో కథానాయకుడి ముఖంలో చిన్న కలవరం కనిపిస్తుంది పోలీస్ ఆఫీసర్ దిగివచ్చి 'ఏ ఊరు వెళుతున్నావ్' అని ప్రశ్నిస్తాడు ఒక ఊరి పేరు చెబుతాడు పోలీస్ ఆఫీసర్ వెళ్ళిపోతూ ఉంటాడు కానీ జీపుకి ఉన్న పక్క అద్దంలోనుంచి తనకు కథానాయకుడు చెప్పిన ఊరివైపుకి కాక ఇంకోఊరి వైపుకు వెళుతున్న సంగతి గమనించి, మళ్ళీ వెనక్కి వచ్చి 'ఆ ఊరు వెళుతున్నానన్నావ్ ఈఊరు వెళ్తున్నావేంటి' అని ప్రశ్నిస్తాడు కథానాయకుడు 'మనసు మార్చుకున్నాను' అంటాడు సోదా చేస్తే అతని దగ్గర కత్తి కనిపిస్తుంది అరెస్ట్ చేసి పోలీస్ స్టేషన్‌కి తీసుకు వెళ్ళి నిజంచెప్పించటానికి థర్డ్‌డిగ్రీ మొదలు పెడితే అందరినీచితకబాది పారిపోయి ఒక లేడీడాక్టర్ ఇంట్లో ఆశ్రయంపొంది, ఆమె అనుమానపడినప్పుడు తనకథ ఆమెకు చెబుతాడు

ఇక్కణ్ణుంచి ఉత్తమపురుషదృష్టికోణం ప్రారంభమవుతుంది అయితే మధ్యలో ఆపి కథానాయకుడు ఇక్కడ వివరించాడు కాబట్టి పూర్వకథ (Flashback)లో నాటకీయ దృష్టికోణమే (Director s Point of View) ఎక్కువ కనిపిస్తుంది

ఆ కథలో తను ఒక డబ్బుగల ఆసామి కూతుర్ని ప్రేమిస్తే, ఆ ప్రేమ అంగీకరించని ఆమె తండ్రి, కథానాయకుడి తండ్రిని ఎలా చంపాడో, కథానాయకుడికి, ఆమె సోదరికి ఎలాంటి కష్టాలు పెట్టాడో చివరికి అతని సోదరిని చంపి ఆ హత్యానేరంలో ఎలా ఇరికించాడో చెప్పి తను నిర్దోషినని మళ్ళీ ఉత్తమపురుష దృష్టి కోణంలో **లేడీడాక్టర్‌కి** చెప్పుకుంటాడు అక్కణ్ణుంచి కథ మళ్ళీ నాటకీయ దృష్టికోణంలో నడుస్తుంది

ఈ ఉత్తమపురుషదృష్టికోణం గురించి తన నవలాశిల్పంలో వల్లంపాటి వెంకటసుబ్బయ్య వివరిస్తూ ఇలా అన్నాడు

> *"ఎన్ని ఇబ్బందులున్నా ఉత్తమపురుషదృష్టికోణంలో నవలా రచన చేయటం ప్రపంచ సాహిత్యంలో విస్తృతంగానే కనిపిస్తుంది లారెన్స్ స్టర్న్ ("ట్రిస్టమ్ షాండీ") వంటి 19వ శతాబ్దపు నవలా రచయితలు, జోసెఫ్ కాన్రాడ్ ("లార్డ్ జిమ్", "ది హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్"), సోమర్‌సెట్ మామ్ ("ఆఫ్ హ్యూమన్ బ్యాండేజ్", "కేక్స్ అండ్ ఏల్") వంటి 20 శతాబ్దపు నవలారచయితలు ఉత్తమపురుష దృష్టికోణాన్ని చాలా ప్రతిభావంతంగా ఉపయోగించారు గ్రాహమ్ గ్రీన్ 'ది క్వైయట్ అమెరికన్' అన్న నవల కూడా ఉత్తమపురుషదృష్టికోణంలోనే రచింపబడింది"[2]*

ఉత్తమపురుషదృష్టికోణంలో కథావస్తువు ఎవరిగురించి అయివుంటుందో అతనే కథానాయకుడు అయివుంటాడు అతనికి చిరపరిచయమైన కథ, అతని చుట్టూ పరిభ్రమించే పాత్రలమనస్తత్వాలను అతను చిత్రంలోని ఇంకోపాత్రకు తద్వారా ప్రేక్షకులకు తెలియచేస్తూ ఉంటాడు

> *కొందరు విమర్శకులు ఈ దృష్టి కోణాన్ని కేంద్రక (Central) దృష్టికోణం అంటారు*[3] అన్న వల్లంపాటి వెంకట సుబ్బయ్య ఆలోచన వాస్తవం

రచయిత కేంద్ర స్థానం నుంచి అంటే '**హీరో పాయింట్ ఆఫ్ వ్యూ** నుంచి కథను చెబుతూ ఉంటాడు ఈ ప్రక్రియ సినిమాల్లో విశేషంగా ప్రాచుర్యంలో ఉంది విజయవంతం కూడా అయ్యింది

'*పలనాటి సింహం*' చిత్రంలో కథానాయకుడు కృష్ణమనాయుడు గొలుసులతో బంధించబడి న్యాయస్థానానికి తీసుకురాబడతాడు న్యాయస్థానంలో దోషిగా నిలబెడతారు న్యాయమూర్తికి తన కథను చెబుతాడు ఆఖరి **రీలు** వరకు ముగింపు

ముందు అంటే క్లయిమాక్స్ వద్ద ఉత్తమపురుష దృష్టికోణం ఆగిపోయి, మళ్ళీ నాటకీయదృష్టికోణంలోకి మారి చిత్రం పూర్తవుతుంది

ఈ దృష్టికోణం చలనచిత్రాలలో బాగా ప్రాచుర్యం పొందటానికి, విజయవంతం కావటానికి ముఖ్యకారణం, కథ **హీరో పాయింట్ఆఫ్ వ్యూ**లో చెప్పబడటమే ప్రేక్షకుడు కథానాయకుడి పాత్రలో సంలీనం చెందుతాడు తానే అతను అనుకుంటాడు లీనమైపోయి ఆ తాదాత్మ్యంలో అతనికష్టం తనకష్టంగా, అతనిసుఖం తనసుఖంగా, అతనిఇష్టం తనఇష్టంగా భావించి ఆఖరికి అతనివిజయం తనవిజయంగా గర్వపడతాడు అదే చిత్రవిజయానికి పునాది అందుకే ఈ విధానాన్ని అనాదిగా పాటిస్తున్నారు

అయితే ఈ విధానంలో కూడా ఒక ప్రమాదం ఉంది ఉత్తమపురుష దృష్టికోణంలో నడుస్తున్న కథలో కథానాయకుడి దృష్టిలో జరిగిన సంఘటనలు కాక వేరే సన్నివేశాలు, దృశ్యాలు, సంఘటనలు కూడా చెప్పాల్సి వస్తుంది తార్కికంగా ఆలోచిస్తే, అదితప్పు! అతను చూడని, అతని ఎరుకలోజరగని సంఘటనలు అతని దృష్టికోణంలో జరిగేకథలో ఎలా చోటుచేసుకుంటాయి? ఈ ప్రశ్నకు ఆ చిత్రరచయితల దగ్గర, దర్శకుల దగ్గర సమాధానం లేదు

సినిమాలో ఒక పరిభాష ఉంది 'Out of site is out of mind' అంటే వేగంగా తిరిగిపోయే **ఫ్రేములు** చెప్పే కథలో కంటికి కనిపించనిది, మస్తిష్కంలోకిరాదు అన్నది 'కథాశివబ్రహ్మం'గా పేరు పొందిన సదాశివబ్రహ్మం ఉవాచ అంతే కాదు, 'సినిమాలో జరిగిపోయినదాన్ని ఎవడూ వెనక్కు వచ్చి ప్రశ్నించడురా అబ్బాయ్' అని సహాయదర్శకులతో అంటూ ఉండేవాడు అని ఇప్పటికీ చెప్పుకుంటారు

*ఖైదీ* చిత్రంలో కథానాయకుడు సూర్యం, *లేడీడాక్టర్*తో చెప్పే ఉత్తమపురుష దృష్టికోణంలో హాస్య సన్నివేశాలు, ప్రతి కథానాయకుల సన్నివేశాలు వస్తాయి వాటికి అతను సాక్షికాదు ఈ ప్రశ్న వేస్తే రచయితలు పరుచూరి సోదరులు, దర్శకుడు ఎ కోదండరామిరెడ్డి చెప్పిన సమాధానం ఏమిటంటే, పేరుకి ఉత్తమపురుష దృష్టికోణంలో నడుస్తున్నా, పోగా పోగా నాటకీయదృష్టికోణంలాగా కనిపిస్తుంది గనుక ప్రేక్షకులు ప్రశ్న వేయలేదు అని

ఈ సమాధానం తార్కికంగా వాస్తవం కావచ్చు గాని, 'ఉత్తమ స్క్రీన్ప్లే'గా ఇలాంటివి నిలబడవు

మొన్నీ మధ్య విడుదలై ప్రపంచవ్యాప్తంగా అఖండ విజయం సాధించిన **టైటానిక్** చిత్రంలో కూడా ఈ దృష్టికోణం సమస్య ఉంది

80 సంవత్సరాల కథానాయిక **పాయింట్ ఆఫ్ వ్యూ**లో ఉత్తమపురుషదృష్టికోణంగా ప్రారంభమయిన ఆ చిత్రంలో కథానాయిక సాక్షి గాని, ప్రత్యక్షంగా చూడని ఎన్నో సన్నివేశాలు వస్తాయి అక్కడకీ ఉత్తమపురుషదృష్టికోణం నుంచి, నాటకీయ దృష్టి కోణంలోకి మారినట్లుగా ప్రయత్నించాడు దర్శకుడు ప్రజలు ఆదరించారు విజయం అందించారు కాని ప్రపంచ సత్కారాలలో తలమానికమైన **ఆస్కార్ అవార్డు**కి ఆ చిత్రం నుంచి పదునాలుగు **నామినేషన్లు** వచ్చినా 'ఉత్తమ **స్క్రీన్‌ప్లే**' **నామినేషన్** లేదంటే, ఇలాంటి దృష్టికోణంలో జరిగే పొరపాట్లవల్ల చిత్రం విజయాన్ని పొందవచ్చు గాని, పురస్కారాలకు నోచుకోదు అని అర్థమవుతోంది అంటే ఆ ప్రక్రియ ఉత్తమత్వానికి దూరమైపోతుంది అని అర్థమవుతోంది

**ప్రథమ పురుషదృష్టికోణం (Un Important character's point of view)** కథలోని ఒక అప్రధాన పాత్ర దృష్టికోణం నుంచి చిత్రకథ చెప్పటం ప్రథమపురుషదృష్టికోణం

**కోడెనాగు** చిత్రం ఈ దృష్టికోణానికి చక్కటి ఉదాహరణ ఒక ఉపాధ్యాయుడు విద్యార్థినీ, విద్యార్థులతో కలసి ఒక చోటికి విహార యాత్రకు వస్తాడు అక్కడ రెండు సమాధుల మీద పువ్వులు పెట్టబడి ఉండటం చూసి పిల్లలు 'ఆ సమాధుల కథ ఏమిటీ' అంటే, ఒక బ్రాహ్మణుల కుర్రవాడు, క్రైస్తవుల అమ్మాయి ప్రేమలోపడి ఆ ప్రేమ పెద్దలు, గురువు అంగీకరించకపోతే వాళ్ళ జీవితాల్ని ఎలా విషాదంగా ముగించుకున్నారో తెలియజెప్తాడు

సర్వసాక్షిదృష్టికోణంలో ఉన్న రచయితజోక్యం, ఉత్తమపురుషదృష్టికోణంలో ఉన్న స్వోత్కర్ష, రెండూ కాని విధంగా మూడో వ్యక్తి ఎవరి గురించో జరిగింది జరిగినట్లు చెబుతున్నాడు కాబట్టి, నమ్మశక్యంగా ఉంటుంది ఆ విశ్వసనీయత ఈ దృష్టికోణానికి శ్రీరామ రక్ష

ఈ దృష్టికోణం నవలల్లోలాగానే సినిమాలలో కూడా తక్కువగా ఉపయోగించారు అప్రధాన పాత్రధారుల పాత్రలలో ప్రేక్షకుడు సంలీనం పొందటం అరుదు అందుకే ఈ పద్ధతి ఆదరణ పొందలేదు

**నాటకీయ దృష్టికోణం – (Director's Point of View) .** మొదటిమూడు దృష్టి కోణాలలో ఏదో ఒక రకంగా రచయిత దృష్టికోణం ఇసుమంతయినా ద్యోతకమవుతూ ఉంటుంది అలా కాకుండా ఇది ఇలా జరిగిందని తెరమీద కథ పరుగెత్తే విధానమే నాటకీయదృష్టికోణం దీన్ని సినిమా పరిభాషలో **డైరెక్టర్ పాయింట్ ఆఫ్ వ్యూ** అంటారు ప్రేక్షకుడి దృష్టి వస్తుగతంగా వెళుతూ ఉంటుంది సన్నివేశాల వెంట పరుగెడుతూ

ఉంటుంది నాటకం ఏ విధంగా వస్తుగతంగా ప్రేక్షకుల ముందు నడుస్తుందో (కొంతకాలంగా ప్రయోక్త రూపంలో ఒక అప్రధాన పాత్ర ప్రవేశం చేసి ప్రధమ పురుష దృష్టికోణంలో నడపటం కూడా ఉంది) ఆ రకంగా చలన చిత్రాల్లో చేసిన ప్రయత్నం ఇది నూటికి 90 శాతం చిత్రాలు ఈ దృష్టికోణంలోనే నడుస్తూ ఉంటాయి

ఇందులో దర్శకుడు కదలకుండాపాతేసిన కెమేరాలాంటివాడు జరుగుతున్నది జరుగుతున్నట్టు ఎవరు చెబుతున్నారో తెలియకుండా చెప్పటం అన్నమాట

*బొబ్బిలి బ్రహ్మన్న* ఉత్తమకథాచిత్రం ఈ చిత్రం నాటకీయదృష్టికోణంలో ప్రారంభమవు తుంది సినిమా ప్రారంభమే ఒక బ్రాహ్మణుడు పారిపోతూ ఉంటాడు ఒక సమూహం అతన్ని తరుముతూ ఉంటుంది ఒక ఊరిపేరు బోర్డు ఉన్న చోట వెంటపడినవాళ్ళు ఠక్కున ఆగిపోయారు పోలీసులే ఆ ఊళ్ళోకి బ్రహ్మన్న అనుమతిలేకుండా వెళ్ళలేరని తెలుస్తుంది (ఈ విషయంలో సెన్సార్ వారు ఇది బ్రిటీష్ వారి కాలంలో జరిగిన కథగా చెప్పబడుతుంది అని టైటిల్స్ ముందు ఒక కార్డు వేయించారు) అప్పుడు ప్రేక్షకులకు ఏ బ్రహ్మన్నను చూడాలన్న ఉత్సాహం కలుగుతుందో ఆ బ్రహ్మన్నపాత్ర పరిచయమై తీర్పు చెబుతుంది చిత్రం మొత్తం నాటకీయదృష్టికోణంలోనే నడుస్తుంది కథానాయిక ఆమెసోదరి చెప్పేబుర్రకథలో ప్రథమపురుషదృష్టికోణంలో బ్రహ్మన్న పూర్వీకులకథ చెప్పబడుతుంది

ఈ దృష్టికోణంలో ఏ జోక్యాలూ లేక జరుగుతున్న పరిణామాలను థియేటర్ నాలుగు గోడల మధ్య కూర్చున్న ప్రేక్షకుడు 'దృష్ట్రమ' (Optical Illusion)తో చూస్తూ ఉంటాడు అనుభూతిని అనుభవిస్తూ ఉంటాడు 'రసము సామాజిక నిష్ఠము' అన్న శాస్త్రకారుల వాక్యానికి పూర్తి న్యాయం చేస్తాడు

**ప్రేక్షకుల దృష్టికోణం (Audience's Point of View)** ఈ కోణం ఇంతవరకు ఎవరి చేత చెప్పబడలేదు కనిపించటానికి ఇది నాటకీయ దృష్టికోణంలాంటిదే చిన్న తేడా ఏవిటంటే ఆ దృష్టికోణంలో నడుస్తూ కొన్ని విషయాలు లేదా కొన్ని రహస్యాలు పాత్రకు తెలియకుండా ప్రేక్షకుడికి తెలియచేస్తాడు అక్కణ్ణుంచి ప్రేక్షకుడు తానే రచయితగా మారి జరగబోయే దాన్ని ఊహించుకుని స్పందిస్తూ ఉంటాడు

ఉదాహరణకి ఒక పాము గుమ్మంలో ఉంది ఒక హాస్య నటుడు గుమ్మం వైపుకి వస్తుంటాడు అది చూసి తెగ సంబరపడిపోతుంటాడు ప్రేక్షకుడు ఎందుకంటే ఆ పాముని చూసి ఆ హాస్య నటుడు ఎలా చిందులు వేస్తాడో తన దృష్టికోణంలో ఊహించుకుంటాడు

అదే పాము గుమ్మంలో ఉన్నప్పుడు ఒక పసిపిల్లాడు గుమ్మం వైపుకి వెళ్తుంటే ఉద్విగ్నత అనుభవిస్తూ ఉంటాడు తనకు తెలుసు అతనికి తెలియదు వెళ్ళొద్దు అని మనసు చెబుతూ ఉంటుంది, కొన్ని పర్యాయాలు ప్రేక్షకులు సినిమా హాలులో ఇలాంటి సందర్భాలలో **జాగ్రత్త పాము** లాంటి మాటలు ఉచ్చరించారనటానికి ఈ సిద్ధాంతకర్తే సాక్ష్యం

అలాగే కొన్ని విషయాలు ప్రేక్షకుడికీ, పాత్రకూ ఒకేసారి తెలియచేస్తారు దాన్ని ఇంగ్లీషులో ట్విస్ట్ అంటారు పైన చెప్పినదాన్ని ఇన్వాల్వ్‌మెంట్ అంటారు అంటే తనకు తెలియని విషయం అకస్మాత్తుగా తెలుసుకున్నప్పుడు కలిగే అనుభూతి వేరు, తనకు తెలిసిన విషయం పాత్రకు తెలియదు ఇప్పుడు తెలుసుకుంటాడు అన్నప్పుడు పొందే అనుభూతి వేరు ఈ అనుభూతినే ఆంగ్లంలో Empathy అంటారు ప్రేక్షకుడు పాత్రలో తనని తను గుర్తించుకుంటాడు ఇదే కష్టం ఒక కథానాయకుడికి వస్తే, తనే కథానాయకుడైతే, ఆ సమస్యను ఎంత హీరోచితంగా ఎదుర్కొంటాడో ఊహించుకుంటాడు

ఈ దృష్టికోణంలోఒక అపూర్వమైన లాభం ఉంది అలాగే అపూర్వమైన నష్టం ఉంది తనకు నచ్చినరీతిలో తాను ఊహించినపద్ధతిలో ఆ సమస్య పరిష్కారంఅయితే చిత్రాన్ని విజయవంతం చేస్తాడు ఒక వేళ ఊహకుభిన్నంగా జరిగితే చిత్రం బాగాలేదని తేల్చేస్తాడు

దర్శకుడు కె రాఘవేంద్రరావు చిత్రాలలో ఈ ప్రేక్షకదృష్టికోణం ఎక్కువగా కనిపిస్తూ ఉంటుంది ప్రేక్షకుడికి తెలిసిన విషయాన్ని పాత్రకు సస్పెన్స్‌లో పెడితేనే, ప్రేక్షకుడికి ఇష్టం అనేది ఆయన పద్ధతి

ఒక్కసారి ఈ దృష్టికోణాలన్నింటిని సింహావలోకనం చేసుకుంటే -

సర్వసాక్షి దృష్టికోణంలో రచయిత పూర్తి జోక్యం ఉంటుంది ఉత్తమ పురుష దృష్టికోణంలో రచయిత కథానాయకుడి వేషంలోనో, ప్రధాన పాత్రలోనో పరకాయ ప్రవేశం చేస్తాడు కథ చెప్పేది రచయితే అయినా చెబుతున్నది కథానాయకుడు అన్న భావన కలిగిస్తాడు అదే ప్రథమ పురుష దృష్టికోణంలో అప్రధాన పాత్రతో కథ చెప్పించే రచయిత తనకూ అతనికీ సంబంధం లేదన్న భ్రమ కలిగిస్తాడు కాని చాలా కష్టమైన ఈ ప్రక్రియలో ఇబ్బంది పడతాడు నాటకీయ దృష్టికోణంలో రచయిత పాత్ర అసలు లేనట్టే కనిపిస్తుంది కాని ఇక్కడ దర్శకుడిలాగా రచయిత మారు వేషం వేస్తాడు అయితే దర్శకుడు కనిపించినా ప్రమాదం ఉంది

'అడవిదొంగ' చిత్రంలో కె రాఘవేంద్రరావు అసమాన దర్శకత్వప్రతిభతో ఓ దృశ్యం తీశాడు కథానాయకుడు అతని మేనమామను, తనకు 48 గంటలు సమయం ఇస్తే, నిజం నిరూపిస్తానని సవాలు చేసే దృశ్యం, థియేటర్లో ఏం టేకింగురా అంటే ఇబ్బంది పడటం జరిగింది ఉత్కంఠతో మేనమామ అతని కోరికను అంగీకరిస్తాడా లేదా అన్న భయాందోళనలతో చిత్రం చూడవలసిన ప్రేక్షకుడు టేకింగ్ అనుభూతిలో సంభ్రమం పొందితే రసభంగం జరుగుతుంది

రచయిత సినిమామధ్యలో కనిపించటంకూడా అంతే అనురాగదేవత చిత్రంలో ఒక సన్నివేశం - జయసుధ భర్త ఎన్ టి ఆర్ ఆయన పోయారనుకుని విధవరాలిగా బతుకుతోంది శ్రీదేవి ఎన్ టి ఆర్ ని పెళ్ళి చేసుకోబోతోంది ఈ దృశ్యంమొత్తం ప్రేక్షకుడిదృష్టికోణంలో జరుగుతోంది తనకు తెలిసిన నిజం శ్రీదేవికి జయసుధకు తెలియదని, ఎన్ టి ఆర్ జయసుధ చనిపోయిందని అనుకుంటున్నాడని, ఇప్పుడు ఈ పెళ్ళి ఏ పరిస్థితిలో ఆగుతుంది అన్న ఉత్కంఠతో ఎదురుచూస్తుండగా, శ్రీదేవి జయసుధ దగ్గరకు వచ్చి *"అక్కా రేపు నువ్వే నన్ను పెళ్ళి కూతుర్ని చేయాలి"* అని అడిగే సన్నివేశం నిజానికి అద్భుతమైన సన్నివేశం అతి వాస్తవమైన సంభాషణలతో ప్రేక్షకుల హృదయాల బరువు పెంచాలి

కాని - *"నేనా! విధవరాలిని నేను నిన్ను పెళ్ళికూతురిగా అలంకరించటం ఏమిటమ్మా"* అంటే

*"మూడు, ఏడు మంచి సంఖ్యలు కాదని చెప్పిన మన పెద్దవాళ్ళే, మూడుముళ్ళబంధాన్ని ఏడడుగుల అనుబంధాన్ని ఏర్పాటు చేసారు"* అని శ్రీదేవి చెప్పిన సమాధానానికి, హాలంతా చప్పట్లతో మారుమోగిపోయింది రచయిత ఆనందపడవచ్చు కాని దర్శకుడు బాధపడతాడు

ఆ సన్నివేశంలో దర్శకుడు కోరుకున్నది హర్షధ్వానాలు కాదు, కరుణ రసానుభూతి! ఒక రకంగా రసభంగం అయినట్లే పాత్ర కనిపించవలసిన సన్నివేశంలో రచయిత కనిపించినా దర్శకుడు కనిపించినా తప్పే

కాబట్టి ఏ దృష్టికోణాన్ని ఎంచుకున్నా రచయిత గుర్తుంచుకోవలసింది ప్రేక్షకుడి రసానుభూతినే అన్న మాట వాస్తవం

కథను ఏ దృష్టికోణంలో చెప్పాలో పరిశీలించాక, ఆ కథ ఎన్నిపేజీలుండాలి? సుమారు 140 పేజీల కథనం రాసుకునే పుస్తకంలోఎక్కడ మొదలు పెట్టాలి? అని పరిశీలించాలి

నిజానికి ముందు విభాగాల్లో చెప్పుకున్నట్టుగా సినిమాలో కథారచయిత ద్వితీయ

శ్రేణి పౌరుడవుతున్నాడు కథ రాసేవరకు నిర్మాత డబ్బు బ్యాంకులోనే ఉంటుంది దర్శకుడి కాలు ఇల్లు కదలదు కెమేరాల షట్టర్లు మూసే ఉంటాయి యూనిట్ వాన్లు ఆఫీసుల ముందే ఆగి ఉంటాయి లైట్‌బాయ్‌స్ చెట్లు కిందే కూర్చుని ఉంటారు ఎడిటింగ్ రూముల్లో కత్తెర్లకు పనిలేదు మూవీలాలు నిశ్శబ్దంగా ఉంటాయి నిజానికి సినిమాలో అన్ని విభాగాలు హర్తాళ్ రోజు వీధిలా నిర్మానుష్యంగా ఉంటాయి తన కథకు అంత విలువ ఉన్నది అని తెలిసీ ఏడు దశాబ్దాలుగా ఏనాడూ కథారచయిత సినిమా పరిశ్రమను శాసించలేదు ఎప్పుడో వేసవిలో వర్షం పడ్డట్టు వేళ్ళ మీద లెక్కించగల సందర్భాలలో తప్ప, ఈ బాధ తెలుగు సినిమారచయితలకే కాదు, ప్రపంచవ్యాప్తంగా, అన్ని భాషల్లో ఉన్న సినిమారచయితలకు ఉంది

ఇదే విషయాన్ని గురించి విచారం తెలియచేస్తూ - మార్గరేట్ మెహరింగ్ తన 'The Screenplay'లో ఇలా అంటున్నారు -

> "*Why, then, when every thing depends on a good story, do screen writers remain in such a powerless position? A question for which there seems to be no valid answer! A problem for which there is a solution*"[4]

ప్రపంచ వ్యాప్తంగా ఇప్పటికి కొన్ని వేల సినిమాలు తీసారు అయినా ప్రతి కథకుడికీ తన సినిమాకథను ఏ వాక్యంతో ప్రారంభించాలి అని, దర్శకుడికి ఏ షాట్‌తో ప్రారంభించాలి అన్నది ఇప్పటికీ అంతుచిక్కని ప్రశ్నే సూర్యోదయంతో ప్రారంభం కావచ్చు ఖైదీలాగా వంతెన మధ్యనుంచి నడుస్తున్న కథానాయకుడిలాగా ప్రారంభం కావచ్చు, సర్పయాగంలోలా, రైల్వేస్టేషన్లో బండి ఆగటంతో ప్రారంభం కావచ్చు

కొన్ని వేల రకాలుగా ప్రారంభం కావచ్చు స్క్రీన్‌ప్లే రచన అనేది ఒక శాస్త్రీయమైన పద్ధతి రోజురోజుకీ, క్షణక్షణానికీ మారుతూ ఉంటుంది నూతనవిధానాలను సంతరించుకుంటూ ఉంటుంది తన ఊహకు నాటకీయతను సంతరించి పెట్టాలన్న తాపత్రయంతో రచయిత కొత్త కొత్త పథకాలను ఆలోచిస్తూ ఉంటాడు

సినిమాచూసి బయటకువచ్చే ప్రేక్షకుడు అనేకపర్యాయాలు **స్టోరీ పిక్చర్ కాదు, కథ లేదు, కథేంటో అర్థం కాలేదు** అంటూ విమర్శిస్తూ వెళ్ళటం ఎన్నో సార్లు రచయితల అనుభవంలోకి వచ్చింది

**అడవిరాముడు** చిత్రం విజయం సాధించినప్పుడు కూడా చాలామంది ప్రేక్షకులు ఈ సినిమా ఎందుకాడుతుందో తెలియటం లేదన్నారు అదే సినిమా గొప్పతనం 140 నిమిషాల పాటు నడిచే నిడివిలో ఆకట్టుకోవాలి కట్టి పడేయాలి

300 సినిమాలలో కథానాయకుడిగా నటించిన ఎన్ టి ఆర్ ఒకసారి "సినిమా విజయానికి కథ కారణం, దాని సక్సెస్ రేంజ్‌కి మేం (హీరోలు) కారణం" అన్నాడు అక్షర సత్యం కథ బాగోకపోతే సినిమా బాగోదు ఆ కథతో, ఒక్కొక్క కథానాయకుడు ఒక్కో స్థాయి విజయం సాధిస్తాడు

కథ ఎంత ముఖ్యమో, ఆ కథ ఎంత బాగా చెప్పబడి ఉంది అనేది అంత ముఖ్యం సంవత్సరం పాటు ఆడిన ఖైదీ ఒక్క ముక్కలో చెప్పాలంటే -

సూర్యం అనే పేదకుర్రాడు, మధులత అనే ఒకధనికురాల్ని ప్రేమిస్తే, ఆమె తండ్రి అంగీకరించక సూర్యం తండ్రిని చంపి, అక్కను చంపి హత్యానేరంలో ఇరికిస్తే, జైలు నుంచి పారిపోయి వచ్చి ప్రతినాయకులనందరినీ చంపి, 'పగ తీర్చుకోవటం కోసం ఈ జన్మ ఎత్తాను, ప్రేమకోసం మరోజన్మ ఎత్తుతాను'అని జైలుకి వెళ్ళిపోతాడు

ఈ కథ అంత విజయం సాధించిందా అనిపిస్తుంది ఈ కథ చిరంజీవి, కోదండరామిరెడ్డి, పరుచూరి సోదరులు ఇంతమంది జీవితాన్ని మార్చిందా అనిపిస్తుంది కాని సినిమా రచనలో కథంతా విన్నాక ఒక్కముక్కలో 'మన కథేంటి?' అని దర్శకుడు గాని నిర్మాతగాని అడగటం అలవాటు

లారీడ్రైవర్ చిత్రం తీసుకుంటే, ఒక ఐ ఎ ఎస్ ఆఫీసర్, ఒక ఐ పి ఎస్ ఆఫీసర్ విడిపోతే చదువురాని ఒక లారీ డ్రైవర్ వాళ్ళిద్దర్నీ కలుపుతాడు

కర్తవ్యం తీసుకుంటే, తన మాష్టారి కూతురు మానభంగానికి గురయితే న్యాయం కోసం పోరాడి ఆ కుర్రాడి చేత ఆ పిల్ల మెడలో తాళి కట్టించిన ఐ పి ఎస్ ఆఫీసర్ కథ

ప్రతిధ్వని పరిశీలిస్తే, డ్యూటీ కోసం భర్తను లారీతో కొట్టడమే కాకుండా, భర్త శవంతో పాటు కన్నీళ్ళు పెట్టకుండా ఊరేగింపులో పాల్గొని నిరాశపడకుండా నేరస్తులను న్యాయస్థానానికి తీసుకువెళ్ళిన సర్కిల్ ఇన్స్పెక్టర్ కథ

సమరసింహారెడ్డి తీసుకుంటే, యాదృచ్ఛికంగా తనసేవకుడిచావుకి కారణమై, అతని చెల్లెళ్ళకోసం ఆస్తిని, అంతస్తును వదిలేసి వాళ్ళ జీవితాలను సరిదిద్దిన ఒక ఫ్యాక్షన్‌లీడర్ కథ

ఇలా రాసుకుంటూ పోతే ప్రతి సినిమాకి నాలుగు వాక్యాలలో కథ రాసుకునే పద్ధతి తప్పదు సింగిల్ లైన్ స్టోరీ అంటే నాలుగు ముక్కల్లో రాసుకునే కథ పద్నాలుగు రీళ్ళ కథకు మార్గదర్శిగా ఉంటుంది దీన్ని గురించి చెబుతూ సిడ్‌ఫీల్డ్ -

*"What is the subject of your Screenplay? Reduce your idea into a character and an action in a few sentences, not more*

*than three or four Remember, this has nothing to do with your screenplay or the accuracy of your story, it is simply a guide for you to follow during the process of writing it"*[5]

నాలుగు వాక్యాలకథ నలభైవాక్యాలవుతుంది అంటే ఒక్కముక్కలో చెప్పుకున్న కథ వందముక్కలవుతుంది ఆ విధానం ఎలా ఉంటుందో పరిశీలించాలి

నాలుగు వాక్యాలలో రాసుకున్న ఖైదీ కథనే నాలుగు పేజీల్లో రాసుకుంటే ఇలా ఉంటుంది

సూర్యం అని ఒక పేద విద్యార్థి ఉన్నాడు అతను మంచి కళాకారుడు కూడా చదువంటే చాలా ఇష్టం తనను అభిమానించే మధులత అనే డబ్బు గల లమ్మాయి అతన్ని ఎంత రెచ్చగొట్టినా, చదువు నుంచి సరదాల వైపుకి దృష్టి మరల్చాలని చూసినా నిగ్రహంతో, తనకు చదువే ముఖ్యం అనుకుంటాడు

కళాశాల వార్షికోత్సవంలో, వారి వారి ప్రవృత్తుల మేరకే, విశ్వామిత్ర రూపకంలో, సూర్యం విశ్వామిత్రుడి వేషం ధరిస్తాడు మధులత మేనక వేషం వేసి అతన్ని రెచ్చగొడుతుంది వార్షికోత్సవ సంబరాలు పూర్తయ్యాక, మధులత బలవంతంగా తన కారులో, స్వగ్రామానికి తీసుకువెళుతుంది

గ్రామంలోకి వస్తుండగా ఆ ఊరి మునసబు వాళ్ళిద్దర్నీ చూసి మధులత తండ్రికి చెబుతాడు మధులత తండ్రి సూర్యం తండ్రిని పిలిపించి ఈ విషయం చెప్పి 'నీ కొడుకుతో నా కూతుర్ని మరిచిపొమ్మని చెప్ప' మంటాడు అతని తండ్రి అంగీకరించడు, దాంతో అనార్కలీని సమాధిచేసి చంపిన సలీం ప్రేమకథ చెప్తు అంటూ భయపెడతాడు అతన్ని చంపేసి ఆత్మహత్యగా చిత్రిస్తాడు

తండ్రి శవాన్ని తీసుకువెళుతున్న సూర్యాన్ని ఆపి, మీ నాన్న నాకు బాకీ ఉన్నాడు, ఆ బాకీ మాట ఏమిటో తేల్చేవరకూ, శవాన్ని తీసుకువెళ్ళటానికి వీల్లేదని చెబుతాడు తన పొలం మొత్తం మధులత తండ్రికే వదిలేస్తాడు సూర్యం సానుభూతిని నటించి ఆ పొలాన్ని అతనికే కౌలుకి ఇస్తాడు మధులత తండ్రి

సూర్యం అక్కభర్త కాన్సర్‌తో చనిపోయి ఉంటాడు అతని వైద్యంకోసం చేసిన అప్పుకిందే పొలం పోగొట్టుకుని ఉంటారు పొలం సాగుచేసుకోటానికి కూడా డబ్బు లేదు అప్పుడు మధులత వచ్చి తన నగలు ఇస్తుంది సూర్యం అంగీకరించడు అక్కడ పెట్టి వెళుతూ ఉంటుంది 'నువ్వు వదిలి వెళుతోంది ఈ నగల్ని కాదు, బంగారంలాంటి మన స్నేహాన్ని' అనగానే తీసుకు వెళుతుంది విధవరాలయిన అక్క మంగళసూత్రం ఇస్తుంది అరటితోట వేస్తాడు

అరటితోట గెలల మీదున్నప్పుడు మధులత తండ్రి ఆ గెలలు నరికించి కరణంతో అముకానికి పట్నం పంపిస్తాడు ఈ సంగతి చూసి ఉద్రేకపడిన సూర్యంతో మధులత 'నువ్వు గనక ఈ పౌరుషం మా నాన్న మీద చూపించవచ్చు గదా' అంటే 'నేను జైలుపాలయితే ఒంటరిగా ఉన్న నువ్వూ అక్క [illegible]' అంటాడు అది అక్క వింటుంది గెలలు పట్నంచేరిన సంగతి మధులత చెబుతుంది సూర్యం పట్నంవెళతాడు

ఈ సమయంలో తన అడ్డు తొలిగితేగాని సూర్యం సుఖపడడు అని నమ్మిన సూర్యం అక్క ఎప్పటినుంచో తన మీద మనసుపడుతున్న మునసబు దగ్గరకు వెళ్ళి తనను పెళ్ళిచేసుకోమని అంటుంది మునసబు అంగీకరించి వెంటనే అదే సమయంలో పెళ్ళి చేసుకుంటాడు తన బదులు ఫారెస్టాఫీసర్ని శోభనం గదిలోకి పంపుతాడు అతను తనమెడలో తాళికట్టింది, ఇలా ఆఫీసర్లదగ్గర ఫామిలీట్రైపు వెశ్యలా చేయటానికని తెలుసుకున్న సూర్యంఅక్క తెల్లబోతుంది

పట్నంలో తనఅక్క పెళ్ళిచేసుకున్నసంగతి తెలిసి ఆందోళనగావస్తాడు సూర్యం మానభంగానికి గురి కావటంకంటే చనిపోవటమే మంచిదిఅనిభావిస్తుంది అతనిఅక్క సరిగ్గా సూర్యం వచ్చేసమయానికి మేడమీద నుంచి అతని చేతుల్లో పడి ప్రాణాలువదులుతూ అతనికి నిజంచెబుతుంది మధులత తండ్రి ఆ నేరాన్ని సూర్యం మీదే వేసి, బండికికట్టేసి ఊరిజనంముందు ఒప్పించాలని చూస్తాడు సూర్యం తప్పించుకుని పారిపోతాడు ఇది విశ్రాంతిభాగం

రెండవభాగంలో ఈకథవిన్న **లేడీడాక్టర్** అతన్ని రక్షించటానికి ప్రయత్నిస్తుంది పోలీసులు ఆమెను ప్రశ్నిస్తారు **పోలీసాఫీసర్**మేనకోడలు పోలీసుల్ని ఫూల్స్ని చేస్తుంది ఆతర్వాత **లేడీడాక్టర్కి, పోలీసాఫీసర్**కి మధ్య **పోలీస్స్టేషన్లో** వాగ్వివాదం జరుగుతుంది ఆ సమయంలో సూర్యంగ్రామస్తులు, సూర్యం జీవితంతో ఆడుకున్న త్రిమూర్తులు అక్కడకివచ్చి ఆమెను చూస్తారు అందులో మునసబు ఆమెకు బావగారే ఆమె అక్కచావుకి కారకుడు కూడా ఆమెను వాళ్ళుబంధిస్తారు పారిపోయిన సూర్యం ఎక్కడఉన్నాడో చెప్పమని చిత్రహింసలు పెడతారు ఆఖరికి మానంకాపాడుకోటానికి ఆమె సూర్యాన్ని రప్పించటానికి ప్రయత్నిస్తుంది ఒక పాడుబడిన భవనంలోకి వస్తాడు సూర్యం వాళ్ళ అసలుఉద్దేశాన్ని గమనించిన **లేడీడాక్టర్** సూర్యం పారిపోఅని హెచ్చరిస్తూ ఉంటుంది సూర్యం తనకు అడ్డంగాఉన్న పలుగుతీసి పక్కనపెట్టి లోపలకు వెళతాడు కానీ అతని వేలిముద్రలుపడిన పలుగుతో **లేడీడాక్టరు**ను చంపేస్తారు చనిపోతూ పోలీసులదగ్గరకు తనను తీసుకువెళితే మరణవాంగ్మూలం చెబుతానంటుంది పోలీసులు వచ్చేలోపే చనిపోతుంది మళ్ళీ పోలీసులు అరెస్ట్ చేస్తారు ఇద్దరు బిచ్చగాళ్ళు దీనికి సాక్ష్యం వాళ్ళ సాక్ష్యాన్ని ఆధారం చేసుకొని సూర్యానికి ఉరిశిక్ష విధిస్తారు సూర్యం తప్పించుకొనిపారిపోతాడు మధులతకు పెళ్ళిచేయాలని చూస్తే మారిపోయిన బిచ్చగాళ్ళే ఆమెనుతప్పిస్తారు అతన్ని వెతుక్కుంటూ ఆమె అడవికి వెళుతుంది అడవిలో అనేకకష్టాలుపడ్డాక సూర్యాన్ని కలవగలుగుతుంది ఒక రాత్రిపూట సూర్యం నలుడు దమయంతిని వదిలి వెళ్ళినట్లుగా ఆమెను వదలివెళ్ళిపోతాడు పోలీసులు మధులతను ఇంటికి చేరుస్తారు సూర్యం తనశత్రువులను ఒక్కొక్కళ్ళను చంపుతూఉంటాడు చివరకు మధులత తండ్రిని చంపటానికి గ్రామానికి వస్తాడు సైన్యంలాగా పోలీసులు కాపలాకాస్తూఉంటారు సూర్యాన్ని లొంగిపొమ్మని హెచ్చరిస్తూ ఉంటారు అయినా పట్టించుకోకుండా మధులతచెప్తున్నా వినిపించుకోకుండా అతన్నిచంపేస్తాడు పోలీసులకు లొంగిపోతాడు సంకెళ్ళతో వెళుతున్న సూర్యం దగ్గరకు మధులత కన్నీటితో వస్తే 'పగ తీర్చుకోవటంకోసం ఈజన్మఎత్తాను, ప్రేమకోసం మరో జన్మ ఎత్తుతాను' అని చెప్పి వెళ్ళిపోతాడు

ఇంతకుముందు నాలుగువాక్యాలలో రాసుకున్న ఈకధ నంబైవాక్యాలయ్యేసరికి ఎలా రూపుదిద్దుకుందో చూసారుగదా నాలుగుముక్కల్లో చెప్పుకున్నప్పుడు లేనిఉత్కంఠ ఇప్పుడు వచ్చింది నాటకీయత వచ్చింది ముందేంజరుగుతుందిలన్న ఉత్సుకతతో పాటు కథలో కదలిక స్పష్టంగా కనిపిస్తోంది కధాంశం పెరుగుతోంది అంతేగాక సుమారు 140నిమిషాలపాటు ఉండే కథ నాలుగుపేజీల్లో ఎదురుగా ఉంటే సింహావలోకనం చేసుకోవటానికి, స్పష్టతకి అవకాశంఇస్తుంది అన్నింటికంటే ముఖ్యం నీకథఏమిటో నీకుతెలుస్తుంది

నాలుగుపేజీల్లో కధరాయటంలో రచయిత చాలా మధనపడతాడు 140 పేజీల కథనాన్ని నాలుగుపేజీలకు కుదించటంఅంటే బుర్రతోసర్కస్ చేసినట్లే సుమారు ముప్పైనలభై పాత్రల్లో నాలుగయిదుపాత్రలను మాత్రం తీసుకుని, ఆదినుంచి అంతందాకా సొంతం అనేకపర్యాయాలు దర్శించి ఈనాలుగుపేజీలలో నేనుఅనుకున్న ప్రధానోద్దేశం మొత్తంవచ్చేస్తోంది అన్నభావనకు రావటానికి, ఆ రచయిత ఎన్ని నిద్రలేనిరాత్రులు గడుపుతాడో అనుభవైకవేద్యం

ముందు చెప్పుకున్న సినిమాకథ కేవలం రచయిత ఇష్టప్రకారమే రాయకూడదు అనేకుల ఇష్టాలని ఇమడ్చాలి అంటే రచయిత తన ఇష్టప్రకారం రాసేది ఒకపద్ధతి, దర్శక, నిర్మాతల, లేదా నాయికా, నాయకుల ఇష్టప్రకారం రాసేది ఒకపద్ధతి

తను ఇష్టపడిరాసుకున్న పద్ధతిలో రూఢీగాఉంటాడు అయిష్టంగా రాసే పద్ధతిలో నజ్జర్ధకంలో ఉంటాడు ఆంగ్లంలో దీనినే Positive, Negative అంటారు

ఉదాహరణకి '*కొండవీటి దొంగ*' చిత్రంఉంది ఆ చిత్రకథలో మొదట ఒక కథానాయిక ఉంది ఒక కథానాయికకు కథ చెప్పటానికి వెళ్ళినప్పుడు కథంతావిన్నాక ఆమె కొన్నిషరతులు పెట్టింది

1 చిత్ర మకుటం *కొండవీటి రాణి- కొండవీటి దొంగ* అనిఉండాలి

2 కథానాయకుడు తనని ప్రేమించాలితప్ప తనుకథానాయకుడి వెనకపడను అని

ఆ షరతులు నిర్మాత అంగీకరించకపోవటంతో సినిమానిర్మాణం రెండుసంవత్సరాలు వెనక్కివెళ్ళిపోయింది ఆ సమయానికి వాస్తవకథారూపాలయిన ***శివ, అంకుశం*** విడుదల కావటం ప్రజలు ఆచిత్రాలకు బ్రహ్మరథం పట్టటం జరిగింది ఈసమయంలో మళ్ళీ *కొండవీటి దొంగ* నిర్మాణం మొదలయ్యింది ఒక హీరోయిన్

పాత్ర, ఇద్దరు కథానాయికలు, వాళ్ళ తల్లిగా విభాగింపబడింది అవమాయక గిరిజనులమధ్య పెరగవలసిన కథానాయకుడు ఐ ఎ ఎస్. చదివే పాత్రగా మారవలసివచ్చింది అంటే కాలానుగుణంగా కథమారింది చిత్రంమాత్రం విజయవంతం అయ్యింది రచయిత ఇష్టాఇష్టాలే కథనంలో ప్రధానంకాదు అనటానికి ఈహేతువుని చూపవలసి వచ్చింది అందుకే సిడ్‌ఫీల్డ్ ఇలాఅంటాడు

"*The hardest thing about writing is knowing what to write*"[6]

ఏమిరాయాలో రచయితకు తెలియాలి ప్రధానంగా ముగింపేమిటి? ప్రారంభం ఏమిటి? ఈరెండూ ముందు జీర్ణించుకోగలిగితే కథ నాలుగుపేజీల్లో రాసుకోటానికి ఏఅభ్యంతరం లేదు

ఇతివృత్తం లేనిదే కథావస్తువు లేదు కథావస్తువు లేనిదే ఇతివృత్తం అనాసక్తికరమైన సన్నివేశాల గుంపులాగాఉంటుంది

కర్తవ్యం తెలుగుచలనచిత్రచరిత్రలో దశాబ్దాలపాటు గుర్తుంచుకోదగినచిత్రం అయితే ఈ చిత్రం కథరాసుకునేటప్పుడు, ఒక స్త్రీ పోలీసాఫీసర్ వృత్తిపరమైన, సాహసోపేతమైన కథ రాయాలన్నది ఉద్దేశం మాసాలతరబడి అనేకసంఘటనలను ఆలోచించి, గుదిగుచ్చినట్లుగాచేసి ఎన్నిపర్యాయాలు చెప్పుకున్నా ఏదోఒక అసంతృప్తి కథలో ముందు ఏంజరుగుతుందన్న ఉత్కంఠ కనిపించటంలేదు కథావస్తువులేకుండా ఇతివృత్తాన్ని అల్లుతున్నామని తెలుసుకోటానికి చాలారోజులు పట్టింది

వైజయంతి ఒక **పోలీస్ఆఫీసర్** కొత్తగా ఒకనగరానికి వచ్చింది ఆ ఊళ్లో ముద్దు కృష్ణయ్య అనే ప్రతికథానాయకుడు ఉన్నాడు అతన్ని ఆమె ఎలాఎదుర్కొంటుంది, ఈ విషయంలో పోలీసు ఉద్యోగం పోగొట్టుకుని వీధుల్లో విమర్శిస్తూ తిరుగుతున్న కథానాయకుడు ఆమెకు ఎలా సహాయ పడతాడు? ఈకోణంనుంచే కథను చాలారోజులు ఆలోచించటం జరిగింది అనుకోటానికి బాగానేఉంది వింటుంటే తర్వాతఏమిటి అన్న ఉత్కంఠ కలగటంలేదు అప్పుడు కొత్తగా ఆ కథలోకి వచ్చినపాత్రలు మాష్టారు, ఆయన కూతురు

మాష్టారికూతుర్ని ప్రతికథానాయకుడికుమారుడు మానభంగం చేస్తాడు ఆ పిల్లకు న్యాయం చెయ్యాలని వైజయంతి ప్రయత్నిస్తుంది న్యాయం చెయ్యగలదా? లేదా? అన్న ఉత్కంఠ విశ్రాంతి సమయానికి కేసు ఓడిపోవటంతో ఇప్పుడేం చేస్తుంది అన్న కుతూహలం, మానభంగం చేసినవాడు ఎంత శిక్షార్హుడో, మానభంగం చేయటానికి ప్రోత్సహించిన అతని స్నేహితులు కూడా అంతే నేరస్తులు అని కొత్త కేసు పెట్టటం,

ఆ ప్రయత్నంలో భయపడిన ప్రతి కథానాయకుడు మాష్టారి కూతురుతో తనకుమారుడి పెళ్ళినిశ్చయించటం, ఊరేగింపులో యాదృచ్ఛికంగా, ప్రమాదవశాత్తు మరణించినట్లుగా హత్య చెయ్యటానికి ప్రయత్నించటం, వైజయంతి కాపాడటం, ప్రజానాయకుడిగా అక్రమంగా ఎన్నిక కావాలన్న ప్రతికథానాయకుడి కుమారుడ్ని అడ్డుకోవటం, పతాక సన్నివేశంలో ఏ మిత్రులు చప్పట్లు కొడుతూ, రెచ్చగొడుతూ మానభంగం చేయించారో అదే మిత్రులు చప్పట్లు కొడుతూ, బాధ్యత గుర్తుచేస్తూ, తాళికట్టించటంతో చిత్రకథ ముగింపుకి వస్తుంది ఈ సన్నివేశాలన్నింటిలోనూ ప్రధాన పాత్ర ఉద్దేశం ఏమిటి? ఆ పిల్లకు న్యాయం చేయటం అది చేయగలుగుతుందా? ఓడిపోతుందా అన్న ఉత్కంఠ ఉండబట్టి, ఆ చిత్రం అంత జనరంజకం కావటమే కాక, ఉత్తమ కథాచిత్రంగా రాష్ట్ర ప్రభుత్వ **నందీఅవార్డు** కూడా పరుచూరి సోదరులకు లభించింది ఈ విషయాన్ని ధ్రువపరుస్తూ మార్గరెట్ మెహరింగ్ తన **'ది స్క్రీన్‌ప్లే'లో** -

> *"A Theme without a plot is not a story A plot without a theme is an empty series of events that may distract but not involve the reader / viewer"* [7]

అన్న మాటలు అక్షరాలానిజాలు అన్నది వాస్తవం అని నిరూపించబడింది

కథావస్తువులోకి ఇతివృత్తం మంచుగడ్డలాగా కలసిపోవాలి మొదట కథావస్తువు అనే నీళ్ళల్లో ఇతివృత్తం అనే మంచుముక్క వేరుగా కనిపిస్తుంది కానీ క్రమేపీ మంచుముక్క కరిగి నీళ్ళల్లో కలసిపోతుంది అలాగే ఇతివృత్తం కూడా కథావస్తువు నుంచి వేరు కాకుండా కలసిపోయి ఏకోన్ముఖంగా సాగాలి, ఒకటే అని అనిపించాలి

కథావస్తువులో ఇతివృత్తం కలిసిపోకపోతే, సంఘటనలు బలీయమై కథావస్తువుని డామినేట్ చేసి ప్రధానఉద్దేశానికి ప్రతిబంధకంగా తయారవుతాయి అందుకే నాలుగు వాక్యాల్లో రాసుకున్న కథావస్తువు నలభైవాక్యాలయినా, నూటనలభై పేజీలయినా ఎన్నిసంఘటనల సమాహారమైనా ముఖ్యోద్దేశానికి బాధకంగా తయారు కాకూడదు

## కథ–మలుపు (Plot Point) :

ఏ దృష్టికోణంలో కథ చెప్పినా కుతూహలంగా చెప్పబడాలి అన్నదే ముఖ్య సూత్రం కథను చెప్పేటప్పుడు కొన్ని మలుపులు అనుకోవాలి ఈ మలుపునే ఆంగ్లంలో Plot Point అంటారు కథ రాసే ముందే మస్తిష్కంలో ఈ కథకు ఒక భూమికను (Paradigam) అనుకోవాలి ఈ భూమిక రచన పూర్తయ్యాకే కథారచనకు ఉపక్రమించాలి ఉదాహరణకు కర్తవ్యం కథకు భూమికను రచించుకుంటే ఎలా ఉంటుంది?

భూమిక

| Act - I | Act - II | Act - III |
|---|---|---|
| ప్రారంభం | మధ్యమం | ముగింపు |

**యాక్ట్ - 1** అంటే ప్రారంభం చాలాకొద్ది సినిమాలలో మాత్రమే బొబ్బిలి బ్రహ్మన్నలాగా, ఖైదీలాగా ఉత్కంఠాభరితంగా చిత్రాన్ని ప్రారంభించటం జరుగుతుంది కథలో మలుపు వచ్చేవరకు, కథానాయకుడు, అతని తల్లి, అతని తండ్రి, అతని స్నేహితులు, ఇంకా అతనితో సంబంధం ఉన్న ముఖ్యపాత్రలను పరిచయం చేస్తారు కథానాయిక ఆమె తండ్రి, ఆమె తల్లి, స్నేహితురాళ్ళు, కుటుంబసభ్యులు అందరినీ పరిచయం చేస్తారు కథనాయకుడు కథకు ఎంతముఖ్యమో, ప్రతికథానాయకుడు కూడా అంతే ముఖ్యం కనుక అతని కుటుంబం, అతని నేపథ్యం కూడా పరిచయం చెయ్యాలి ప్రేమకథాచిత్రాలయితే ప్రతికథానాయకులకు బదులు కుటుంబ నేపథ్యాలు, అంటే ఆస్తి, కులం, మతం, అంతస్తు సామాన్యంగా ప్రేమకు అడ్డుపడుతూ ఉంటాయి గనుక ఆ విషయాలన్నీ విశ్లేషించటం జరుగుతుంది సినిమాకి హాస్యం కూడా ప్రధానం గనుక హాస్యపాత్రలను కూడా పరిచయం చెయ్యటం జరుగుతుంది ఈ పరిచయాల్ని పూర్తయ్యేసరికి సుమారు 30 నిమిషాల కాలం అయిపోతుంది సినిమాలో మూడో రీలు పూర్తవుతూ ఉంటుంది ఈ సమయంలోనే కథలో మొదటిమలుపు రావాలి దానికి సరిపోయే పునాది 30వ నిమిషంలో వేసుకుని, 35వ నిమిషంలో మొదటి మలుపు సృష్టించటం జరుగుతుంది

కథ మొదటి మలుపు తిరిగాక, ప్రేక్షకుడి ఊహ, కథలో రెండవ మలుపు తిరిగేలోపు పరిపరివిధాల పోతూఉంటుంది ప్రేమికులయితే వీళ్ళిద్దరి ప్రేమకు ఎవరు అడ్డుపడతారు అన్నట్లు, లాయరో, పోలీసాఫీసరో కథానాయకుడయితే ప్రతికథానాయకుణ్ణి లొంగదియ్యగలుగుతాడో, లేదో అన్న భావంలో ఉంచుతూ, ఊహించని రెండవ మలుపుతో సందిగ్ధతలో పడెయ్యాలి అలా మధ్యమం లేదా విశ్రాంతిభాగానికి వచ్చేసరికి, ఇప్పుడెలా? దాన్ని ప్రధానపాత్ర ఎలా అధిగమిస్తుంది? అన్న కొండంతప్రశ్న ఉండాలి? ఈ సందిగ్ధత ఇలాగే నూరవనిమిషం వరకు కొనసాగాలి విశ్రాంతి దగ్గరనుంచి పతాకస్థాయి చేరేలోపు మూడోభాగం మొత్తం విషమంగా, ఉత్కంఠతో గెలుపు ఓటముల మధ్య తులాదండంలా ఊగుతూ ఉండాలి పతాకస్థాయికి చేరటానికి ముందు విషమస్థితి తీసుకువెళ్ళాలి ఇదే **యాంటీక్లయిమాక్స్** మాస్టారికూతుర్ని ఊరేగింపులో చంపేస్తున్నారని వైజయంతికి తెలియటంలా ఇలా కథానాయికో, కథానాయకుడో ఇక ఆశయాన్ని సాధించలేరు అని నూటికినూరుశాతం నమ్మకం కలిగించటమే విషమస్థితి ఆ తర్వాత ఫలప్రాప్తిని సాధించాలి

| మొదటి మలుపు | రెండవ మలుపు | ఫలప్రాప్తి |
|---|---|---|
| మాష్టారి కూతురి మానభంగం | వైజయంతి న్యాయస్థానంలో ఓడిపోవటం | వైజయంతి మాష్టారి కూతురి పెళ్ళి జరిపించటం |

కథావస్తువు మాష్టారి కూతురి మానభంగం - దానికి వైజయంతి చేసిన పరిష్కారం వైజయంతి, ముద్దుక్రిష్ణయ్యల మధ్య ప్రత్యక్ష పోరాటానికి దారి తీసిన మలుపు ఇదే ఇక్కణ్ణించి తన కొడుకుని కాపాడుకోవాలన్న ముద్దు క్రిష్ణయ్య తాపత్రయం, ఎలాగయినా నిందితుడికి శిక్ష పడింది అన్న వైజయంతి కృతనిశ్చయం, కథలో రెండోమలుపు వచ్చేవరకూ అలాగే కొనసాగింది వైజయంతి ముద్దుక్రిష్ణయ్య కొడుక్కి శిక్షవేయించలేక న్యాయస్థానంలో ఓడిపోయింది ఇక ఎలా న్యాయం చెయ్యగలదన్న ఈ సందిగ్ధావస్థ రెండో మలుపు అయ్యింది అయితే వైజయంతి ఆశయం ఏమిటి? మాష్టారి కూతుర్ని మానభంగం చేసిన ప్రతికథానాయకుడి కుమారుడికి శిక్షపడేలా చూడటం కానీ ఆ విషయంలో ఓడిపోయింది అయితే ఇదే కేసు మళ్ళీ న్యాయస్థానంలో పెట్టలేదు గనుక ఎవరయితే ముద్దుక్రిష్ణయ్య కొడుకుని-మాష్టారి కూతురి మానభంగానికి ప్రేరేపించారో వాళ్ళు అసలైన నిందితులు అని మరో కేసు పెట్టింది సాక్షులు, ముద్దాయిలయ్యేసరికి ముద్దుక్రిష్ణయ్య తనకొడుక్కి మాష్టారి కూతురితో పెళ్ళి చేస్తానని ఒప్పుకొని కథని మళ్ళీ మలుపు తిప్పాడు నిజానికి అతని ఉద్దేశం ఆమెను పెళ్ళి ఊరేగింపులో హతమార్చటం కాపాడి చివరికి వైజయంతి పెళ్ళి చేయించింది నిజానికి వైజయంతి అతనికి, ఆ అమ్మాయికి పెళ్ళి చెయ్యాలని అనుకోలేదు అసలు ఆమెకు ఆ ఉద్దేశం ఎప్పుడూలేదు కానీ ఆపరిస్థితులు ఆమెకు తప్పనిసరిఅయ్యాయి అందుకే చిత్రకథ సజీవమయ్యింది అంటారు అది అనేకమార్పులు పొందుతుంది వైజయంతి ఒక మంచి పోలీసుఅధికారి తప్పు చేసిన వాళ్ళకు శిక్షపడేలా చెయ్యటం ఆమె ముఖ్యోద్దేశం ఆ శిక్ష జైలుశిక్ష కావచ్చు, మరణశిక్ష కావచ్చు, పశ్చాత్తాపంతో బాధితురాలిని స్వీకరించటం కావచ్చు బాధితురాలికి న్యాయం, బాధించినవాడికి శిక్ష వైజయంతికి కావాలి అవి జరగకపోతే కథ కథకాదు వ్యథగా మిగిలిపోతుంది

ఈ కథను చిత్రకథగా రాసుకునేటప్పుడు ఎన్ని నిమిషాల కాలం గడుస్తోంది, ఈ సమయానికి ప్రేక్షకునికి ఈ చిత్రకథ ఉత్సాహభరితంగా ఉంటుందా? విసుగు పుడుతుందా? అని అనుక్షణం ఆలోచించుకునేకంటే ఈ విధంగా విభాగించుకుంటే మంచిది

## భూమిక[8]

**(PARADIGM)**

| యాక్ట్ 1 | యాక్ట్ 2 | యాక్ట్ 3 |
|---|---|---|
| ప్రారంభం<br>35 నిమిషాలు | మధ్యమం<br>70 నిమిషాలు | ముగింపు<br>100 – 140 నిమిషాలు |
| మొదటి మలుపు<br>(First Plot Point) | రెండవ మలుపు (సందిగ్ధత)<br>(Dramatic Context) | ఫలప్రాప్తి<br>(Dramatic Resolution) |
| 20 నిమిషాలు గడిచాక పాత్రల పరిచయాలు పూర్తయి మొదటి మలుపు మూడో రీలు అంటే 30-35 నిమిషాల వ్యవధిలో ప్రారంభం కావాలి | 70వ నిమిషంలో సందిగ్ధత ఉండాలి రెండో భాగంలో ఈ విషయం ఎలా ఎదుర్కొంటారు అన్న తర్జన భర్జనలో ప్రేక్షకుడు ఉండాలి | ప్రధాన పాత్ర ముఖ్యోద్దేశం ఏవిటో ఆ దిక్కుగా ఆఖరి 30-40 నిమిషాల నడక ఉండాలి గెలుపోటముల మధ్య డోలాయమాన పరిస్థితి ఉండాలి |

ఖైదీ చిత్రం కధ - ఇప్పుడు విడుదలైన చిత్రంలోని కథలాగా ఉండకపోతే అదేచిత్రం ఇంత అద్భుతమైన విజయాన్ని సాధించి ఉండకపోవచ్చు సాధించి ఉండేదికూడా కాదేమో అంటే కథ కంటే కథనానికి ఉన్న ప్రాముఖ్యాన్ని మనం గమనించవచ్చు

సూర్యం అనే కుర్రాడు మధులత అనే ధనవంతురాలైన అమ్మాయిని ప్రేమించాడు అని మనం ఖైదీ కథప్రారంభిస్తే, కథానాయకుడి ఉద్దేశంలో ఫలప్రాప్తి ఏమిటి? మధులతతో ప్రేమను పెళ్ళిగా మార్చుకోవటం, ముగింపు పెళ్ళి అయి తీరాలి కాని కథానాయకుడు ఈ చిత్రం చివరిలో కథానాయిక తండ్రి పాత్రను అంటే వీరభద్రయ్యను చంపేసి, పోలీసులకు లొంగిపోయి, మధులత దగ్గరకొచ్చి, **పగ తీర్చుకోవటం కోసం ఈ జన్మ ఎత్తాను, ప్రేమకోసం మరోజన్మ ఎత్తుతాను** అని చెప్పి వెళ్ళిపోతాడు

మరి ఆవిధంగా ప్రారంభం అయిఉంటే ప్రేమికుడిగా ప్రారంభమై పగ కోసం ఈ జన్మ ఎత్తాను అని ఎలా చెబుతాడు? చెప్పటానికి అవకాశం లేదు!

కాని ఆ ఖైదీచిత్రంలో కథ అలా ప్రారంభంకాలేదు సూర్యం నివురుగప్పిన నిప్పులాగా ఒక వంతెన మీదనడుస్తూ, ఒక పోలీసుఅధికారి ఎదురుపడితే, కోటిపల్లి వెళుతున్నాననిచెప్పి, కొండపల్లి వైపుకు వెళుతూ, అతనితో తను ఏ ఊరువెళుతున్నాడో అసత్యంచెప్పి, సోదాచేస్తే కత్తితోఉన్నాడని చూపించటం జరిగింది అతని ప్రధానోద్దేశం పగ - హత్య అన్నది చిత్రప్రారంభంలోనే ప్రేక్షకుడికి తెలియజేయటం జరిగింది ఆ పగతోనే చిత్రంముగిసింది

ఖైదీలో సూర్యం అనే యువకుడికోరిక ఎవరినో హత్యచేయటం ఇది నిజానికి ప్రేమ కథ ఒక పేదకుర్రవాడు ఒకధనవంతురాలైన అమ్మాయినిప్రేమిస్తే, ఆ ధనవంతురాలి తండ్రి ఆ ప్రేమ సఫలం కానివ్వకుండా విఫలంచెయ్యటానికి సూర్యంతండ్రిని హత్య చేస్తాడు సూర్యాన్ని కష్టాలు పెట్టాడు ఆ కష్టాలు తమ్ముడు తనమూలంగా పడుతున్నాడని సూర్యంఅక్క మునసబుని పెళ్ళిచేసుకుంది మునసబు శోభనంరాత్రి ఆమెను అటవీశాఖాధికారికి తార్చబోతే ఆత్మహత్య చేసుకుంది ఇక్కడ్నించి ప్రేమకథ పగకథగా మారిపోతోంది ఆ సమయంలో తిరగబడ్డ సూర్యాన్ని వీరభద్రయ్య పోలీసులకి అప్పజెప్పి అతనే అక్కచావుకి కారణం అని ఆరోపించాడు తనకు మరణ శిక్ష తప్పదు అని తెలుసుకున్న సూర్యం, చనిపోయేలోపు చంపటం మంచిది అని అనుకున్నాడు కేవలం తన కుటుంబానికేకాక తనకు ఆశ్రయంఇచ్చిన **లేడీడ్యాక్టర్‌ని** కూడా హత్యచేయటం అగ్నికి ఆజ్యంతోడయినట్లయింది చివరకు తను అనుకున్నది సాధించాడు

ఈ కధకు చిత్రకధ రాసుకున్నప్పుడు రచయితలు దీన్ని విభాగించుకున్న తీరు-

1 సూర్యం అనే యువకుడు కోటిపల్లికి బయలుదేరి, అనుమానితుడిగా పోలీసులకు చిక్కి, పోలీస్ స్టేషన్‌కి వచ్చి, అక్కడ పోలీసులందరినీ చితకబాది పారిపోవటం

2 సూర్యం గాయపడి ఒక లేడీడ్డాక్టర్ ఇంటికి వెళ్ళటం ఆమె అతనికి శుశ్రూష చెయ్యటం సి ఐ మేనకోడలు రావటం ఈ పాత్ర మూలంగా సి ఐ కి సూర్యం ఈ ఇంట్లో ఉన్నాడేమోనన్న విషయం మేనకోడలి మూలంగా తెలుస్తుందేమోనన్న ఉత్కంఠ కలిగించటం తనకధ లేడీడ్డాక్టర్‌కి సూర్యం చెప్పటం ప్రారంభించటం

3 కాలేజీలో సాంస్కృతిక కార్యక్రమంలో సూర్యం, మధులత పాడుకోవటం మధులత సూర్యాన్ని ప్రేమిస్తోందని తెలియజేయటం ఆమె కారులో వాళ్ల గ్రామానికి బయలుదేరటం

4 మునసబు వాళ్ళనుచూసి వీరభద్రయ్యకిచెప్పటం వీరభద్రయ్య కూతురిద్వారా అది వాస్తవం అని తెలుసుకొని, సూర్యం తండ్రిని పిలిపించి కొడుక్కి బుద్ధి చెప్పమనటం, అతను అతనినిస్సహాయత వ్యక్తం చెయ్యటం అతని ఆస్తి జప్తుచేయించటం, ఆ రాత్రి అతన్ని చంపటం ఆశవాన్ని తీసుకు వెళ్ళటానికి వీలులేకుండా ఆపి, ముందు తండ్రిచేసిన అప్పులు తీర్చి శవాన్నితగలబెట్టుకోమనటం, ఆస్తి మొత్తం వీరభద్రయ్యకి సూర్యం ఇచ్చివేయటం, అతని పొలాన్ని అతనికే వీరభద్రయ్య కౌలుకి ఇవ్వటం

5 సూర్యం వ్యవసాయం చెయ్యటం అరటితోట ఫలసాయానికి రాగానే వీరభద్రయ్య గెలలు కొట్టించి వెయ్యటం అది చూసి ఆగ్రహాన్ని ఆపుకోటానికి ప్రయత్నిస్తున్న సూర్యంతో, ఈ పౌరుషం మా నాన్న మీద ఎందుకు చూపించకూడదు అంటే విధవరాలయిన అక్క ఏమయిపోతుందో అని ఆగిపోతున్నాను అంటే విన్నఅక్క మునసబుని పెళ్ళిచేసుకోటానికి నిర్ణయించుకోవటం

6 పెళ్ళిచేసుకున్న సంగతి పట్నంలో ఉన్న సూర్యానికి తెలియటం, ఆవేశంగా మునసబు ఇంటికి బయలుదేరటం, భర్త అని నమ్మిన మునసబు అటవీశాఖాధికారికి తార్చబోవటం, ఆ ప్రయత్నంలో ఆమె ఆత్మహత్యకు ప్రయత్నించటం, అదే సమయానికి ఎచ్చిన సూర్యం అందరిమీద తిరగబడటం, పోలీసులకు అప్పజెప్పి వీరభద్రయ్య, సూర్యాన్ని హత్యకేసులో ఇరికించటం

7 నిజానికిదే విశ్రాంతి పాయింట్ అంటే రెండో ప్లాట్‌పాయింట్ కానీ ఇది పూర్వకధ(Flash Back) రూపంలో లేడీ డ్డాక్టర్ సుజాతకు చెప్పబడటం వల్ల ఫ్లాష్ ఎండ్‌తో విశ్రాంతి ఇవ్వాలి కానీ ఏ ఉత్సుకతా లేకుండా ఎలా? అందుకే సరిగ్గా ఆ సమయానికి సి ఐ మేనకోడలు ద్వారా సూర్యం ఎక్కడున్నాడో తెలుసుకున్న సి ఐ , సుజాతఇంటిని చుట్టుముట్టి సూర్యాన్ని లొంగిపొమ్మని హెచ్చరించటం సుజాత తలుపుతెరవటంతో ఆపటం జరిగింది ఇది ఏడోభాగంగా మారింది

8 సూర్యం కోసం పోలీసులు వెతకటం మంచం కింద సి ఐ మేనకోడలు కనిపించటం (అంటే ఆమె లోపల ఉంది కాబట్టి సూర్యానికి నిజం చెప్పేసి ఉంటుంది అన్న నిర్ధారణ అవుతుంది) సి ఐ సుజాతను పోలీస్ స్టేషన్‌కి పిలిచి అతనికి ఎందుకు వైద్యం చేసావని హెచ్చరించటం, ఆ సమయానికే ప్రతినాయకత్రయం అక్కడికి రావటం ఆమెను వాళ్ళు బంధించి సూర్యం ఎక్కడున్నాడో తెలుసుకోవాలనుకోవటం

9 సూర్యం సుజాత ఫోన్ అందుకుని ఒక ప్రదేశానికి వెళ్ళటం అక్కడ ఇద్దరు అడుక్కుతినే వాళ్ళుండటం సుజాతను పలుగుతో చంపి, ఆమె మరణవాంగ్మూలం చెప్పేలోగా మరణించటంతో సూర్యం మళ్ళీ హత్యకేసులో ఇరుక్కోవటం

10 కోర్టులో సూర్యానికి శిక్షపడటం మధులత కోర్టులో సాక్ష్యంచెప్పిన అడుక్కుతినే వాళ్ళ మనసు మార్చి మళ్ళీ సాక్ష్యం చెప్పించటానికి ప్రయత్నించటం సూర్యం జైలునుంచి పారిపోవటం

11 మధులత బలవంతపు పెళ్ళి తప్పించుకోటానికి అడుక్కుతినే వాళ్ళుగా ఒటుకుతున్నవాళ్ళ అద్దె కార్లలో పారిపోవటం సి ఐ వెంటపడటం మధులత అడవిలోకివెళ్ళిపోవటం అక్కడ కష్టాలలో ఉండగా సూర్యం కాపాడటం ఆ రాత్రి నలమహారాజు దమయంతిని వదలినపద్ధతిలో, మధులతనువదలి సూర్యం వెళ్ళిపోవటం పోలీసులు మధులతను ఇంటికి చేర్చటం

12 సి ఐ మేనకోడలు అడవిలోకి వెళ్ళి ప్రతి నాయకులకు దొరికిపోవటం సూర్యం మొదటి ప్రయత్నంగా అటవీశాఖాధికారిని నిర్మూలించటం

13 మునసబు చావుకి పరోక్ష కారకుడై, సి ఐ. మేనకోడలిని అడ్డంపెట్టుకొని, పోలీసుల నుంచి తప్పించుకొని, అడవి నుంచి గ్రామానికి వెళ్ళిపోవటం

14 ఆఖరి భాగం ఎన్నివందలమంది పోలీసులున్నా తెగించి, సూర్యం వీరభద్రయ్యనిచంపి, పోలీసులకు లొంగిపోయి, ప్రియురాలితో పగ తీర్చుకోవటం కోసం ఈ జన్మఎత్తాను, ప్రేమకోసం మరో జన్మ ఎత్తుతాను అని చెప్పి వెళ్ళిపోవటం

సూర్యం అనే పేద కుర్రాడు ధనవంతురాలిని ప్రేమించటంవల్ల సర్వం కోల్పోయి, చివరకు హత్యలు చేసి జైలుకి వెళ్ళటం అనే కథాంశం, ఇంత ఇతివృత్తంగా ఎదిగింది

ఇలా కథాంశం ఇతివృత్తంగా ఎదిగే పద్ధతిలో రచయిత చిత్రకథ కోసం కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి

1 కథ వేగంగా కాకుండా నత్త నడక నడుస్తూ ప్రేక్షకుణ్ణి ఆకర్షించలేకపోయే ప్రమాదాన్ని నివారించాలి

2 చిత్రానికి ప్రారంభం చాలా విలువైనది కథానాయకుడు ఎలాంటివాడు? చిత్రం ఎటువంటిది అనే స్పష్టమైన అవగాహన ఆరంభంలోనే ప్రేక్షకుడికి కలిగించాలి

3 చిత్రం రెండో భాగంలో ఘటనగాని, ప్రతిఘటనగాని, వింతగాని, విడ్డూరంగాని, మలుపులు గాని లేకుండా ఉంటే ఆ చిత్రకథ విసుగు పుట్టిస్తుంది

4 అకస్మాత్తుగా చిత్రకథను ముగించటం ప్రేక్షకుణ్ణి నిరాశకు గురి చేస్తుంది

5 ఇంతకు ముందే చూసిన కథగాని, చూడటానికేముంది అనిపించే విధంగాగాని కథ ఉండకూడదు

6 చిత్రకథలో అనేక పర్యాయాలు పూర్వకథ (Flashback) జొప్పిస్తే కథనడక బాగోదు

7 పాత్ర తనలోతాను మాట్లాడుకునే పద్ధతి, సంభాషణతోనే కొత్త విషయాన్ని స్ఫురింపచేయటం కంటే, దృశ్యంతో ఆ విషయాన్ని చెప్పగలిగినప్పుడు ఆ పద్ధతినే అనుసరించటం మంచిది

8 కథను అద్భుతంగామలచాలి అన్నఅభిప్రాయంతో అనేకమైన విషయాలను జొప్పిస్తే కథకు నష్టం జరుగుతుంది

9 సుదీర్ఘమైన సంభాషణలతో చిత్రకథను నడపకూడదు

10 కథలో నూతనత్వానికి ప్రయత్నించాలి

11 కథలో సంఘర్షణ ఉండాలి

12 మోదాంతంతో కథ పూర్తికావాలి ( విషాదాంతాలు కూడా మంచి కథలే వ్యాపారపరంగా డబ్బు తీసుకురాలేని చిత్రాలే ఎక్కువ)

13 కథ శబ్దకావ్యంలా కాక దృశ్యకావ్యంలా ఉండాలి

14 వాస్తవికత ఉండాలి

15 సంలీనం (Immersion) చెందటానికి అనుగుణమైనపాత్రలు ఉండాలి

16 కథానాయకుడికి సాధించటానికి ఒక ఆశయం కావాలి అది ప్రేమ కావచ్చు, పగ కావచ్చు, ఉన్నత స్థానం పొందటం కావచ్చు

17 కథ నిండా ఎక్కువ మంచి పాత్రలే ఉండాలి ( ఆడది అనే చిత్రంలో మగ పాత్రలన్నీ మంచివి కావు అని ప్రేక్షకులు తీర్పు చెప్పే వరకు రచయితలు, దర్శకుడు, నిర్మాత ఆ విషయాన్ని గమనించలేదు )

18 కథలో నీతిఉండాలి

19 కథానాయకుడికి దీటుగా ప్రతికథానాయకుడు ఉండాలి (పాత రోజుల్లో ఆర్ నాగేశ్వరరావు , ముక్కామల, రాజనాల, నాగభూషణం, రావు గోపాలరావులాంటి ప్రతికథానాయకుల పాత్రలు కథానాయకుడి పాత్రతో పోటీగా ఉండేవి దొంగరాముడు చిత్రంలో అయితే సావిత్రి 'రావోయి మా ఇంటికి మావో మాటున్నది మంచి మాటున్నది' అని

ఆర్ నాగేశ్వరరావుతో పాడిన పాట ఇప్పటికీ సజీవంగా ఉందంటే అర్థం చేసుకోవచ్చు ఈ మధ్య జయం అనే చిత్రంలో ప్రతి కథానాయకుడి పాత్రకు చాలా విలువ ఇవ్వబడింది)

20 కథలో దేన్ని గురించి చెప్పాలనుకుంటున్నామో అది అర్థవంతంగా చెప్పబడాలి

21 కథలో స్థలజ్ఞత ఉండాలి అంటే ఆ ప్రాంత నాగరికతకు అనుగుణంగా ఉండాలి

22 పునరుక్తులు ఉండరాదు దీన్ని ఆంగ్లంలో Superfluous అంటారు

23 కథనంలో శాఖాచంక్రమణాలు ఉండగూడదు

ఒక కథకుప్రాణం కథానాయకుడే కావచ్చు కాని ఒక్కపాత్రతో కథ పూర్తికాదు సహాయ పాత్రలుండాలి

అంటే కథనంలో కథనడపాలంటే పాత్రలు కావాలి

పాత్ర అంటే ఏవిటో తెలుసుకునే ముందు ఈ భాగంలో కథావస్తువు అంటే ఏమిటి? కథనం అంటే ఏమిటి? ఇతివృత్తం అంటేఏమిటి అన్నవిషయాలు తెలుసుకోవటమే కాక ఆ కథను ఎన్నిరకాల దృష్టికోణాలలో చెప్పుకోవచ్చు అన్న విషయం పరిశీలించటం జరిగింది

ఆ కథను ముందు నాలుగుపేజీల్లో రాసుకోవాలని, ఆ తర్వాత నలభై పేజీలకు పెంచి రాసుకోవాలని, ఆ రాసుకునే సందర్భంలోనే ప్రారంభం, మధ్యమం, ముగింపు అనే భూమికను అనుసరించాలని, నాటితో పాటు కథలో మొదటిమలుపు, రెండోమలుపుతోపాటు ఫలప్రాప్తిని కూడా ఉత్కంఠాభరితంగా నడపాలని తెలుసుకోవటం జరిగింది

పాత్ర . పాత్రను గురించి పాశ్చాత్యరచయితలు, లాక్షణికులు ఎన్నో విధాలుగా నిర్వచించారు

> అభినయమే పాత్ర పాత్ర లక్షణాన్ని తాను నటిస్తున్నానోని ఆ తత్వం నాదికాదు అని నటుడు చెపుతాడు [9]
>
> పాత్ర వ్యాపారం నటన మనిషి శరీరంలోకి ప్రవేశించటానికి నటనకు రెండుదారులున్నాయి మనసూ, హృదయం ఒక దారి, ఆత్మ రెండో దారి పాత్ర ఎదుగుదల, మార్పే నటన [10]
>
> ప్రేక్షకులు ఒకసినిమాని పాత్రద్వారానేగుర్తుంచుకుంటారు చాలామందికిసినిమా ఇతివృత్తాలకంటే అందులో పాత్రలేగుర్తుకు వస్తాయి [11]
>
> ప్రవర్తనే చలన చిత్రం [12]
>
> చిత్రకథకు పాత్ర తప్పని సరిగా అవసరమైన పునాది కథకు మనసు, హృదయం, నాడీమండలం అదే ఒక అక్షరం రాయకముందే పాత్ర రచయితకు తెలిసి ఉండాలి [13]

కథావస్తువును సృష్టించటం కంటే ఒకపాత్రను సృష్టించటం తేలిక [14]

పాత్రలు సజీవంగా కాగితంమీదకు కాని తెరమీదకుగాని రావని ఒక పాతనానుడి ఉంది రచయితలలో కథలు తిరస్కరింపబడినప్పుడు తెలుస్తుంది చేసిన పాత్ర చిత్రణ తప్పని [15]

తెరమీద కథ, పాత్ర స్వయం పోషకాలు ఆ రెండింటిని ఒకచోట బంధించేది ఆశయం [16]

ఈ కిందివి తెలుగువారి అభిప్రాయాలు -

ఒక గొప్ప వాంఛయో, ఆశయో, ఆశయమో, భావమో, క్షోభయో ఇట్టి ఒక చిత్తవృత్తి ప్రకృష్టముగానున్న వ్యక్తి పాత్రకావటానికి యోగ్యమవుతుంది [17]

కథను నడిపించేవారూ, కథావస్తువును భరించేవారూ, కథాంశాన్ని సూచించే వారూ పాత్రలు [18]

పైన పాత్ర గురించి చెప్పిన ప్రతివ్యక్తీ ప్రతిభాశీలుడే, చిన్నవ్యత్యాసాలతో అన్నీఒక్కటే సీసాను బట్టి అందులో నీళ్ళు ఆకారాన్ని మార్చుకున్నట్టు వారి వారి పదజాలాన్ని బట్టి ఆయా నిర్వచనాలు అలా అందజేయబడతాయి

కథముందా? పాత్రముందా?

గుడ్డు ముందా? కోడి ముందా?

చెట్టు ముందా? విత్తు ముందా?

పై మూడు ప్రశ్నలలో మొదటిది రెండోదానికంటే మూడోదానికంటే సులువైన ప్రశ్న ఎందుకంటే ముందు కథ పుట్టదు ఒక ఆలోచన, ఒక ఊహ పుడుతుంది ఆ ఊహ కూడా ఒక పాత్ర మూలకంగానే పుడుతుంది ఊహే కథకాదు గనుక, ఆ ఊహని కథలో బంధించటానికి ఒక పాత్ర కావాలిగనుక పాత్ర పుట్టినతర్వాతే దానిచుట్టూ కథ అల్లబడుతుంది

పాత్రచుట్టూ కథ అల్లబడే ముందు, ఆపాత్రకు సంబంధించి ఈ కింది విషయాలు ఆలోచించాలి

1 పాత్ర పేరేమిటి?

2 ఆడా? మగా?

3 వయసేమిటి?

4 ఎలా కనిపిస్తుంది పాత్ర? శారీరక సౌష్టవం?

5 తాను ఎలాంటి వ్యక్తిని అని ఆ పాత్ర ఆలోచిస్తుంది?

6 ఒక వేళ ఆ పాత్ర యవ్వనంలో ఉంటే ఆ పాత్ర సంబంధాలెలా ఉంటాయి?
క తల్లిదండ్రులతో ఎలా ఉంటుంది పాత్ర
ఖ సోదరులతో సంబంధ బాంధవ్యాలు ఎలా ఉంటాయి?
గ మిగతా వాళ్ళతో ఆ పాత్ర ప్రవర్తన ఎలా ఉంటుంది?
ఘ ఎదుగుతున్న కొద్దీ ఆ పాత్ర ప్రవర్తన ఎలా ఉంటుంది?
ఙ విద్య (ఎంతవరకు చదువుకుంది)
చ పసితనపు అలవాట్లు ఏమిటి?
ఛ పెరిగిన ప్రదేశం - వాతావరణం ఎలాంటిది?
జ పాఠశాలవిద్య తర్వాత కళాశాలచదువు ఉందా?

ఇవన్నీ ఆలోచించిన తర్వాత ఆ పాత్ర పసితనంలో తల్లిదండ్రులతో ఉన్నట్లే ఇప్పుడూ ఉంటోందా? సోదరులతో (సోదరి, సోదరులు) ముఖ్యసంబంధీకులతో మార్పు ఏమయినా వచ్చిందా? అన్నది పరిశీలించాలి

7 పాత్రకు పెళ్ళయిందా?
8 పాత్ర ప్రేమలో పడిందా?
9 పాత్ర పెళ్ళయి విడిపోయిందా?
10 విధురుడు కానీ విధవరాలు కానీనా?
11 నీతిమంతమైనదా? అవినీతిమంతమైనదా?
12 పాత్రకు పిల్లలున్నారా? లేదా? ఉంటే పిల్లలతో ఎలా ప్రవర్తిస్తుంది పాత్ర? లేకపోతే పిల్లలకోసం ఆరాట పడుతుందా? అనవసరం అనుకుంటుందా?
13 పాత్ర వృత్తి ఏమిటి?
14 పాత్ర మతం ఏమిటి? మత విశ్వాసం ఉందా పాత్రకు?
15 సాటివారితో యజమానితో పాత్ర ప్రవర్తన ఎలా ఉంటుంది?
16 పాత్ర అభిరుచులేమిటి?
17 చేస్తున్న వృత్తిపట్ల ఇష్టం ఉందా? శ్రద్ధ ఉందా?
18 పాత్ర వేదాంతదృక్పథంతో ఉంటుందా?
19 పాత్రకున్న రాజకీయబంధాలు, అనుబంధాలేమిటి?
20 పాత్ర ఒంటరిగా ఉండటానికి ఇష్టపడుతుందా? కలివిడితనం ఇష్టమా? ఆశావహమైనదా? నిరాశావంతమైనదా?
21 ఏ విషయం గురించి తనగురించితాను పాత్ర గర్వపడుతుంది?

22 పాత్ర ఏ విషయమై తనగురించితాను సిగ్గు పడుతుంది
23 పాత్ర ఆరోగ్యపరిస్థితి ఏమిటి?
24 పాత్ర తెలివితేటలపరిస్థితి ఏమిటి?
25 కథలో మిగిలినపాత్రలతో ఈ పాత్ర సంబంధబాంధవ్యాలేమిటి?
26 పాత్ర ఆశయం ఏమిటి?
27 ఆ ఆశయం సాధించాలని ఎందుకు కోరుకుంటోంది?
28 ఆ ఆశయ సాధనకు ఈ పాత్రకు ఉపయోగపడే పాత్రలేమిటి?
30 పాత్రలో స్పష్టత ఉందా?
31 పాత్ర మాండలికం (Dialect) మాట్లాడుతుందా?
32 పాత్ర యాస (Accent) మాట్లాడుతుందా?
33 చిత్రకథలో పరిచయంకాక ముందు పాత్ర ఏం చేస్తూ ఉండేది?

పాత్ర పేరు కేమిటి అంత ప్రాముఖ్యం? ఏ పేరుపెట్టినా పాత్రకు సరిపోతుంది కాని ఒక్కొక్క సారి పేరే పాత్రకు ప్రాణం పోస్తుంది సమరసింహారెడ్డి ఈ పాత్ర నేరము - శిక్ష అన్న దృక్పథంలో ఉన్న పాత్ర ఖైదీబాబాయ్ (హిందీ చిత్రం 'దుష్మన్'కి తెలుగు సేత) ఇలాంటి నేరము - శిక్ష అన్న సైద్ధాంతిక చిత్రాలకు ఆది తర్వాత **నేరము – శిక్ష,** అలాగే రౌడీ ఇన్‌స్పెక్టర్, రౌడీ అన్నయ్య, వంశానికొక్కడు మొదలైన చిత్రాలు ఈ సిద్ధాంతాన్ని ఆధారం చేసుకుని తీసిన చిత్రాలే

కానీ సమరసింహారెడ్డి రాష్ట్ర చలన చిత్రచరిత్రలో ఒక సంచలనం ఆ సంచలనానికి కారణం కేవలం ఆ చిత్రం కథ, దర్శకత్వం, సంగీతం, సంభాషణలే కాదు, చిత్రమకుటం, ఆ చిత్ర కథానాయకుడి పేరు

**సమరసింహారెడ్డి**లో రెడ్డి ఆంధ్రప్రదేశ్‌లో రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా, సామాజికంగా ఎంతోగుర్తింపు ఉన్న కులం మొట్టమొదటిసారి ఆ కులంపేరుతో ఉన్న కథానాయకుడి కథ అనగానే అన్ని కులాల వారికి ఆసక్తి పెరిగి, కుతూహలం పెరిగింది ఆ తర్వాత అనేక చిత్రాలు రావటం తెలుసు

పాత్రపేరు చలనచిత్రంలో చాలాప్రాముఖ్యాన్ని సంతరించుకుంటుంది రావణబ్రహ్మ చిత్రంలో కథానాయిక పేరు సీత కాని సెన్సారువారు సీతను గీతగామారిస్తే తప్ప చిత్రానికి 'సర్టిఫికేటు' ఇవ్వలేదు

పాత్రలకు పేరు పెట్టటంలో ఆ పాత్రల వ్యక్తిత్వాన్ని సామాన్యంగా సూచించటానికి ప్రయత్నిస్తాడు రచయిత ఏకపత్నీవ్రతుడైన కథానాయకుడికి శ్రీరామ్ అనకుండా

గోపాలకృష్ణ అని పెడితే తప్పులేదు గాని, ప్రేక్షకుడికి పంటికిందిరాయి తగులుతూ ఉంటుంది విన్నప్పుడల్లా అలాగే ఒక రౌడీ పాత్రకు 'గాంధీ' అని పేరు పెట్టలేం కదా!

మంచిఅమ్మాయి అనగానే సీత, సావిత్రి, జానకి, అనసూయ, కమల, సుగుణ, ఇలా మంచిఅబ్బాయి అయితే గోపి, రాము, గాంధీ, బోసు, రాజు, ధర్మారావ్, అర్జున్ ఇలా పేర్లు పెట్టటం జరుగుతుంది అదే ప్రతినాయకుల దగ్గరకు వచ్చేసరికి భుజంగం, ఫణిభూషణరావ్, కుప్పుస్వామి, రెడ్డప్ప, శీలంలేని శీతారామయ్య, జరాసంధరాయుడు మొదలైన పేర్లు, స్త్రీ పాత్రలు దుష్ట స్వభావం కలిగి ఉంటే సూర్యాకాంతం, మహంకాళి, భద్రకాళి, సత్యభామ, గజలక్ష్మి ఇలా ఉంటాయి

ప్రధానపాత్ర ఆడా? మగా అన్న అంశంమీద ఇతివృత్తాలు ఆధారపడిఉంటాయి సామాన్యంగా స్త్రీ ప్రధానపాత్రలు స్త్రీవాద దృక్పధంలో, స్త్రీల సానుభూతిని గెలుచుకునే ప్రయత్నంలో ఉంటాయి ఆ చిత్రాలలో కధానాయకుడి పాత్ర ఉన్నా స్త్రీ పాత్రకే ప్రధమ తాంబూలం అందుతుంది

*కర్తవ్యం, ప్రతిధ్వని, లాయర్ భారతీదేవి, డాక్టర్ భవాని, కృష్ణవేణి, శారద* ఇలాంటివన్నీ స్త్రీ పాత్రలను ఆకాశానికి ఎత్తిన కధాంశాలతో తయారయినవే

అదే కధానాయకుడు చిన్నవాడయితే **పసివాడి ప్రాణం, పాపం పసివాడు** లాంటి కధాంశాలతో చిత్రకధలు తయారవుతాయి పాత్రను ఆధారం చేసుకునే సినిమా సాహిత్యంలో కధలు రాయబడతాయి అనటానికి పై చిత్రాలు ఉదాహరణ

ఆకారాన్ని ఆధారం చేసుకుని కూడా పాత్రలు సృష్టించబడతాయి **కలసివుంటే కలదుసుఖంలో** యన్ టి ఆర్ చెయ్యి ఔడు ***ఊర్వశిలో*** శారద కాటుక నలుపు ***నాదీఆడజన్మేలో*** సావిత్రి నలుపు కేవలం వాళ్ళ ఆహార్యం, ఆంగిక లోపాలను ఆధారం చేసుకుని ఎన్నో పాత్రలు సృష్టించబడ్డాయి

ఇలా పైన పేర్కొన్న ముప్పై రెండు అంశాలకు పాత్రచిత్రణలో, కధారచనలో ప్రాముఖ్యం ఉంది

**మంచిపాత్ర సృష్టి** మంచిపాత్ర, ప్రజలు మెచ్చుకునే పాత్ర, హృదయానికి హత్తుకునే పాత్ర అని నిర్ణయించుకోవాలి ఆ పాత్ర ఉద్దేశాలనుబట్టా? ఆ పాత్ర మాట్లాడే సంభాషణలనుబట్టా? ఆ పాత్ర నిజాయితీనిబట్టా అనేది పరిశీలించాలి

మంచిపాత్ర చిత్రకధకు ప్రాణం, హృదయం, నాడీమండలం, నరాలవ్యవస్థ చిత్రం విజయవంతం కావాలంటే చిత్రకధలో మంచిపాత్ర తప్పని సరి పాత్ర లేనిదే చర్యలేదు చర్య లేనిదే సంఘర్షణ లేదు సంఘర్షణలేనిదే కధలేదు కధలేకుండా కధనం లేదు

మంచిపాత్రను గురించి రాస్తున్నప్పుడు మన మీద ప్రభావం చూపిస్తాయి ఎన్నో చిత్రాలలో, ముఖ్యంగా **నరసింహనాయుడు** చిత్రంలో, ఏ అన్నావదినలు తనను అవమానించారో, వాళ్ళే ప్రాణాపాయంలోఉంటే ప్రాణాలకుతెగించి **నరసింహనాయుడు** కాపాడుతున్న సన్నివేశాన్ని చూస్తున్నప్పుడు, గుండె పట్టేయటం, కళ్ళు చెమర్చటం ఈ సిద్ధాంతకర్త స్వానుభవం

మంచి పాత్రలకూ రచయితకూ మధ్య ఎప్పుడూ స్పర్ధఉండదు రచయితకీమధన పడటం ఉంటుంది జన్మనివ్వటం, మట్టిలో కలిపేయటం, రెండూ రచయితచేతిలోపనేఅయినా, తన ఇష్టానుసారం పాత్రలను నడపడు ఆ పాత్రస్వభావాన్ని జీర్ణించుకుని, బ్రహ్మసృష్టించిన పాత్రకు ఆయన ఏమిఎదుగుదల ఇస్తాడో ఏమిముగింపుఇస్తాడో అదేఇస్తాడు కవి సృష్టికర్త కదా! అందుకే అతనికి ఆ పాత్రస్వభావం పూర్తిగా వంటబట్టి ఉంటుంది ఆ పాత్రఅంతరంగం, బహిరంగ ప్రవర్తన, ఆశయాలు, ఆశలు, కలలు, భయాలు అన్నీ రచయిత ఊహల్లో కలసిపోయి ఊపిరి పోసుకుంటాయి అప్పుడు మంచిపాత్రల సృష్టి జరుగుతుంది

**సాగరసంగమంలో** కథానాయకుడి పేరు బాలకృష్ణ అతనికి శాస్త్రీయనాట్యం అంటే ప్రాణం దానికోసం అతని ఆరాటం పోరాటం ఆ పాత్ర నాట్యాన్ని ప్రేమించేవాళ్ళకే కాక, సామాన్యులకు కూడా బాగానచ్చటానికి కారణం, ముక్కుసూటిగాఉండే బాల కృష్ణపాత్ర ఎప్పుడూ ఏ ఆటుపోట్లకు గురవుతుందోనన్న ఉత్కంఠ నడుస్తూనే ఉండటం

**నరసింహనాయుడులో** నరసింహనాయుడు కథానాయకుడు ఈ పాత్రని ప్రేమించని ప్రేక్షకుడు లేడు ఎందుకని? రెండుగ్రామాలమధ్య జరిగినగొడవలో ఒకగ్రామం తరపున బలిదేవుడుగా నలుగురుబిడ్డల్లో ఆఖరివాడు అంగీకరించటం అంతేకాదు అతను ఊరికోసం ప్రత్యర్ధిని చంపుతాడు కుటుంబంకోసం చదువుసంధ్యలు వదిలేసాడు అన్నయ్యలను తూలనాడింది అని కట్టుకున్నభార్యను వదిలేస్తాడు సోదరులకోసం ప్రాణాలను త్యాగం చేయటానికి సిద్ధ పడతాడు వాళ్ళను రక్షించుకునేసమయంలో భార్యనుపోగొట్టుకుంటాడు కొడుకు వేరేకథానాయికలో అమ్మనువెతుక్కుంటే అంగీకరించడు కానీ తండ్రి ఇంతమందికి ఇన్ని చేసావు, ఆ పసివాడికి అమ్మను తెచ్చిపెట్టలేవురా అంటే వెళ్ళి తీసుకొస్తాడు విచిత్రం ఏమిటంటే ఏదీ తన కోసంచేయడు తనవారికోసమే చేస్తాడు అందుకే అందరికీ నచ్చిందా పాత్ర

**సమరసింహారెడ్డిలో** కథానాయకుడు కక్షలూ, కార్పణ్యాల రాయలసీమలో శత్రువుల్ని చంపుతూ, పొరపాటుగా అనుచరుడి చావుకు కారకుడై, ఆ తప్పుకి శిక్షగా

అతని ముగ్గురి చెల్లెళ్ళ జీవితాలు చక్కదిద్దుతాడు తను కోట్లకులధిపతి క్షణంలో వాళ్ళందరినీ కోటీశ్వరులను చేయవచ్చు కానీ వాళ్ళన్నయ్య ప్రేమ కోట్లకంటే విలువైనది అని అతనికితెలుసు ఆ ప్రేమను డబ్బుతో కాకుండా శ్రమతో సాధిస్తాడు అదే అతనివిజయం అందుకే ఆ చిత్రానికి ప్రేక్షకులు బ్రహ్మరథం పట్టారు

**ముత్యాలముగ్గులో** కథానాయిక పాత్ర గొప్పది పేదింటి అమ్మాయి పెళ్ళి ఆగిపోతున్నప్పుడు, జమిందారు బిడ్డ తాళికడితే, తలవంచుకొని గోవులా అతని వెనకేవచ్చి, కథానాయకుడి మేనమామ, ఒక **కాంట్రాక్టర్** కలిసి, ఆమె కాపురాన్నికూలిస్తే, వాల్మీకిఆశ్రమంలో సీతలా ఉండి కవలలని కని, మామ వచ్చి తీసుకువెళతానన్నా ఆత్మాభిమానంతో వెళ్ళదు, తను నిష్కళంకిత అని భర్త తెలుసుకున్న తర్వాతే అతని దగ్గరకు వెళుతుంది మనస్తత్త్వరీత్యా కథానాయిక పాత్ర, సంభాషణ పరంగా **కాంట్రాక్టర్** పాత్ర మన్ననలు పొందాయి

**శంకరాభరణం** సినిమాలో శాస్త్రీయసంగీతాన్ని ప్రేమించే శంకరశాస్త్రి కథానాయకుడు సంగీతానికి ప్రాణం పెట్టే ఆ పాత్ర తెలుగు వారి ముంగిట సాక్షాత్కరించి, నేటికీ బతికి ఉంది దేశంలోనే కాక విదేశాలలో కూడా ఖ్యాతి సంపాదించింది

అలాగే **బాటసారి, దేవదాసు, స్వాతిముత్యం** లాంటి అనేక చిత్రాలలో పాత్రలు చిరకాలం ప్రేక్షకులకు గుర్తుండిపోవటానికి కారణం చిత్రకథలో అవి తీర్చిదిద్దబడిన తీరే!

అవలోకిస్తే ఒక్క **ముత్యాల ముగ్గులో కాంట్రాక్టర్** పాత్రతప్ప మిగిలిన పాత్రలన్నీ వ్యక్తిత్వం మూలంగా వికసించినవే పాత్రకు ఒక ఆశయంకావాలి ఆ ఆశయం సాధించటానికి సంఘర్షణ పడాలి ఆ సంఘర్షణలో ఆ పాత్ర తనఆశయాన్ని నెరవేర్చుకోలేదేమోనన్న అనుమానం కలిగించాలి ఆ స్థితి పతాక స్థాయికి చేరాలి అప్పుడే ఆ పాత్ర ద్వారా చిత్రకథ రక్తి కడుతుంది అంతే కాక ఆ పాత్ర తన ఆశయసాధనకోసం చేసే పనులు నమ్మశక్యంగా ఉండాలి ఇలాంటి పాత్ర ఉన్నది నిజమే అనిపించాలి పాత్రస్పందన ప్రేక్షకుడిస్పందన అయి ఉండాలి నాయకత్వాన్ని శ్లాఘించే సమయంలో అతిశయోక్తి ఫరవాలేదు గాని రాళ్ళు తిని అరిగించుకుంటాడు అంటే నమ్మలేరు కదా!

అందువల్ల ఆ పాత్ర నిజమని, పాత్రస్వభావం నిజమని, పాత్రప్రవర్తన నిజమని ప్రేక్షకుడు నమ్మాలి నమ్మకం కలగకపోతే ఏకాగ్రత లోపించి పక్కప్రేక్షకుడితో ఆ విషయమై చర్చించటం మొదలు పెడతాడు అదే పాఠకుడయితే రసాస్వాదన దెబ్బతింటే పుస్తకం మూసి పక్కన పెడతాడు ప్రేక్షకుడు అలాకాదు తనతో పాటు చుట్టూఉన్నవాళ్ళను కూడా రసానుభూతి పొందకుండా చేసే ప్రమాదంఉంది

మనిషి ఎలాఎదుగుతూ ఉంటాడో పాత్ర కూడా అలాగే ఎదుగుతూ ఉంటుంది ఉండాలి ఆ ఎదుగుదలను వీక్షిస్తున్న ప్రేక్షకుడికి అచ్చం మన ఇంటి పక్క అబ్బాయో, అమ్మాయో ఇలాగే చేసారు అన్నఅనుభూతి కలగాలి సామాన్యంగా కథానాయకుడు ధైర్యవంతుడై ఉంటాడు, సాహసవంతుడై ఉంటాడు, అందంగా ఉంటాడు, సక్రమంగా ఆలోచిస్తూ ఉంటాడు ఆ పాత్ర మీద ప్రేక్షకుడికి ఎంత రసానుభూతి ఉంటుందంటే అతను రౌడీఅయితే ఏ పరిస్థితిలో రౌడీ అయ్యాడో అర్థంచేసుకుంటాడు ( శివ చిత్రం విడుదలయిన తర్వాత చాలా కళాశాలల్లో విద్యార్థులు చెయిన్ల సంస్కృతికి అలవాటు పడ్డారని గొడవ చేసారు కొందరు) ప్రియురాలికి మంచి బహుమతి ఇవ్వటం కోసం ఎక్కువ శ్రమచేసి డబ్బులు సంపాదించుకునే కథానాయకుడు ఒకరకం, దానికోసం దొంగతనం చేసే కథానాయకుడు మరొకరకం మొదటిది పవిత్రమైన పాత్ర, రెండోది గాలి పాత్ర , మొదటిది క్లాస్ ప్రేక్షకుల ఆదరణ పొందుతుంది రెండోది మాస్ ప్రేక్షకుల స్పందన పొందుతుంది

ఉదాహరణకు నమరసింహారెడ్డిలో కథానాయకుడు ఢిల్లీ నుంచి రైలుదిగి, గెలిచిన ఆనందంలో మనంఉన్నాం, ఓడినబాధలో వాళ్ళున్నారు అని శత్రువుల్ని క్షమించేపాత్ర, కానీ అతనే పరిణామాలకు లోనై, నీ ఇంటికొచ్చా, నీ నట్టింటికొచ్చా అంటూ నరికిపారేస్తాడు ఆ పరిస్థితుల్ని ప్రేక్షకుడు అవగాహనచేసుకున్నాడు

అలాగే *కొండవీటి దొంగ* చిత్రంలో నిజానికి కథానాయుకుడు ఐ ఎ ఎస్ పాసవుతాడు ఒక జిల్లాకికలెక్టర్‌గా ఉండాల్సిన యువకుడు, ఒకఏరియాలో ముసుగుదొంగగా మారతాడు మారిన పరిణామాన్ని అర్థం చేసుకున్నారు ప్రేక్షకులు '*దొంగ*' అన్నా, '*కొండవీటి దొంగ*' అన్నా, '*అడవి దొంగ*' అన్నా ప్రేక్షకులు ఆదరించారు

నటుడు పాత్ర స్వభావాన్ని ప్రదర్శించగలడే తప్ప, పాత్రను సృష్టించలేడు రసముయన్నిష్టము అన్నప్పుడు సామాజిక నిష్ఠము అని లాక్షణికులు ఏనాడో తేల్చి చెప్పారు ప్రేక్షకుడికి రసానందాన్ని అందించటానికి, నటుడు ఒక సాధనం మాత్రమే అయితే చలన చిత్రకథల్లో, చాలావరకు నటుడికి ఉన్న ప్రజాదరణ బట్టి సృష్టించబడటం వల్ల, ఎక్కువ భాగం దెబ్బ తినటానికికారణం అవుతాయి నిజాయితీగా వెళితే విజయవంతం అవుతాయి

ఉదాహరణకు ఇంద్ర చిత్రంలో కథ నిజాయితీగా వెళుతుంది కథానాయకుడు కాపాడాడు అన్న నెపంతో ప్రతికథానాయకుడు తన కొడుకుని, పదేళ్ళప్రాయంవాణ్ణే కత్తితో

పొడిచిచంపేస్తాడు మరి కథానాయకుడికష్టం వ్యర్థంఅయినట్లే గదా? అలాగే పేదవాళ్ళకు 'జలాశయం' నిర్మాణం గురించి తనయావదాస్తిని వదులుకుంటాడు, ఆఖరికి ప్రతికథానాయకుడి సోదరిని పెళ్ళిచేసుకోటానికి అంగీకరిస్తాడు ఇంకా, తను పుట్టిన నేలను వదిలి వెళ్ళటానికి అంగీకరిస్తాడు నిజానికిది ఒక కథానాయకుడి లక్షణం కాదు, అక్కడ చిరంజీవి అనే గొప్ప నటుడి ప్రజాబలాన్ని దృష్టిలోపెట్టుకుంటే తప్పే కానీ పాత్ర కథానుగుణంగానే రాయబడింది గనుక విశేష ప్రజాదరణపొందింది

> *రూపకాల్లోను, కథాత్మక రచనల్లోను సంవాద నటనల ద్వారా స్వీయ ప్రవృత్తిని ప్రకటీకరించే వ్యక్తిని పాత్ర అంటాం (Character) పాత్ర చెప్పేది సంవాదం (Dialogue), పాత్ర చేసేది 'నటన/చర్య' (Action) ఈ రెంటికీ మూలం వైయక్తిక స్వభావం పాత్రల్లో కొన్ని మొదటి నుంచి చివరి వరకు ఏ మార్పూ లేకుండానే ఉంటాయి మరికొన్ని సమూలంగా మారుతుంటాయి మార్పు ఉన్నప్పటికీ, కథలో పాత్ర ప్రవేశానికీ నిష్క్రమణకూ ఉండే మధ్య వ్యవధిలో పాత్ర ప్రవర్తనలో సంగతత్వం (Consistency) ఉండకతప్పదు అది సహేతుకం కావాలి లేనప్పుడు పాత్ర చిత్రణ విచ్ఛిన్నమవుతుంది* [19]

పై వివరణ **పోరంకి దక్షిణామూర్తిది** కథానికస్వరూప స్వభావాలలో సంవిధానవిభాగంలో పాత్ర గురించి చెబుతూ పై ఉద్దేశాన్ని ఆయన వివరించాడు అంటే ఒకరకంగా అది మంచిపాత్ర అన్నమాట

మంచిపాత్రలో ఎదుగుదల ఉంటుంది ఏ విత్తు మనం నాటితే అదే వృక్షంగా ఎలా పెరుగుతుందో, రచయిత ఏ ఉద్దేశంతో పాత్రస్వభావానికి బీజం వేస్తాడో తదనుగుణంగానే పరివర్తనం చెందుతూ ఉంటుంది మంచి పాత్రలెప్పుడూ అవి తీసుకునే నిర్ణయాలకు అనుగుణంగా నడుస్తూ ఉంటాయి నిర్ణయానికి ప్రతిఫలంరానప్పుడు మారుతూ ఉంటాయి

ఖైదీలో సూర్యాన్ని ఉదాహరణగా తీసుకుంటే, అతను ఏ రోజూ మధులతను కావాలని ప్రేమించలేదు ఆమె తన మనసువిప్పి చెప్పినప్పుడు కూడా, అంతరాల గురించే మాట్లాడాడు ఆ ప్రేమ మూలంగానే తండ్రి చంపబడ్డాడని అతనికి తెలియదు అప్పుబాధతో ఆత్మహత్య చేసుకున్నాడనే అనుకున్నాడు లేదంటే కథ ఆ కోణంనుంచి ఇంకోపద్ధతిలోకి మారిఉండేది తనపొలం తానే కౌలుకి తీసుకుని, వీరభద్రయ్యే పంట (అరటి గెలలు) కోయించుకు తీసుకు వెళ్ళటం, అక్క మునసబుని పెళ్ళిచేసుకోవటం అతన్ని మార్చాయి అక్కని తానే చంపానని వీరభద్రయ్య నింద వెయ్యటంతో, అతన్ని

అంతం చెయ్యాలని నిర్ణయం తీసుకున్నాడు ఇక ఇక్కడి నుంచి అతని నిర్ణయంలో మార్పు లేదు వీరభద్రయ్యని, మునసబుని ఎలా చంపాలి, ఎప్పుడు చంపాలి, అదే అతని ఆశయం ప్రేమ నుంచి పగకు పరివర్తన పొందిన పాత్ర లక్షణం ఇది అందుకే పాత్ర పరివర్తనే కథాసారం అని కూడా కొందరంటారు

*Character change is the essence of story telling*[20]

ఆ విధంగానే మంచి పాత్రల మరొక ముఖ్యలక్షణం, విశ్వజనీనమైన ఆశయం ఉండటం ఆ పాత్ర ఆశయం ప్రపంచంలో ఉన్న అనేకమంది ప్రజలమనస్తత్వాలకు ప్రతీకగా ఉంటుంది **పాతాళభైరవి** తోటరాముణ్ణి తీసుకుంటే కోటలో రాజకుమార్తెను కోరుకుంటాడు ఆ కోరిక తీరాలంటే ధనం సంపాదించమంటాడు మహారాజు దానికోసం సాహసం చేశాడు సాహసం సాయరాడింభకా అన్నాడు మాంత్రికుడు డింభకుడు మేరువై మహామాంత్రికుడి శిరస్సునే ఖండించాడు కొన్ని కోట్ల మంది తాదాత్మ్యం చెందుతారు తోటరాముడి పాత్రలో

**సాగరసంగమంలో** బాలు పాత్ర కూడా గొప్ప సదాశయంతో ఉంటుంది **శంకరాభరణంలో** శంకరశాస్త్రి దృక్పథం కూడా అదే కానీ, రిక్షా కార్మికులు కూడా శంకరా అంటూ పాడుతూ, రిక్షా తొక్కారంటే ఆశయం గొప్పదయితే అతను పండితుడయినా, పామరుడైనా తాదాత్మ్యం చెంది తీరతాడు అని నిరూపించబడింది ఆ పాత్ర అవసరం ప్రేక్షకుడు తన అవసరంగా భావిస్తాడు ఆ పాత్ర సాహసం తనదిగా యోచిస్తాడు ఆ పాత్ర భయం తనదిగా భావిస్తాడు అతని సంతోషం తన సంతోషం అతని ఉత్కంఠ తన ఉత్కంఠగా ఆలోచిస్తాడు

అంతే కాదు మంచిపాత్రలు నియమబద్ధమైన జీవితం గడుపుతాయి విలువ గల ఆశయాలను కోరుకుంటాయి రూపాయినాణానికి బొమ్మా బొరుసూ ఉన్నట్లే పాత్రస్వభావంలో కూడా మంచి, చెడు ఉంటాయి ఖైదీలో సూర్యం, వీరభద్రయ్యను చంపాలని నిర్ణయం తీసుకోవటం, చెడ్డ వైపుకి మొగ్గటమే చట్టానికి పట్టించకుండా, చట్టాన్ని చేతుల్లోకితీసుకుని, తానేచట్టమై, మరణశిక్ష విధించటం రూపాయినాణానికి మరోవైపు రూపమే అసహ్యం, కసి, కక్ష, కార్పణ్యం, విధ్వంసం అన్నీ అలవరుచుకున్నాడు అందుకు ముందు శాంతం, సహనం, ప్రేమ మాత్రమే ఉన్నాయి ఆ పాత్రలో

పాత్రలో సంఘర్షణలేనిదే అది పాత్రకాదు ఒక వ్యక్తిమీద ప్రేమ, ద్వేషం కలగవచ్చు ఒకే పాత్రమీద అభిమానం - కోపం కలగవచ్చు పాత్రకు బలహీనత లేకపోతే కథ

నడవకపోవచ్చు దీనికి రామాయణం కంటే గొప్ప ఉదాహరణ ఏముంది? సీత బంగారు లేడిని అడగటం ఏమిటి? తను రాముడి వెంట అడవులకు వెళ్ళాల్సిన అవసరం లేదు నారచీరలు కట్టాల్సిన అవసరం అంతకంటే లేదు అలాంటి సౌహార్ద్రవతి, కోరికలేలేనిది బంగారుజింకను అడగటంఏమిటి? అడగకపోతే రాముడు వెళ్ళడు వెళ్ళకపోతే లక్ష్మణుడు వెళ్ళడు వెళ్ళకపోతే సీతాపహరణం జరగదు అంటే సీతాపహరణఘట్టానికి వాల్మీకుల వారికి, సీతమ్మ గర్భవతిగా ఉన్నప్పుడు సహజంగా స్త్రీలకు ఉండే కోరికల తాలుకూ బలహీనతలే అవసరమయ్యాయి కైక విషయికమైన బలహీనత దశరథుడికి, భరతుడి విషయికమైన బలహీనత కైకకు, సీత విషయికమైన బలహీనత రావణుడికి ఈ మూడు బలహీనతలూ ఉన్నా, సీత బంగారులేడి విషయమై బలహీనతను పొంది ఉండకపోతే, ఇక పదివగాసాలు అరణ్యవాసంచేసి రాముడువచ్చేయటమో, రామలక్ష్మణులుండగానే సీతనపహరించటానికి రావణుడు ప్రయత్నించి, అక్కడే యుద్ధం చేసి చనిపోవటమో రామాయణం అయిఉండేది

మంచిపాత్రలలో ఉన్న మరొక లక్షణం ఏమిటంటే వారినెవరూ గెలవలేకపోవటం ఆత్మస్థయిర్యంలోగాని, నిర్ణయాల విషయంలో గాని, ఎన్నికష్టాలొచ్చినా, ఎన్నినష్టాలొచ్చినా పోరాడతాయి ఏమికోరుకున్నాయో అదిసాధించటానికి తుదికంటా పోరాడటం ఈ పాత్రల నైజం అసలు ఏ ప్రతిఘటనా రాకుండా, ఏ లడ్డంకీ రాకుండా స్తబ్దంగా పాత్ర నడిచి వెళ్ళిపోతుంటే అది మంచిపాత్ర లక్షణమే కాదు మాంత్రికుడు రాజకుమారిని తీసుకువెళ్ళకుండా, అతని శిష్యుడు సంజీవనితో మళ్ళీ మాంత్రికుణ్ణి బతికించకుండా, పాతాళభైరవి సాయంతో ముందే తోటరాముడు, రాజకుమారిని పెళ్ళి చేసుకుని శుభం అంటే - ఆ కథ, దానిలోని పాత్రలు గాని, ఇన్ని సంవత్సరాలు కాదు కదా, కొన్ని రోజులు కూడా గుర్తుండవు ఏం చెయ్యాలో ఆ పాత్రకు తెలుసు ఎలా సాధించాలో తెలుసు అదిసాధించటానికి అవసరమయితే తనప్రాణాలు ఇవ్వవలసివచ్చినా పట్టించుకోదు పగకోసం ప్రాణంతీసినపాత్ర సూర్యం (ఖైదీ) అయితే ప్రేమకోసం ప్రాణం ఇవ్వటానికి సిద్ధపడ్డ పాత్ర తోటరాముడు అయితే తోటరాముడు కూడా ప్రేమకోసం మాంత్రికుణ్ణి చంపాడు అది చట్టపరంగా నేరం కాదు

అంతేకాక మంచి పాత్రలు వివిధసన్నివేశాలలో ఒక్కొక్కవిధంగా ప్రవర్తిస్తుంటాయి *సాగరసంగమం*లో బాలు, శైలజను ముద్రతప్పు చూపించిందని తిట్టి, వివిధనాట్యాలలో ఆ భంగిమ ఎలా ఉంటుందో చూపిస్తాడు కాని అదే శైలజ తన ఒకనాటి ప్రియురాలి కుమార్తె అని తెలియగానే, ఏదో చిన్నపిల్ల చేసింది చిన్నతప్పే

గదా, మిగతాదంతా చాలా బాగా చేసింది కదా అని పశ్చాత్తాపం పడతాడు తుదికంటా బాలు పాత్ర అర్థమయ్యీ, అర్థం కానట్టు ఉంటుంది ప్రియురాలిని మళ్ళీ భర్త దగ్గరకు పంపాక ఏ మత్తు పదార్థాన్ని అసహ్యించుకుంటాడో దానికే బానిస అవుతాడు ఆమెకు హృదయం ఇచ్చాడు కాని తాళి ఇవ్వలేకపోయాడు ఆఖరి కోరికగా, తన నాట్యం తనతో అంతంకాకుండా, శైలజకు నేర్పాలన్న ప్రియురాలికోరికనుతీర్చటంతో, నది వెళ్ళి సాగరంలో సంగమవుతుంది

మంచిపాత్రకు మరో రెండుముఖ్యలక్షణాలుంటాయి ఆంతరంగికమైన ఆశయం, బహిర్గతమైన ఆశయం బాలు ఆంతరంగికమైన ఆశయం ప్రియురాలిప్రేమను పొందటం, బహిర్గతమైన ఆశయం నాట్యాన్నిప్రపంచీకరించటం అయితే ఒకసమయానికి పాత్ర రెండింటిలోనూ ఓడిపోతూ, ప్రేక్షకుడికి హృదయభారాన్ని అందిస్తూ ఉంటుంది చివరకు బహిర్గతమైన ఆశయాన్ని నెరవేర్చి, నువ్వు లేని ఈ ప్రాణం అనవసరం అన్న ధోరణిలో నిర్యాణ రూపంలో నిష్క్రమిస్తూ ఉంటుంది ఈ చిత్రం కర్మపద్ధతుల్లో మొదలయ్యింది బాలు ఏ చెప్పు మీద నడవాలో ఆ చెప్పుల్ని ప్రారంభంలోనే పారేస్తాడు చివరలో శ్లోకం వినిపిస్తూ ఉండగా స్నేహితుడు అతన్ని తీసుకువెళ్ళిపోతాడు అద్భుతమైన అభినయపూర్వకమైన కర్మసిద్ధాంతావలంబన పాత్రచిత్రణకు కారణమయ్యింది

ఒక్కోసారి పాత్రఆశయాలు అవసరాల మూలంగాఉంటాయి ఒక్కోసారి పంతం మూలంగాఉంటాయి ఒక్కొక్కసారి తప్పనిసరయిఉంటాయి మంచిపాత్ర ఎప్పుడూ ఆత్మాభిమానం కలిగిఉంటుంది ఎదుటివ్యక్తినుంచి గౌరవాభిమానాలను కోరుకుంటుంది ఏదో సాధించటంకోసం, ఏదో సృష్టించటంకోసం ప్రయత్నిస్తూ ఉంటుంది మంచిపాత్రలు త్యాగం చేయుటానికయినా సిద్ధపడతాయి, అంతం చెయ్యటం కోసం కూడా సిద్ధపడతాయి సైకిల్‌పందాలలో పాల్గొన్నా, బాక్సింగ్‌పోటీల్లో పాల్గొన్నా, కారు పందాలలో పాల్గొన్నా, అన్నీ ఆశయ సాధనలలో కధనరూపంలో కధను ముందుకునడపటమే

ఇంకా చెప్పుకోవాలంటే ఒక్కోసారి మంచి పాత్రలు మార్మికంగా ఉంటాయి చివరి వరకూ ఒక్కొక్క సారి అర్థం కాకుండా ఉంటాయి మన ఊహలకు అందుతున్నట్లు, అందనట్లు ఉండి, మనను ఊహింపచేస్తూ, ఊరింపచేస్తూ ఉంటాయి కధ ప్రధానోద్దేశాన్ని సాధించే దృష్టిలో పాత్రలుంటాయి అయితే ఈ పాత్రలన్నీ ఒకే ఆశయసాధన కోసం పనిచేయవు ప్రధానపాత్ర ఆశయాన్ని సాధించటానికి కొన్ని ఉపకరణాలుగా ఉంటాయి కొన్ని నిరోధించటానికి సాధనంగా ఉంటాయి

ప్రధానపాత్ర  ఈ ప్రధానపాత్రను కథానాయకుడు లేదా కథానాయిక అంటారు  ఆంగ్లంలో *Protagonist* అంటారు  కథలో వచ్చేమార్పులన్నీ ఈపాత్ర మూలంగానే వస్తాయి కథ, అభివృద్ధికి, ఈ పాత్రలే కారణం అవుతాయి  తమ తమ ఆశయసిద్ధికోసం, కథనరూపంలో, కథను ముందుకు నడుపుతుంటాయి  చురుకుగా ఉంటాయి తప్ప స్తబ్దంగా ఉండవు

సమరసింహారెడ్డి పాత్ర చాలా చురుకుగా ఉంటుంది  ఒక ఆశయంలో ఆ పాత్ర ప్రారంభం కాదు కథగా చూసుకుంటే  కాని కథన రూపంలో అబ్బులుగా రావటంలో ఆశయం ఉంది  చిన్నప్పుడు పారిపోయిన మీ అన్నయ్యనే అని ముగ్గురు చెల్లెళ్ళను నమ్మిస్తుంది  విశ్రాంతి సమయానికి అతను ఆ చెల్లెళ్ళ అన్నయ్య కాదని, ఆ అన్నయ్యను చంపిన హంతకుడని తెలియటంతో ఉత్కంఠారాజనకంగా కథ మలుపుతిరుగుతుంది  కథానాయకుడు హంతకుడెందుకవుతాడు? ఒక వేళ అయినా, మంచివాడైన ఈ చెల్లెళ్ళ అన్నయ్యను ఎందుకు చంపేస్తాడు? చంపితే ఈ చెల్లెళ్ళ దగ్గరకు రావలసిన అవసరం ఏమిటి? ఇవన్నీ ప్రశ్నలే  ప్రతి ప్రశ్నకి ఎవరికి తోచిన ఊహలో వాళ్ళు సమాధానాన్ని ఊహించుకుంటూ కథతో పాటు ముందుకు సాగుతూ ఉంటారు  ఒక రకంగా మన కథావస్తువుని ప్రేక్షకులకు తెలియజేసుకోటానికి ఉపయోగపడే సాధనం కథానాయకుడు లేదా కథానాయిక అవుతారు

**ఉద్బోధక పాత్ర : (Modifier)**  ప్రధానపాత్రను ప్రేరేపించి, ఒక ఆశయాన్ని కల్పించి ఆ ఆశయసాధన కోసం ఉద్బోధకంగా ఉంటాయి కొన్ని పాత్రలు

భద్రాచలం అనే చిత్రంలో ఒక పల్లెటూరి అమాయకుణ్ణి మార్షల్ ఆర్ట్స్‌లో తీర్చిదిద్ది, ప్రపంచవిజేతగా నిలుపుతాడు ఒక గురువు  ఇందులో రెండు ఆశయాలున్నాయి  గురువు ఆశయం , తన ప్రథమశిష్యుడు తనను అవమానిస్తే, అంతకంటే గొప్పవాణ్ణే వెతికి, అతన్ని విశ్వవిజేతగా నిలపటం  అయితే ఇక్కడ భద్రాచలానికి కూడా ఆశయం ఉంది  వదినలదృష్టిలో ఎందుకూ పనికిరానివాడిగాఉన్న భద్రాచలం, తను ఏదోసాధించి గొప్పవాడిని అనిపించుకోవాలన్న ఆశయం ఈరెండుఆశయాలకూ కథానాయకుడు భద్రాచలం గనుక, అతనికి గురువుపాత్ర ఉద్బోధకపాత్ర అవుతుంది

**ఉత్ప్రేరక పాత్ర  (Catalyst)**  ప్రధానపాత్ర ఒకేరకమైన జీవితాన్ని అనుభవిస్తూ హఠాత్తుగా జీవనసరళిని మార్చుకుంటుంది  ఆ మార్పుకి కారణంఅయిన పాత్ర

**ఉత్ప్రేరకపాత్ర** ఉదాహరణకు ఖైదీలో సూర్యం అతనిలో మార్పుకు కారణం అక్క వివాహం తమ్ముడు తనమూలంగా ప్రేమకు దూరమవుతున్నాడని, వీరభద్రయ్యకు ఎదురు తిరగలేకపోతున్నాడని భావించిన అక్క, మునసబుని పెళ్ళిచేసుకోటానికి ఒప్పుకుంటుంది అది తెలిసి, సూర్యం వచ్చేలోపు, మునసబు సూర్యం అక్కను అటవీ శాఖాధికారికి తార్చటానికి సిద్ధపడటంతో, ఆమె చనిపోవలసి వచ్చింది ఆ చావు సూర్యంజీవితానికి ఉత్ప్రేరకమైం ప్రేమికుడుగానో, రైతుబిడ్డగానో జీవితాన్ని కొనసాగించుకోవలసిన సూర్యం హంతకుడయ్యాడు ఖైదీ అయ్యాడు పరారీ అయ్యాడు ఈ మార్పులన్నిటికీ అక్క మరణం కారణం

**ప్రతినాయక పాత్ర** కథలో ఉన్న ప్రధానఆశయాన్ని సాధించేవాడు కథానాయకుడైతే, అది సాధించకుండా అడ్డుపడేవాడు ప్రతినాయకుడవుతాడు ఈ ఆశయం కథానాయికను పెళ్ళి చేసుకోవటం కావచ్చు ***పాతాళ భైరవి***లో తోటరాముడి ఆశయం రాజకుమారిని పెళ్ళిచేసుకోవటం దీనికి ప్రతినాయకుడు మాంత్రికుడు

***సమరసింహారెడ్డి***లోకథానాయుకుడి ఆశయుం చనిపోయిన వాసు చెల్లెళ్ళను ప్రయోజకులను చేయటం అంటే ఒకచెల్లికి పెళ్ళి, ఒకచెల్లికి చదువు, ఒకచెల్లికి అవిటితనం పోగొట్టటం అయితే ఈ ఆశయాన్ని సాధించకుండా అడ్డుపడింది వీరరాఘవరెడ్డికుమార్తె అంజలి ప్రతి కథానాయిక

**ప్రత్యర్థి పాత్ర** · ప్రతికథానాయుకుడితో పాటు, కథానాయుకుడి ఆశయాన్ని కొనసాగించకుండా చేసే పాత్రలు కొన్నిఉంటాయి అవన్నీ ప్రత్యర్థిపాత్రలే ఖైదీలో వీరభద్రయ్య పక్కన ఉన్న మునసబు, కరణాల పాత్రలు అలాంటివే

**సహాయ పాత్రలు** కథానాయకుడి ఆశయ సాధనకు ఉపకరించే ప్రతిపాత్ర సహాయపాత్రే కేవలం కథను నడపటానికి ఉపయోగపడే పాత్రలు కూడా సహాయపాత్రలే ఖైదీలో సూర్యం తండ్రి సహాయపాత్రే ఆ పాత్ర కథానాయకుడి తొలి ఆశయమైన ప్రేమకు సహాయపడి చనిపోయింది ***లేడీడాక్టర్*** సుజాత పాత్ర అతని మొదటిఆశయానికిగాని రెండోఆశయానికిగాని ప్రత్యక్షంగా సహాయపడలేదు గాని, పోలీసుల బారినుంచి కాపాడి, సూర్యం తన పగని తీర్చుకోటానికి, అతను పోలీసులకు దొరకకుండాచేసింది, చనిపోయింది

**హాస్య పాత్ర** పదిసంవత్సరాలక్రితం వరకూ ప్రతిచిత్రకథలోనూ హాస్య కథానాయకుడు, హాస్య కథానాయిక తప్పని సరిగా ఉండేవారు చిత్రంలో హాస్యాన్ని అందించటానికి

సృష్టించబడిన పాత్రలు ఇప్పుడు ఎక్కువగా హాస్యంకోసమే పాత్రలు సృష్టించబడుతున్నాయి ఆ పాత్రలకు హాస్య కథానాయకుడు, హాస్య కదానాయిక స్థాయి ఉండటం లేదు

**ఉప పాత్రలు** ఇన్‌స్పెక్టర్‌లు, డాక్టర్లు, లాయర్లు, టీచర్లు, ఇంజనీర్లు, పక్కింటి వాళ్ళు, ఎదురింటి వాళ్ళు ఇలా చిత్రంలో పదిహేను నుంచి పాతికవరకూ ఉంటాయి ఇవి గాక **జూనియర్ ఆర్టిస్ట్‌ల** పేరుతో సంభాషణలు లేకుండా సహాయంగా వాడబడే పాత్రలుంటాయి

పైన చెప్పిన పాత్రలన్నీ రకరకాల ఆశయాలతో ఉంటాయి రకరకాల సిద్ధాంతాలతో ఉంటాయి అన్నీ ఒకే రకంగా ఉంటే చిత్రకథలో పటుత్వం ఉండదు సిద్ధాంత భేదాలతో, పాత్రలు నడుస్తున్నప్పుడే ఘర్షణ ఉంటుంది అప్పుడే చిత్రకథ ఉత్కంఠాభరితంగా ఉంటుంది

**అభినయం :**

చిత్రకథలో అభినయం కూడా ఒక భాగమే సాహిత్యకథలో అయితే అతను తెల్లబోయాడు అనిరాస్తాడురచయిత చిత్రంలో దాన్ని అభినయించిచూపుతాడు నటుడు కాబట్టి అక్కడ రచయిత కంటే నటుడి అభినయమే కథను చెబుతుంది ఒక్కోసారి ఒక్కో దృశ్యం, సంభాషణ లేకుండా అభినయంతోనే ముందుకు నడుస్తూ ఉంటుంది

అనేక పాత్రల అభినయంద్వారా కథ ముందుకు కదులుతోంది కాబట్టి చిత్రకథలో అభినయం కూడా ఒక భాగమే

**సంభాషణ (Dialogue) :**

ఒకపాత్ర మరోపాత్రతో తన భావాన్ని చెప్పుకోవటమే సంభాషణ మూకీచిత్రాలు, మూకీచిత్రకథల రోజుల్లో కూడా సంభాషణలుండేవి కాని అవి వినిపించేవి కావు టూరింగ్ టాకీసులు దగ్గర వ్యాఖ్యాతలుగా వ్యవహరిస్తూ, చిత్రంలో భావార్ధాలను విపులీకరిస్తూ ఉండేవాళ్ళు టాకీయుగం మొదలయ్యేసరికి సంభాషణ తప్పనిసరయ్యింది

> నా పాత్రలు ఏం మాట్లాడాలో నాకు తెలుసు గనుక సంభాషణలు పుడతాయి నా దృశ్యాన్ని ఊహిస్తాను తెరమీద వాటిని దర్శిస్తాను అవి ఎందుకు అలా

చెబుతున్నాయో ఊహించి నా పాత్రల ద్వారా పలికిస్తాను అప్పుడు సంభాషణ పుడుతుంది ప్రపంచంలో ప్రతి రచయితా ఇంతే! క్లుప్తత కోసం ఆ సంభాషణను కుదించుకుంటూ ఉంటాను [21]

చాలా మంది సినిమాకి రాయటం అంటే సంభాషణ రచనే అనుకుంటారు అద్భుతమైన నటీనటులు పలకటానికి అవి రాస్తారని భావిస్తారు నిజానికి సంభాషణ రచయిత చిత్ర కథకు అందించేది కథా నిర్మాణమే [22]

సంభాషణలు రాసుకునే సదుపాయం నీకుంది అంటే నువ్వు చిక్కుల్లో పడ్డట్టే శబ్ద సౌందర్యంతో నువ్వు గొప్ప సంవాదం రాసి ఉండవచ్చు నిజానికి సంభాషణ దృశ్యం నడకకు సరిపడా ఉంటే చాలు[23]

ఏమిజరుగు తోందో చెప్పటానికి మాత్రమే సంభాషణ అయితే దాని వల్ల జరిగే ఉపకారం చాలా తక్కువ [24]

నాటకరచయిత తను ఏ సంభాషణ రాసాడో అది రంగస్థలం మీద వింటాడు ఆశ్చర్య కరమైన విషయం ఏవిటంటే సినిమాసంభాషణరచయితకు తను రాసిన మాట ఉందో లేదో చిత్రం విడుదలయ్యే వరకు తెలియదు[25]

ఊసుపోని మాటలు సంభాషణగా ఎప్పుడూ రాయవద్దు[26]

సినిమారచయితకు చిత్రకథలో లభించేహక్కు ధ్వనిప్రభావం మాత్రమే నిజానికి కథనంలో రచయిత భాగం పంచుకునేది సంభాషణరూపంలోఉన్న ధ్వనిలో మాత్రమే[27]

సామాన్యంగా సంభాషణరచయితలు మూడు తప్పులు చేస్తూ ఉంటారు

1 అన్ని పాత్రలచేత ఒకేలా మాట్లాడించటం

2 ఒకపాత్ర అన్ని సన్నివేశాలలోనూ ఒకేలామాట్లాడటం

3 వాస్తవిక సంభాషణకు అతీతంగా కుప్పలు తెప్పలుగా పాత్రలకు సంభాషణలు రాయటం[28]

సంభాషణ రచనలో సందర్భోచితంగా, ఆపటాలూ ప్రారంభించటాలు ఉంచటమే గాక సజీవంగా ఉండేట్టు చూడాలి కథను ఆపటానికిగాని, కథార్థాన్ని ఆపటానికి గాని సంభాషణ ప్రయత్నించ గూడదు[29]

సంభాషణ ఎలారాయలో ఎవరూ ఎవరికీ చెప్పరు[30]

సంభాషణ పాత్ర వ్యాపారం కథకూ పాత్రకూ మధ్య సంభాషణ సమన్వయ శక్తిగా ఉండాలి[31]

ఎంత దృశ్యం ద్వారా తెలియజేయటానికి ప్రయత్నించినా ఒక్కొక్కసారి అరటి పండు వలిచి చేతిలో పెట్టినట్లు సంభాషణ రాయక తప్పదు[32]

సంభాషణ కథను నడుపుతుంది ప్రేక్షకులకు నిజాలు తెలియజేస్తుంది సమాచారం అందిస్తుంది పాత్రను ఆవిష్కరిస్తుంది[33]

పైవి పాశ్చాత్య సినీరచయితల అభిప్రాయాలు ఇవి ఎంతవరకు సమంజసాలో తెలుగు సినిమాలో అన్వయిస్తూ ఆయాసందర్భాల్లో అవసరమైనంత వరకు చర్చించటం జరిగింది

'పాత్రల మధ్య జరిగే సంభాషణను 'సంవాదం' అంటాం', అంటున్నాడు పోరంకి దక్షిణామూర్తి [34]

భాష పుట్టింది, మనిషి తనేం మాట్లాడుతున్నాడో సాటి మనిషికి తెలియటం కోసం నీ మనసులోని భావం, భాష రూపంలో బయటకు వస్తుంది ఒక మనిషి ఇంకో మనిషి భావాలను భాష ద్వారా తెలుసుకోవటం సంభాషణ లేదా సంవాదం అంటారు

భాష అర్థంకావాలంటే మాటలు సరళంగా ఉండాలి గ్రాంధికప్రయోగం అయి ఉండకూడదు దీర్ఘ సంస్కృత పదాలు ఉండకూడదు, దేశ భాషలో కలసిపోయినప్పటికీ పామరుడికి అర్థం కాని పరదేశీయాలు ఎక్కువ ఉండకూడదు

వ్యాకరణ సూత్రంలో అక్షరం ఒక్కటితగ్గితే ఒకపుత్రుణ్ణి కన్నంత ఆనందాన్ని వ్యాకర్త పొందినట్లే, ఒక వాక్యంలో ఒక పదం తగ్గితే, ఒక బిడ్డను పొందిన అనుభూతిని పొందటం, సంభాషణ కర్తకు కూడా అలవాటు

సంభాషణలు రాసేటప్పుడు, ముఖ్యంగా చిత్రకథలో సంభాషణలు రాసేటప్పుడు ఈకిందినియమాలు పాటిస్తూ ఉంటారు

1 సంభాషణ క్లుప్తంగా ఉండేట్టు చూడటం

2 సంభాషణ సరళంగా ఉండేట్టు చూడటం

3 సంభాషణ సహజంగా ఉండేట్టు చూడటం

4 సంభాషణ ఒక్కరే చేయకుండా పాత్రల మధ్య పంచటం

5 సంభాషణ పాత్రోచితంగా ఉండటం

6 సంభాషణలో ప్రాంతీయతను పాటించటం

7 సంభాషణలో భావం మరుగుపడకుండా చూడటం

8 సంభాషణలో కథ నడిచేలా చూడటం

9 సంభాషణ పునరావృతం కాకుండా చూడటం

10 సంభాషణలో జీవం ఉండేలా చూడటం

11 సంభాషణలో యధార్థత ఉండేలా చూడటం

12 సంభాషణలో దేశీయత (Nativity) ఉండేలా చూడటం

13 సంభాషణలో అలంకారికత ఉండేలా చూడటం

14 సంభాషణ వ్యవహారిక భాషలో ఉండేలా చూడటం

15 సంభాషణలో చమత్కారాలు ఉండేలా చూడటం

16 సంభాషణ ఆహ్లాదకరంగా ఉండేలా చూడటం

17 సంభాషణ పాత్రఉద్దేశాన్ని తెలియజేసేదిగా ఉండటం

18 సంభాషణ చిత్రకథలో పాలలోనీరులా కలసిపోవటం

19 సంభాషణ చిత్రకథలో నీళ్ళల్లో మంచుముక్కలా కలిసిపోవటం

20 సంభాషణకు ప్రయోజకత ఉండటం

21 సంభాషణలో అశ్లీలత ఉండకుండా చూడటం

22 సంభాషణలో పొందిక ఉండేలా చూడటం

23 సంభాషణ విలక్షణంగా ఉండేలా చూడటం

24 సంభాషణ సంస్కారవంతంగా ఉండేలా చూడటం

25 సంభాషణలో వ్యక్తిత్వప్రదర్శన చెయ్యటం

26 సంభాషణలోసందేశం ఉండేలా చూడటం

*కేవలం క్రియోత్తేజక, గతిశీలక, భావోద్బోధక సంవాదాలే కథానికలో ప్రయోగించడానికి యోగ్యమైనవి* [35]

అన్న పోరంకిమాట కథానికవరకు వాస్తవమే అయినా వ్యాపారదృక్పథంతో కూడిన చిత్ర కథల్లో సంభాషణలు మాత్రం పైన పేర్కొన్న విధంగా ఉండాలి

ఒక్కొక్కసారి రచయిత పాత్రల్లో కనిపిస్తాడు అన్ని పాత్రలూ ఒకే విధంగా మాట్లాడటం అంటే ఇదే అంటే పాత్ర మాట్లాడకుండా రచయిత మనసు మాట్లాడితే ఈ ప్రమాదం జరుగుతుంది

చిత్రకథలో సంభాషణ పాలల్లో నీళ్ళలా కలిసిపోవటం అంటే, ఆ సంవాదం ప్రేక్షకుల్ని పాత్ర నుంచి దూరం చేసి, నటుడి వ్యక్తిగతస్థాయిని పరిమితం చేయకూడదు నటుడే అలా మాట్లాడుతున్న అనుభూతిని కలిగించాలి

ఇంతకు ముందు చెప్పుకున్నట్లు చలన చిత్రం వ్యాపారం కాబట్టి, ఆ చిత్రకథను చూడటానికి సినిమాహాలులో కూర్చున్న వెయ్యిమంది ప్రేక్షకులు ఒకే అభిరుచికలవారు కాదుకాబట్టి, చిత్రకథలో సంభాషణ ఒక ప్రేక్షకుడి సంతృప్తి గురించి కాక ఎక్కువహృదయాలను రంజింప చేయటం గురించి ఆలోచించాలి

సంభాషణ సరళంగా ఉండాలి అనటంలో కూడా ఒక అర్థం ఉంది ఒక చిత్రం చూసి బయటకు వచ్చి ఆత్రేయ ***సినిమా బాగుంది, డైలాగులు తెలుగులో రాస్తే బాగుండేది*** అన్నాడట అంటే సమాసభూయిష్టమైనవాక్యరచన చిత్రకథలో హర్షణీయం కాదు అని తాత్పర్యం

సంభాషణలో ఉండే వైచిత్రి, శిల్పం 'సంభాషణశిల్పం' అనే విభాగంలో చర్చించబడుతుంది

## ధ్వని :

ఒక రకంగా సంవాదం లేదా సంభాషణ ధ్వనిలో అంతర్భాగమే చిత్రకథలో ధ్వనిది చాలా ప్రముఖమైనపాత్ర

1 సంవాదం
2 నేపథ్య సంగీతం (బాక్‌గ్రౌండ్ మ్యూజిక్)
3 సంగీతం (మ్యూజిక్)
4 వాతావరణసంబంధమైన ధ్వనులు
5 జంతువుల ధ్వనులు

**1. సంవాదం :** ఇందులో మొదటిదైన సంవాదం గురించి ముందే చర్చించటం జరిగింది

**2. నేపథ్య సంగీతం** చిత్ర కథలో, నేపథ్య సంగీతం అతి ముఖ్యమైన భాగం నటుడి అభినయానికి ఉత్ప్రేరకంగా వెనుక వచ్చే సంగీతం కరుణరసాత్మకమైన సన్నివేశం నడుస్తున్నప్పుడు వెనుక వీణ, సితార, లేదా వయొలిన్‌తో అభినయానికి అనుగుణమైన విధంలో నడుస్తుంటే అభినయానికి పూలకు తావిలా తయారై ప్రేక్షకుడి హృదయాన్ని రంజింపజేస్తాయి

**3. సంగీతం** భారతదేశంలో చిత్రకథల్లోసంగీతం చోటు చేసుకుంటుంది కథారచయితతోపాటు గీతరచయితకుకూడా ఇందులో భాగస్వామ్యం ఉంటుంది కేవలం వినోదం కోసం పాడుకునే పాటలుకాకుండా కథనుముందుకు నడిపేగీతాలు, కథకు ఆ సన్నివేశానికి బలాన్ని అందించే గీత, సంగీతాలు కూడా ఉంటాయి

**4. వాతావరణ సంబంధమైన ధ్వనులు** • చిత్రకథ నడుస్తున్నప్పుడు ఆ సన్నివేశానికి సరిపోయే వాతావరణం సృష్టించాలి ఉదాహరణకి ఒక కథానాయకుడో, కథానాయికో సముద్రతీరంలో ఉంటారు అతను లేదా ఆమె మనో వైకల్యంలో ఉన్నారు అప్పుడే వాళ్ళకు తోడుగా ఉండే సముద్ర ఘోష వాళ్ళ మనోభావాలకు ప్రతీకగా ఉంటుంది ఇలాగే అరణ్యంలో పక్షుల కిలకిలారావాలు, వీధిలో వెళ్ళే వాహనాల రొదలు, అవసరమైనప్పుడు సంవాదం వినిపించకుండా సాగే రైలుబండి శబ్దాలు ఇలా చిత్రకథలో అంతర్భాగం అవుతూ ఉంటాయి

**5 జంతువుల ధ్వనులు** ఒక్కొక్కప్పుడు ఒక కథానాయకుణ్ణో, పాత్రనో ఉన్నతంగా చూపించటం కోసం, ఆ నటుడి అభినయంజరుగుతున్నప్పుడు వెనుకనుంచి సింహంగర్జిస్తున్నట్లు, పులి గాండ్రిస్తున్నట్లు శబ్దాలు ధ్వనిముద్రణ చేస్తారు అలాగే ఒక ప్రతికథానాయకుడు బీరాలు పలుకుతున్నప్పుడు అతని అభినయంతోపాటు పిల్లి మ్యావ్ అన్నట్లు, ఒకవయసులో ఉన్న అమ్మాయిని అబ్బాయి చూస్తున్నప్పుడు గుర్రంసకిలించినట్లు (కోరికలే గుర్రాలయితే అన్న సామెతకు అనుగుణంగా), అలాగే రెండు పాత్రలు ఒక విషయం మీద విపరీతంగా పోట్లాడుకుంటుంటే కుక్కలు అరుచుకుంటున్నట్లు, ఒక ప్రతికథానాయకుడి అభినయంతోపాటు పాము బుసబుసలు ఇలా రకరకాల జంతువుల ధ్వనులను కూడా ముద్రించి చిత్రకథలో అంతర్భాగం చేసి (సినిమా నేపథ్య సంగీతం ధ్వనిముద్రణ పూర్తయ్యాక 'మిక్సింగ్' అని ఒక ప్రత్యేక తరహాలో చిత్రకథలో ఇవన్నీ ఇమిడిస్తారు) రసాస్వాదనకు ప్రయత్నిస్తారు

> *"Sounds chosen for their communicative and expressive values rather than as naturalistic necessities "*[36] అంటారు మార్గరెట్ మెహరింగ్ తన స్క్రీన్‌ప్లేలో

ఈ సంగీత పరమైన, వాతావరణ పరమైన, జంతుపరమైన, నేపథ్య సంగీతపరమైన ధ్వనులన్నీ తన చిత్రకథలో రచయిత రాయకపోవచ్చు కాని వాటన్నింటిని ముందు దర్శించవలసిన వాడు రచయితే!

'శబ్దగుణకమాకాశం' అన్నారు లాక్షణికులు ఈ విశ్వమంతా ధ్వనిమయం జనం మధ్య, సముద్రం పక్కన, అరణ్యంలో, నిర్జనప్రదేశంలో ఒక్కొక్కచోట రచయిత నిశ్శబ్దంగా కూర్చున్నప్పుడు, అంతకు ముందు అనుభూతిలోకిరాని అనేకశబ్దాలను వింటాడు అతని మస్తిష్కంనిండా వినూత్నమైన శబ్దాలు ముద్రించబడతాయి చిత్రకథ రాసేటప్పుడు తదనుగుణమైన శబ్దాలు స్ఫురిస్తాయి ఒక్కొక్క శబ్దాన్ని గుర్తిస్తున్నప్పుడు ఏ అనుభూతిని పొందుతాడో ఆ శబ్దాన్ని ఉపయోగించినప్పుడు దానికి రెట్టింపు అనుభూతిని పొందుతాడు

కెమేరా మాట్లాడుతుంది అని చెప్పుకోవటం జరిగింది ధ్వని మాట్లాడుతుంది ఒక్కొక్కసారి ఒక పాత్ర కూర్చుని ఉన్నప్పుడు అగ్నిపర్వతం బద్దలవుతున్న ధ్వని ఉంటే అతని ఉద్రేకాన్ని, గాలి ఉధృతంగావీస్తున్న శబ్దంఅయితే ద్వైధీభావ సంఘర్షణకు లోనైన విధానాన్ని, కుహూ కుహూశబ్దాలు విన వస్తే ప్రేమతత్త్వాన్ని, ఇలా అనేక విధాలుగా తలపింపజేసే అద్భుతమైన శక్తి ధ్వనికి ఉంది ఇది, మామూలు కథానికల్లో వాతావరణంలో రాసి, ఆ పాత్రమనస్తత్వాన్నీ విశదపరచటానికి ప్రయత్నిస్తాడు రచయిత అదే చలనచిత్రకథలో ప్రత్యక్షంగా ఆ శబ్దాన్ని వినిపింపజేస్తారు

ధ్వని, అభినయం చూడటానికి రెండుప్రక్రియల్లా కనిపించినా, అనుభూతిఐక్యతలో ఒక్కటిగా మారిపోతాయి అందుకే సన్నివేశాన్ని బట్టి వచ్చే శబ్దాలూ, భావాన్ని ఉద్దేశించి వచ్చే శబ్దాలూ స్ఫూర్తిమంతంగా ప్రయోగించుకోవచ్చు

ఉదాహరణకు, ఎండినఆకుల చప్పుళ్ళు, కారో, ఆటోనో వీధిలో పోతున్న శబ్దం, ఒక క్రీడో, చిత్రమో చూస్తూ ప్రేక్షకులు చేసే ధ్వని, హర్షాతిరేకంతో పెట్టే కేకలు, అవి ఒక్కసారిగా ఆగిపోతే వచ్చే నిశ్శబ్దం, గాలిలో ఎగురుతున్నజెండాధ్వనులు, ఎవరినోచూసి మొరుగుతున్నకుక్క, చందమామను చూసి ఊళపెడుతున్న నక్క, తలుపులుమూసుకుంటున్న శబ్దం, తలుపులు తెరుచుకుంటున్న శబ్దం, కాలింగ్‌బెల్ మోగిన శబ్దం, ఫోను మోగుతున్న శబ్దం, పక్షుల కిల కిలా రావాలు, తొలికోడి కూత, కార్ల హారన్ శబ్దాలు, విమానం శబ్దం, దిగేటప్పుడు ఎగిరేటప్పుడు, ఫ్యాక్టరీ సైరన్ శబ్దం, పోలీసుల సైరన్ శబ్దం, బూట్లశబ్దాలు, స్నానాల గదిలో నీళ్ళశబ్దం, కొండ మీద నుంచి కిందికి దూకుతున్న జలపాతం శబ్దం, సెలయేటి పక్కన కీచురాళ్ళ మోత, చిన్నపిల్లాడి నవ్వు, చిన్నపిల్లాడిఏడుపు, స్త్రీ ఆర్తనాదం, మనిషి చావుకేక, ఆస్తమాతో దగ్గుతున్న మనిషిచేసే దగ్గుమోత, సన్నటి మూలుగు, ఆగ్రహంతో అరిచే అరుపు, మిలటరీ లేదా పోలీస్ ఆఫీసర్లు చెప్పే మార్చ్‌ఫాస్ట్ ఆర్డర్ తాలూకు శబ్దాలు, చల్లటివాయువు వీస్తున్నప్పుడు

వచ్చే శబ్దం, రైలుకూత, రైలుచక్రాలు పట్టాలమీద పరుగెత్తుతున్నప్పుడు వచ్చే శబ్దం, మనిషిచనిపోయినప్పటి నిశ్శబ్దం, బిడ్డ పుట్టినప్పటి ఏడుపు, కూనిరాగం, ఆశ్చర్యార్ధకంగా నోటినుంచి వెలువడే శబ్దం, ఇలా ఊహించుకుంటూపోతే వేలకొలది శబ్దాలు మన చెవులపక్క రింగుమంటూ ఉంటాయి

**సంఘటన :**

మానవుడి జీవితంలో మంచి జరుగుతుంది, చెడూ జరుగుతుంది మంచి జరగటానికి కారణమయిన సంఘటన పదేపదే జ్ఞాపకం చేసుకుంటూ ఉంటాడు చెడు జరగటానికి కారణమయిన సంఘటనను మరచిపోవటానికి ప్రయత్నం చేస్తాడు

సంఘటన అంటే ఏమిటి? ఇంగ్లీషులో *Incident* అంటారు అంటే జరిగినది జరిగిన ప్రతిదీ మానవుడి మస్తిష్కం గుర్తుపెట్టుకోదు కనుక ఆ జరిగినది తన జీవితానికి మంచికో, చెడుకో దారి తీస్తే అప్పుడు జ్ఞాపకం ఉంటుంది రామాయణంలో పట్టాభిషేకానికి ఉద్యుక్తుడవుతున్న శ్రీ రామచంద్రుణ్ణి, కైక వరం పేరుతో దశరధుడు అడవికి వెళ్ళమని అడగటం, ఆయన వెళ్ళటం సంఘటన ఈ సంఘటన జరగకపోతే రాముడి వనవాసం ఉండదు

బంగారు లేడిని సీత అడిగి ఉండకపోతే, సీతాపహరణం లేదు, వాలి సుగ్రీవుల కధ లేదు, సముద్రాన్ని హనుమంతుడు లంఘించటం ఉండదు, లంకా దహనం, రావణ సంహారం వరకు ఉండదు

అంటే ఒక సంఘటన జరిగినప్పుడు, సంఘర్షణ మొదలవుతుంది ఆ సంఘర్షణ ఒక దృశ్యం అవుతుంది అటువంటి దృశ్యాలమాలిక సన్నివేశం అవుతుంది కొన్ని సన్నివేశాల సమాహారం చిత్రకధ అవుతుంది

ముందు సంఘటన అంటే ఏమిటో పరిశీలించాలి

> *జీవంతమైన సృష్టిలో అనుక్షణం, ఎక్కడో అక్కడ ఏదో ఒకటి జరుగుతూనే ఉంటుంది ఒక పుట్టుక - ఒక చావు, ఒక పెరుగుదల- ఒక తరుగుదల, సంకోచ వ్యాకోచాలు, స్పందన ప్రతిస్పందనలు, ధ్వని ప్రతినిధులు (?) మొదలైనవి అనేకం అభివ్యక్తం అవుతూ ఉంటాయి వాటికి కారకాలూ, ప్రేరకాలూ గుప్తంగానో, వ్యక్తంగానో ఉండవచ్చు కొన్ని కొన్ని పనులు, పర ప్రమేయమేదీ లేకుండా యాదృచ్ఛికతా రూపంలోనే గోచరిస్తూ ఉండటం కద్దు ఇటు నిత్య జీవితంలో నైతేనేమి, అటు కల్పనా జగత్తులో నైతేనేమి జరిగే ప్రతి పనినీ సంఘటన (Incident) అంటాం*[37]

మలుపు (Plot Point) వేరు, సంఘటన వేరు ఖైదీ చిత్రంలో సూర్యం, మధులత కారులో వస్తున్నప్పుడు మునసబు చూడటం మలుపు అతను చూడకపోతే, వీర భద్రయ్యతో చెప్పకపోతే, వీరభద్రయ్యకు కూతురు ఎదురు తిరగకపోతే, సూర్యం తండ్రి కొడుకు ప్రేమవిషయంలో నిస్సహాయుణ్ణి అని వీరభద్రయ్యతో చెప్పకపోతే, సూర్యం ఆస్తిజప్తు అనే సంఘటన జరగదు అంటే ఒక రకంగా ఈ మలుపు జరగబోయే సంఘటనకు బీజంలాంటిది

ఆస్తి జప్తుఅవుతున్న సంగతి తెలిసి సూర్యంతండ్రి కాళ్ళా వేళ్ళాపడ్డాడు మనసులో వేరే ఆలోచన ఉన్న వీరభద్రయ్య జప్తు చేయించాడు ఆ సంఘటన అక్కడితో ఆగలేదు ఆ రాత్రి వీరభద్రయ్య వాళ్ళు మందు తాగుతూ ఉండగా సూర్యం తండ్రి వెళ్ళి హత్యకు గురవ్వటం, తండ్రి ఆత్మహత్య చేసుకున్నాడని సూర్యం అనుకోవటం, శవాన్ని తీసుకు వెళుతుండగా మళ్ళీ వీరభద్రయ్య వచ్చి మీ నాన్న చేసిన అప్పు పూర్తిగా తీరలేదు, తీరే మార్గమేదో చెప్పే వరకు, శవాన్ని తీసుకు వెళ్ళటానికి వీల్లేదని పేచీ పెట్టటం, సూర్యం ఎదురుతిరగబోతే మునసబు చట్టాన్ని గుర్తు చెయ్యటం, వీరభద్రయ్య అతని చేనుని అతనికే కౌలుకిచ్చి, అప్పు తీర్చుకోమనటం, వ్యవసాయం చెయ్యటానికి ఎడ్లను కొనటానికికూడా సూర్యానికి స్తోమతలేకపోవటం, ఆ స్తోమత లేకపోవటంవల్ల అక్క మేడిపట్టుకుంటే కాడి భుజానవేసుకుని భూమిదున్నటం, అలా భూమిదున్నటం మూలంగా అతనికి మెడవెనుక భుజాలపైన గాయాలవ్వటం, అదిచూసి అక్క కన్నీళ్ళుపెట్టటం, అక్క చేతులు బొబ్బలుఎక్కటం చూసి సూర్యం బాధపడటం, మధులత బంగారం తెచ్చిఇవ్వటం, నువ్విక్కడ వదిలి వెళుతున్నది నగలుకాదు బంగారంలాంటి మనస్నేహాన్ని అని సూర్యం తిరస్కరించటం, ఆమె మౌనంగా తీసుకువెళ్ళిపోవటం, అక్క నీ బావ లేనప్పుడు ఈ మంగళసూత్రం అవసరం నాకు లేదంటూ సూర్యానికి తన మంగళసూత్రం ఇవ్వటం, సూర్యం అరటితోట వెయ్యటం- ఇంతవరకు అనేకదృశ్యాల సమాహారమైన సన్నివేశం జరిగింది

దీని తర్వాత వేరొక సంఘటన జరిగింది పంట మీదున్న సూర్యం చేలోపడి వీరభద్రయ్య మనుషులు అరటి గెలలు కోసుకుపోయారు అది తెలిసిన సూర్యం ఆవేశంతోవచ్చి, అరటి చెట్లను నరికేస్తుండగా, మధులత వచ్చి ఈ పౌరుషం మా నాన్న మీద చూపించవచ్చుగదా అంటే మా అక్క అడ్డువస్తోందని, ఊళ్ళో వాళ్ళ కళ్ళు మా అక్క మీదున్నాయి, నేను కూడా దూరమయితే ఏమయిపోతుంది అని అనటం, ఆ మాట వెనకనుంచి విన్న అక్క, తమ్ముడు అరటిగెలలు తీసుకువెళ్ళిన కరణం

పనిపట్టటానికి వెళ్ళినసమయంలో, మునసబుదగ్గరకొచ్చి నన్ను పెళ్ళి చేసుకొమ్మని అడగటం, అతను అంగీకరించి వెంటనే పెళ్ళి చేసుకుని ఆ రాత్రికి అటవీశాఖాధికారికి ఆమెను తార్చాలనిచూడటం, అక్క పెళ్ళివిషయం తెలుసుకునివచ్చిన సూర్యం కళ్ళముందు అక్క చనిపోవటంతో రెచ్చిపోయి అందరినీ చితకబాదుతూఉండగా జనం పట్టుకోవటం, అతణ్ణి హంతకుడిగా చిత్రించటంతో ఈ సన్నివేశం పూర్తవుతుంది

అయితే ఒక సంఘటన జరిగిన తర్వాత, ఆ సంఘటన మూలంగా సంఘర్షణ జరుగుతుంది సంఘర్షణ అంటే ఏమిటి?

## సంఘర్షణ :

దీన్ని ఆంగ్లంలో 'Conflict' అంటారు అంటే ఒక పాత్రకు, మరో పాత్రకు మధ్య నడిచేది సంఘర్షణ ఆ సంఘర్షణ సిద్ధాంతరీత్యా కావచ్చు, ప్రేమ విషయంలో కావచ్చు, ఆస్తి విషయంలో కావచ్చు, పెళ్ళి విషయంలో కావచ్చు, నైఘంటుకార్థం రాపిడి, ఒరిపిడి అని ఉన్నా - రెండు భావాల మధ్య జరిగేస్పర్ధ సంఘర్షణ అవుతుంది సామాన్యంగా కథానాయకుడికి ప్రతికథానాయకుడికి మధ్య సంఘర్షణ జరుగుతూ ఉంటుంది ప్రేమికుల మధ్య జరుగుతూ ఉంటుంది అన్నదమ్ముల మధ్య, భార్యాభర్తల మధ్య, తండ్రీకొడుకుల మధ్య జరుగుతూ ఉంటుంది

**అగ్ని పుత్రుడు** చిత్రంలో తండ్రీ, కొడుకుల పాత్రల మధ్య తీవ్రవాదం, భక్తివాదం అనే సిద్ధాంతపరమైన సంఘర్షణ జరుగుతూ ఉంటుంది

> *సంఘర్షణ అన్నది మానవస్థితిలోని విపర్యాసాన్ని ఆవిష్కరిస్తుంది ఈ విపర్యాసం కేవలం పైపైకి కనిపించేదైనప్పటికీ కూడా మానవ ప్రకృతిలో ఉన్న సానుభూతి-స్పర్థ అనే లక్షణాలకు స్వప్రయోజనపరత - నిస్వార్థ దృష్టి అనే విరుద్ధ ధ్రువాలకు మధ్య ఉండే మౌలిక సంఘర్షణలోకి పర్యవసిస్తుంది మానవ స్వభావాన్నీ స్థితిగతులనూ లోతుగా తరచి చూడటానికి ఇది తోడ్పడుతుంది* [38]

న్యూటన్‌సిద్ధాంతంలో ప్రతిచర్యకూ, ప్రతిచర్య ఉన్నట్లే, ఒక పాత్ర చేసిన పనికి మరో పాత్ర స్పందించినప్పుడు పుట్టేదే సంఘర్షణ అది సంవాద రూపంలో ఉండవచ్చు, పోరాట రూపంలో ఉండవచ్చు, మౌనపోరాటరూపంలో ఉండవచ్చు

## సన్నివేశము :

సూర్యుడి చుట్టూ నవగ్రహాలు తిరుగుతున్నట్టు, సన్నివేశంచుట్టూ అభినయం, పాత్రలూ, సంభాషణలూ, సంఘర్షణలూ, సంఘటనలూ పరిభ్రమిస్తూనే ఉంటాయి

కొన్ని దృశ్యాలు కలిస్తే సన్నివేశమవుతుంది. ఇంతకు ముందు తెలియజేయటం జరిగింది. సన్నివేశం చిత్రకథలో వెన్నెముక వంటిది. అద్భుతమైన సన్నివేశాలు లేకపోతే చిత్రకథ వెన్నెముక లేని మానవశరీరం వంటిది!

ఒకే ఊహ (Idea)కు లేదా ఒకే అంశానికి సంబంధించిన అనేక దృశ్యాల కలయిక సన్నివేశం.

మల్లీశ్వరి తీసుకుంటే, నాగరాజు మల్లీశ్వరి ఇద్దరూ సరదాగా తిరునాళ్ళకు వెళ్ళారు. అతి సాధారణంగా జరుగుతున్న ఆ దృశ్యంలో నాగరాజు, మల్లమ్మకు జ్యోతిష్యుడు జ్యోతిష్యం చెబుతూ, మల్లమ్మకు మహారాణీ యోగం ఉందని చెబుతాడు. 'నువ్వు చూపించుకో బావా' అంటే, 'నువ్వు మహారాణివయితే నేను మహారాజునే' అంటాడు. ఈచిత్రరచయిత దేవులపల్లి కృష్ణశాస్త్రి, కృష్ణ దేవరాయల సమాగమం, అందులో నాగరాజు తన మరదలికి రాణీవాసం పల్లకీ పంపమనటంతో, రాబోయే సంఘటనకి బీజంగా వేసాడు.

రాయలవారు మల్లీశ్వరి నాట్యానికి మెచ్చి హారం బహుమతిగా ఇవ్వబోతే 'ముక్కూ-మొహం తెలియనివాళ్ళు ఇచ్చే బహుమతులు తీసుకోము' అంటుంది. పండితులవారు ఆయన తండ్రి లాంటివాడు అని సూచిస్తాడు. నాగరాజు 'పెద్దలిచ్చేది ... ...' అంటాడు. 'తీసుకో' అని హితవు చెబుతాడు. మల్లీశ్వరి ముందుకువచ్చి తీసుకుంటూ ఉండగా ఉరుముల శబ్దాలు నేపధ్యంలో వినిపిస్తుంటాయి. ఇది శిల్పానికి సంబంధించిన అంశం. అప్పుడు చర్చించుకోవాలి.

కూతురు ఇంకా ఇంటికి తిరిగిరాలేదని మల్లీశ్వరితల్లి ఆందోళన పడుతూ ఉంటుంది. ఆ తర్వాత నాగరాజు గుహలో తన ఎదురుగా ఉన్నది రాయలు అని తెలియక రాణీవాసం పల్లకీ తన మరదలికోసం పంపమని అడుగుతాడు. ఆ మాటను ఎగతాళి చేస్తుంది మల్లీశ్వరి. అది అయిష్టత అని బయటపడలేదు. వెక్కిరింతలాగా ఉంది. వెళుతున్నప్పుడు జామపళ్ళుఇచ్చి పంపింది. దూరంగా వెళ్ళాక కూడా అరుస్తూ నాగరాజు రాణీవాసం పల్లకి గురించే చెబుతాడు.

'ఎందుకు బావా వాళ్ళతో అలా చెప్పా'వంటే, 'ఆ వీళ్ళకు రాయలవారి దర్శనం కూడా కాదు' పొమ్మంటాడు. సన్నివేశానికి బలం చేకూరుస్తూ రాయలవారు తన కోటలోకి వెళ్ళటం, జామపండు ప్రస్తావన, రాణీ గారితో మల్లీశ్వరి రాణీవాసం గురించి చెప్పటం, ఒక దాని తర్వాత ఒకటి చకచకా జరిగి పోయాయి.

అంటే ఇవన్నీ రాబోయే రాణీవాసపు పల్లకి గురించిన, ఒక అంశానికి సంబంధించిన దృశ్యాలు. ఒక పెళ్ళి జరగాలి అంటే, పెళ్ళికొడుకు ఇంటి దగ్గర బయలుదేరటం,

పెళ్ళికూతురుని ఇంటి దగ్గర సిద్ధం చేయటం, పెళ్ళి వారు రావటం, పెళ్ళి చూపులు, అవునుకోవటం, అల్పాహారం, నిశ్చయాలు, తాంబూలాలు, పెళ్ళి, విడిది, తాళి కట్టే వరకూ ఏకాంశమే ఇలాగే ఒక చావు గురించయినా, ఎన్నికల గురించయినా, ఒక అంశానికి సంబంధించి అనేక దృశ్యాలు కలుస్తాయి

ప్రతి సన్నివేశానికీ, కథకు ఉన్నట్లే, ఆరంభం, మధ్యమం, ముగింపు ఉంటాయి

**దృశ్యం : (The Scene)**

దృశ్యం కూడా చిత్రకథలో కథను ముందుకు నడపటానికే ఉపకరిస్తుంది

*The purpose of the scene is to move the story forward* [39]

చిత్రకథలో అతి ముఖ్యమైనది దృశ్యం ఈ దృశ్యం అనేది నిస్సారంగా ఉంటే సన్నివేశం బలహీనమయిపోతుంది

దృశ్యంలో సంభాషణ ఉండాలా? నిశ్శబ్దంగా ఉండాలా? దృశ్యం కొట్లాటకు సంబంధించినదా? ఆ దృశ్యం ఎక్కడ జరుగుతుంది? ఊళ్ళోనా, వీధిలోనా, గుళ్ళోనా? పడక గదిలోనా, నట్టింట్లోనా, వసారాలోనా, పెరట్లోనా, కారులోనా, విమానంలోనా, రైలు బండిలోనా, లారీలోనా, ట్రాక్టరులోనా, పొలంలోనా, గడ్డివాము దగ్గరా? ఇలా రకరకాల ప్రదేశాల గురించి, ఆ దృశ్యంలో పాల్గొనే పాత్రలెందరు? ఏ పాత్ర మాట్లాడాలి, ఏ పాత్ర మౌనంగా ఉండాలి! ఆ దృశ్యం ఎప్పుడు జరుగుతుంది? ఉదయమా? మధ్యాహ్నమా? సాయంత్రమా? రాత్రిపూటా? నడిరేయా? తొలికోడి కూసినప్పుడా, తెలతెలవారుతూ ఉండగానా? అనేది కూడా విశ్లేషించాలి

సన్నివేశంలాగానే దృశ్యానికి కూడా ప్రారంభం, మధ్యమం, పతాకం ఉంటాయి

దృశ్యంలో దృశ్యప్రధానమైనవి, ధ్వని ప్రధానమైనవీ ఉంటాయి సంభాషణలు లేని పోరాటాల్లో, పొడి పొడి మాటలు తప్ప, దీర్ఘ సంభాషణలుండవు అలాగే సంభాషణతో నిండిన దృశ్యంలో పోట్లాటలుండవు నిజానికి చలనచిత్రంలో దృశ్యాలు రెండింటి కలయికతో ఎక్కువ ఉంటాయి

అసలు దృశ్యం ఎందుకు?

సాహిత్యంలో రచయిత కథ రాసుకుంటూ వెళ్ళేటప్పుడు దృశ్యంలా కాక వివరణాత్మకంగా వెళుతూ ఉంటాడు చలనచిత్రంలో ఆ వివరణలు ఉండవు కాబట్టి అభినయం, సంభాషణలతో దృశ్యంలా ఉంటుంది ఆ దృశ్యం కథను ముందుకు నడపటానికి కావాలి అని తెలుసుకున్నాక ఆ దృశ్యం ఏఏ సందర్భాలలో సృష్టించబడుతుంది? అని పరిశీలించాలి

1 పాత్రల పరిచయానికి దృశ్యం కావాలి

2 పాత్రలప్రవర్తనను బహిర్గతంచేయటానికి దృశ్యం కావాలి

3 కథను కదపడానికి దృశ్యం కావాలి

4 పాత్రల సంఘర్షణకు దృశ్యం కావాలి

5 వాతావరణం చూపించటానికి దృశ్యం కావాలి

6 దృశ్యంలో వ్యక్తిత్వవికాసం చూపించవచ్చు

7 వినోదంకోసం దృశ్యం సృష్టించవచ్చు

8 ఆశయ ప్రకటన లేదా సిద్ధికోసం సృష్టించవచ్చు

9 శృంగారం మొదలైన నవరసాల కోసం దృశ్యం సృష్టించవచ్చు

10 అనుభూతి కోసం దృశ్యం సృష్టించవచ్చు

11 సిద్ధాంత ప్రదర్శనకోసం దృశ్యం సృష్టించవచ్చు

12 పాటకు ప్రాతిపదికగా దృశ్యం సృష్టించవచ్చు

13 దృశ్యానికి, దృశ్యానికి వంతెనగా విషయప్రాధాన్యం లేని దృశ్యం సృష్టించవచ్చు (అనుసంధానదృశ్యం)

14 క్రీడకోసం దృశ్యం సృష్టించవచ్చు

15 పోరాటంకోసం దృశ్యం సృష్టించవచ్చు

16 సంఘటనకోసం దృశ్యం సృష్టించవచ్చు

17 యుద్ధంకోసం దృశ్యం సృష్టించవచ్చు

18 ప్రయాణంకోసం దృశ్యం సృష్టించవచ్చు

19 స్నానానికి దృశ్యం సృష్టించవచ్చు

20 మానభంగానికి దృశ్యం సృష్టించవచ్చు

21 హత్యకోసం దృశ్యం సృష్టించవచ్చు

ఇలా రకరకాలుగా ఒక దృశ్యం సృష్టించబడుతుంది

ఇన్ని దశాబ్దాలుగా ప్రజల మస్తిష్కాల్లో హత్తుకుపోయిన మల్లీశ్వరి చిత్రాన్ని, ఉదాహరణగా తీసుకోవటం జరిగింది ఈ చిత్రం, చిత్రకథలో ఎన్ని దృశ్యాలున్నాయి, వాటి ప్రయోజనం ఏమిటి? ఆ దృశ్యాలు సన్నివేశాలుగా ఎలా మారాయి? ఆ సన్నివేశాలు చిత్రకథలో ఎలా ఇమిడాయి అన్నది పరిశీలించాలి

ఒకే చిత్రంలోనుంచి ఎందుకు పరిశీలించాలి? నిజానికి డెబ్బై రెండు సంవత్సరాల చలన చిత్రచరిత్రలో ఈ స్క్రీన్ ప్లే ని ఎందరో ఎన్నో రకాలుగా భావించారు

కొందరు చిత్రానువాదం అన్నారు కొందరు చిత్రానుకరణ అన్నారు కొందరు సినేరియో అన్నారు *కథాసంవిధానం, కథావిస్తరణ, కథనం* ఇలా రకరకాలుగా ఉపయోగించారు పరిశ్రమలో, ఏమిటో తెలియకపోయినా, కొందరు దర్శకులు స్క్రీన్‌ప్లే అన్నదాన్ని, ఇంటిపేరులాగా వేసుకుంటారు అనే నానుడి కూడా ఉంది

తెలుగులో ఇప్పటికీ ఈ విషయమై ప్రామాణికగ్రంథం ఏదీ లేకపోవటం వల్ల, ఎవరికి తోచిన రీతిలో వారు, ఈ స్క్రీన్‌ప్లే గురించి భావిస్తున్నారు కొందరు ఏకవాక్య చిత్రకథ స్క్రీన్ ప్లే అని, కొందరు దృశ్యమాలిక స్క్రీన్‌ప్లే అని, రకరకాలుగా, కాగితం మీద పెట్టకుండా మౌఖికంగా మాట్లాడుతూ ఉంటారు

నిజానికి స్క్రీన్‌ప్లే అంటే చిత్రకథ దాని స్వరూపస్వభావాలేమిటో అర్థమయ్యేలా వివరించాలంటే ఒక చిత్రం నుంచి దృశ్యమాలికను తీసుకుని వివరిస్తే బాగుంటుందని, పైగా పామర పండితలోకం చేత, ప్రపంచంలో ఉన్న తెలుగు వారందరి మన్ననలు పొందిన దృశ్యకావ్యం మల్లీశ్వరిని, ఉదహరిస్తే బాగుంటుందని భావన

**దృశ్యమాలిక (Scenic Order):**

సాంకేతికవర్గం, నటీనటులు పూర్తయ్యాక

| | |
|---|---|
| దృశ్యం1 | చిత్తూరు వి నాగయ్య గళంలో దక్షిణాపథాన్ని పరిపాలించిన విజయనగర సార్వభౌముడు శ్రీకృష్ణ దేవరాయల గురించి ఆబాలగోపాలమూ ఆప్యాయంగా చెప్పుకుంటూ వచ్చిన గాథలు ఈ మల్లీశ్వరి కథకు ఆధారము అని చెప్పించటం |
| ప్రయోజనం | ధ్వని ప్రధానంగా ప్రారంభమయ్యింది ఈ దృశ్యం కేవలం ఈ కథ ఊహాజనితమయ్యిందే కాదు, కృష్ణదేవరాయల కాలంలో జరిగింది అన్న విషయం చెప్పటంకోసమే ఈ దృశ్యం |
| దృశ్యం2 | మల్లీశ్వరి, నాగరాజు బాల్యంలో ఉండగా పాట పాడుకోవటం |
| ప్రయోజనం | ఆడుతూ పాడుతూ బతికేవాళ్ళు అన్న విషయం, పరిచయం కోసం ఈ దృశ్యం |
| దృశ్యం 3 | కోతితో పోల్చి బావను మల్లీశ్వరి ఆడించటం తన్నులు కావాలా? అని నాగరాజు భయపెట్టటం |
| ప్రయోజనం | ఈ వేళాకోళమే తదనంతర కాలంలో మల్లీశ్వరి జీవనగమనాన్ని ఇరుకున పడేసింది అన్నది స్థాపించటం కోసం ఈ దృశ్యం |

దృశ్యం 4 బావి దగ్గరకు మల్లీశ్వరి కుండ తీసుకొచ్చి మంచినీళ్ళు అడగటం బసక్క మీ అమ్మ నీ కోసం ఊరంతా గాలిస్తోంది, ఇంటికి పో తెలుస్తుంది అనటం

ప్రయోజనం ఆ తల్లికి నాగరాజుతో మల్లీశ్వరి తిరగటం ఇష్టం లేదన్న ధ్వనితో కూడిన దృశ్యం

దృశ్యం 5 గోవిందమ్మ నాగరాజు తల్లి నాగమ్మ, గోవిందమ్మ మీద విరుచుకుపడి ఆ గాడిదతో తిరిగి మా పిల్ల గాడిదైపోతుంది అని అరవటం కుమ్మరి పాపన్న ఇంటికి తన కూతురు పెళ్లి కోసం వెళ్ళటం నిరసించటం

ప్రయోజనం గోవిందమ్మ అంటే ఇష్టం లేదు అని తెలియజేయటం దృశ్యం నాలుగులో బీజ ప్రాయంగా ఉన్న విషయం నిజమేనని స్థాపించటం

దృశ్యం 6 మల్లీశ్వరి మంచి రాతి బొమ్మని మాసాను అని చెప్పి కోతి బొమ్మను చూపించటం నాగరాజు మల్లీశ్వరితో గుంజీలు తీయించటం 6,8, 10, 12 అంటూ లెక్క తప్పించి గుంజీలు తియ్యటం ఇంతలో గంట మోగటంతో, పూజయిపోతుంది రా బావా అంటూ గుడి దగ్గరకు తీసుకెళ్ళటం

చెట్లకు నీళ్ళన్నీ నేనే పోసా అంటే, నీకూ రాజాకి పెళ్ళిచేస్తాం అంటే సిగ్గుపడి పో స్వామి అంది శిల్పులు నాగరాజు శిల్ప కళానైపుణ్యాన్ని పొగడటం ప్రసాదం మొత్తం బావకేపెట్టి అతను తింటుంటే మళ్ళీ కోతిని చూసి నవ్వటం నాగరాజు వెంటపడటం

ప్రయోజనం ఇదే విషయాన్ని మూడుసార్లు ఉపయోగించుకున్నారు రచయిత, దర్శకులు పిల్లలు పెద్దవాళ్ళయినప్పుడు, రాణీవాసం నుంచి తిరిగి వచ్చాక, పాత్రల వ్యక్తిత్వ ప్రదర్శనకోసం

దృశ్యం 7 పరుగెత్తుతున్న కూతుర్ని నాగమ్మ పట్టుకోవటం, నాగరాజు పారిపోవటం అతన్ని వెతుకుతూ నాగమ్మ బయలుదేరటం

ప్రయోజనం ఈ దృశ్యంలో విషయం ఇంతకుముందు పరిచయమయ్యిందే అయినా, వేరొక పాత్ర పరిచయం చేయటానికి, రాణీవాసపు పల్లకీలు చూపించటానికి 'లీడ్'గా వాడుకున్నారు

దృశ్యం 8 చెట్టు మీదున్న నాగరాజుని దిగమని నాగమ్మ అడగటం దూరంగా వస్తున్న బండిని చూసి, మల్లీశ్వరి అదిగో మావయ్య బండి అని చెప్పటం హనుమంతప్ప బండి దిగటం నీ మేన కోడలు, అదిగో ఆ చెట్టు మీద కొండ ముచ్చు, నన్ను ఇంట్లో ఉండనివ్వటం లేదని ఫిర్యాదు చెయ్యటం దూరంగా వెళుతున్న రాణీవాసపు పల్లకిని చూడటం

ప్రయోజనం నాగమ్మ అన్న నత్తివాడయిన హనుమంతప్ప పరిచయం కోసం, తరువాత మల్లీశ్వరి కోసం నాగరాజు అడగబోయేది, మల్లీశ్వరి కోసం వచ్చేది అయిన రాణీవాసపు పల్లకీని, దృశ్యంగా చూపించి పరిచయం చెయ్యటం

దృశ్యం 9 ఇంట్లో బావని మెచ్చుకుంటున్న మల్లీశ్వరిని తల్లి నాగమ్మ మందలించింది నాగప్ప, హనుమంతప్ప, విజయనగరం నవరాత్రి కొలువుకి రాని విషయమై చర్చించటం గోవిందమ్మ వస్తే నాగమ్మ ఈసడింపుగా చూడటం కొడుకు అక్కడ లేడని తెలుసుకుని, ఇదంతా నా రాత వదిన అంటూ గోవిందమ్మ బయటకు వెళ్ళటం

ప్రయోజనం వ్యక్తిత్వ ప్రదర్శన, పాత్ర పరిచయం కోసం

దృశ్యం 10 నాగరాజు రాతికి జీవం పోస్తూ శిల్పం చెక్కటం, పిలిస్తే పలకలేదన్న అలకతో మల్లీశ్వరి కూడా రాతిమీద బొమ్మ చెక్కటం తనుపిలిస్తే పలకలేదని పిల్లి బొమ్మ చెక్కి కింద మల్లి అని చెక్కటం మల్లి మంచినీళ్ళిస్తే తాగటం బావ మురళీనాదానికి వెళుతున్న మల్లి పాదాలు ఆగి పోవటం

ప్రయోజనం మల్లీశ్వరికి బావ వేణుగానం అంటే ఇష్టమని తెలియజెయ్యటం రాణీవాసం నుంచి బయటకు వచ్చినప్పుడు ఈ వేణుగానం వినే వెళుతుంది

దృశ్యం 11 ఓ బావా పాట

పాటలో పరుగుతీస్తున్న పిల్లలు పెద్దవాళ్ళుగా మారిపోవటం

ప్రయోజనం చాలా చిత్రాల్లో పాటలోనే పిల్లలను పెద్దవాళ్ళను చేస్తారు ఆంగ్లంలో *'Time laps'* అంటారు కాలం గడిచి వాళ్ళు పెద్దవాళ్ళయ్యే వరకూ చెప్పవలసిన విషయం లేనప్పుడు ఇలాటి ప్రక్రియను ఉపయోగిస్తారు

దృశ్యం 12 — మల్లీశ్వరితో నాగరాజు గుంజీలు తీయించటం. ఎదిగిన మల్లీశ్వరి కూడా దొంగలెక్కలు చెప్పి గుంజీలు తియ్యటం. నవ్వుల్లో పూజారి కొట్టిన గంట వినిపించి వెళ్ళటం.

గుళ్ళో ప్రసాదం అందుకోవటం. ఇద్దరూ ఎప్పుడు పెళ్ళి చేసుకుంటారోనన్న ఆకాంక్షను పూజారి వ్యక్తం చేయటం.

ప్రయోజనం — *పూజారి ఇద్దరి పెళ్ళి గురించి మాట్లాడితే చిన్నప్పుడు 'పొండి స్వామీ' అన్న మల్లీశ్వరి, వంగి నమస్కరించటం, పాత్ర వ్యక్తిత్వ ప్రదర్శనకోసం! చిన్నప్పుడు సిగ్గు! ఇప్పుడు ఇష్టం!*

దృశ్యం 13 — కోతి బావకు పెళ్ళంట పాట

ప్రయోజనం — *ఆటవిడుపు*

దృశ్యం 14 — ఏకాగ్రతతో పనిచేస్తున్న నాగరాజు మీద చెట్లకు నీరు పోసిన మల్లీశ్వరి నీళ్ళుచల్లటం, నాగరాజు కోప్పడటం. నీకు కోపం ముక్కుమీదే ఉంటుంది అని ముక్కు పట్టుకుని ఆడించటం. రాతిబొమ్మ మోజులోపడి అసలు బొమ్మని మరిచిపోతావేమో అనటం. అల్లరిబొమ్మకంటే రాతిబొమ్మేనయం అనటం. అలిగి వెళ్ళిన మల్లీశ్వరి గుడి మెట్ల మీద శిల్పంలా కూర్చోవటం. నాగరాజు వచ్చి వెక్కిరించటం. మల్లీశ్వరి పకపకా నవ్వటం (డిజాల్వ్)

ప్రయోజనం — *రాతిబొమ్మ మోజులోపడి అసలుబొమ్మను మరిచిపోతావేమో అంటే అల్లరిబొమ్మ కంటే రాతిబొమ్మే నయం అనటం ద్వారా, గండము (Dramatic Irony) ప్రదర్శనకు ఈ దృశ్యం ఉపయోగపడింది*

దృశ్యం 15 — మల్లీశ్వరి, నాగరాజు తిరునాళ్ళకు వెళ్ళటం సంబరం. చెరుకు ముక్కలు తింటూ ఇద్దరూ తిరుగాడటం. ఎలుగుబంటిని చూసి మల్లీశ్వరి కంగారుపడటం. జ్యోతిష్యుడు ఏకచక్రీమహాభోగీ మహారాణివవుతావ్ అంటే, నువ్వూ చూపించుకో బావా అంటే ఆ, నా చెయ్యి ఎందుకూ, నువ్వు మహారాణివయితే నేను మహారాజుని అయినట్టే అని ఆలస్యమై పోతుంది గాని, లెండి మహారాణీగారూ లెండి అని బయలుదేరటం

ప్రయోజనం — *తిరునాళ్ళలో వాతావరణం కోసం వాడబడ్డట్టుగా ఉండే ఈ దృశ్యం మల్లీశ్వరికి మహారాణీయోగం ఉందని సూచించటానికి ఉపయుక్తం అయ్యింది*

దృశ్యం 16 బండిలో పాట

ప్రయోజనం వినోదం

దృశ్యం 16ఎ వర్షం తరుముకొస్తుందని సత్రంలోకి వెళ్ళటం

ప్రయోజనం పాట వర్షం మూలంగా ఆగింది వర్షం వాతావరణమే కానీ జరగబోయే సంఘటనకు ఏ రాయల సమావేశం బీజం అవుతుందో, ఆ దృశ్యానికి ఈ దృశ్యం కారణమయ్యింది

దృశ్యం 17 పిలిచినా బిగువటరా పాట

దానిని కృష్ణ దేవరాయిలు, పండితుడు గమనించటం

ప్రయోజనం పిలిచినా బిగువటరా పాట ఈ పాటను ప్రత్యక్షంగా నాగరాజు, పరోక్షంగా రాయలవారు, పండితుడు ఆస్వాదించటం ఈ రసాస్వాదనే మల్లీశ్వరిని చిత్రకథ చివరిలో మహారాజు క్షమించటానికి కారణం

ఇందులోనే ముక్కు, మొహం తెలియని వారిచ్చే కానుక తీసుకోను అనటం మహారాణీ వారి ఇష్ట సఖి ప్రస్తావన దాని మూలంగా రావటం, నారప్పను గురించిచెప్పగా తరువాతి దృశ్యం నారప్ప మీద ప్రారంభమవటానికి కారణం అయ్యింది

దృశ్యం17ఎ నాగరాజు, మల్లీశ్వరి రాయలవారితో సమాగమం తన మామగారి ఊరే అని తెలిసిన మల్లీశ్వరి మామ గురించి మాట్లాడటం రాయలవారి రాణీ వాసానికి కావాల్సిన చీరలన్నీ తన మామ దగ్గరే కొంటారని చెప్పటం, తన ఊరు వీరాపురం అని, మల్లీశ్వరి తనమామ నారప్పకూతురని చెప్పటం, తన నాట్యాన్ని మెచ్చుకుంటే ఏదో బావ కోసం సరదాగా ఆడానని చెప్పటం రాయల వారు మెడలోహారంఇస్తే మల్లి వద్దంటే పెద్దలు ఇచ్చింది వద్దనకూడదని చెప్పటం, తాము పద్మశాలీలమని, తన మామ నారప్పకు నూరు మగ్గాల దాకా ఉన్నాయని చెప్పటం

ప్రయోజనం రాజుల్ మత్తులు వారిసేవనరకప్రాయంబు అని ధూర్జటి చెప్పినట్లు, ఈ సంభాషణ పొడిగించబడటం దేనికి దారి తీస్తుందో అన్న ఉత్కంఠ కల్గించటం కోసం

దృశ్యం 18 నాగమ్మ కూతురు ఇంటికి రాలేదని అరవటం నారప్ప నువ్వే కూతుర్ని అల్లరి చేస్తున్నావని చెప్పటం

ప్రయోజనం నారప్ప, నాగమ్మ గాలి వానలో ఇరుక్కుపోయిన మల్లీశ్వరి గురించి చర్చించటానికి ఉపయుక్తమయ్యింది

దృశ్యం19 రాణీవాసపు పల్లకీ మల్లీశ్వరికి పంపమని అడగటం మల్లీశ్వరి జామపళ్ళు ఇవ్వటం రాణీవాసపు పల్లకీ పంపమని ఎందుకు చెప్పావు అని అడిగితే, వీళ్ళురాణివాసపు పల్లకీ, పట్టపుటేనుగు పంపే వాళ్ళు కారు, వాళ్ళకు రాయలవారి దర్శనమే దొరకదు అనటం మళ్ళీచిలిపిగా రాణివాసపుపల్లకీ పంపమని అరుస్తుంటే నోరు ముయ్యటం దూరంగా గుర్రాలను చూసి పెద్ద గుర్రాలని చెప్పటం నాగరాజు హారం గురించి పొగడటం

ప్రయోజనం తదనంతరం నాగరాజు, మల్లీశ్వరిల వియోగానికి హేతువయిన దృశ్యం ఇదే అందుకే అక్కడ జరగబోయే సంఘటనకు ఇక్కడ ఈ దృశ్యం బీజమయ్యింది పెద్దగుర్రాలు ఎక్కి రాయల వారు వెళుతున్నా - తాను అడిగింది రాయల వారినే అని నాగరాజు తెలుసుకోలేక వీళ్ళకు రాయల వారి దర్శనం కూడా కాదు అని చెప్పటంతో, పాత్ర వ్యక్తీకరణకోసం కూడా ఈ దృశ్యం

దృశ్యం 20 నాగమ్మ హారాన్ని అమ్మలక్కలకు చూపిస్తుంటే నారప్ప చివాట్లు పెట్టటం

ప్రయోజనం హారాన్ని పదిమందికి చూపిస్తూ - ఇచ్చకాలకు ఇష్టపడే నాగమ్మని ఎవరో ఇచ్చిన హారాన్ని గొప్పగా చెప్పుకుంటున్నావ్ అన్న నారప్ప, దారిని పోయే వాళ్ళు అని వాడటం వల్ల ఈ పాత్రలు కూడా, ఇచ్చింది రాయలవారని తెలుసుకోలేకపోతున్నారు అని తెలియజెయ్యటం

దృశ్యం 21 కోటలోకి రాయలవారు రావటం పరిచారికలు, సేవకులు వందనాలు అర్పించటం పుష్పాలతో, హారతులతో స్వాగతించటం

ప్రయోజనం నిజంగా అతను రాయలేనా అన్న అనుమానాన్ని పటాపంచలు చేస్తూ - మాంటేజ్‌లో ఆయన రాయలే అని నిశ్చయిస్తూ రెండు మూడు దృశ్యాలు

దృశ్యం 22 వీణ వాయిస్తున్న అమ్మాయిలు వెళ్ళిపోవటం తిరుమలదేవి మరకత మాణిక్యాలకురానిమర్యాద ఈ జామపండుకి వచ్చింది అంటే, విషయం చెప్పి మల్లీశ్వరి మహారాణి వారి ఇష్టసఖి కావాలన్న నాగరాజు కోరిక చెప్పటం పాపం ఆ చిన్నవారి మనసులో రాణివాసపు భోగభాగ్యాలంటే వింత వింత ఊహలున్నాయి కాబోలు అనటం

ప్రయోజనం ఆ చిన్న వారి మనసులో రాణీవాసపు భోగభాగ్యాలంటే వింత వింత ఊహలున్నాయి కాబోలు అనటం ద్వారా, మల్లీశ్వరి కష్టాలు పడబోతోంది అన్న సూచన కోసం ఈ దృశ్యం

దృశ్యం 23 పాట

దృశ్యం23ఎ బసక్క పాట పాడమని అడగటం మల్లీశ్వరి ఎగతాళి చెయ్యటం

ప్రయోజనం ఈ పాట, దృశ్యం చిత్రంలో లేకపోయినా ఫరవాలేదు అనిపిస్తుంది కాని, ఉత్కంఠకు లోనైన ప్రేక్షకుడి హృదయానికి కాస్త విశ్రాంతి ఇవ్వటానికి ఇలాంటి దృశ్యాలు చిత్రాల్లో వాడతారు

దృశ్యం 24 రాట్నాలు వడుకుతున్నప్పుడు, గోవిందమ్మ తన కొడుక్కి మల్లీశ్వరితో పెళ్ళి జరుగుతుందని ఆశపడటం ఈ పెళ్ళి జరుగుతుందో లేదో నాగమ్మ మాపు విజయనగరం మీద ఉందని, అమ్మలక్కలు ఈ పెళ్ళి జరుగుతుందోలేదోనని చర్చించటం

ప్రయోజనం కథానాయకుడి ఆశయానికి భంగం కలగబోతోందన్న సూచన కోసం ఈ దృశ్యం

దృశ్యం 25 తిరిగి తిప్పలు పడందే వరుడెక్కడ దొరుకుతాడు అని నాగమ్మ అనటం మేనల్లుడికి ఇద్దామన్న ఆలోచన భర్త చెబితే, నాగమ్మ అంగీకరించకుండా ఈ పెళ్ళి చేస్తే ఉరి పోసుకు చస్తాననటం, అప్పుడే వచ్చిన గోవిందమ్మ బాధగా వెనుదిరిగి వెళ్ళిపోవటం

ప్రయోజనం మల్లీశ్వరికీ, నాగరాజుకి పెళ్ళి చేస్తే ఉరి పోసుకుని చస్తానని నాగమ్మ బెదిరించటం ద్వారా పూర్వపు దృశ్యానికి బాధకంగా ఈ దృశ్యం నాగరాజు ఊరు వదలివెళ్ళటానికి కూడా ఈ దృశ్యమే కారణం అవుతుంది

దృశ్యం 26 గోవిందమ్మ, నాగరాజుకి ఆ మాట చెబితే, కంచంలో చెయ్యికడిగేసి బాధపడటం ధనం సంపాదించుకువస్తానని చెప్పటం

ప్రయోజనం ఆశయ సాధన కోసం కథానాయకుడు ఊరువదిలి వెళితే కథానాయికకు ఏం జరుగుతుందోనన్న అనుమానం, శంకమూలంగా వచ్చే అంతర్లీనమైన ఉత్కంఠ

దృశ్యం 27 నాగరాజు ఊరు వదిలి వెళ్ళిపోవటం మల్లీశ్వరి వెంట పడటం ధనంతో తిరిగి వస్తానని, తల్లిని చూసుకోమని చెప్పటం

ప్రయోజనం ఇన్నాళ్ళుగా ఎగతాళి చేసుకున్న ప్రేమికులు మొదటిసారిగా నిజంగా చర్చించుకోవటం ఈ దృశ్యంకూడా పల్లకీ వచ్చే సమయానికినాగరాజు ఊళ్ళో లేడు అని చెప్పటం కోసం సామాన్యంగా చిత్ర కథల్లో నాయకుడు ఉండగా అతని తరుపు వాళ్ళకు అన్యాయం జరిగితే కథానాయకుడి పాత్రవైచిత్రి దెబ్బ తింటుందన్న నమ్మకం ఇప్పటికే రాణీవాసపు పల్లకీ పంపటానికి రాయలు

నిశ్చయించుకున్నాడు గనుక, నాగరాజు లేని సమయంలో ఏది వస్తుందేమోనన్న బెంగ ప్రేక్షకుడి హృదయంలో స్థాపించటం కోసం, రాబోయే విరహానికి ఆదిగా ఈ దృశ్యం ఉపయోగించబడింది

**దృశ్యం 28** నాగరాజు ఒక కొండప్రాంతానికి చేరి ఉద్యోగం సంపాదించి రాళ్ళను శిల్పాలుగా చెక్కటం ఒక కళాభిమాని మెచ్చుకోవటం

**ప్రయోజనం** ఆశయసాధన ప్రారంభమయ్యింది అని సూచించటానికి ఈ దృశ్యం

**దృశ్యం 29** గోవిందమ్మ మంచాన పడితే మల్లి సేవలు చెయ్యటం బావ విషయంగా నేను ఒక మనిషిని పంపానని, తనకీ బావను చూడాలని ఉందని చెప్పటం

**ప్రయోజనం** కొడుకును అనవసరంగా దూరం చేసుకున్నానన్న బాధ తల్లికి, ప్రియుడికి దూరమయ్యానన్న బాధ ప్రియురాలికి ఉంది, అన్నది ఋజువు చెయ్యటం కోసం ఈ దృశ్యం

**దృశ్యం 30** నాగరాజు విజయనగరప్రాంతం చేరుకుని శిల్పాలు చెక్కటం అతని హస్త లాఘవానికి అందరూ ఆశ్చర్యపోవటం మేఘమాల పాట

**ప్రయోజనం** ఏ విజయ నగరానికి మల్లీశ్వరి రాబోతోందో అక్కడికి చేరాడు, ఇక్కడేమన్నా జరుగుతుందా? అన్న ఉత్కంఠ కోసం

**దృశ్యం 31** మేఘమాల పాట చివర్లో మల్లి ప్రసాదం తీసుకోకపోవటం

**ప్రయోజనం** మేఘమాల పాట

కాళిదాసు మేఘసందేశం స్ఫూర్తి కనిపిస్తుంది పాటలో బావామరదళ్ళ విరహం కోసం వాడబడింది పూజారి గంట మొదటిసారి విన్లేదు అంటే, ఆమె మానసిక పరిస్థితి విశ్లేషణకు ఉపయోగ పడుతుంది

**దృశ్యం 32** రాణీవాసపు పల్లకి రావటం

**ప్రయోజనం** ఉత్కంఠ ఇంట్లో కథానాయిక లేదు ఊర్లో కథానాయకుడు లేడు ఏదన్నా జరిగి ఆగితే బాగుండన్న ఆశ కల్పించటం కోసం

**దృశ్యం 33** కుండతో మల్లీశ్వరి నూతి దగ్గరకు బయలుదేరటం

**ప్రయోజనం** ఈ దృశ్యం మాములుగా ఆలోచిస్తే కావాలా అనిపిస్తుంది కాని ఆమెకు రాణీవాసపు పల్లకీ వచ్చిన సంగతి తెలియదు ప్రేక్షకుడికి తెలుసు ప్రేక్షకుడి దృష్టికోణంలో, నాటకీయ దృష్టి కోణంలో, నిడివి చిన్నదయినా, ఈ దృశ్యం, ఉత్పత్తి చెందబోతున్న కరుణ రసానికి ప్రాతిపదికగా వాడబడింది

| | |
|---|---|
| దృశ్యం 34 | రాణివాసానికి వెళ్ళాలని తెలిసి, మల్లీశ్వరి మూర్ఛపోవటం హనుమంతప్ప ఒక్కసారిగా ఇలాంటి వార్త వినబట్టే, ఇలా అయి ఉంటుందని నచ్చచెప్పటం |
| ప్రయోజనం | ఇది సంఘటన మూలంగా జరిగిన సంఘర్షణ ఆశయ భంగానికి మల్లీశ్వరి పాత్ర పరమైన చర్య కోసం |
| దృశ్యం 34ఎ | రాణివాసానికి మల్లీశ్వరిని సాగనంపటం పోయిరావే తల్లీ పాట తండ్రికూతుర్ని క్షమించమని పాట మధ్యలో అడగటం |
| ప్రయోజనం | పాటలో మల్లీశ్వరి, గోవిందమ్మ, పూజారి, నారప్పల మానసిక సంఘర్షణ ప్రదర్శన కోసం ఈ దృశ్యం చక్కగా ఉపయోగపడింది |
| దృశ్యం34బి | ఇంటి బయట హనుమంతప్ప తొందరపరచటం మల్లీశ్వరి పూజారి వంక చూసి కన్నీళ్ళు పెట్టటం పూజారి నర్మగర్భంగా చూడటం మల్లీశ్వరి పాదాలు తాకటం పాట, దృశ్యం, సంభాషణ మిళితంగా ఈ దృశ్యం నడవటం గోవిందమ్మ కన్నీళ్ళు పెట్టటం |
| ప్రయోజనం | ఈ సంఘటన జరిగినప్పుడు సంఘర్షణ జరగాలి కాని ఈ చిత్రంలో పాత్రచిత్రణలు విప్లవాత్మకమైనవి కాక, విధికి తలవంచే పాత్రలవ్వటం వల్ల ఆ సంఘర్షణ మౌనప్రదర్శనగా చూపించబడింది |
| దృశ్యం34సి | ఊరి బయటకు రాణీవాసపు పల్లకి వెళ్ళటం ఇంటి బయట నుంచి నాగమ్మ వాళ్ళని చూడటం |
| ప్రయోజనం | నాగరాజు ఆగమనం ముందు, ఇది రెండు భిన్న రసానుభూతుల కోసం, దృశ్యానికి దృశ్యానికి మధ్య వారధిగా ఉపయోగపడింది పూర్వపు ఆలంకారికులు దీనినే, భావ సంధిగా పేర్కొన్నారు , సినిమా పరిభాషలో దీనిని **ఛేంజ్ ఓవర్ షాట్** అంటారు |
| దృశ్యం 35 | ధనం సంపాదించుకుని నాగరాజు గుర్రం మీద రావటం రాణి వాసానికి వెళ్ళిందని తెలిసి నిరుత్తరుడవ్వటం |
| ప్రయోజనం | మల్లీశ్వరి వెళ్ళిపోయిన తరువాత కలిగిన నిరుత్సాహం నుంచి నాగరాజు వచ్చి ఏదో సాధిస్తాడన్న ఆశనిరాశా మారుటంతో, ఈ దృశ్యం, ఉత్పత్తి అవుతున్న కరుణరసాన్ని, రస స్థాయికి తీసుకు వస్తుంది ఒకవేళనాగరాజు ఆమె కోసం వెంటనే బయలుదేరి ఉండి ఉంటేకరుణరస స్థానంలో వీరరసం ఆవిర్భవించి ఉండేది |

దృశ్యం 36 రాణీవాసంలో మల్లీశ్వరి అలంకరణ వీణతో పరిచారిక వచ్చి మహారాణి దగ్గరకు వెళ్ళాలని చెప్పటం (మిక్స్)

ప్రయోజనం రాణీవాసం అంటే ఏమిటో ప్రేక్షకులకు పరిచయం చెయ్యటానికి, మల్లీశ్వరి వియోగ దుఃఖాన్ని ప్రదర్శించటానికి ఉపయోగపడుతుంది

ఈ వియోగానికి, నాగరాజు ధనం సంపాదించటానికి వెళ్ళినప్పటి వియోగానికి తేడా ఉంది అక్కడ బావ ధనంతో తిరిగి వస్తాడన్న నమ్మకం, పెళ్ళి జరుగుతుందన్న విశ్వాసం, ఆశఉంది ఇక్కడ రాణీవాసం నుంచి తను బయట పడటం లేదు బావ రాలేడన్న నిరాశ ఉంది

దృశ్యం 37 స్త్రీలు బాకాలు ఊదుతుండగా, స్త్రీ వందిమాగదులు కాగడాలతో చూపుతుండగా, పూలు చల్లుతూ, కొందరు సేవికలు, తిరుమలాదేవిని ఉద్యానవనమండపానికి పాటతో తీసుకురావటం

ప్రయోజనం రాణీవాసపు వాతావరణం, ఆచారాలు, మహారాణి ఇష్టసఖి మహారాణిని వినోదపరచటానికి ఉపయోగపడాలి అన్న స్థాపన కోసం వంది మాగద స్త్రీల జయ జయ ధ్వానాల మధ్య తిరుమల దేవిని పరిచయం చెయ్యటం, ఆచారాన్ని పరిచయం చెయ్యటం కోసం ఈ దృశ్యం గోపికలు కృష్ణుడిగురించి పాడటం మల్లీశ్వరి అంతరంగానికి దగ్గరగా ఉండటం కోసం

దృశ్యం 38 గోవిందమ్మ సోది చెప్పించుకోవటం ఈ విషయం పిచ్చి నవ్వులు నవ్వుతూ పూజారికి చెప్పటం

ప్రయోజనం ఆమె మానసిక పరిస్థితి తెలియ జేస్తూ గోవిందమ్మ మతి భ్రమణకు దగ్గరగా ఉందని సూచన కోసం, అది పూజారి దగ్గర బహిర్గతమయ్యింది

దృశ్యం 39 నాగమ్మ, బసక్కవాళ్ళు నాగరాజు గురించి చర్చించటం గోవిందమ్మ పిచ్చిదానిలా తిరుగుతోందనటం అది చస్తేకాని పీడ వదలదు అని అనటం నారప్ప తిట్టటం

ప్రయోజనం మనస్తత్వ విశ్లేషణ కోసం వాడబడింది

దృశ్యం 40 మల్లీశ్వరి మహారాణికి పాట పాడి వినిపించటం

ప్రయోజనం మల్లీశ్వరి మానసిక పరిస్థితి విశ్లేషణ కోసం

దృశ్యం 41 నాగరాజు, మల్లీశ్వరిని తలుచుకుని దిగులుపడటం

ప్రయోజనం రాణీవాసానికి వచ్చిన మల్లీశ్వరి ఆశయం, చెక్కు చెదరలేదని స్థిరీకరించటం కోసం

| | |
|---|---|
| దృశ్యం 42 | పరిచారిక ద్వారా మల్లీశ్వరి, పద్మావతికి, ఆమె ప్రియుడికి ఉరిశిక్ష పడిన సంగతి విని నిశ్చేష్టురాలవటం మహారాణి వారి ఇష్టసఖికి చివరకు మిగిలేది ఇదేనా అనటం |
| ప్రయోజనం | *తను బావ కోసం వెళితే ఏమవుతుందోనన్న సూచన కోసం ఈ దృశ్యం మహారాణి గారి ఇష్ట సఖికి చివరకు ఇంతేనా అనటంతో - రాజుతో రాణి జామపండు తీసుకున్నప్పుడు చెప్పిన మాటను నిర్ధారించటం కోసం* |
| దృశ్యం 43 | తనుచెక్కినశిల్పాలు చూసుకుంటూ 'అవునా నిజమేనా' అని పాట పాడుకోవటం మల్లీశ్వరి అదే పాట పాడటం |
| దృశ్యం 43 | *ఇద్దరికీ తెలియదు ఒకరి గురించి ఒకరు తలచుకుని కుమిలిపోతుంటే ప్రేక్షకుడికి సానుభూతి, రసానుభూతి కోసం ఈ పాట* |
| దృశ్యం 44 | మల్లీశ్వరి దగ్గరకు నాగమ్మను చూడటానికి మల్లీశ్వరీదేవికి మహారాణి అనుమతించిన ఉత్తర్వు ఇవ్వటం |
| ప్రయోజనం | *కథ ముందుకు కదులుతుందేమోనన్న భ్రమ కల్పించటం కోసం* |
| దృశ్యం 45 | తల్లి, హనుమంతప్ప, మల్లీశ్వరి కోసం ఎదురుచూడటం మల్లీశ్వరి రావటం హనుమంతప్ప, నాగమ్మ ఆనందంగా చూడటం తల్లిని మల్లీశ్వరి ఇలా నగలు అలంకరించుకుని ఉండగా చూడాలనేగా నీ కోరిక అని తల్లిని ఈసడించటం మధ్యలోనే వెళ్ళిపోవటం |
| ప్రయోజనం | *ప్రేక్షకుడికి కాస్త ఉపశమనం పరాయీకరణ జరిగి, బాధనుంచి కొంచెం హర్షం పొందటం కోసం* |
| దృశ్యం 46 | శిల్పాచారి నాగరాజుని చూసి, అతని శిల్ప కళా నైపుణ్యాన్ని మెచ్చి, ఎవరు నాయనా నువ్వు అంటే, ప్రేమ గురించి చెప్పి ప్రేయసి తుర్రుమంటుంది, శిల్ప సుందరి మాత్రం ఎప్పుడూ నా దగ్గరే ఉంటుంది అని నవ్వటం అతనికి నచ్చచెప్పి శిల్పాచారి రాయల ఆస్థానానికి తీసుకువెళ్ళటం |
| ప్రయోజనం | *ఇక ఇతను బండల మధ్య, ఆమె పంజరంలో బతకాలసిందే, అన్న అనుమానంతో ఉన్న ప్రేక్షకుడికి ఈ దృశ్యం తొలకరి జల్లులాంటిది ఒక రకంగా తరువాత జరగబోయే సంఘటనకు తొలి బీజం ఇక్కడే పడింది* |
| దృశ్యం 47 | నర్తనశాల అద్భుతంగా రూపుదిద్దుకుంటుంది రాణివాసపు అంతఃపుర స్త్రీలు నర్తనశాల నిర్మాణం చూడటానికి వస్తున్నారని, ఎవరూ పక్క |

చూపులు చూడకూడదని హెచ్చరించారు అంతఃపుర స్త్రీలు వచ్చారు అధికారి శిల్పులను మందలిస్తున్నాడు ఒకామె ఎంత ఆశ్చర్యం, ఈ బొమ్మలోని పోలికలన్నీ మన మల్లీశ్వరీదేవిలా ఉన్నాయి అన్నది మల్లీశ్వరీదేవిలాంటి ప్రియురాలు ఈ బొమ్మను చెక్కిన శిల్పికి ఉందేమో అని మరొకతె అనటం మల్లీశ్వరి ఈ మాటలు విని తన బావ నాగరాజే మలిచాడా అన్న సందేహంలో పడింది తన బావను గుర్తుపట్టింది ఇద్దరూ ఏదో లోకంలో ఒకరినొకరు చూసుకుంటూ ఉండగా జలజ అంతఃపురానికి వెళ్ళే వేళయిందని తీసుకువెళ్ళింది శిల్పాచారి నాగరాజును హెచ్చరించాడు

ప్రయోజనం — *ప్రేక్షకుడికి ఎంత ఆనందమో అంత భయం, ఇద్దరినీ అలా చూసి అధికారులు పట్టుకుంటారేమోనని! జలజ ఆ ప్రమాదాన్ని నివారించింది*

దృశ్యం 48 — తన ప్రేమకథను జలజకు వివరించింది ఆమె శోకాన్నీ,వేదననీ భరించలేకపోయింది అన్నీ అనుకూలించే సమయం రాకపోదు అని ధైర్యం చెప్పి, వారి కలయికకు బాధ్యత వహిస్తానని చేతిలో చెయ్యి వేసింది

ప్రయోజనం — *ఈ దృశ్యం ప్రాప్త్యాశను కలిగిస్తోంది*

దృశ్యం 49 — జలజ నర్తన శాలకు వచ్చి అధికారిని మోహపు లోభంలో పెట్టి నాగరాజుని కలిసింది

49ఎ, 49బి — పాట పాడుతూ, ఆడుతూ పువ్వులు పడేసి నాగరాజుకి సందేశం అందించింది వచ్చే శుక్రవారం రాత్రి పంపానదీ దేవాలయం, తుంగభద్ర ఒడ్డున మా మల్లీశ్వరీదేవి మీ కోసం ఎదురుచూస్తూ ఉంటారు అని చెప్పింది నాగరాజు నమ్మలేకపోయాడు

ప్రయోజనం — *ఈ దృశ్యాలు ఆగిపోయిన కథను ముందుకు నడపటానికి ఉపయోగపడ్డాయి*

దృశ్యం 50 — జలజ, మల్లీశ్వరీ ఎవరి కంటా పడకుండా వచ్చారు నాగరాజు కనిపించకపోతే

50 ఎ — బావను ఎవరన్నా పట్టుకున్నారేమోనని భయపడింది ఇంతలో మురళీనాదం వినిపించింది పరుగెత్తింది ఇద్దరూ కౌగలించుకున్నారు 'మనసున మల్లెల మాలలూగెనే' పాట

ప్రయోజనం — *ప్రేక్షకుడికి ఎంత సంతోషమో అంత భయం దొరికిపోతే ఏమిటి అన్న ఉత్కంఠను అనుక్షణం కలిగిస్తున్నాయి*

దృశ్యం 50బి విషయం బయటపడితే జలజను చంపేస్తారని మల్లి చెప్పింది రేపు రాత్రి రెండో జాము నగారా వినబడేలోగా, బుక్కరాయల బురుజు దగ్గర సిద్ధంగా ఉంటాను, తప్పక రావాలి సుమా అని చెప్పాడు నాగరాజు మరోసారి ఆలింగనం చేసుకుని విడిపోయారు

ప్రయోజనం *ఈ దృశ్యం మల్లీశ్వరీ, నాగరాజులు, రాణీవాసం నుంచి మల్లీశ్వరిని ఎలా తప్పించి తీసుకు వెళ్ళాలి, ఏ సమయానికి కలుసుకోవాలి అన్న చర్చకోసం*

దృశ్యం 51 మల్లీశ్వరి, జలజ క్షేమంగా అంతఃపురానికి చేరుకున్నారు ఎన్నాళ్ళకీ బ్రతుకు పండెనో, ఎంత హాయి ఈ రేయి నిండెనో అని తియ్యగా పాడుకుంది ఈ నవ్వులు ఇన్నాళ్ళు ఎక్కడ దాచావమ్మా అని జలజ కొంటెగా అడిగింది

ప్రయోజనం *పంజరంలోనుంచి వెళ్ళిపోతున్నానన్న ఆనందంతో ఉన్న మల్లీశ్వరి హృదయావిష్కరణ కోసం ఈ దృశ్యం*

దృశ్యం 52 నర్తనశాల వైభవాన్ని కృష్ణరాయలవారు సపరివారంగా వీక్షించటానికి వచ్చారు శిల్పి గురించి ఆరా తీశారు శిల్పి పేరు నాగరాజు అని తెలుసుకున్నారు ఆలోచించారు

ప్రయోజనం *నర్తన శాలలో శిల్పాలను చూస్తూ, ఆ శిల్పంలో మల్లీశ్వరిని పోల్చుకున్నాడు రాజు ప్రేక్షకుడికి ఉత్కంఠ, రాజుకు తెలిసిపోతుందా అన్న అనుమానం, రాజు ఏ నిర్ణయం తీసుకుంటాడోనన్న ఉత్సుకత ఈ దృశ్యంలో ఉన్నాయి*

దృశ్యం 53 అంతఃపురంలో మల్లికి క్షణాలు యుగాలుగా నడుస్తున్నాయి ఎందుకే నీకింత

53ఎ తొందర అని చిలకను చూసి పాడింది జలజ దగ్గర తన్మయత్వంతో బావ గురించి చెబుతుంటే జలజ కన్నీళ్ళు పెట్టింది రాత్రి తను కన్న పీడకల గురించి చెప్పింది ఇంతలో భృత్యురాలు మహారాణీ వారి దగ్గర నుంచి లేఖ తెచ్చింది రాత్రికి ఉషా పరిణయం నాటకం చూడటానికి రాయల వారితో కలసి, తిరుమలాదేవి వారు వస్తున్నారని, ఉషాదేవిగా మల్లీశ్వరి నటించాలని రాణిగారి ఆదేశం అని ఉంది మల్లీశ్వరి నిరుత్సాహంతో నీరు గారిపోయింది

ప్రయోజనం *ఎప్పుడు రెండవ ఝాము అవుతుందా అన్న ఆశతో ఉన్న మల్లీశ్వరి ఆశలు ఆవిరైపోయేలా, ఉషా పరిణయం చూడాలని రాణిగారు కోరుకుంటోంది అన్న*

ఈ దృశ్యం ఆఖరి మలుపు (*Last Plot Point*) నాగరాజు ఎదురుచూస్తూ ఉంటాడు మల్లి వెళ్ళదు అతనేంచేస్తాడు? వస్తాడా? నిరాశతో పిచ్చి వాడైపోతాడా? ఇన్ని ప్రశ్నలు ఉత్పన్నం చేసే దృశ్యాలు

దృశ్యం 54 రాయలవారు, తిరుమలాంబ ఆసీనులయి ఉన్నారు నటీ సూత్రధారులు ప్రారంభించారు బావ తొందరపడి కోటలోకి వస్తాడేమోనని మల్లీశ్వరికి భయం ఆ సంగతే జలజతో చర్చించింది

పాట జరుగుతుండగా గదిలో ఉన్న మల్లీశ్వరి బాధ

ఆమె కోసం ఎదురుచూస్తున్న రాయలు, రాణీవారు!

ఆమె కోసమే ఎదురుచూస్తున్న నాగరాజు!

ప్రయోజనం మల్లీశ్వరి ఆవేదన, సంఘర్షణ ప్రారంభమయ్యింది నాగరాజు తెగిస్తాడేమోనన్న ఉత్కంఠ

దృశ్యం 55 కోట ప్రాకారాన్ని ఎక్కి నాగరాజు కోట లోపలకు రావటం, తుండు గుడ్డ సాయంతో- దూకిన శబ్దానికి సైనికుడు ప్రమాద ఘంటికను కొట్టటం సైనికులు అప్రమత్తం అవ్వటం సైనికాధికారి హెచ్చరిక చేయటం అతని హెచ్చరిక నాగరాజు వినటం

ప్రయోజనం కథ ముందుకు కదులుతోంది సైనికులు చూడటం ప్రాప్త్యాశకు భంగం కలుగుతోంది

దృశ్యం 56 మల్లీశ్వరి నాట్యం ఆ నాట్యంలో నిర్లిప్తత పాట

ప్రయోజనం బావ వచ్చాడని ఆమెకు తెలియదు ప్రేక్షకుడి దృష్టి కోణంలో ఉత్సుకత

దృశ్యం 57 నాగరాజు నక్కి నక్కి రావటం నగారాలు వాయించి సైనికులను అప్రమత్తం చెయ్యటం కాగడాలతో వెతుకులాట

ప్రయోజనం కథ కదులుతోంది

దృశ్యం 58 మల్లీశ్వరి నాట్యం - పాట బావను తరమటం చూసి బావా అని పరుగెత్తటం మహారాజు నిశ్చేష్టుడవటం

ప్రయోజనం ప్రేక్షకుడి గుండె ఆగేది ఇక్కడే ఇదే విషమస్థితి

దృశ్యం 59 జలజ ఆపాలని చూడటం

ప్రయోజనం ప్రేక్షకుడి హృదయంలో భయం, ఉత్కంఠ

దృశ్యం 60 నాగరాజు సైనికులకు దొరికిపోవటం బావా అన్న మల్లీశ్వరిని 'ఎవరు నువ్వు' అని అడగటం సైనికాధికారి హెచ్చరించినా వినిపించుకోకుండా, ఈ ఘాతకిని కూడా తీసుకువెళ్ళమని అనటం సైనికాధికారి ఇరువురినీ తీసుకెళ్ళటం జలజ విషాదంగా చూడటం

ప్రయోజనం వ్యక్తిత్వ ప్రదర్శన కోసం ఈ దృశ్యం

దృశ్యం 61 పాసింగ్ షాట్స్ జలజ రియాక్షన్

ప్రయోజనం భయానకం నుంచి, కరుణ రసానికి సన్నివేశం మార్పు చెందటానికి ఉపయోగపడే నిడివి ఇది

దృశ్యం 62 ఎంత చెప్పినా వినకుండా, ఆ నిర్భాగ్యుడితో కలసి ఆనందంగా చెరసాలకు వెళ్ళారు అని జలజ మహారాణికి చెప్పటం

ప్రయోజనం ప్రేక్షకుడి ఆఖరి ఆశ కూడా చచ్చిపోవటం శోకస్థాయికి వెళ్ళటం

దృశ్యం 63 జైలు బయట, లోపల మల్లీశ్వరి సంకెళ్ళతో - అవతల గదిలో నాగరాజు సంకెళ్ళతో ఒకరినొకరు చూసుకోవటం ఈ రాత్రి మాత్రమే మిగిలి ఉందని చెప్పి వెర్రి నవ్వు నవ్వి నీకిష్టమైన పాట పాడేదా అంటూ ఓ బావా, నా బావా పాట పాడటం మల్లీశ్వరిని నాగరాజు శిరస్సు మీద చెయ్యి వేసి ఓదార్చటం కాగడా వెలుతురు ఆరిపోవటం

ప్రయోజనం కరుణ రసం పతాక స్థాయికి చేరుకోటం కోసం ఈ దృశ్యం

దృశ్యం 64 రెండు ఉరి తాళ్ళు వేలాడుతున్న దృశ్యం

ప్రయోజనం విషమ స్థితిని పతాక స్థాయికి తీసుకు వెళ్ళటం కోసం

దృశ్యం 65 దర్బారులో రాయలు నాగరాజుని నిలదియ్యటం ముందు నా ప్రాణాలు తీయించి తరువాత మల్లికి రాణీ వాసపు పల్లకి పంపి ఉండాల్సింది అంటే రాయలు అది మీకోరికే అని చెప్పటం దానికి నాగరాజు మేమెంత, మా యోగ్యత ఎంత? అంటే రాయలు నువ్వే అడిగావేమో అనగా లేదు అనటం, రాజు నగారా కొడితే పండితుడు గుర్తు చేయటం వేళాకోళానికి అంటే, మహారాజులతో వేళాకోళమా అనటం మల్లీశ్వరీ, నాగరాజు ఎవరికి వారు తనను చంపి ఇంకొకరిని క్షమించమని అడగటం నాట్యంతో, శిల్పంతో సంతృప్తి పరిచిన ఇద్దరినీ మహారాజు క్షమించటం

ప్రయోజనం	రాయల తీర్పు కరుణం, అద్భుతం, శాంతరసాలకు అనుపానంగా ఈ దృశ్యం రాయలు, పండితుల పాత్ర విశ్లేషణకు కూడా ఉపయోగపడింది

దృశ్యం 66	నాగరాజు, మల్లీశ్వరిల వివాహం, పూజారి, నారప్ప ఆనందంగా చూడటం గోవిందమ్మ, నాగమ్మ, జలజ ఆనందంగా చూడటం

ప్రయోజనం	ఆశయ సిద్ధి - ఫల ప్రాప్తి కోసం

దృశ్యం 67	గుడి దగ్గర మళ్ళీ బావా మంచి బొమ్మని చూపిస్తా రమ్మని కోతిని చూపించటం నాగరాజు మల్లి వెంటపడటం మళ్ళీ గుంజీలు తియ్యటం, గంట వినపడగానే పరుగెత్తటం పాపం కలకండ భక్తురాలు అనటం పూజారి ఇద్దరికీ హారతి ఇవ్వటం

ప్రయోజనం	కథ ఎక్కడ ప్రారంభమయిందో అక్కడే ముగించటం కథనశిల్ప విశేషం

**– శుభం –**

ఈ చిత్రకథలో ఉన్న దృశ్యాలను, ఆదృశ్యాల ప్రయోజనాన్ని పరిశీలించాక, వీటిలో మలుపులుగా చెప్పుకుంటే-

మొదటి మలుపు, రాయల వారిని నాగరాజు మల్లీశ్వరి కోసం రాణీవాసపు పల్లకిని పంపమని అడగటం

ఆ రోజు వాళ్ళిద్దరు సంతకు వెళ్ళి ఉండకపోతె, వర్షం వచ్చి ఉండకపోతే, సత్రంలోకి వెళ్ళి ఉండకపోతే, రాయలవారిని కలిసి ఉండకపోతే, మల్లీశ్వరీ నాగరాజుల కథ ఇలా జరిగిఉండేదికాదు

ఎలాగూ నాగమ్మకు తన కూతుర్ని నాగరాజుకిచ్చి పెళ్ళిచేయటం ఇష్టం లేదు గదా, అప్పుడుకూడా ఈ పెళ్ళి జరగదు గదా అన్న అనుమానం రావచ్చు తన పేదరికాన్ని నాగమ్మ తన తల్లి ముందు మాట్లాడింది అన్న విషయంతెలుసుకుని, తనకు వచ్చిన వృత్తితో ధనం సంపాదించటానికివెళ్ళాడు కథానాయకుడి ఆశయం మల్లీశ్వరిని పెళ్ళి చేసుకోవటం కాబట్టి ధనం సంపాదించి తిరిగి రాగానే, నాగమ్మకు ధనం చూపించేవాడు ధనాశాపరురాలయిన నాగమ్మ నోరు మూతపడేది మల్లీశ్వరి నాగరాజులు పెళ్ళిచేసుకొని పిల్లల్ని కని సుఖంగా ఉండేవారు ఇదే కథ అయితే ఈ చిత్రాన్ని నిర్మించేవారు కాదు గదా!

మొదటి మలుపు తిరిగిన దగ్గర నుంచి,

1 హారంతో నాగమ్మ ఆనందం నారప్ప చికాకు

2 రాయలవారు కోటలోకి రావటం

3 రాయల వారు రాణీగారికి నాగరాజు కోరిక చెప్పటం

4 బసక్క వాళ్ళు పాట పాడటం మల్లీశ్వరి వెక్కిరించటం

5 అమ్మలక్కలతో తన అన్న నాగరాజుకి కూతుర్ని ఇస్తానన్నాడని గోవిందమ్మ చెప్పటం

6 నారప్పతో - నా కూతుర్ని నాగరాజుకి ఇవ్వాలన్నదే నీ నిశ్చయం అయితే నేను ఉరి పోసుకొని చస్తానని నాగమ్మ భయపెట్టటం గోవిందమ్మ విని బాధ పడటం

7 గోవిందమ్మ కొడుకుతో విషయం చెప్పటం నాగరాజు ధనం సంపాదించి తిరిగి రావాలన్న నిర్ణయం తీసుకోవటం

8 నాగరాజు వెళ్ళిపోతుంటే మల్లీశ్వరి వెంట పడటం

9 నాగరాజు కొండల మధ్య శిల్పాలు చెక్కటం

10 గోవిందమ్మకు మల్లీశ్వరి సేవలు చేయటం

11 నాగరాజు విజయనగరానికి చేరటం

12 మేఘమాల పాట

13 రాణీవాసపు పల్లకీ రావటం

14 నూతి దగ్గర మల్లీశ్వరి బయలుదేరటం

15 తన కోసం రాణీవాసపు పల్లకి వచ్చిందని తెలిసి మూర్ఛబోవటం

16 రాణీవాసపు పల్లకిని ఎక్కించి మల్లీశ్వరిని మానసిక సంఘర్షణల మధ్య సాగనంపటం

17 నాగరాజు ధనంతో తిరిగి వచ్చి, మల్లీశ్వరి రాణివాసపు పల్లకి వస్తే వెళ్ళిపోయింది అని తెలిసి నిశ్చేష్టుడవ్వటం

ఇన్ని దృశ్యాలూ కలిపి ఒకే సన్నివేశం సన్నివేశం అంటే ఒకే ఆలోచనతో ఉన్న అనేక దృశ్యాల సముదాయం అని అర్థం రాణీవాసపు పల్లకి పంపమని నాగరాజు అడిగిన దగ్గర నుంచి, రాణివాసపు పల్లకి ఎక్కి మల్లీశ్వరి వెళ్ళిపోయింది అనితెలుసుకొన్నంత వరకు ఒకే అంశం (Idea) ఇందులో ప్రతి నిమిషం కథ కదులుతోంది

సంతలో వర్షం పడటంతో సత్రంలోకి వెళ్ళి ఒక విశిష్ట వ్యక్తిని కలుసుకోవటం, ఆయనను రాణివాసపు పల్లకి పంపమని కోరటం, ఎందుకడిగావు బావా అంటే వీళ్ళకు రాయల వారి దర్శనమే కాదు అనటం, పిచ్చివాళ్ళు ఆయన రాయలే, తెలియక అమాయకులు గోతిలో దిగుతున్నారు అన్న ఆలోచన ప్రేక్షకుడికి ఎప్పుడు కలుగుతుందో అప్పుడే అతని ఆలోచనలంత వేగంగా కథ పరుగెత్తుతుంది హారం చూపించటం, ఆయన రాయల వారేనని ప్రేక్షకుడి హృదయంలో స్థాపించటం, రాణీవారితో చెప్పారు కనుక ఇక

రాణి వాసపు పల్లకి రావటమే ఆలస్యం అన్న ఆందోళన, అన్న తన కూతుర్ని తన కొడుక్కి చేసుకుంటాడన్న ఆశ, అదే జరిగితే ఉరి పోసుకు వస్తానని నాగమ్మ మాటతో నిరాశ, గోవిందమ్మ విషయం చెప్పటంతో నాగరాజు ఊరు విడిచిపెట్టి వెళ్ళాలన్న నిర్ణయం, బావ తనను వదిలి వెళుతున్నాడన్న మల్లీశ్వరి బాధ, నాగరాజు ఆశయ సాధన ప్రారంభం, గోవిందమ్మకు మల్లీశ్వరి సేవలు చేయటం, మేఘ సందేశం ద్వారా ప్రేమికులు వియోగ ఉపశమనాన్ని పొందటం, పాట చివరిలో పూజారి మీ బావ నీ కోసం వస్తాడని ఆశ కల్పించటం, రాణి వాసపు పల్లకి రావటం, అది తెలియక నూతిలో నీళ్ళు తీసుకుని మల్లీశ్వరి అమాయకంగా బయలుదేరటం, నిజం తెలిసి మూర్ఛబోవటం, రాజాజ్ఞ మీర లేక మల్లీశ్వరిని సాగనంపటం, నాగరాజు ధనంతో తిరిగి వచ్చి నిజం తెలుసుకుని నిరుత్సాహపడటం

అనుక్షణం ఈ సన్నివేశం మొత్తం నాటకీయతతో నిండి ఉంది ప్రేక్షకుణ్ణి ఊపిరితీసుకోనివ్వని నాట్య విలాసం ఉంది

ఈ సన్నివేశం తర్వాత చాలా సేపటి వరకు మరలా సంఘటన జరగలేదు బొమ్మల మధ్య నాగరాజు, రాణివాసంలో మల్లీశ్వరి, రాణివాసపు మర్యాదలు, రాణిగారి ఇష్ట సఖి జీవితం ఎలా ఉంటుంది, రాణి వాసంలో ఉన్న రాణిగారి ఇష్టసఖి పాత ప్రియుడితో లేచిపోవాలని చూస్తే ఏం జరుగుతుంది, కూతురి వైభవాన్ని చూడటానికి వచ్చిన నాగమ్మ, ఆమె అన్న హనుమంతప్పలు మల్లీశ్వరిని చూసి వెళ్ళటం, మల్లీశ్వరి తను సుఖపడటం లేదన్న విషయం బయటపెట్టటం, నాగరాజుని ఒక శిల్పాచార్యుడు చూడటం, ఇంతవరకు దృశ్యాల సమాహారమేగాని అది సన్నివేశం కాజాలదు ఎందుకంటే ఈ దృశ్యాలన్నీ ఒక అంశం మీద నడవటం లేదు ఏ అంశానికి ఆ అంశమే నడుస్తోంది

సంఘటన లేకుండా, సంఘర్షణ లేకుండా, ఏకాంశంతో కూడిన దృశ్యాల కలయిక లేకుండా చిత్రకథ నడుస్తోంది దీన్ని ఆంగ్లంలో మెలోడ్రామా అంటారు

డ్రామాకి, మెలోడ్రామాకి తేడా ఏమిటి? పాత్రకీ, పాత్రకీ మధ్యజరిగే సంఘర్షణ డ్రామా ఆ డ్రామా మోతాదు ఎక్కువై చెప్పిందే చెప్పినట్టు, సానుభూతిగాని అనుభూతి గాని అధికంగా చూపించటాన్ని మెలోడ్రామా అంటారు

> *Melodrama - sensational, sensationalistic, dramatic, stagy, theatrical, (over) sentimental, (over) sentimentalized, histrionic, over drawn, over worked, over wrought, over done, exaggerated*[40]

ఇక్కడ ఎక్కువగా చెప్పబడింది వియోగ బాధ ఇంతకు ముందు ఒక వియోగ బాధ చూపబడింది అందులో బావ డబ్బుతో వస్తాడన్న ఆశ మల్లీశ్వరికి, ధనం సంపాదించి మల్లీశ్వరిని గెలుచుకుంటానన్న విశ్వాసం నాగరాజుకి ఉండటం వల్ల అది మెలోడ్రామా కాలేదు

కానీ ఇక రాణీవాసానికి వెళ్ళిపోయిన మల్లీశ్వరి మళ్ళీ లభించదు అన్న అనుమానం, అవునా నిజమేనా మల్లి నాకు కరువేనా? అనటంతో ద్వైధీభావ సంఘర్షణకు లోనయినట్లు కనిపించినా, బొమ్మలు చెక్కుతూ సంస్కారహీనంగా శిల్పాచారుడికి కనిపించటం, ప్రేమించిన అమ్మాయి మోసం చేసి వెళ్ళిపోవచ్చు గాని, శిల్ప సుందరి నన్ను వదిలి వెళ్ళదు అని చెప్పటంతో మల్లీశ్వరి తనను విడిచి పెట్టేసిందని రూఢిగా చెప్పినట్లయ్యింది

అలాగే అనన్య సామాన్యమైన రాణివాసపు భోగాలు అనుభవించటానికి వచ్చి, వాటిని పట్టించుకోకుండా బావను గురించే ఆలోచిస్తూ, రాణీగారు పాట పాడమన్నా విషాద పూరితమైన స్వరంతో పాడుతూ, ఎవరో పద్మావతి ప్రియుడితో దొరికిపోతే రాణీగారి ఇష్టసఖి బతుకింతేనా అని డీలాపడిపోతూ, కూతురి వైభవాన్ని చూడాలని ఎంతో ఆనందంగా వచ్చిన తల్లికి తను ముళ్ళసింహాసనం మీద కూర్చున్నట్లు తెలియజేస్తూ, మళ్ళీ బావను కంటితో చూసే దాకా విషాదాన్ని అనుభవించింది

కాబట్టి మతిభ్రమకు దగ్గరగా నాగరాజు, పూర్తి మనోవేదనతో మల్లీశ్వరి ఉన్న ఈ దృశ్యాలన్నీ మెలోడ్రామా కిందకి వస్తాయి

### చిత్రకథలోకి కథను సర్దుకున్న తీరు :

కథనంలో కథను నాలుగు వాక్యాలలో రాసుకుని, తరువాత దానికి ఒక భూమికను తయారు చేసుకోవాలని ఇంతకు ముందు తెలియజేయటం జరిగింది ఆ పద్ధతిని అనుసరించి ఈ మల్లీశ్వరి చిత్రకథలో కథ ఎలా కుదురుకుందో పరిశీలించాలి

### మొదటి అంకం (ACT - 1)

మల్లీశ్వరి నాగరాజు, బావా మరదళ్ళని, వాళ్ళు ఒకరినొకరు ఇష్టపడతారని, ఒకరినొకరు ఎగతాళి చేసుకుంటారని, అక్కడొక గుడి ఉంది, పూజారి వాళ్ళిద్దరు భవిష్యత్తులో భార్యాభర్తలు కావాలని ఆశిస్తున్నాడని, నాగరాజు తల్లి గోవిందమ్మకు పెళ్ళి ఇష్టమని, మల్లీశ్వరి తండ్రి నారప్పకు కూడా ఇష్టమని, అతని భార్య నాగమ్మకు ఇష్టం లేదని, రాణీవాసపు పల్లకీలో ఎవరో వెళుతుంటే చూసి అసూయపడింది నాగమ్మ అని, ఇలాగే ఇద్దరూ పెరిగి పెద్దవాళ్ళయ్యారు అన్న భాగమంతా ప్రథమ భాగం భూమికలో ప్రారంభం అనే అంశం కిందికి వస్తాయి

తిరునాళ్ళలో వర్షం మూలంగా రాయలవారిని మోసి రాణీవాసపు పల్లకీ పంపమని అడగటం, మొదటి మలుపు (First Plot Point) సుమారు 30వ నిమిషంలో ఆ మలుపు వచ్చింది అంటే ప్రశాంతంగా జరిగిపోతున్న బావామరదళ్ళ జీవితంలో ఏం జరుగుతుందోనన్న ఆందోళన కలిగించింది కాబట్టి కథ ఈ మలుపు తిరిగి ఉండకపోతే, నాగరాజు, మల్లీశ్వరుల కథను ఎవరూ పట్టించుకొనేవారు కాదు

రెండవ మలుపు రాణీవాసపు పల్లకీ వచ్చి మల్లీశ్వరి వెళ్ళిపోవటం అనిపిస్తుంది కాని నిజానికి అది మలుపు కాదు మొదటి మలుపు తాలూకు సంఘటన ఏనాడు నాగరాజు రాణీవాసపు పల్లకి పంపమన్నాడో ఆనాడే రాయల వారు వెళ్ళి తనభార్యకు విషయంచెప్పగానే రాణీవాసపు పల్లకీ వస్తోందన్న వాస్తవం ప్రేక్షకుడికి తెలిసిపోయింది పల్లకీ రాకపోతే మలుపు లేదా వచ్చిన పల్లకీ నేను ఎక్కి వెళ్ళనుపొమ్మని మల్లీశ్వరి ఎదురుతిరిగితే మలుపు లేదా ధనంసంపాదించుకువచ్చిన నాగరాజు, రాయలదగ్గరకు వెళ్ళి, నా మల్లిని నాకు ఇచ్చేయండి అని అడిగితే మలుపు కానీ ఇవేమీ జరగలేదు విధికి తలవంచి మల్లీశ్వరి వెళ్ళిపోయింది ప్రియురాలు భోగాల మీద మోజు పడి తనను మోసం చేసిందన్న బాధాతప్త హృదయంతో నలిగిపోయాడు నాగరాజు

మరిదేమిటి? ఇది Confrontation, సంఘర్షణ! మల్లీశ్వరిని చేసుకోవాలన్న ఆశయంలో ఉన్న కథానాయకుడు నాగరాజు ఆశయానికి భంగం రాణీవాసానికి వెళ్ళిన మల్లీశ్వరిని తిరిగి తెచ్చుకోగలగటం అసంభవం అందుకే ఈ సంగతి మొత్తం మెలోడ్రామాగా మారిపోయి, సంశయాత్మకతను హృదయంలో పెంచి, హృదయభారం కలిగించి ఇక వీరి ఆశనిరాశేనేమో, వీరిద్దరికలయిక అసంభవమేమో అని అనిపిస్తుంది

ఎప్పుడయితే నాగరాజు, మల్లీశ్వరి నర్తనశాలలో ఒకరినొకరు చూసుకున్నారో అది రెండవ మలుపు (Second Plot Point) మొదటి మలుపు 20వ దృశ్యంలో వస్తే, రెండవ మలుపు 45వ దృశ్యంలో వచ్చింది తెలుగుసినిమా నిడివి ఎక్కువ గనుక, 70వ నిమిషంలో రావాల్సిన రెండవ మలుపు 90వ నిమిషంలో వచ్చింది నిజానికి మన భూమిక ప్రకారం ఇక్కడ సందిగ్ధత ఉండాలి, ఉంది చూడనయితే చూసుకున్నారు గాని ఎలా కలుస్తారు? కలిసినా కోటలో నుంచి మల్లీశ్వరిని తీసుకొని నాగరాజు ఎలా బయటపడతాడు? అన్న సందేహం అనుక్షణం కలుగుతూనే ఉంటుంది గనుక, చిత్రకథలో రెండవ మలుపుకి ఇది చక్కటి ఉదాహరణగా నిలుస్తుంది

ఇక్కడ నుంచి ఫలప్రాప్తి (Resolution)ఎలా సాధిస్తాడు అన్న అనుమానంతో ఉన్న ప్రేక్షకుడికి, ఆ సాధించే ప్రక్రియలో అనుక్షణం భయమే, అనుమానమే

ఈ చిత్రానికి *Anti Climax* నాగరాజు దొరికిపోవటం, అతనితో పాటు తననూ తీసుకుపొమ్మని మల్లీశ్వరి అడగటం

అంటే ప్రేక్షకుడు - అంతకుముందు పద్మావతీ దేవి, ఆమె ప్రియుడు ఉరి తీయబడ్డారు కాబట్టి, నాగరాజు, మల్లీశ్వరి కూడా ఉరి తీయబడతారు, అన్న నిశ్చయమైన అభిప్రాయం కలిగి ఉంటాడు కాని ముగింపుకు వచ్చేసరికి రాయలవారు నాగరాజుకి అతనే రాణివాసపు పల్లకీ పంపమని అడిగిన విషయం గుర్తు చెయ్యటం, నాగరాజు, మల్లీశ్వరీ నన్ను చంపి మా మల్లిని కాపాడండి, నన్ను చంపి మా బావను కాపాడండి అని అడగటం, ఆనాడు సత్రంలో అపూర్వ నాట్యం చూపించిన మల్లీశ్వరిని, నర్తనశాలలో అద్భుతమైన శిల్పాలను చెక్కిన నాగరాజుని ఇద్దరినీ క్షమిస్తున్నాను అని రాయలవారుచెప్పటంతో ఫలప్రాప్తి పూర్తయ్యిందనిపిస్తుంది నిజానికి వారు ప్రాణాలతో బయటపడ్డారు తప్ప, కథానాయకుడు కోరుకున్న ఆశయం మల్లీశ్వరితోవివాహంగదా! అదింకా పూర్తి కాలేదు తరువాత పూర్తయ్యింది

అంతటితో ఆపకుండా ఆ రచయిత, దర్శకుడు చిత్రకథకు చక్కని ముగింపునివ్వటం కోసం మళ్ళీ గుడి దగ్గరకు తీసుకు వెళ్ళి-

1 మళ్ళీ కోతి బొమ్మను మల్లీశ్వరి నాగరాజుకి చూపించటం, నాగరాజు మల్లి వెంటపడటం

2 మల్లీశ్వరిని నాగరాజు గుంజీలు తియ్యమనటం తప్పు లెక్కతో మల్లీశ్వరి గుంజీలు తియ్యటం గుడిలో గంట మోగగానే బావా పూజయిపోయింది అని పరుగెత్తటం పాపం కలకండ భక్తురాలు అని నాగరాజు హాస్యమాడటం

3 పూజారి హారతి ఇచ్చి ఇద్దరినీ ఆశీర్వదించటం

అక్కడ శుభం అన్నారు

## చిత్రకథ – సంభాషణరచయిత పాత్ర :

ఇప్పుడు ఇలా చిత్రకథలో కథను కథారచయిత, సంభాషణ రచయిత, దర్శకుడు దృశ్య మాలికగా రాసుకున్నారు పాత్రలు ఎలా ఉండాలో కూడా ఆలోచించుకున్నారు ఆ పాత్రలు ఎలా మాట్లాడాలో సంభాషణ రచయిత రాస్తాడు ఆ ప్రక్రియను వివరించటానికి, నాగరాజుని శిల్పాచార్యుడు విజయనగరానికి ఆహ్వానించినదగ్గర నుంచి, రాయలు క్షమించే వరకు సంభాషణ రచయిత పాత్రని పరిశీలించటం జరుగుతోంది

ఒక శిల్పాచార్యుడు ఒక గుహలోకి వచ్చాడు అక్కడ ఉన్న శిల్పాలను చూసి ఆశ్చర్య పోయి ఈ శిల్పాలు చెక్కిందెవరా అని చూసాడు ఆయనతో పాటు ఇంకొందరు అలాగే చూసారు దూరంగా నాగరాజు మురళీ వాయిస్తూ కూర్చుని ఉన్నాడు అతనేనా అన్నట్లుగా చూసాడు నోట్లో ఏదో వేసుకుని మళ్ళీ మురళి ఊదసాగాడు

శిల్పాచారి · ఎవరు నాయనా నువ్వు?

అని అడిగాడు కొంచెం దగ్గరగా వచ్చి నాగరాజు పట్టించుకోలేదు మురళి ఊదుకుంటూనే ఉన్నాడు

శిల్పాచారి ఒక్కడివే ఇక్కడ ఏం చేస్తున్నావు?

అని మళ్ళీ అడిగాడు శిల్పాచారి ఇప్పుడు గమనించి, ముందు వెరపుతో చూసి తరువాత ఫక్కున నవ్వాడు నాగరాజు రహస్యం చెబుతున్నట్లుగా శిల్పాచారితో చెబుతున్నాడు

నాగరాజు కళ్ళుండి కూడా మీరు చూడలేరు ఇదిగో చెబుతున్నా వినండి, మనసిచ్చి, నమ్మించి, కవ్వించే ప్రేయసి ఎప్పుడో ఒకూడు చెప్పకుండా తుర్రు మంటుంది కాని, నా శిల్పసుందరి మాత్రం ఎప్పుడూ నా దగ్గరే ఉంటుంది

అని పక పకా నవ్వాడు అర్థం చేసుకున్నాడు శిల్పాచారి

శిల్పాచారి . ఎంత సుదినమోయి ఈ దినం ఎంత దివ్యమయ్యా నీ ప్రతిభ నేను కూడా ఒక శిల్పినే నాయనా, రాయలవారి ఆస్థానంలో పనిచేస్తున్నాను ఏలిన వారి

సెలవు మీద రాచనగరంలో నర్తనశాల నిర్మిస్తున్నాం శిల్పానికి అవసరమైన రాళ్ళ కోసం వస్తే భగవంతుడు ఒక మహాశిల్పినే చూపించాడు గా నాయనా, ఇక నువ్వు ఉండేచోటు ఇది కాదు

అన్నాడు శిల్పాచారి శిల్పాచారి చెప్పింది విని నాగరాజు అయోమ యావస్థలో సమాధానం చెప్పాడు

నాగరాజు నేనెలా వస్తాను నేనిప్పుడు చచ్చి పోయాను ఎవరికోసం నేనీ శిల్పం నేర్చుకున్నానో ఆమె నాకు ఈ రాతి మీదే దక్కింది నేనూ రాయి అయిపోయాను

అతని ఆవేదన అర్థం చేసుకుని అనునయిస్తున్నట్లుగా మాట్లాడాడు

శిల్పాచారి . గ్రహించాను నాయనా నీ ఆవేదన భగవంతుడు నీకు శక్తి ప్రసాదించాడు ఆ శక్తి లోకం కోసం వినియోగించక పోవడం పిరికితనం మన కష్టాలు మనకి అడ్డురాకూడదు నాయనా

నాగరాజు నిరుత్తరుడయ్యాడు

– కట్–

దృశ్యం 47 నర్తనశాల పగలు

అనేక శిల్పులు శిల్పాలను చెక్కుతున్నారు సర్వాంగ సుందరంగాఉంది నర్తనశాల శిల్పాచారి పర్యవేక్షి స్తున్నాడు అక్కడి నిర్మాణపు పనులను పర్యవేక్షిస్తున్న అధికారి శిల్పాచారి దగ్గరకు వచ్చాడు

అధికారి : ఆచార్యా! అంతఃపుర స్త్రీలు నర్తన శాల నిర్మాణం చూడటానికి వస్తున్నారు పని వాళ్ళందరితో జాగ్రత్త అని చెప్పండి రాణి వాసపు కట్టుబాట్లు మీకు తెలియనివి కావు

అని చెబుతూ, దిక్కులు చూస్తున్న శిల్పులతో

అధికారి — పక్క చూపులు చూసారంటే ముక్కలు ఎగురుతాయి జాగ్రత్త

అనగానే కంగారు పడ్డారు అంతఃపుర స్త్రీలందరు గుంపులుగా వస్తున్నారు
అధికారి అతి వినయంగా వాళ్ళను ఆహ్వానిస్తున్నాడు
మల్లీశ్వరి కూడా వచ్చింది జలజతో కలసి స్త్రీ జనం నర్తనశాలలోని శిల్పాలను చూస్తున్నారు
వాళ్ళను చూడగూడదని తెలిసీ కొందరు శిల్పులు చూస్తుంటే శిల్పా చారి మళ్ళీ వాళ్ళను మందలించాడు

శిల్పాచారి — ఎక్కడయ్యా అలా చూస్తారు మీ పని మీరు చూసుకోండి అంతఃపుర స్త్రీలవంక కన్నెత్తి చూసారంటే ప్రాణాలకే ముప్పు వస్తుంది జాగ్రత్త

దానితో అందరూ తలలు తిప్పుకుని ఎవరి పని వాళ్ళు చేసుకోసాగారు
మల్లీశ్వరి కూడా కుతూహలంగా కాకపోయినా శిల్ప సౌందర్యాలను వీక్షిస్తోంది కొందరు రాణివాసపు స్త్రీలు ఒక శిల్పందగ్గర నిలబడి పరీక్షగా చూస్తున్నారు

ఒకతె — ఎంత ఆశ్చర్యం, ఈ బొమ్మ లోని పోలికలన్నీ మన మల్లీశ్వరీ దేవిలా ఉన్నాయి

అంది వెంటనే పక్కన ఉన్న మరో రాణివాసపు స్త్రీ అందుకుని

రెండవ — ఏమో ఎవరు చూసారు ఈ బొమ్మను చెక్కిన శిల్పికి మల్లీశ్వరీదేవి లాంటి పోలికలున్న ప్రియురాలుందో ఏమో!

అని కొంచెం వ్యంగ్యాన్ని కంఠంలో మిళితం చేసి అంది
పక్కనే వున్న మల్లీశ్వరీ దేవి ఆ మాటలు వింది పైగా పక్కనున్న స్త్రీలంతా ఆ మాటలకు నవ్వటం కొంచెం బాధించింది కాని ఆశిల్పం తన పోలికలతో ఎందుకు ఉంది అన్న ఉత్సుకత ఆమె గుండెల్లో తద్వారా కళ్ళల్లో కనిపిస్తోంది శిల్పాన్ని మళ్ళీ పరిశీలించింది అచ్చంతనే!
ఒకవేళ బావ తన శిల్పం చెక్కి ఉంటాడా అన్న ఆనందం, బావ ఏమయినాడో అన్న బాధ సందిగ్ధావస్థలో వున్న మల్లీశ్వరిని ఒక రాణి వాసపు స్త్రీ గమనించి

మూడవ — అటు చూడండి మన మల్లీశ్వరీ దేవికి మనసు మనసులో లేనట్టుంది

అన్నది సన్నగా నవ్వుతూ మల్లీశ్వరి నర్తన శాల మెట్లు దిగి వస్తోంది శిల్పులందరూ వెనక్కి తిరిగి కూర్చుని వారి వారి శిల్పాలు చెక్కుతున్నారు వాళ్ళను చూస్తూ వెళుతున్న మల్లీశ్వరి చూపు ఒక శిల్పి వీపు మీద పడింది విశాలమైన వీపు మీద పెద్ద పుట్టు మచ్చ ఆ జుట్టు భుజాల వెనక నుంచి చూస్తే అచ్చం తన బావలాగానే కనపడు తున్నాడు గబగబా దగ్గరగా వెళ్ళింది ఆమె కళల్లో బాధ, ఆనందం కలబోసిన కన్నీళ్ళు నాగరాజు వీపు మీద పడ్డాయి నాగరాజు వీపు తడుము కుని వెనక్కి తిరిగాడు ఎదురుగా తన మల్లి!

మల్లీశ్వరి — బావా!

నాగరాజు — మల్లీ!

అంటూ ముందుకు వస్తున్నారు ఇంకో క్షణం ఆగితే ఇద్దరూ ఆలింగనం చేసుకుని ఉండేవారు జలజ చటుక్కున అడ్డువచ్చింది ఆమెకు పరిస్థితి అర్ధమయ్యింది

జలజ — అంతఃపురానికి వెళ్ళే వేళయ్యింది దయ చేయండి రేపు లన్నీ తీరిగ్గా వచ్చి మాట్లాడు కుందాం

అని చెయ్యి పట్టుకుని తీసుకు వెళ్ళింది ఇప్పుడు లోకంలోకి వచ్చిన మల్లి శిల్పులందరూ తమను గమనించటం గమనించి కంగారు పడింది

జలజ — భయపడకండమ్మా అపాయం అతనికే గాని మనకి కాదు

అంది ఆ మాట విని దిగులుతో

మల్లీశ్వరి — అవును అతనికోసమే భయ పడు తున్నాను

జలజ — మరేం మాట్లాడకండి తొందరగా అంతఃపురం చేరుకోవాలి పదండి

అంటూ ఒక రకంగా బలవంతంగా తీసుకువెళ్ళింది నాగరాజు బొమ్మలా అలాగే నిలబడి ఉన్నాడు
శిల్పాచారి దగ్గరగా వచ్చి

శిల్పాచారి — ఎంత ప్రమాదం! అంతఃపుర స్త్రీలతో ఆటలాడితే అపాయం వస్తుంది నాయనా

నాగరాజు మణిపూస చేజారినట్టు నిట్టూర్చాడు

– కట్ –

మల్లీశ్వరి మౌనంగా రోదిస్తోంది
జలజ కన్నీటితో చూస్తోంది అంటే
అప్పటికి తన కధ ఆమెకు చెప్పిందని
అర్ధమవుతోంది

మల్లీశ్వరి : నా ఏడుపు ఎవరు వింటారు? ఊరంతా నా అదృష్టానికి ఉబ్బి పోయింది మా నాన్నకి మాత్రం తెలుసు నా మనసులో దుఃఖం పాపం తెలిసి ఏం చేస్తాడు? రాజాజ్ఞ కాదనలేక పోయాడు మేళ తాళాలతో నన్ను పల్లకి ఎక్కించాడు నా ప్రాణం నా రాజాను వెతుక్కుంటూ వెళ్లిపోయింది ఈ శరీరం మాత్రం రాణి వాసం చేరుకుంది ఈ దిక్కు మాలిన మల్లికి మిగిలింది ఒకటే కోరిక ఒక్కసారి బావ పాదాలమీదుడి మన్నించమని వేడుకుంటాను ఇంకొక్క సారి రాజాను చూడగలిగితే, ఈదిక్కు మాలిన దానికి అంత అదృష్టం కూడానా!

అని ఏడవ సాగింది మల్లీశ్వరి జలజ
ఓదార్పుగా

జలజ : ఇంత దుఃఖాన్ని ఎలా భరించారు తల్లీ ఇన్నాళ్ళూ అన్నీ అనుకూలించే సమయం రాకపోదు ఈ దాసీ మాట నమ్మండి

అని నమ్మకంగా చెప్పింది

– కట్ –

జలజ పూల సజ్జతో నిలబడి ఉంది ఏం చెప్పాలో తెలియక నిలబడి ఉన్నాడు అధికారి అది గమనించి శిల్పాచారి అధికారి దగ్గరకు వచ్చాడు

**శిల్పాచారి** : ప్రభువులు ఏదో ఆలోచిస్తున్నట్లుంది

**అధికారి** : వాళ్లమ్మగారికి పువ్వులు కావాలట మన ప్రాణం మీదికి రావటానికి వెతికి వెతికి ఈ తోటపువ్వులే కావాల్సి వచ్చాయి స్వామీ మీకు పుణ్యం ఉంటుంది ఈ నిర్మాణం తొందరగా పూర్తి చేయించండి

అని నమస్కారం పెట్టాడు

**శిల్పాచారి** : ఇంకెన్నాళ్లు ఈ మాసంలోగా పూర్తవుతుంది దశమి నాడు మహా ప్రభువులు నర్తన శాల చూట్టానికి విజయం చేస్తున్నారు గదా

**అధికారి** : అవును

ఇదే అదననుకొని జలజ అధికారి ముందుకి వగలుపోతూ వచ్చి నిలబడింది

**జలజ** ప్రభువులు సెలవిస్తే

**అధికారి** అలాగే

అన్నాడు

– కట్ –

## దృశ్యం 49 ఎ నర్తనశాల వద్ద తోట పగలు

జలజ పాడుతూ పుష్పాలు కోసుకుంటోంది అధికారి మీసాలు మెలివేసుకుంటూ ఆమె సౌందర్యోపాసన చేస్తున్నాడు పాట నర్మగర్భంగా ఉండడంతో నాగరాజు అర్థం చేసుకుంటున్నాడు నాగరాజు దగ్గరకు వచ్చి కాలుజారి పడట్టుగా పడింది పాట ఆగింది

– కట్ –

## దృశ్యం 49 బి నర్తనశాల వద్ద తోట పగలు

నాగరాజు ఉలిక్కిపడి లేచాడు

**జలజ** జాగ్రత్త అక్కడే ఆగండి

అనగానే నాగరాజు ఏమీ ఎరగనట్లు కూర్చున్నాడు

**జలజ** నా వేపు చూడకండి మీపనిమీరు చేసుకోండి

అంది చిన్న గొంతుతో పువ్వులు ఏరుతోంది అధికారి ఆమెవైపుకి రాసాగాడు అనుమానం నిండిన స్వరంతో

**అధికారి** పాపం పడ్డట్టున్నావ్

అన్నాడు
జాలిగా ముఖం పెట్టింది

**అధికారి** దెబ్బ తగిలిందా?

అని అడిగాడు ఓదార్పుగా

**జలజ** మరేం లేదులెండి, రాళ్ళ మీద కాలు జారింది పాపం, మీకు శ్రమ కలిగించాను ఈ పువ్వులు ఏరుకుని తొందరగా పోతాను

అంత అందమైన ఆడపిల్ల తొందరగా పోతాను అంటే వృద్ధుడయినా మగవాడే కదా!

అధికారి : తొందరగా కాకపోతే నెమ్మదిగాపోవచ్చు పనివాళ్ళకు మాత్రం ఇబ్బంది కలగ కూడదు రాణివాసపు కట్టుదిట్టాలు నీకు తెలియనివి కావు

అన్నాడు ఆ స్వరంలో ఇంకాసేపు ఉంటే బాగుండును అన్న ధ్వని వినిపించింది

జలజ : ఎంత మాట సెలవిచ్చారు

అనగానే మీసం దువ్వుకుంటూ వెళ్ళాడు ఇప్పుడు నాగరాజుకి మాత్రం వినిపించే స్వరంతో

జలజ : వచ్చే శుక్రవారంరాత్రి పంపావతీదేవి ఆలయం దగ్గర తుంగభద్ర ఒడ్డున మా మల్లీశ్వరీ దేవి మీ కోసం ఎదురు చూస్తూ ఉంటారు

నాగరాజు నమ్మలేనట్లుగా చూసాడు

జలజ : ఇటు చూడకండి ఈ రహస్యం ఎవరికీ తెలియ కూడదు

ఇంకా అయోమయంగానే

నాగరాజు : నిజమేనా?

జలజ : మాట్లాడవద్దు నా వేపు చూడకండి

ఆ అమ్మాయిని మరొక సారి చూడవలెననో, ఉలి శబ్దం వినబడకో, తల తిప్పి చూసి మెల్లగా అధికారి మళ్ళీ అక్కడికే వచ్చాడు తను అతనితో మాట్లాడ లేదు అని అధికారిని నమ్మించటం కోసం

జలజ : రాతిబొమ్మలు చెక్కి-చెక్కి మనసులు రాళ్ళయి పోయాయి హా! ఎంత అన్యాయం

అంది

అది వినిపించి కూడా వినిపించనట్లు

అధికారి : ఏమిటే, ఏమిటో అంటున్నావు

**జలజ** — అహో ఏమీలేదు బొమ్మలు చెక్కి చెక్కి ఇక్కడ వాళ్ళ మనసులు రాళ్ళయి పోయాయి అంటున్నాను జారిపడితే జాలిపడే వాళ్ళు ఒక్కరూ లేరు

లంది మిగిలిన పూలు ఏరుతున్నట్టు నటిస్తూ

**అధికారి** — జాలికేం కావలసినంత ఉంది అంతఃపుర స్త్రీలకు జాలి చూపటం, కోరి ఉరి తెచ్చుకున్నట్టే

నవ్వి

**జలజ** — మా దేవి గారికి ఈ పువ్వుల మీద ఇష్టమే లేకపోతే, ఈ జాలిపడటాలూ జారిపడటాలూ మీకు నాకూ కూడా తప్పేవి

అని కిలకిలా నవ్వింది
అధికారి మళ్ళీ మీసం తిప్పాడు

**అధికారి** — ఏయ్ దిక్కులు చూడకుండా పని చేసుకోవయ్యా

నాగరాజు జలజ చెప్పినవాటిని గుర్తుకు తెచ్చుకున్నాడు

– కట్ –

| దృశ్యం 50 | పంపావతీదేవి ఆలయం | పగలు |
|---|---|---|

మల్లీశ్వరి, జలజ తుంగభద్ర ఒడ్డుకి వచ్చారు నాగరాజు కోసం వెతికారు జలజ వెతకటానికి వెళ్ళింది రాళ్ళ మీదనడిచింది మల్లీశ్వరి అసహనంగా చూస్తోంది జలజ తిరిగి వచ్చింది

**మల్లీ** — జలజా

**జలజ** — వస్తున్నానమ్మా

అంటూ వచ్చింది

| | |
|---|---|
| మల్లీ | నాకేవిటో భయంగా ఉంది జలజా నువ్వు నాగరాజుతో మాట్లాడినప్పుడు ఎవరూ లేరు గదా నిజంగా వస్తానన్నాడా! |
| జలజ | వస్తారమ్మా, ఎందుకు రారూ? |
| మల్లీ | మనం రాకముందే ఎవరయినా రాజుని పట్టుకున్నారేమో అయ్యయ్యో ఎంత పని చేసాను |
| జలజ | అయ్యో! నా పిచ్చి తల్లీ! ఈ జలజ అంత తెలివిమాలినది కాదు |
| మల్లీ | మరి మేం ఎక్కడ కలుసుకోవాలో సరిగ్గా చెప్పావా? బావ సరిగ్గా విన్నాడో లేదో? |
| జల | మనసు పరుగెత్తేటంత వేగంగా మనిషి పరుగెత్తగలడా అమ్మా? |

అంటుండగా మురళీనాదం వినిపించింది అది తన బావ వేణుగానమే ఆమె మనసు ఆనందడోలికల్లో ఊయలలూగింది

– కట్ –

| దృశ్యం 50 ఎ | పంపావతీదేవి ఆలయం | పగలు |
|---|---|---|

– పాట –

బావ ఒళ్ళో సేద తీరుతూ మల్లీశ్వరి కమ్మగా పాట పాడ సాగింది జలజ దూరంగా కూర్చుంది

– కట్ –

| | | |
|---|---|---|
| వేచిచూస్తున్న జలజమీద మిక్స్ చేస్తే నిద్రపోతోంది | | |
| | మల్లీ | అయ్యయ్యో, ఇంకేవన్నా ఉందా బావా, పులినోట్లో తల దూర్చి అయినా బతకగలం గాని అంతఃపురంలో అడుగుపెట్టి బతకగలమా? |
| నగారా శబ్దానికి జలజ తుళ్ళిపడి లేచింది | | |
| | మల్లీ | కావచ్చు కానీ జలజ ఏమవుతుంది? అయ్యయ్యో చిత్రవధ చెయ్యరూ! |
| అంటుండగా జలజ దూరంగా వచ్చి | | |
| | జలజ | దేవీ |
| అని పిలిచింది | | |
| | జల | ఇప్పటికే ఎంతో ఆలస్యం అయ్యింది |
| | నాగ | రేపురాత్రి రెండోజాము నగారా వినపడేలోగా బుక్కరాయల బురుజుదగ్గర సిద్ధంగా ఉంటాను తప్పక రావాలి సుమా |
| అన్నాడు | | |
| | మల్లీ | అవును అంతే, అక్కడికి దక్షిణద్వారం ఎంతో దూరంలో లేదు |
| | జల | దేవీ |
| అనగానే బయలుదేరి బావను వదలలేక మళ్ళీ కౌగలించుకుంది | | |
| | జల | దేవీ రెండో నగారా కూడా విన్నారు |
| అంది జలజ బాధగానే విడిపోయి కదిలింది | | |

– కట్ –

దృశ్యం 51 | మల్లీశ్వరి సదనం | రాత్రి

ఆనందంతో వచ్చింది మల్లీశ్వరి జలజ ద్వారం మూసింది

– పాట –

మల్లీశ్వరి హృదయం ఆనందంతో పాట పాడసాగింది బావదగ్గర ఏ పాట పాడిందో అదే పల్లవిని పాడ సాగింది జలజ సంతృప్తిగా చూసింది

జలజ — ముత్యాల వానలు కురిపించే మురిపాల నవ్వులు ఇన్నాళ్ళు ఎక్కడ దాచావమ్మా?

అంటూ పక్కన కూర్చుని

ఈ సౌందర్యాన్ని చూస్తుంటే ఆడదాన్ని నాకే

అని నర్మగర్భంగా అంటే ఇష్టంతో కూడిన కోపాన్ని నటిస్తూ

మల్లీ — ఏయ్!

అంది

– కట్ –

దృశ్యం 52 | నర్తనశాల | పగలు

రాయులవారు నర్తనశాలలో శిల్పాల సౌందర్యాలను చూస్తున్నారు ఆయన ఒక ప్రతిమను చూస్తుంటే అది అచ్చం మల్లీశ్వరిదిలా అనిపించింది

రాయలు — ఆచార్యా! ఇవి ఊహా చిత్రాలు కావు ఎవరో ప్రాణానికి ప్రాణమైన మూర్తులను ఆప్యాయంగా తీసుకువచ్చి, ఈ పాషాణం మీద ప్రతిష్టించుకున్నారు ఈ లావణ్య లక్ష్మిని సృష్టించిన మహాశిల్పులెవరో!

శిల్పా  మహా ప్రభువులు సకలకళా పారంగతులు ఏలిన వారి చిత్తానికి ఆహ్లాదం కలిగించటం సామాన్యులకు సాధ్యం కానిది ఈ సౌందర్య మూర్తులను సృష్టించిన కుమార శిల్పి జన్మ సార్ధకమైనది ఈ తరుణంలో సార్వభౌముల సమక్షంలో లేకపోవటం ఆ చిరంజీవి దుర దృష్టం

రాయ  ఎవరా శిల్పి? మన ఆస్థానంలోని వాడేనా?

శిల్పా  ఏలినవారు చిత్తగించాలి ఒకనాడు పంపా సరోవరం పక్కన కొండలోయలో తిరుగుతూ కనిపించిన ప్రతిరాతిమీద అపూర్వ శిల్పకళను చూసాను ఆ సమీపంలోనే మతి చెడి మౌనంగా కూచున్న ఒక యువకుని చూసాను ఆ శిల్పాలు చెక్కినది అతడేనని తరువాత తెలుసు కున్నాను ఎంతో కష్టం మీద నచ్చజెప్పి ఆ చిరంజీవిని మన నర్తశాలలో పని చెయ్యటానికి తీసు కొచ్చాను

రాయ  ఆ శిల్పి పేరు?

శిల్పా  · నాగరాజు

రాయ  నాగరాజు!

అని మల్లీశ్వరి ఉన్న శిల్పం వంక చూసాడు

– కట్ –

దృశ్యం 53 | మల్లీశ్వరి సదనం | పగలు

- పాట -

ఎందుకే నీకింత తొందర అని తొందర పెడుతున్న మనసుని ఓదారుస్తూ పాడుకుంటోంది మల్లీశ్వరి

- కట్ -

దృశ్యం 53 ఎ | మల్లీశ్వరి సదనం | పగలు

మల్లీ — జలజా!

అంటూ జలజ దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చి

ఈ పగటికి రాత్రంటూ లేదు జలజా ఈ రాత్రి రెండో జామునగారా, మా బావ చేతుల్లో పరవశిస్తూ ఉంటాను తెల్లవారేలోగా ఏ కానలోనో, ఏ కోనలోనో బావా నేనూ హాయిగా పావురాల్లాగా, హో హో

అని ఆనందంగా చెబుతుంటే జలజ కన్నీళ్ళు పెట్టింది

మల్లీ — ఎందుకా కన్నీరు జలజా? ఈ కత్తుల బోను దాటినేను బయట పడటం నీకు సంతోషం కాదూ

జలజ — అంతకంటే నేను కోరేదేముంది తల్లీ నాకెందుకో భయంగా ఉందమ్మా రాత్రి నాకో పాడు కల వచ్చింది ఉదయం నుంచి అన్నీ అపశకునాలే చూస్తున్నా

మల్లీశ్వరి పక పకా నవ్వేసింది

మల్లీ . హహహ! పిచ్చిదానా! నా మీద ఉండే అపేక్ష కొద్దీ నీ మనసుకి అలా అనిపిస్తోంది నిజంగా ఈ రాణివాసం కంటే నాకు నరకం ఏముంది చెప్పు ఈ విచ్చు కత్తుల కాపలాలు దాటి బయట పడితే బావతో ఈ లోకంలో స్వర్గం అనుభవిస్తాను పట్టుబడితే ఉరి తీస్తారు అంతేగా!

అంది తేలిగ్గా

అంతలో మహారాణి వారి మందిరం నుంచి లేఖ తీసుకొని వచ్చింది ఒక పరిచారిక

జలజ వెళ్ళి అందుకుంది

జల మహా ప్రసాదం ఇప్పుడే మా దేవిగారికి అందజేస్తాను

అనగానే వచ్చిన భృత్యురాలు

పరి మంచిది

అని వెళ్ళిపోయింది

మల్లీశ్వరి లేఖచూసి కుంగి పోయింది

మల్లీ అసంభవం! వీల్లేదు!

అని లేఖను విసిరి పారేసి కూలబడి పోయింది ఏడవ సాగింది జలజ అది తీసుకుని

జల ఈ రాత్రి నందనవనలతామంటపంలో ఉషాపరిణయ నాటకం వీక్షించుటకు శ్రీశ్రీ మహారాణి తిరుమల దేవమ్మ గారు, శ్రీశ్రీశ్రీ మహారాయలవారి సమేతంగా విజయం చేయుచున్నారు అందు ఉషాదేవిగా నటించుటకు మహారాణీవారు మల్లీశ్వరీ దేవికి దయచేయించిన ఆజ్ఞా పత్రం

– కట్ –

| దృశ్యం 54 | నందనవనం | రాత్రి |
|---|---|---|

– పాట –

రాయలవారు, రాణీవారు వీక్షిస్తున్నారు

మల్లీ . జలజా! తొందరపడి బావ వచ్చేస్తాడేమో

అంది

జలజ ఆమెను మాట్లాడనివ్వలేదు

ఉషగా తన మనసు ఏ బాధ అనుభవిస్తోందో

అదే అనుభవిస్తోంది మల్లీశ్వరి

– కట్ –

| దృశ్యం 55 | నందనవనం | రాత్రి |
|---|---|---|

నాగరాజు కోట గోడ ఎక్కి పైకండువా దిమ్మకు కట్టి లోపలకు దూకాడు ఒక కాపలాదారుడు శబ్దం విన్నాడు ప్రమాద ఘంటిక మోగించాడు సైనికులు అప్రమత్తులయ్యారు

అధి ఎంత సాహసం సందేహం లేదు ఆ దుర్మార్గుడెవరో చావుకోరే కోటలోకి ప్రవేశించి ఉంటాడు ప్రహరీల చుట్టూ కాపలాలు కట్టుదిట్టం చెయ్యండి ప్రాకారాలన్నీ గాలించి వెతకండి జాగ్రత్త ప్రభువుల వినోదానికి భంగం రాకూడదు

నాగరాజు వింటున్నాడు

– కట్ –

| దృశ్యం 56 | నందనవనం | రాత్రి |
|---|---|---|

మల్లీశ్వరి పాట పాడుతోంది

– కట్ –

దృశ్యం 57　　　　నందనవనం　　　　రాత్రి

నాగరాజు నక్కినక్కి వెళుతున్నాడు

మల్లీశ్వరి పాడుతూ దిక్కులు చూస్తోంది

– కట్ –

దృశ్యం 58　　　　నందనవనం　　　　రాత్రి

సైనికులు బావ వెంటపడటం గమనించి
'బావా' అంటూ పరుగెత్తింది

– కట్ –

దృశ్యం 59　　　　నందనవనం　　　　రాత్రి

లంటూ ఆపాలని చూసింది

జలజ　　దేవీ! దేవీ!

– కట్ –

దృశ్యం 60　　　　నందనవనం　　　　రాత్రి

నాగరాజుని చుట్టుముట్టారు

అధి　　మూర్ఖుడా కత్తి దింపు

మల్లీ　　బావా! బావా!

అంటూ పరుగెత్తింది
సైనికాధికారి అయోమయంగా చూసాడు

నాగ　　ఎవరు నువ్వు? నీకు మతి లేదూ? ఇక్కడికెందు కొచ్చావ్?

మల్లీ　　బావా!

అధి — దేవీ, అంతఃపురంలోకి ఉయచెయ్యాలి ఈ ఘాతకుడిని దండనాయకుడికి ప్పగించాలి

మల్లీ — ఈ పాతకిని కూడా తీసుకు వెళ్ళండి నా రాజాను ఒక క్షణమైనా విడిచి వెళ్ళను

అధి — మన్నించాలి మహాపరాధం చేస్తున్నారు ఘోర దండనకు గురి కావలసి ఉంటుంది

మల్లీ — నాకేం భయం లేదు అన్నిటికి సిద్ధంగా ఉన్నాను

అధి — మంచిది ఊ! కదలండి

– కట్ –

| దృశ్యం 61 | నందనవనం | రాత్రి |
| --- | --- | --- |

భటులు ఇద్దరినీ బందీలుగా తీసుకు వెళుతున్నారు జలజ గుండె భారంతో చూస్తోంది తీసుకు వెళ్ళిపోతున్నారు

– కట్ –

| దృశ్యం 62 | రాణీ మందిరం | రాత్రి |
| --- | --- | --- |

మహారాణి దిగులుగా కూర్చుంది ఎదురుగా జలజ ఉంది

జల — ఏలినవారికి ఏమని మనవి చెయ్యను? ఎంత బ్రతిమాలినా వినిపించుకున్నారు కాదు తన అపరాధానికి ఘోర దండన అనుభవించాలని తెలిసి కూడా వినిపించుకోలేదు

ఏ విపత్తు వచ్చినా సరే, తన బావని ఒక్క క్షణమయినా వదిలి రానన్నారు ఆ నిర్భాగ్యుడితో కదిలి ఆనందంగా చెఱసాలకు నడిచి వెళ్ళారు

ఇకచెప్పవద్దు అన్నట్టు ఆపింది జలజ వెళ్ళిపోయింది

– కట్ –

## దృశ్యం 63 కారాగారం రాత్రి

ఒకగదిలో మల్లీశ్వరి, ఇంకో గదిలో నాగరాజు ఒకరినొకరు కటకటాల మీద నుంచి చూసుకున్నారు

**మల్లీ** బావా!

అంటే దగ్గరగా వచ్చాడు

మనకి మిగిలింది ఈ ఒక్కరాత్రే రేపు మనకి ఈ లోకంతో ఋణం తీరిపోతుంది

అని పిచ్చి పట్టినట్లుగా నవ్వింది నాగరాజు దుఃఖంతో చూసాడు

**మల్లీ** దిగులుపడి కూచుంటే ఈ ఒక్క రాత్రీ దాటిపోతుంది బావా, నేను నీకు ఇష్టమైన పాట పాడేదా చెప్పు బావా? నీకు ఇష్టమైన పాట పాడనా బావా?

అని పూడుకుపోయిన గొంతును పెకిలించుకొని

**మల్లీ** ఓ బావా నా బావ ఓ రాజా నా రాజా పొన్న చెట్టు కింద ఓ బావా నా బావా బొమ్మలు చేసేటి నా బావా మట్టి బొమ్మలు చేసేటి నా బావా

అని పాడుతూ కిటికీ చువ్వ మీద పడి ఏడవసాగింది

అని తల నిమిరాడు

నాగ — మల్లీ! మల్లీ!

మల్లి — బావా!

– కట్ –

**దృశ్యం 64** — వధ్య స్థలి — పగలు

---

రెండు ఉరి తాళ్ళు వేలాడుతున్నాయి

– కట్ –

**దృశ్యం 65** — దర్బారు — రాత్రి

---

రాయలవారు దర్బారులో అటూ, ఇటూ తిరుగుతూ చేతులు కట్టుకుని నిలబడ్డ నాగరాజు, మల్లీశ్వరిని చూసారు

రాయ — నిర్భాగ్యుడా! ప్రాణాల మీద ఆశ వుండే ప్రవేశించావా అంతఃపురంలోకి?

అని కోపంగా అడిగారు

నాగ — ప్రాణానికి ప్రాణమైన నా మల్లి ఏనాడయితే రాణివాసపు పల్లకిలో వెళ్ళిపోయిందో, ఆనాడే ఈ బ్రతుకు మీద ఆశపోయింది నా మల్లికి దూరమై చచ్చిబ్రతికే కంటే, నా మల్లిని ఒక్కసారి కళ్ళారా చూసి ఈ బ్రతుకు చాలించటం తప్ప నాకు వేరే గతి ఏముంది ప్రభూ, ఏలిన వారు కరుణా సముద్రులు ముందు నా ప్రాణాలు తీయించి తర్వాత నా మల్లికి రాణివాసపు పల్లకి పంపి ఉంటే ఈనాడు తమకీ శ్రమ లేకపోయేది

అనగానే రాయల వారికి కోపం పెరిగింది

రాయ  మూర్ఖుడా! మా మీదే అపవాదు మా సంప్రదాయాన్నే నిలదీస్తున్నావు మా మనసుకు పాత్రులైన వారికిగాని ఈ రాణి వాసపు గౌరవం లభించదు మల్లీశ్వరికి ఆత్మీయులెవరో మీరే మమ్ము అర్థించనిదే మేము పల్లకి పంపిఉండము

నాగ  మహా ప్రభువులు మన్నించాలి ఏలిన వారి పాదధూళికయినా తగనివారము మేమింతటి రాణి వాసాన్ని కలలోనైనా ఆశించ గలమా ప్రభూ! మేమెంత? మా యోగ్యత ఎంత? మా మల్లికి రాణి వాసపు పల్లకీని పంపించమని ప్రార్థించామంటారు

రాయ  అయితే మా అంతట మేమే పల్లకిని పంపామంటున్నావా? బాగా ఆలోచించి మాట్లాడు

అని రాయలవారు గర్జించారు

నాగ  ఎంత ఆలోచించినా మా వైపు ఎవరికీ రాణీవాసపు పల్లకి పంపించమని అర్థించే సాహసం లేదు ప్రభూ

రాయ  . ఏమో! ఒక వేళ నీవే మాతో మనవి చేసావేమో!

నాగ  నేనా ప్రభూ!? కోరి కోరి నా మల్లిని నేనే దూరం చెయ్యమంటానా? నాకు మతి పోతోంది

అని తల పట్టుకున్నాడు

అనగానే రాయలవారు వెళ్ళి 'పిలుపు గంట' కొట్టారు

పండి — జయ విజయీభవ జయ విజయీభవ
కర్ణాటాంధ్ర మహా మహీ మండల దేవేంద్రా
జయ విజయీభవ జయ విజయీభవ

అంటూ పండితుడు ప్రవేశించాడు

రాయ — వీరెవరుగురుడువా?

నాగరాజు తేరిపార చూసి గుర్తుకు తెచ్చుకోవటం కోసం ప్రయత్నించాడు

పండి — ఆ అప్పుడే మరిచిపోయావా నాయనా మీ ఊరికి సమీపంలో ఒక సత్రం ఉంది అక్కడ మంచి వర్షంలో మనం కలుసుకున్నాం జ్ఞాపకం ఉందా ఆ నీ పేరు నాగరాజు కదూ

ఇప్పుడు నాగరాజుకి గుర్తొచ్చింది

నాగ — • కవి రాజు!

అన్నాడు పైకి

పంతు — ఆఁ జ్ఞాపకం వచ్చిందీ, నాకు బాగా జ్ఞాపకం ఉందిలే అమ్మాయిచ్చిన జామ పండు రుచి, లక్కడే గదుటయ్యా రాయల వారితో మనవి చేయాలని, మన అమ్మాయికి రాణివాసప్పల్లకి పంపే ఏర్పాటు చెయ్యమని నీవు నన్ను అడిగింది

నాగ — కాని స్వామీ! ఏదో వేళా కోళానికి ఎన్నో మాట్లాడాం

రాయ — • పెద్దవారితోనా వేళాకోళాలు? మా ఆస్థాన కవీశ్వరులతో మనవి చేస్తే మాతో మనవి చేసినట్లే

పండి — సరి సరి నాతో ఏమిటి? ప్రభువుల సముఖాన్నే మనవి చేసుకుంటే

నాగ ప్రభువులతోనా?

అని విస్మయంగా చూసాడు
ఇప్పుడు రాయల వారి రూపం సత్రంలో కనిపించిన రూపంతో పోల్చుకుని నాగరాజు, మల్లీశ్వరి దిగ్భ్రమ చెందారు

నాగ ప్రభూ తమరేనా ఆనాటి బాటసారులు

మల్లి ఎంతటి అపచారం

రాయ ఇప్పటికయినా తెలియ వచ్చిందా? ఇదంతా నీ అపరాధమని

నాగ అపరాధమంతా నాదే ప్రభూ నన్ను శిక్షించి నా మల్లిని రక్షించండి

మల్లి ప్రభూ! అపరాధమంతా నాది

రాయ కాదు అపరాధమంతా నాగరాజుదే మల్లీశ్వరిని క్షమిస్తున్నాం

మల్లి కాదు ప్రభూ! అపరాధమంతా నాదే నేను రమ్మంటేనే నా బావ అంతఃపురం లోనికి వచ్చాడు నన్ను ఉరి తీయించి నా బావను రక్షించండి

పండి సార్వభౌములకు గట్టి చిక్కు వచ్చింది ఈ ధర్మసూక్ష్మం ఎలా విడదీస్తారో?

రాయ ఆనాడు సత్రంలో మనోహరమైన నృత్యం చేసి మాకు ఆనందం కలిగించిన మల్లీశ్వరిని, మా నర్తనశాలలో అపూర్వ శిల్పాలు సృష్టించి మాకు శాశ్వతమైన కీర్తిని కలిగించిన నాగరాజునీ ఇద్దరినీ క్షమిస్తున్నాం

మహారాణి, నాగరాజు, మల్లీశ్వరి సంతోషించారు
ఇద్దరూ నమస్కరించారు

– కట్ –

ఇంత విస్తరణగల సన్నివేశాన్ని ఇవ్వటానికి కారణం, సంభాషణ రచయిత పాత్ర కేవలం సంభాషణ రచించటానికే కాదు అని తెలియజెయ్యటానికి సంభాషణలతో పాటు రచయిత కాగితం ఎడమ పక్క అభినయానికి సంబంధించి, ఆహార్యానికి సంబంధించి కొన్ని సూచనలు రాస్తాడు నాగరాజు పిచ్చివాడిలా నవ్వటం అలాంటిదే అంతే కాక కధాచర్చలప్పుడు లభించని కొన్ని పాత్రౌచిత్యాలు, సంభాషణ రచనతో పూర్తవుతాయి రాణివాసపుపల్లకి పంపమని నాగరాజు అడిగాడు రాయల పాత్రను కాపాడటానికే 'మా మనసుకు పాత్రులైన వారికి గాని ఈ రాణివాసపు గౌరవం లభించదు మల్లీశ్వరికి ఆత్మీయులెవరో మీరే మమ్ము అర్థించనిదే మేము పల్లకి పంపి ఉండము' అనే మాట రాయటం జరిగింది

దర్శకుడి పని సులువు చెయ్యటానికి పాత్రల కదలికలు, ఒక్కొక్కసారి హావభావాలూ కూడా రచించబడ్డాయి అధికారి మీసం మెలి వేసుకోవటం లాంటిది

సంభాషణ రచయిత పాత్ర తన పని పూర్తి చేసే సరికి కధ ఏ దృష్టి కోణంలో చెప్పబడాలి, ఎన్ని దృశ్యాలు కావాలి, వాటి ప్రయోజనాలేవిటి, ఏయే పాత్రలు ఎలా మాట్లాడాలి అన్నది తెలిసింది కొంత వాతావరణం కూడా తెలిసింది అభినయానికి తగిన సంభాషణల వల్ల పాత్రల మనస్తత్వాలు, సంఘటన జరిగినప్పుడు, సంఘర్షణ జరిగినప్పుడు అవి ఎలా ఉంటాయో దర్శకుడికి తెలిసింది కధారచన అనేది ఒక రహదారి అయితే దాని మీద నడిచే మొదటి బాటసారి సంభాషణ రచయిత। దర్శకుడి కంటే ముందు, దృశ్యాన్ని, అభినయాన్ని తెరమీద దర్శించేది ఇతనే ఈ వివరాలన్నీ పైన వివరించిన సన్నివేశంలాగా రచించి దర్శకుడి చేతిలో పెడతాడు సంభాషణ రచయిత

## తెరకధ – దర్శకుడి పాత్ర :

సంభాషణలు రచయిత ద్వారా విన్న తరువాత దర్శకుడు వెండి తెర మీద దాన్ని ఎలా దర్శింప చేయాలా అని తపన పడతాడు

ఉదాహరణకు రచయిత సూర్యోదయం అవుతోంది అని రాసి ఊరుకుంటాడు దర్శకుడు ఆ సూర్యోదయానికి తన చిత్రంలో, తన సన్నివేశంలో, తన దృశ్యంలో ఎంత విలువ ఇవ్వాలో అన్ని షాట్లు తీస్తాడు ఒక్క షాటు తీయవచ్చు పది షాట్లు తీయవచ్చు అది ఆయా దర్శకుల అభిరుచి మీద ఆధారపడి ఉంటుంది

ఆ దృశ్యంలో ఎన్ని షాట్లు తియ్యాలి, అందులో క్లోజప్పులు ఎన్ని, మిడ్ షాట్స్ ఎన్ని, లాంగ్‌షాట్స్ ఎన్ని, సంభాషణ ఇంకో నటుడి క్లోజ్ మీద పోస్ట్ చెయ్యాలా? ఇవన్నీ

దర్శకుడి బాధ్యతే కెమెరా గురించి గాని, లెన్స్ గురించి గాని రాసాడంటే ఆ రచయిత వర్తమాన రచయిత అని అర్థం అయిపోతుంది రచయితకు అసలు అనవసరమైన విషయం లెన్స్

ప్రధానంగా దర్శకుడు సంభాషణ రూపంలో ఉన్న చిత్రకథను చేతిలో పెట్టుకుని అంక విభజన సరిచూసుకుంటాడు మొదటి అంకంలో (Act-1) భూమిక (Dramatic Premise) గురించి ఆలోచిస్తాడు ప్రధానపాత్రల పరిచయం, సహాయ, ఉప పాత్రల పరిచయం పూర్తి చేయటంతో పాటు, మొదటి మలుపు (First Plot Point) వచ్చిందో లేదో చూసుకుంటాడు

అదే రెండవఅంకం (Act - II) వచ్చేసరికి స్పర్థకోసం వెతుకుతాడు (Dramatic Context) పాత్రకూ పాత్రకూ మధ్య సంఘటన జరిగితే దాని మూలంగా ఉత్పన్నమయ్యే సంఘర్షణ (Confrontation) గురించి గమనిస్తాడు

కథానాయకుడి చర్యకు ప్రతికథానాయకుడు పాత్రరూపంగా ప్రతిచర్య ఉంటుంది (Action - Reaction) ఈ విధంగా కథ నడుస్తున్నప్పుడు రెండో మలుపు వస్తుంది

మూడోఅంకంలోకి వచ్చేసరికి (III Act) ప్రధానంగా దర్శకుడు ఫలప్రాప్తి (Dramatic Resolution) గురించి ఆలోచిస్తూ ఉంటాడు

కథానాయకుడి ఆశయం ఏమిటి? ఆ ఆశయం భంగం చేయాలని ఏ పాత్రలు ఆలోచిస్తున్నాయి? అవి గెలుపొందినట్లు కనిపించాలి తప్ప గెలుపొందకూడదు అన్న దృక్పథంతో ఆలోచిస్తాడు కథానాయకుడి ఆశయం వీగిపోతే అది ఉత్తమ చిత్రకథ కాలేదు

ఇన్ని ఆలోచనలు మనసులో పెట్టుకున్న దర్శకుడు, రచయిత సంభాషణలతో ఇచ్చిన దృశ్యాన్ని ఎదురుగాపెట్టుకొని, నిద్రలేనిరాత్రులు గడిపిన సంగతి ఈ సిద్ధాంతవ్యాసరచయిత అనేకపర్యాయాలు వీక్షించాడు

ఆ దృశ్యాలలో ఉన్న భావాన్ని, అర్థాన్ని, ఉద్దేశాన్ని ఏ రూపంగా తెరపై తెరకథగా మలచాలి? ఎన్ని షాట్లు తియ్యాలి? అని ఆలోచిస్తాడు

మల్లీశ్వరి బావను చూసే దృశ్యం రచయిత ఎలా రాసి ఇచ్చాడో పరిశీలించటం జరిగింది, దానికి దర్శకుడు బి ఎన్ రెడ్డి తెరరూపం ఇలా ఇచ్చాడు

1 ముందు శిల్పాచారి ఒకఫలకాన్ని పరిశీలిస్తూ ఉంటాడు దానిమీదే దూరంగా పాదఘట్టనల శబ్దం వినవస్తోంది వెంటనే బాకాలు ఏమా అని చూసాడు

2 రాణివాసపు స్త్రీలు చాలా మంది నర్తనశాలకు వస్తున్నారు

3 అధికారి శిల్పావారితో రాణివాసపు స్త్రీలు నర్తనశాల చూడటానికి వస్తున్న సంగతి చెప్పి, ఎవరయినా చూస్తే ఎంత ప్రమాదమో తెలియజేయటం
4 రాణివాసపు స్త్రీలు వస్తున్న షాటు
5 రాణివాసపు స్త్రీలు వస్తుంటే శిల్పులు కెమెరా ఎడమ వైపుకి తప్పుకున్నట్లు షాటు
6 అధికారి శిల్పులను మందలించి అవతలకు పంపుతూ రండమ్మా అని పిలవటం
7 రాణివాసపు స్త్రీలు మెట్లెక్కటం ఆఖరికి మల్లీశ్వరి రావటం
8 అధికారి సంభ్రమంగా చూడటం (అందరినీ చూడవద్దని ఇతను చూస్తూ ఉంటాడు ఇతని బలహీనత ఇక్కడ బహిరంగం చేసి జలజ పూలకు వచ్చినప్పుడు ఆ బలహీనత మూలంగానే జలజ నాగరాజుకి సందేశం ఇవ్వగలిగిందని దర్శకుడు పాత్రోచిత వైఖరి ప్రదర్శించాడు )
9 ఇంకా శిల్పులు చూస్తుంటే శిల్పాచారి తిట్టటం
10 ఇప్పుడు దూరపు షాట్‌లో, రాణివాసపు స్త్రీలంతా నర్తనశాల శిల్పాలను చూస్తున్నారని చూపించటం
11 మల్లీశ్వరి ఒంటరిగా చూస్తోంది
12 నలుగురు ఇష్టసఖులు ఒక శిల్పాన్ని చూస్తూ అచ్చం మల్లీశ్వరిలా ఉందని చెప్పుకోవటం
13 మల్లీశ్వరి ఒంటరిగా ఉండగా ఆ మాటలు ఆమెపై ప్రోత్సహటం
14 ఇద్దరు ఇష్ట సఖులు మల్లీశ్వరి మనసు మనసులో లేదని చెప్పుకోవటం
15 మల్లీశ్వరి అవతలకు వెళ్ళిపోవటం
16 జలజ మల్లీశ్వరి కోసం వెతకటం
17 మల్లీశ్వరి గుమ్మందాటి తోట దగ్గరకు రావటం
18 జలజ అదే తోవలో వెతుకుతూ రావటం
19 మల్లీశ్వరి ఒంటరిగా నిలబడిపోవటం
20 శిల్పులు అటూ ఇటూ తిరుగుతూ ఉండటం
21 మల్లీశ్వరి అక్కణ్ణించి మళ్ళీ కదలటం
22 జలజ గుమ్మందాటి రావటం
23 మల్లీశ్వరి ఒంటరిగా శిల్పుల మధ్యకు రావటం
24 మల్లీశ్వరి నాగరాజు వీపు భాగాన్ని చూడటం
25 మల్లీశ్వరి నాగరాజు దగ్గరకు రావటం
26 మల్లీశ్వరి కన్నీళ్ళు నాగరాజు వీపు మీద పడటం
27 నాగరాజు, మల్లీశ్వరి ఒకరినొకరు చూసుకోవటం
28 కౌగలించుకోబోవటం
29 జలజ కంగారుగా చూడటం

30 జలజ ఇద్దరి మధ్యకు వచ్చి మాట చెబుతూ అవతలకి తీసుకు వెళ్ళటం
31 నాగరాజు నిశ్చేష్టుడై నిలబడి ఉండటం
32 మల్లీశ్వరికి నచ్చచెప్పి తీసుకు వెళుతుండగా వెనక్కి తిరిగి చూడటం
33 శిల్పాచారి వస్తూ ఉండటం
34 శిల్పాచారి హెచ్చరించటం (ఒక రకంగా ఇతనికి, నాగరాజుకి ఒక స్త్రీ మూలంగా మతి భ్రమణ కలిగిందని తెలుసు ఆ స్త్రీ, ఈ స్త్రీయే అని తెలిసి కూడా ఆ మాట చెప్పి ఉండవచ్చు)
35 మల్లీశ్వరి, జలజ వెళ్ళిపోతూ ఉండటం
36 శిల్పాచారి, నాగరాజు చూస్తూ ఉండటం
37 వెళ్ళిపోతూ ఉండగా **మిక్స్**

మల్లీశ్వరి నాగరాజులు పునస్సమాగమం కోసం బి ఎన్ రెడ్డి 37 **షాట్లు** వాడుకున్నాడు తదనుగుణమైన సంభాషణలు రాయించుకున్నాడు మల్లీశ్వరీ, నాగరాజులు కలవబోతున్నారన్న ఉత్సాహం ఇప్పటికే ప్రేక్షకుడి హృదయంలో ఉంది దానికి అడ్డు కట్ట వేస్తూ దృశ్యం ప్రారంభించాడు రాణివాసపుస్త్రీలను ఎవరన్నా చూస్తే ప్రమాదం అని, ఈ మాట మరలా అధికారి ద్వారా శిల్పులకు, శిల్పాచార్యుడి ద్వారా శిల్పులకు, శిల్పాచారి ద్వారా నాగరాజుకి నాలుగు సార్లు చెప్పించాడు వాడిన సంభాషణ వాడగూడదని దేవులపల్లి కృష్ణశాస్త్రికి తెలుసు, బి ఎన్ రెడ్డికీ తెలుసు, మరెందుకు?

కలిస్తే ఉరి తాటికి ఎదురవుతారు అని ముగింపులో ప్రేక్షకుణ్ణి ఉత్కంఠలో పెట్టాడు

మల్లీశ్వరి నాగరాజుని ఎప్పుడు చూస్తుంది అన్న ఉత్సుకతలో ఉన్న ప్రేక్షకుడికి, శిల్ప సుందరి అచ్చం మల్లీశ్వరిలా ఉంది అటూ ప్రాతిపదిక వేయించుకున్నాడు ఆ మాట మల్లీశ్వరికి కోపం తెప్పించలేదు బాధ, ఆనందం సమానంగానే పంచింది ఒక వేళ తన బావే నిజంగా ఆ శిల్పాలు చెక్కాడేమోనని మల్లీశ్వరి బయటకు వచ్చింది శిల్పులు నడుస్తున్నారు ఈ షాట్ వ్యర్ధం అనిపిస్తుంది కాని ఒక వేళ వెళ్ళే వాళ్ళల్లో నాగరాజున్నాడేమోనని ప్రేక్షకుడిని ఊరించటం జలజ వెతుకుతూ వస్తోంది ఒక వేళ నాగరాజుని చూడకముందే భయపెట్టి తీసుకు వెళ్ళిపోతుందేమోనన్న అనుమానం బలపరచటం కోసం

ఆ తర్వాత చూడనే చూసింది దొరికిపోతుందన్న ఉత్కంఠ జలజ కాపాడుతోందన్న నమ్మకం, మళ్ళీ జలజ వీళ్ళిద్దరినీ కలుపుతుందిలే అన్న విశ్వాసం ఆఖరికి శిల్పాచారి మాటలతో, ఒక వేళ కలవలేరేమోనన్న భయంతో దృశ్యాన్ని ముగించి, ఒక చిత్రానికి, చిత్రకథ ఎంత ప్రాణమో ఈ దృశ్యం ద్వారా నిరూపించాడు బి ఎన్ రెడ్డి

దీని తరువాత చిత్రం రషెస్ చూసుకున్న తరువాత ఎడిటింగ్ (కూర్పు) వేసుకుని డబ్బింగ్ చెప్పించుకుని డబుల్ పాజిటివ్ తీసుకుని సంగీత దర్శకుడితో చర్చించి నేపథ్య సంగీతం, సన్నివేశాలకు అవసరమైన ధ్వనిముద్రణలు చేయించుకుంటాడు దర్శకుడు

ఈ సాంకేతిక ప్రక్రియలన్నీ దర్శకుడు పూర్తి చేస్తే అప్పుడు చిత్రకథ జనం చూసే సినిమాగా రూపాంతరం చెందుతుంది

ఈ భాగంలో కథనం అంటే స్క్రీన్‌ప్లే అంటారని, సాహిత్యకథలోని కథాంగాలు చిత్ర కథలో ఇమిడిపోతాయని తెలుసుకోవటం జరిగింది

కథ ఎన్ని దృష్టి కోణాల్లో చెప్పబడుతుందో పరిశీలించటం జరిగింది

ఆ కథలో పాత్రలు ఎన్ని రకాలు? వాటి నిర్వచనాలేమిటి? అని పరిశీలించటం జరిగింది

కథనంలో సంభాషణ, ధ్వని ఎంత ముఖ్యమయినవో, ధ్వని ఎన్ని రకాలుగా ఉందో, వాతావరణం కథనానికి ఎలా సహకరిస్తుందో పరిశీలించటం జరిగింది

సంఘటనలోనుంచి సంఘర్షణ పుడుతుందని, అది దృశ్యం అయి ఉంటుందని, ఆ దృశ్యాలు ఒకే అంశం మీద నడిస్తే అది ఒక సన్నివేశంగా మారుతుందని, అలాంటి సన్నివేశాలు కొన్ని కలిస్తే చిత్రకథ అవుతుందని తెలుసుకోవటం జరిగింది

సంఘటన, సంఘర్షణ, సన్నివేశం, దృశ్యం అనే అంశాలను విడివిడిగా పరిశీలించటం జరిగింది

మల్లీశ్వరి లాంటి ఉత్తమ కళాభిరుచి కలిగిన చిత్రం నుంచి దృశ్యమాలిక తీసుకుని, దృశ్య ప్రయోజనాలు తెలియజేయటం జరిగింది

ఇలా తయారయిన దృశ్యాలకు కథనం ఎలా రాసుకుంటారో తెలుసుకోవటం జరిగింది

ఒక సన్నివేశం మొత్తాన్ని సంభాషణతో సహా రాసుకుని, దృశ్య మాలిక, సంభాషణ రాసుకున్న తర్వాత సగం చిత్రకథగా ఎలా రూపాంతరం చెందుతుందో తెలుసుకోవటం జరిగింది

ఆ దృశ్యానికి సంభాషణలు రాసుకున్నాక, దర్శకుడు ఎన్ని షాట్లుగా విభజించుకుంటాడో తెలుసుకోవటం జరిగింది బొమ్మలు చెప్పే కథ, 'చిత్రకథ' గనుక, ఆ దృశ్యం ద్వారా చిత్రకథ సంపూర్ణ స్వభావాన్ని తెలుసుకోవటం జరిగింది

కథ, కథనాల సంగతి పరిశీలించటం జరిగింది ఇక మిగిలింది శిల్పం తెలుగు సినిమా సాహిత్యంలో - చలనచిత్రంలో శిల్పం ఎన్ని రకాలుగా ఉంటుందో ఇప్పుడు పరిశీలించాల్సి ఉంది

# చతుర్థాధ్యాయం

# తెలుగు సినిమా సాహిత్యం - శిల్పం

శిల్పం అనేది అనేకులకు కొరుకుడు పడని పదం శిల్పం అంటే అర్థం ఏమిటి? అనాదిగా మనం పరికిస్తే రాతిపై చెక్కిన బొమ్మ శిల్పం మరి సాహిత్యంలో శిల్పం అంటే ఏమిటి?

## నిర్వచనం :

కొందరు శిల్పం అంటే శైలి అంటారు

కొందరు శిల్పం అంటే పోకడ అంటారు

కొందరు కుశలత్వం అంటారు

కొందరు నిపుణత్వం అంటారు

ఆంగ్లంలో శిల్పం అంటే technique అని అర్థం

ఈ technique అనేదానికి లలితకళా పదకోశం ఏం అర్థం చెబుతోందో పరిశీలించాలి

*1 మాధ్యమాన్ని ఉపయోగించుకోవటంలో కళాకారుడు ప్రదర్శించే చేతి కుశలత, సాధన ద్రవ్య సంపత్తిపై అతనికి గల పనితనపు పటిమ, వీటికి తోడుగా తన కళను గురించి అతనికి గల సమగ్ర పరిచయం - ఇవి అన్నీ చేరి సాంకేతికత, లేక సాంకేతిక ప్రక్రియ అనబడుతున్నాయి తాను ఉద్దేశించిన సౌందర్య స్ఫోరకతను తీసుకొని*

రావటానికి కళాకారుడు - వర్ణ సంయోజనము, వర్ణికా భంగము అనే వాటిపై ఆధారపడతాడు ఇటువంటి సాంకేతిక ప్రజ్ఞను, స్వీయం చేసుకోవటానికి ఒక కళాతపస్వి దగ్గర అంతేవాసిత్వం, లేదా వృత్తిగా కళనభ్యసించే వ్యక్తి దగ్గర శిక్షణ అవసరమని సామాన్యంగా భావించటం యథార్థమే అయినా సహజ కల్పనా చాతుర్యం గల కళా ప్రజ్ఞ అందులో మేళవించినప్పుడే లది రాణించగలదు

2 చిత్రలేఖనం, శిల్పం- ఇంకా తదితరములై అటువంటివే అయిన వాటిలో భావ ప్రకటనకై అవలంబించే ఒక నిర్దిష్ట పద్ధతి, [illegible] ద్యుతి కల్పన మొదలైనవి ఇటువంటివే [1]

అసలు శిల్పం అంటే ఏమిటో లాక్షణికులు, సిద్ధాంతకర్తలు ఏమేమి చెప్పారో ఒకసారి పరిశీలించాలి

ఒక రచయిత ( లేదా కళాకారుడు) తన పనిలో కళా కౌశలాలను వినియోగించే రీతి, సామర్థ్యం , నిర్దిష్ట రంగంలో వినియోగించే ప్రత్యేకీకృత పద్ధతులు, ప్రక్రియా విధానాల సమాహారం అన్నది స్పష్టమవుతోంది సంగ్రహంగా చెప్పాలంటే, ఏ పనిలోనయినా కళానైపుణ్యాన్ని చూపే పద్ధతినే శిల్పమనవచ్చు [2]

ఋక్సామయోః శిల్పే స్థః తే వాం ఆరభే।
తే మాం పాతం। ఆస్య యజ్ఞస్య ఉదృచః
శర్మాసి। శర్మ మే యచ్ఛ।[3]

యజుర్వేదము 4-9

ఋక్సామములయనంతరము రెండు శిల్పములున్నవి ఆ రెండింటిని నేను ప్రారంభిస్తాను ఆ రెండు నన్ను కాచుగాక ఈ యుదృచమనెడు యజ్ఞమునకు సుఖ రూపమైన ప్రయోజనమున్నది నాకు సుఖమునిమ్ము అని అర్థం

కర్మయజ్ఞానికి శిల్పాలు సాధనాలు మానస సిద్ధము, క్రియా సిద్ధము అని ఆ శిల్పాలు రెండు రకాలు

ఒక కళాకర్మ చూసినప్పుడు మనకు సుఖం కలుగుతుంది ఆ సుఖం మూడు రకాలు

1 లౌకికం
2 లోకోత్తరం
3 పారలౌకికం

ఈ మూడింటిలో పారలౌకికసుఖము గొప్పది

వరూధిని ప్రవరాఖ్యుడితో -

"ఆనందో(బ్రహ్మయటన్న ప్రాజదువునంతర్బుద్ధినూహింపుమా[4]" అంటుంది

ఆమె ఉద్దేశంలో స్త్రీ, పురుషుల లౌకిక కలయిక పతాక స్థాయికి చేరినప్పుడు పొందే సుఖము బ్రహ్మానందసమానం అంటే పారలౌకిక సుఖం అంటోంది

కాని నిజానికి ఒక చిత్రకారుడి కుంచెనైపుణ్యం, ఒక సాహిత్యకారుడి కలంనైపుణ్యం ఇలా ఒక కళాకర్మ జరిగినప్పుడు పాఠకుడు లేదా ప్రేక్షకుడు ఒక సుఖాన్ని అనుభవిస్తాడు ఆ సుఖానికి కారణం శిల్పం వారి వారి చాతుర్యం వీరికి ఇచ్చేది సుఖమయితే వారు ప్రదర్శించేది 'శిల్పం'

అంతే కాదు, కొన్ని మానవ కర్మలందు కూడా శిల్పాలున్నాయి

కారుశ్శిల్పీ

తక్షా చ తంతువాయశ్చ నాపితో రజక స్తథా

పంచమశ్చర్మ కారశ్చ కారవ శ్శిల్పినోమతాః॥

*వీరి కర్మలన్నియు శిల్పములే అంటాడు పై సూత్రాన్ని వివరిస్తూ లింగయ సూరి[6]*

*శీలము అనేధాతువు నుండి శిల్ప శబ్దం పుట్టింది*

*సిద్ధాంత కౌముదిలో - "ఖర్ప శిల్ప శష్ప రూప పర్పతల్పాః -*

*స్పైతే పప్రత్యయాంతం నిపాత్యంతే। శీలతేః హ్రస్వం। శిల్పం కౌశలం"[7]*

శిల్పం అంటే కౌశలం అంటున్నారు కుశలుడి ధర్మం కౌశలం శిల్పం నిపుణ కర్మ

*శిల్పం కర్మ కళాదికమ్[8]*

అని అమరసింహుడు అంటున్నాడు

శిల్ప ధాతువుకి అభ్యాసం, సమాధి అని రెండు అర్థాలున్నాయి

అభ్యాసంతో సాధించేది కౌశలం సమాధితో రాబట్టేది నైపుణ్యం

సంభాషణల రచన చేసేటప్పుడు ఎన్ టి ఆర్ చుట్టుపక్కల చాలా నిశ్శబ్దంగా ఉండేట్టు చూసేవాడు

బ్రదర్ మీరు సమాధిలో రాస్తారు శబ్దం మీ ఏకాగ్రతకు భంగం కలిగిస్తుంది అనేవాడు

ఆ సమాది నుండి సాధించే శిల్పం సంభాషణశిల్పం అన్నమాట చిత్రకథను, కథను, సంభాషణను అభినయాన్ని కాచి వడబోసిన మనీషి గనుక ఆయన ఆ పద ప్రయోగం చేసేవాడు

మీ డైలాగులు సూపర్‌గా ఉంటాయండి అంటూ ఉంటారు యువకులు, గ్రామీణులు కలిసినప్పుడు సూపర్ అంటే సుందరంగా, సొబగుగా ఉంటాయని అర్థం సొబగు అంటే శోభ శోభ అంటే సౌందర్యం అని అర్థం

*అంగ ప్రత్యంగ కానాం యః*
*సన్నివేశోయథోచితం*
*సుస్నిగ్ధ సంధి బంధః స్యాత్*
*తత్ సౌందర్య మితీర్యతే*[9]

*అంగ ప్రత్యంగకముల యథోచితమైన సుస్నిగ్ధసంధి బంధమైన యే సన్నివేశము కలదో అది సౌందర్య మనబడుచున్నది* [10]

అని భరతరసప్రకరణం నుంచి పాటిబండ మాధవశర్మ ఉదహరించాడు

శిల్పం గురించి చెబుతూ పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి -

*మొదలుపెట్టడంలో చమత్కారం నడపడంలో నేర్పు, ముగించడంలో ముచ్చట- ఈ మూడింటిని ఆశ్రయించి ఉంటుంది శిల్పం ఆద్యంతమూ కథని మనోహరంగా సాగించి, కథలో కథాంగాలైన ఎత్తుగడ, పాత్రల నిర్వహణ, సన్నివేశ కల్పన, సంభాషణ, భాష, శైలి, ధోరణి, లక్ష్యము, ముగింపుల మధ్య సమరసమైన సమన్వయం సాధించగలిగితే, ఆ కథలో మంచి శిల్పం ఉన్నట్లే*[11] అని చెప్పాడు

అంటే కథ మొదలుపెట్టడంలో చమత్కారం అని, చమత్కారానికి చెప్పలేదు ఆయన సుబ్బారావు సుబ్బలక్ష్మిని ప్రేమించాడు అని కథ మొదలు పెట్టటానికీ, సుబ్బారావు మెడకు ఉరితాడు తగిలించుకున్నాడు, కుర్చీని తన్నటానికి సిద్ధంగా ఉన్నాడు అని మొదలు పెట్టటానికి చాలా తేడా ఉంది రెండోదానిలో ఉన్న ఉత్కంఠ మొదటి దానిలో లేదు

నడపటంలో నేర్పు అంటున్నాడు ఎందుకు సుబ్బారావు మెడకు ఉరి తగిలించుకున్నాడో ఎక్కడ చెప్పాలి? ఎలా చెప్పాలి? అదే నడక

ముగించటం ఓ ముచ్చట అన్నాడు మోదాంతమా, విషాదాంతమా అన్నది ప్రశ్న కాదు ఆ కథకి, ఆ పాత్రలకి ఆ సన్నివేశాలకు సరిపోయిన ముగింపు ఏదో అదే ముచ్చటయిన ముగింపు అని అర్థం వీటిని ఆశ్రయించి ఉంటుంది శిల్పం అంటున్నాడు

సాహిత్యంలో శిల్పం అంటే తను చెప్పదలుచుకున్నది ఎలా చెప్పాడో మనసుకు నచ్చేలా చెప్పాడా? మనసునొచ్చుకొనేలా చెప్పాడా? చాకచక్యంగా చెప్పాడా? రమణీయంగా చెప్పాడా? హృదయానికి హత్తుకునేలా చెప్పాడా? చెప్పిన రీతిలో కళాత్మకతను సాధించాడా లేదా? వీటన్నింటిని పరికించి, అవి పాఠకుడి హృదయంలోకి ఎలా పర్యవసించాయి అని పరిశీలిస్తే మట్టి కడిగితే మాణిక్యం బయటపడ్డట్టు శిల్పం బయటపడుతుంది

ఏతావాతా తేలిందేమిటంటే - మొదలు పెట్టటంలోనే ఒక ప్రత్యేకత ఉండాలనీ, ముందుకు నడపటంలో ఒక రామణీయకత ఉండాలనీ, ఆ నడకలో పాఠకుడికి దొరికిపోకుండా ఉత్కంఠను సాధించాలనీ, కథను నడిపే పాత్రలకు శుద్ధత ఉండాలనీ, ఆ పాత్రలు భాషించే తీరులో చతురత ఉండాలనీ, కథను విషమ స్థితిని దాటించటంలో సమర్థత ఉండాలనీ, కథాపరిమితిలో సమయజ్ఞత ఉండాలనీ తెలిసింది

*ఏది ఎప్పుడు ఎలా చెప్పాలనేదే శిల్పం*[12] *అంటాడు దుత్తా దుర్గా ప్రసాద్*

*వస్తువుని మలిచే విధానం శిల్పం*[13] *అంటాడు హితశ్రీ*

లోతుగా పరిశీలిస్తే శిల్పం అనేది -

1 కథ నడపటంలో
2 పాత్ర చిత్రణలో
3 సంఘటన సృష్టించటంలో
4 సంఘర్షణ చూపించటంలో
5 సన్నివేశాన్ని నడపటంలో
6 సంభాషణలు రచించటంలో
7 నేపథ్యంలో కూడా శిల్పాన్ని చూపిస్తారు అంటే ఆ దృశ్యానికి సరిపడా వాతావరణాన్ని సృష్టించటంలో, ఆ దృశ్యానికి సరిపోయిన సహజ ధ్వనిని, కృత్రిమ ధ్వనిని కల్పించటంలో కూడా శిల్పం ఉంటుంది
8 అన్నింటినీ మించి అభినయశిల్పం కూడా తోడవుతుంది
9 శీర్షికను పెట్టటంలో
10 పాత్రలకు నామకరణం చెయ్యటంలో
11 ప్రతీకల్ని ప్రదర్శించటంలో

శిల్పాన్ని చూడాలి ఇవన్నీ కలబోసి సాధించేదే కథనశిల్పం చిత్రకథాశిల్పాలను విభాగించుకుంటే -

1 కథాశిల్పం 2 పాత్రచిత్రణశిల్పం 3 సంఘటనాశిల్పం 4 సంఘర్షణశిల్పం

5 సన్నివేశకల్పనాశిల్పం 6 సంభాషణరచనాశిల్పం 7 నేపథ్యశిల్పం 8 అభినయశిల్పం 9 శీర్షికాశిల్పం, 10 నామకరణశిల్పం 11 ప్రతీకాత్మకశిల్పం

పైన చెప్పిన పదకొండు శిల్పాలలో అన్నిటా మెరుగైన ప్రతిభ చూపగలిగితేనే ఆ చిత్రకథలో కథనశిల్పం ప్రదర్శించినట్లౌతుంది

**కథాశిల్పం :**

రచయిత ఉపజ్ఞ కథను చెప్పటంలోనే ఉంటుంది చిత్రకథలో కథను ఎలా చెబుతున్నామన్నదే ప్రధానం అలా చెప్పటం దేనికి, ప్రతిదీ ఎలా జరిగిందో అలా చెప్పవచ్చు గదా! ఇప్పుడు జరుగుతున్నది చెప్పి, అప్పుడెలా జరిగిందో చెప్పి, ఇప్పుడు జరుగుతున్న దానితో సమన్వయం చెయ్యటమే ఉపజ్ఞ అందులోని వైశిష్ట్యం శిల్పం

అతను చాలా అందంగా ఉన్నాడు అంటారు ఏం చూసి చెబుతున్నారు? కళ్ళు అందంగా ఉంటే కళ్ళు అందంగా ఉన్నాయి అంటారు ముక్కు అందంగా ఉంటే ముక్కు అందంగా ఉంది అంటారు బంగారపు ఛాయలో ఉంటే రంగు భలేగాఉంది అంటారు ఏదో ఒకఅవయవం అందంగా ఉంటే అది అందంగాఉంది అని చెబుతారు కాని, అతను అందంగా ఉన్నాడని చెప్పరు గదా! ఏం చూసి చెప్తారు? అతని స్వరూపంలోని సంపూర్ణసౌందర్యాన్ని గమనించి చెప్తారు

*అంగ సౌందర్యానికి అతిరిక్తంగా అంగి సౌందర్యం ఉంటుంది* [14] అని ఆనందవర్ధనుడు అన్నట్లుగా

ఒక కళలోని సర్వాంగీణ సామరస్యమే శిల్పం అని చెప్పవచ్చును

'వస్తువుని మలిచే విధానమే శిల్పం' అని చెప్పిన హితశ్రీ అక్కడే శిల్పాన్ని గురించి చెబుతూ కథకుడి మంత్రదండం రచయిత ఉపజ్ఞ కథా కథన శిల్పంలో వ్యక్తమవుతుంది శిల్ప సౌందర్యం పఠితని మంత్రముగ్ధుణ్ణి చేస్తుంది ఆ ఆనందంలో కథలో ఏమైనా దోషాలున్నప్పటికీ అతడికి తోచవు[15] అన్నాడు

అంకుశం చిత్రంలో ముఖ్యమంత్రిని చంపేయాలని ప్రతికథానాయకుడి మురా న్నిర్ణయం తీసుకున్నప్పుడు, ఒక విలేకరి వింటాడు అతన్ని వెంటాడుతూ ఉండగా ఒక టెలిఫోన్‌బూత్ నుంచి ఇన్‌స్పెక్టర్‌కిఫోన్ చేస్తాడు

క) విలేకరి కథానాయకుడికి ఫోన్ చేసినప్పుడే ముఖ్యమంత్రికి నిమ్మకాయ రసంలో విషం కలుపుతున్నారని చెప్పవచ్చు కాని తనను కలుసుకొమ్మని చెబుతాడు

ఖ) ప్రతి కథానాయకుడి మురాకి దొరికిపోయి కారులో విలేకరి ఉన్నప్పుడు,

కధానాయకుడు జీపు ఆగి ఉన్నప్పుడు, అరవకుండా నోరు మూసినా కాలితో కారు డోర్ తన్నవచ్చు తన్నలేదు

గ) ప్రతికధానాయకుడు కధానాయకుడి గొంతుతో మాట్లాడితే కధానాయిక తలుపు తీస్తుంది ప్రతికధానాయకుడు చంపటానికి వచ్చాడని తెలిసీ అంత త్వరపడి తీస్తుందా?

ఈ ప్రశ్నలేవీ ప్రేక్షకులు వెయ్యలేదు? కోడి రామకృష్ణ కధాశిల్పసౌందర్యం ప్రేక్షకుల్ని మాట్లాడనివ్వలేదు

చిత్రాలలో కధాశిల్పం ఎలా ప్రదర్శించబడిందో పరిశీలించాలి

**శుభలగ్నం** శుభలగ్నం చిత్రం చూసి వచ్చి స్త్రీలు సినిమా ఎలా ఉంది అంటే కధ భలేగా ఉంది అన్నారు ఏం నచ్చింది వాళ్ళకు? పెళ్ళాం మొగుణ్ణి కోటి రూపాయలకు అమ్మేస్తుంది, అది నచ్చింది ఆ పని ప్రతి భార్య చేయగలదా? చెయ్యలేదు మరెందుకు నచ్చింది ఈ కధ? ఈ దేశంలో ఉన్న చాలామంది ఆడవాళ్ళు తాళి బొట్టుకి చాలా విలువ ఇస్తారు భర్తను దైవంగా చూడటం అలవాటు చేసుకుంటారు వాళ్ళ నుదుటిమీదున్న కుంకుమబొట్టుకి ప్రతిరూపంగా చూసుకుంటారు శుభలగ్నంలో కధానాయిక భర్తను అమ్మేసి దాని మూలంగా ఏం తప్పు చేసిందో తెలుసుకుని, పశ్చాత్తాప పడటం నచ్చింది అంటే భారతీయ నాగరికతను వెలారుస్తున్న కధ నచ్చింది ఈ కధలో ఏ శిల్పాన్ని ఆశ్రయించారు చిత్రకధారచయిత, దర్శకుడు?

ఈ చిత్రానికి మూలకధారచయిత భూపతిరాజా, కధారచయిత, చిత్రకధారచయిత, దర్శకుడు ఎస్ వి కృష్ణారెడ్డి, మాటల రచయిత దివాకర బాబు వారు శిల్పాన్ని ఎలా ప్రదర్శించారో పరిశీలించే ముందు సంక్షిప్తంగా ఆ చిత్రం కధను తెలుసుకోవాలి

ఇంజనీరు మధుసూదనరావు, రాధల పెళ్ళితో చిత్రం ప్రారంభమయ్యింది పెళ్ళిలో ఎవరో బంగారు కానుక ఇవ్వబోతే మధుసూదనరావు తిరస్కరిస్తాడు రాధ అయ్యో ఎందుకు వద్దన్నారు అని బాధపడుతుంది ఆ తర్వాత శోభనం గదిలో మీ ఇంట్లో ఏసీ, ఫ్రిజ్జు అన్నీ ఉన్నాయా అని అడిగితే మన ఇంట్లో అవేమీ లేవు, నిన్ను అపురూపంగా చూసుకునే నేను ఉన్నాను అని చెబుతాడు ఆ తర్వాత ఏడు సంవత్సరాల కాలం గడిచిపోయింది ఒక పాప, బాబు పుట్టారు భర్త లంచం తీసుకునయినా డబ్బు సంపాదించాలన్న రాధ కోరిక నెరవేరదు డబ్బే సర్వస్వం అని నమ్ముతున్న రాధను క్షమిస్తూ వస్తున్న మధు జీవితంలోకి వాళ్ళ యజమాని కూతురు లత ప్రవేశిస్తుంది ఒక్కొక్క సంఘటనలో ఒక రకంగా అతన్ని చూసి స్పందిస్తూ అతని మనసుకి చేరువవుతూ ఉంటుంది ఒక రోజు లతనికి పెళ్ళయింది అని తెలుస్తుంది అయినా అతనే కావాలనుకుంటుంది తన భర్తను

ఇంకో ఆడది కోరుకొంటోందని తెలిసిన రాధ గుడికి వెళ్ళి దేవుడికి మొక్కుకుంటుంటే అక్కడికీ లత వచ్చి నీ భర్తను నాకు వదిలేస్తే కోటి రూపాయలిస్తాను అంటుంది ధనాశాపరురాలయిన రాధ అంగీకరిస్తుంది కొన్నాళ్ళు గడిచేసరికి ధనం కంటే భర్తే ఎక్కువ అని తెలుసుకుని నా భర్తను నాకు ఇచ్చేయమంటుంది లత ఎదురు తిరుగుతుంది రాధ లాయర్ని కలుస్తుంది లాయర్ తన నిస్సహాయతను తెలియచేస్తాడు రాధ ప్రవర్తనలో వచ్చిన మార్పును గమనించి పిల్లల్ని తీసుకొని, తన భర్తతో సహా లండన్ వెళ్ళిపోవాలని నిర్ణయం తీసుకుంది లత తన పేర ఉన్న ఆస్తులన్నీ అనాధ శరణాలయానికి రాసేసి లతను, భర్తను క్షమాపణ కోరటానికి బయలుదేరింది రాధ విమానాశ్రయంలో మధుని, పిల్లల్ని వదిలేసి, నీ జ్ఞాపకం తీసుకెళుతున్నాను అని చెప్పి లత లండన్ వెళ్ళిపోతుంది

స్థూలంగా ఇది కథ

ఇందులో కథానాయకుడికి ఒక ఆశయం లేదు నిజాయితీగా బతకాలి, నీతిగా ఉండాలి, వచ్చే జీతం సర్దుకుని జీవితాన్ని చక్క దిద్దుకోవాలి అన్నది అతని పాత్ర చిత్రణాంశం

అలాగాక కథానాయికకు ఒక ఆశయం ఉంది అది ధనం సంపాదించాలి అన్నది ధనం వచ్చాక మిగతా ప్రపంచాన్నీ మరిచిపోయి సుఖపడిపోతే, అంతటితో కథ ముగిసిపోతే, కథానాయిక కథగా ఆమె ఆశయసిద్ధి నెరవేరినట్లుగా అంగీకరించవచ్చు డబ్బు వచ్చిన తర్వాత ఆమె భ్రమలు క్రమంగా తొలగిపోయి, డబ్బుకంటే భర్తే గొప్పవాడు అని అంగీకరిస్తుంది అంటే తన ఆశయం తప్పు అని అంగీకరిస్తుంది

*కథానాయకుడికీ ఆశయం లేక, కథానాయికకూ ఆశయం దెబ్బ తిన్నాక, ఈ కథలో రచయిత ఏం సాధించినట్టు? ఈ విషయాన్నే చిత్ర సంభాషణరచయిత దివాకర్‌బాబుతో మాట్లాడటం జరిగింది అతను -*

*"కథని కథానాయకుడి పాయింట్ ఆఫ్ వ్యూలో రాయలేదు ఆమని పాయింట్ ఆఫ్ వ్యూలో (కథానాయిక) రాసాము మా ఉద్దేశంలో ఆమె అమాయకురాలు, ఆశ ఉంది అది అత్యాశ అని ఆమెకు తెలియదు తను కావాలనుకుంటోంది, కోరుకుంది రావాలనుకుంది వచ్చాకగాని తెలియలేదు ఆ డబ్బు మూలంగా భర్త దూరమయ్యాడు, బిడ్డలు దూరమయ్యారు, సుఖ సంతోషాలు దూరమయ్యాయి అని చేతులు కాలాక, భర్త చేతులు మారాక తెలుసుకుంది, తను చేసిన తప్పు, పోగొట్టుకున్నదాన్ని పశ్చాత్తాపంతో సాధించుకోగలిగింది[16]" అని చెప్పాడు*

నిజమే కాని ఉత్తమ పురుష దృష్టికోణంలో అంటే కథానాయిక దృష్టి కోణంలో ఆమె ఆశయం ఏమిటి? ధనవంతురాలు కావటం అది తప్పు అని తెలుసుకుంది మరి ప్రేక్షకుడు ఆమె ఆశయంలో తాదాత్మ్యం చెందితే అది తప్పు అని ఆమె ఒప్పుకోగానే

తనూ తప్పు చేసినట్లు భావిస్తాడు గదా? మరి ఎలా ప్రజారంజకం అయ్యిందీ చిత్రం అంటే ప్రేక్షకులు 'దొంగ ముఖానికి' బాగా అయ్యింది అనుకున్నారు అదే చిత్రవిజయానికి కారణం అన్నాడు

అంటే ఈ చిత్రం కథానాయకుడి ఆశయంతోగాని, కథానాయిక ఆశయంతోగాని ప్రారంభం కాలేదు కేవలం నాటకీయ దృష్టికోణంలో, ప్రేక్షకుడి ఆశయంతో ప్రారంభమయ్యింది ఏమిటి ప్రేక్షకుల ఆశయం?

చిత్రం మధుసూదనరావు, రాధల పెళ్ళితో ప్రారంభమయ్యింది ఇక్కడే ప్రారంభమయ్యింది చిత్రంలో శిల్పం ఈ దేశంలో పెళ్ళిళ్ళు దైవ సాక్షిగా, అగ్నిసాక్షిగా జరుగుతాయి ఆ పెళ్ళికి వేలాదిమంది హాజరై అక్షింతలు వేసి నూరు కాలాలపాటు చల్లగా ఉండండి అని చెప్పి వెళతారు పెళ్ళికి వచ్చిన వారి ఆశయం ఆ భార్యాభర్తలజీవితం సుఖమయంగా ఉండాలని కానీ దురదృష్ట వశాత్తు, రాధ అత్యాశ మొదటి రెండు దృశ్యాలలోనే బహిర్గతమై, ఈ పిచ్చిది కాపురం పాడు చేసుకుంటుందేమో అన్న బెంగ ఏ క్షణంలో అయితే ప్రేక్షకుడి మనసులో ప్రారంభమయ్యిందో, అప్పుడే కథావిషయికమైన ఉత్కంఠ ప్రారంభమైనట్లే

అంటే కథ ఎత్తుగడలోనే రచయిత తన కథాశిల్పాన్ని ప్రారంభించాడు భార్యా, భర్తలిద్దరి ఆలోచనలో, ప్రవర్తనలో ఏడేళ్ళు గడిచినా మార్పు లేదు గనుక, శోభనం దృశ్యం కాగానే టైటిల్సు వేసుకుని ఏడు సంవత్సరాలు గడిచి పోయిన సంగతిని మౌఖికంగా చెప్పించాడు రాధలో ఏ మార్పూ లేదు అన్నది అనేక దృశ్యాలలో చూపించుకుంటూ వచ్చాడు అయితే అవి కథనంలో భాగాలు తప్ప కథలో భాగాలు కావు ఇప్పుడు పరిశీలించాల్సిన కథాభాగంలో ఆమె ప్రవర్తనను ఇతను మార్చగలడా? లేడా? లొంగిపోతాడా? తట్టుకోలేక వదిలేస్తాడా? ఇల్లు వదిలి పారిపోతాడా? సన్యాసుల్లో కలిసిపోతాడా? ఇవన్నీ ప్రేక్షకుడి హృదయంలో మొలకెత్తుతున్న ప్రశ్నలే సరిగ్గా అప్పుడు ప్రవేశిస్తుంది, అతని యజమాని కూతురు లత విదేశాలనుంచి ఈ పాత్ర ఉత్ప్రేరక పాత్ర రాధ మళ్ళీ మధుసూదనరావుకి దగ్గరవటానికి ఈ పాత్ర కారణం భర్త విలువ తెలియటానికి ఆమె ప్రవర్తన కారణమయ్యింది తప్ప ఆమె తెలియచెప్పలేదు

తను కోరుకున్నది తన సొంతం అవ్వాలి అన్న ఆలోచనతో ఉన్న పాత్ర అది తన తండ్రి మీద మధుసూదనరావుకి ఎనలేని గౌరవం ఉందని తెలిసినప్పుడు, తనను పాడుచెయ్యబోయిన వాడినుంచి వర్షపురాత్రిలో కాపాడినప్పుడు ఆమె ఆకర్షితురాలయ్యింది పదివేలు రాధకు ఇచ్చి ఆమె కొన్న వెయ్యి రూపాయల చీర

రికార్డర్ తీసుకుంది ఇది జరగబోయే సంఘటనకు ధ్వని ఆ టేపు రికార్డర్‌లోనే లత తను మధుసూదనరావుని ప్రేమిస్తున్న సంగతి తెలియజేసింది రాధ నెత్తిన పిడుగులు పడలేదు కంగారు పడింది లత రాధల సమాగమం కథలో గుడి దగ్గర జరగటం ఒక శిల్పం

దైవసాక్షిగా, అగ్నిసాక్షిగా ఒక శుభలగ్నంలో జరిగిన రాధ, మధుసూదనరావుల వివాహానికి విఘ్నంకూడా దైవసమక్షంలో జరుగుతోందని చెప్పటం రచయిత కలంబలం ముందు ఒప్పుకోకపోయినా నువ్వు డబ్బు లేకపోతే చచ్చిపోతావ్ నేను నువ్వు కోరుకున్న మార్గంలో డబ్బు సంపాదించలేను అందువల్ల ఈ పెళ్ళికి ఒప్పుకొంటున్నాను అంటాడు మధుసూదనరావు

నిజానికి రాధ కథ, మధుసూదనరావుకథ, లతకథ ఇక్కడితో పూర్తయ్యింది రాధకి డబ్బు కావాలి, వచ్చింది లతకు కోరుకున్నది జరగాలి, జరిగింది మధుసూదనరావు నీతి తప్పడు, తప్పాల్సి వచ్చింది వారి వారి ఆశయాల ప్రకారం అయితే ఈ కథకి విశ్రాంతే ముగింపు

కాని ఈ కథను రచయిత, దర్శకులు ప్రేక్షకుడి దృష్టికోణానికి మార్చుకున్నారు

వాళ్ళ దృష్టిలో కథ ఇప్పుడే ప్రారంభం అయ్యింది పెళ్ళికి వచ్చి అక్షింతలు వేసే పెళ్ళి పెద్దలయ్యారిప్పుడు ప్రేక్షకులు వాళ్ళ దృష్టిలో శుభలగ్నంలో జరిగిన ఈ పెళ్ళి దెబ్బతినకూడదు ఎలాగయినా కాపాడబడాలి నిజంగా ఇక్కడి నుంచి రాధ ఆలోచనలో మార్పు వచ్చే వరకూ మెలో డ్రామానే ఆమె అవగాహనా రాహిత్యాన్ని సూచించే దృశ్యాలు, సంభాషణలూ నడుస్తూ ఉంటాయి అవి విసుగు పుట్టించకుండా ఉండటానికి, కథలో హాస్యాన్ని ఒక భాగంగా చేసి పరాయీకరణ అంటే ఎలీనియేషన్ పద్ధతిని అనుసరించటం కూడా ఈ చిత్రకథారచయిత చూపించిన శిల్పమే!

అయితే మధుసూదనరావు నీతితప్పి, భార్య చనిపోతుంది అన్న బాధతో లతను పెళ్ళిచేసుకున్నాడే తప్ప రెండోభార్య మీద కోరికతో గాదు ఆ విషయం తెలియజెయ్యటానికే పెళ్ళి జరిగిన తర్వాత కూడా, విడాకులిచ్చిన రాధ గదిలోకే వస్తాడు నిజానికిది కథకు బాధకం విడాకులు పుచ్చుకున్న తర్వాత అతను ఆమె గదిలోకి ఎలా వస్తాడు? ఇదే కథా రచయిత ఎస్ వి కృష్ణా రెడ్డిని అడిగితే -

> *చట్టపరంగా విడిపోకపోతే లతను పెళ్ళి చేసుకునే అవకాశం లేదు గనుక అలా చేసింది గాని, భర్తను వదులుకుంటానని చెప్పలేదు తాళిబొట్టు తియ్యలేదు. ఈ రోజు సమాజంలో ఇద్దరు భార్యలతో ఉన్న ఎందరో భర్తల్లాగా మధుసూదనరావు*

ఉండాలన్నదే ఆమె కోరిక. అందుకే ఈ రోజు మీరుండవలసింది నా దగ్గర కాదు లత దగ్గర అని చెప్పించాం, అన్నాడు దాన్ని మీరు వివరించాలి గదా అంటే అందుకే పెళ్ళికి ఒప్పించే దృశ్యాన్ని హాఫ్‌వేలో ప్రారంభించాను అనేక నిశ్శబ్దపు షాట్స్ తీశాను[17] అని చెప్పాడు

మధుసూదనరావుని బలవంతంగా తీసుకువెళ్ళి గదిలో వదిలినా, గుర్రాన్ని కొనగలవు గాని, నీళ్ళు తాగించలేవు అని అడ్డం తిరిగాడు ఇదే కథాశిల్పం మెలోడ్రామాగా పరివర్తన చెందిన కథలో ఇంత కష్టపడి పెళ్ళిచేసినా లతతో కాపురం చెయ్యటంలేదు, నా డబ్బు నాకిచ్చెయ్ అని వెళ్ళిపోతుందా? అన్న ఉత్కంఠ ఒక పక్క రేకెత్తగా, ఏ విధంగా అయితే మధుసూదనరావు వైపుకి లత ఆకర్షితురాలయ్యిందో, అదే విధంగా లత వైపుకి మధుసూదనరావు ఆకర్షితుడవుతూ ఉండటమే కుతూహలజనకమైన విషయం ఎలా, ఎప్పటికి ఆకర్షితుడవుతాడు అనే కుతూహలం మెలోడ్రామాని జయించింది ఎప్పుడయితే పిల్లలూ, భర్త తన చేతులు దాటిపోయారని తెలుసుకుందో, అప్పుడు పరివర్తన ప్రారంభమయ్యింది రాధలో కోటి రూపాయలిచ్చిన లతను తను వచ్చేసరికి బొట్టు పెట్టిందని కొట్టింది బలవంతంగా భర్తను, పిల్లల్నీ తన గదిలోకి తెచ్చుకున్నా, వాళ్ళు గుట్టు చప్పుడు కాకుండా లేచి వెళ్ళిపోవటం తట్టుకోలేకపోయింది ఒక విధవరాలు వచ్చి నీకు మొగుడుండీ ఒకటే, నాకు మొగుడులేక ఒకటే అన్న మాట రాధ పాలిట అశనిపాతం డబ్బుంటే చాలు జీవితాన్ని సుఖంగా అనుభవించొచ్చు అనుకున్న రాధ డబ్బుంది గాని అనుభవించటానికి జీవితమే లేదని తెలుసుకుంది తల్లిదండ్రుల దగ్గర బాధపడింది అయోమయావస్థలో పాత ఇంటికి వెళితే అక్కడ స్నేహితురాలు మీనానే ఉంది

కథాశిల్పనిర్భరత కోసం ఈ చిత్రంలో రచయిత లతఅనేఉత్ప్రేరక పాత్రని, మీనా అనేఉద్బోధక పాత్రని సృష్టించుకున్నాడు ఆ మీనా లాయర్ని కలవమని సలహా ఇచ్చింది లాయర్ చేతులెత్తేసాడు

నిజానికి ఇక్కడ కూడా కథ ముగిసిపోయింది కానీ ప్రేక్షకుడికోరిక అదికాదు అందుకే రచయిత నువ్వు మెడలో వేసుకున్న తాళి అలంకారం కోసం మాత్రమే, నువ్వు బొట్టు పెట్టుకున్న విధవరాలివి అని చెప్పటం ఈ కథకు విషమస్థితి భార్యాభర్తలు కలవాలి అని త్రికరణశుద్ధిగా కోరుకునే ప్రేక్షకుల గుండెకోత తీవ్రస్థాయికి చేరే ప్రదేశం ఇదే

తిక్కకుదిరింది అని ఎవరయితే తిట్టుకున్నారో, వాళ్ళే పిచ్చిది అనవసరమైన భేషజాలకు పోయింది దాని కాపురం బాగుపడితే బాగుండును అని కోరుకుంటున్నారు

సరిగ్గా ఆసమయంలో రాధ తన యావదాస్తినీ అనాధశరణాలయానికి రాసి లండన్ వెళుతున్న భర్తనీ, పిల్లల్నీ చూడటానికి వెళ్ళింది

ఇది పతాకస్థాయి ఏ డబ్బుకోసం ఆశపడిందో ఆ డబ్బుని అనాధలకిచ్చేసింది గనుక ఇక భర్త ఆమె దగ్గరకు తిరిగి వచ్చెయ్యటం ధర్మం అని ప్రేక్షకుడి హృదయం నిండా సానుభూతిని నింపి, లండన్ వెళ్ళిపోతున్నారు అని నమ్మించి, పిల్లల్ని తాకవచ్చా అని రాధ చేత అడిగించి కన్నీళ్ళు పెట్టించి - లత ఒక్కతే లండన్ వెళ్ళిపోతుంది అని చెప్పటంతో, ప్రేక్షకుడికి కొండెక్కినంత సంతోషం! కాని రచయిత చూపించిన శిల్పం ఇక్కడ అద్భుతంగా అమరింది ఈ క్షణం వరకు రాధ మీద ఉన్న సానుభూతి మొత్తం లత వైపుకి మారిపోయింది ప్రతికథకీ ఒకనీతి ఉంటుంది కనుక లత నోటిద్వారానే ఆ నీతి చెప్పించారు

**కళ్ళు వెళ్ళిన ప్రతిచోటుకీ మనసు వెళ్ళగూడదు మనసు వెళ్ళిన ప్రతిచోటుకీ మనిషి వెళ్ళకూడదు** అని

తన కళ్ళకు ఇష్టంగా కనపడిన మధుసూదనరావుని కోరుకుంది లత తన మనసు ఇష్టపడిన సంపద దగ్గరకు వెళ్ళింది రాధ ఇద్దరిదీ తప్పే నిమిత్తమాత్రుడిగా మిగిలిన మధుసూదనరావు గెలుపే ప్రేక్షకుల గెలుపయ్యింది

ఖైదీ  ఖైదీ కథ ఇంతకు ముందు చర్చించటం జరిగింది సూర్యం అనే కుర్రవాడు మధులత అనే అమ్మాయిని ప్రేమించి, ఆమె తండ్రి ఒప్పుకోకుండా తన తండ్రి, అక్క చావులకు కారణం అయ్యాడు కాబట్టి శత్రువులందరినీ చంపేసి జైలుకి వెళ్ళాడు

ఈ కథని ఇలాగే రాసుకుని, ఇలాగే చిత్రీకరించి ఉంటే ఈ చిత్రం ఇంత విజయవంతం కాదు అదేకథను తిప్పి చెప్పబట్టి కథాశిల్పం కథని బతికించింది మామూలు పగ, ప్రతీకారం చిత్రంకథ కోట్లాది ప్రేక్షకుల ప్రేమాభిమానాలను చూరగొన్నది

ఏమిటా శిల్పం?

ఈ చిత్రకథ సూర్యం, మధులత ప్రేమతో ప్రారంభం కాలేదు సూర్యం మాసిన గడ్డంతో, నల్ల బట్టలతో, ఎర్రజీరలున్న కళ్ళతో ఒక వంతెనమీద పచార్లుచేస్తుండటంతో ప్రారంభమయ్యింది అతన్ని ఒక పోలీసు అధికారి ప్రశ్నించాడు అనుమానించి సోదా చేశాడు కత్తిని చూసాడు నిర్బంధించాడు స్టేషన్‌కి తీసుకెళ్ళాడు

సూర్యం ఆశయం వీరభద్రయ్యను చంపటం అని చిత్రం ప్రారంభమయ్యింది వీరభద్రయ్యను సూర్యం చంపటంతోనే చిత్రకథ పూర్తవుతోంది సూర్యం ఆశయసిద్ధి జరిగింది కనుక కథ, ఉత్తమకథే

---

అంతే కాదు -

భయానకం సుఖపరం గర్భే చ కరుణోరసః

అద్భుతోఽంతే సుక్లప్తార్థో నోదాత్తా సా కథానికా।। అగ్ని 12 367

అని అగ్నిపురాణం చెప్పిన లక్షణాలకు ఇది అచ్చుగుద్దినట్లు అతికేకథే ఎందుకంటే నిర్బంధించబడిన సూర్యం, పోలీసుస్టేషన్ నుండి పోలీసులందరినీ తన్నుకుంటూ పోలీసులు కాలుస్తుంటే గాయపడి తప్పించుకోవటంతో ఈ సన్నివేశం మొత్తం భయానక రసంగా కానవస్తుంది ఎక్కడ కథానాయకుడు పోలీసుల చేతిలో మరణిస్తాడోనన్న భయం। అక్కడ సూర్యం భయానకం అనుభవించకపోవచ్చు ప్రేక్షకుడు అనుభవించే రసం అదే।

ఉత్తర గోగ్రహణంలో ఉత్తరకుమారుడు కౌరవసైన్యాన్ని చూసి వణికిపోతూ ఉంటాడు కాని ప్రేక్షకులు తెగ నవ్వుతూ ఉంటారు అతని పిరికితనం ప్రేక్షకులకు హాస్యాన్ని ఉత్పత్తి చేసింది

అలాగే సూర్యం వీరోచితంగా ఎదుర్కొంటున్నా పోలీసువ్యవస్థ ఎదురవటం, వాళ్ళను గాయపరచటం, కొట్టటం, విధ్వంసం సృష్టించటం, వాళ్ళ కాల్పులకు గురికావటం ఈ ప్రక్రియ మొత్తం భయానకరసోత్పాదకమే

ఆ భయానకం సుఖపరమై ఉండాలి అంటున్నారు భయం ఎలా సుఖంగా ఉంటుంది? మరి కథానాయకుడుసూర్యం **పోలీస్‌స్టేషన్‌లో** చేసిన సాహసకాండ ఎంత భయానకమో అంత వీరోచితం సుఖపరమైన భయం అది। ఒక రోజు క్రికెట్ ఆటలో చివరి ఓవర్లో కలిగే అనుభూతి। గెలుస్తారా అన్న భయం, గెలుస్తున్నారు అన్న సుఖం। భయమూ, సుఖమూ, ఒక మదిలో ఒకే గదిలో నడుస్తూ ఉంటాయి

ఆ విధంగా ఖైదీ చిత్రం, అగ్నిపురాణం చెప్పినట్లు సుఖపరమైన భయానకంతో ప్రారంభమయ్యింది

'*గర్భే చ కరుణోరసః*' అన్నాడు మళ్ళీ ఖైదీ కథాగర్భమంతా కరుణరసాత్మకమే

తన కూతుర్ని ప్రేమించాడు అని తెలిసిన క్షణం నుంచి వీరభద్రయ్య కళ్ళల్లో కనిపించే క్రౌర్యమే, ప్రేక్షకుడి కళ్ళల్లో కనిపించే కరుణమవుతోంది వీరభద్రయ్య సూర్యం తండ్రిని హత్య చేసాడు ఆత్మహత్యలా చిత్రీకరించాడు తండ్రి శవాన్ని మోసుకువెళుతుంటే అప్పుతీర్చే మార్గం చెప్పాకే శవాన్ని తీసుకెళ్ళాలని షరతు పెట్టాడు తండ్రి శవంతోపాటు అప్పు తగలబడిపోతుందని ధర్మ సందేహాన్ని వెలిబుచ్చాడు ఆ తర్వాత అతని పంట కోసుకుపోయారు సూర్యం అక్క మునసబుని పెళ్ళిచేసుకుంటే

అటవీశాఖాధికారికి తార్చబోయాడు ఆమె కూడా చనిపోయింది హత్యా నేరం మోపాడు సూర్యం మీద పరారయ్యాడు ఆశ్రయం ఇచ్చిన డాక్టర్ సుజాతను కూడా చంపి ఆ నేరంకూడా అతని మీదే వేసారు మధులత సూర్యాన్ని వెతుక్కుంటూ అడవుల పాలయ్యింది అనేక కష్టాలకు గురయ్యింది ఇదంతా కరుణ రసోత్పాదకమే

పాత్రలన్నీ అనుదాత్తమైనవే! అర్థం క్లుప్తార్థమే!

అంతం అద్భుతమే! ప్రేమకు అపజయం పగకు జయం

ఈ జన్మ పగ కోసం, మరో జన్మ ప్రేమ కోసం అనటం ఇదే!

ఒక సినిమా కథ ఇంత చక్కగా ... చెప్పబడిన లక్షణానికి సరిగ్గా అమరిందంటే ఇంక చెప్పేదేముంది

**బొబ్బిలి పులి .** ప్రఖ్యాత దర్శకుడు, రచయిత దాసరినారాయణరావు రాసిన కథ బొబ్బిలిపులి ఈ కథ కూడా ఖైదీ బాటే అయితే ఖైదీ కంటే ముందు విడుదలయ్యిందీ చిత్రం

కథలో ఏ పోలికా ఉండదు

కథశిల్పాలలోనే పోలిక

మేజర్ చక్రధర్‌కి ఒక చెల్లెలు, తల్లి ఉంటారు తండ్రి సైనికాధికారి మంచివాడు కాదు తల్లి చిన్నతనంలోనే త్యజిస్తుంది మేజర్ చక్రధర్‌కి ఒక ప్రియురాలు మేజర్‌గా వృత్తి ధర్మం నిర్వర్తించటానికి సరిహద్దుకి వెళ్ళాడు శత్రు సంహారం చేసాడు కోరుకున్న ప్రియురాలిని పెళ్ళిచేసుకుందాం అనుకునేసరికి, చెల్లెలు ప్రేమించిన కుర్రాడి తండ్రి తన పిచ్చి కూతురిని చక్రధర్ పెళ్ళిచేసుకుంటేనే, కుండమార్పిడులు జరిగితేనే తప్ప ఆ పెళ్ళి జరగదు, అనటంతో తప్పనిసరి పరిస్థితులలో మతిభ్రమించిన అమ్మాయినే పెళ్ళిచేసుకుంటాడు మళ్ళీ సరిహద్దులకు బయటదేరేలోపు, ఒక నేరస్తుణ్ణి కోర్టుకి అప్పగించి ఆ నేరస్తుడు చట్టబద్ధంగా, న్యాయబద్ధంగా తప్పించుకోవటంతో తిరగబడి తానే నేరం చేసి, జైలుపాలై పారిపోయి, తను చనిపోయినట్లు సమాజాన్ని భ్రమింపచేసి బొబ్బిలిపులి అవతారం ఎత్తి చట్టపరంగా శిక్ష తప్పించుకున్న వారందరినీ తానే చట్టాన్ని చేతుల్లోకి తీసుకొని చంపేస్తాడు చట్టానికి దొరికిపోయి తను చేసిన దాంట్లో తప్పేమిటి అని న్యాయస్థానాన్ని ప్రశ్నిస్తాడు

ఈ కథ చక్రధర్ ప్రేమతో ప్రారంభం కాలేదు రచయిత, దర్శకుడు అయిన దాసరినారాయణరావు, అమోఘమైన తెలివితేటలతో, చక్రధర్ తుపాకితో ఒక టార్గెట్‌ని కాల్చటంతో ప్రారంభించాడు అతని ఆశయం శత్రుసంహారం అని సూచించాడు శత్రుసంహారంతో అతని ఆశయం పూర్తయినట్లే కాని ఎప్పుడయితే సరిహద్దు లోపల శత్రువుని చూసాడో ఆ శత్రువుని నాశనం చేసే వరకూ నిద్రపోలేదు

సరిహద్దులో సైనికుడు శత్రువుని చంపితే వీరుడు, సరిహద్దు లోపల చంపితే హంతకుడా? ఎలా ఒక సైనికాధికారి హంతకుడయిపోతున్నాడు? ఈ విషయాన్ని మంచిపాత్రల ద్వారా ప్రశ్నింపచేసి, గుర్తింపజేసి, ఒక ఉత్సుకతను రేకెత్తింపచేసాడు అదే కథాశిల్పం! సైనికాధికారిగా సరిహద్దులో శత్రువుని చంపుతున్నప్పుడు హర్షించిన ప్రేక్షకుడు, పౌరుడిగా నగరంలో ఆ పని చేస్తుంటే భయపడి పోయాడు చట్టం తనపని తను చేసుకువెళితే చక్రధర్‌కి శిక్ష పడుతుంది అని తెలుసు కానీ ప్రేక్షకుణ్ణి, అంత గొప్ప పాత్ర ఉరి కంబానికి వెళుతుంటే ఒప్పించే విధంగా కథను రాయటమే శిల్పం

అతనికి దేశం మీద ప్రేమతప్ప ప్రాణాల మీద ఆశలేదు ఒక అల్లూరి సీతారామరాజు మరణం ప్రేక్షకుణ్ణి ఎలా కలిచివెయ్యలేదో, అలాగే బొబ్బిలి పులి ముగింపు కూడా ప్రేక్షకుణ్ణి బాధించలేదు

ఇలాంటి విషాదాంత చిత్రకథను జనామోదాన్ని పొందింపచేయటం సామాన్యం కాదు

ఆ విద్యలో తను ఘటికుణ్ణి అని నిరూపించుకున్న దాసరి నారాయణరావు, కథను శత్రు సంహారం అనే ఆశయంతో ఏక సూత్రం మీద నడిపినా, ఏకతాటి మీద నడపలేదు, ప్రేమ, పెళ్ళి, ధర్మం, పగ, ప్రతీకారం అనే పంచఆశయాలను రకరకాల పువ్వుల్లోకి ఒక దారాన్ని పంపినట్లు, రకరకాల భావాలను ప్రోది చేసుకుంటూ కథను నడిపి ప్రజారంజకం చేసాడు

**శంకరాభరణం .** చిత్రకథలో ఎన్నిశిల్పాలుంటాయో అన్నిశిల్పాలకు ఆలవాలమైన చిత్రం శంకరాభరణం

కథగా ఆలోచిస్తే ఇది పెద్దకథ గాదు కాని ఆ కథ చెప్పబడిన తీరు రమ్యం

శంకరాభరణం అనే రాగంతో సుప్రసిద్ధుడైన శంకరశాస్త్రికి ఒక కూతురు, ఒక స్నేహితుడు, ఒక వంట మనిషి కాని అతని సంగీత విద్వాంసత వల్ల ప్రజలంతా అతనికి పరిచితులే ఆత్మీయులే అలాంటి సమయంలో కష్టాల్లో ఉన్న ఒకవేశ్య కుమార్తెను ఆదరించవలసి వస్తుంది దాని మూలంగా సభలకు, సదస్సులకు దూరమవుతాడు ఇది భరించలేదు తులసి ఇంతలో తల్లి, మేనమామ వచ్చి నిందించి తీసుకెళతారు ఏ జమిందారు ఆమె మీద మనసు పడ్డాడో అతనికి తల్లి అప్పచెబుతుంది అతను పశువులా అనుభవిస్తాడు శంకర శాస్త్రి పటాన్ని కాలితో తంతాడు అది భరించలేని తులసి అతన్ని చంపేసి ఆ రక్తం శంకరశాస్త్రి పాదాలకు రాస్తుంది తన మూలంగా శంకర శాస్త్రి అవమానాలు భరించటం సహించలేని తులసి ఇల్లు వదిలి వెళ్ళిపోతుంది వెళుతుండగానే ఆమె గర్భవతిని అని తెలుసుకుంటుంది తనకో కుమారుడు పుట్టి ఏడేళ్ళ వయసు వాడయ్యాక మళ్ళీ శంకరశాస్త్రిని వెతుక్కుంటూ వచ్చి కొడుక్కి ఆయన చేత సంగీతం నేర్పించే ప్రయత్నం మొదలుపెడుతుంది

శంకరశాస్త్రికి మాత్రం కనిపించదు తల్లివనిపోతూ ఆస్తి మొత్తం తులసి పేర రాసిపోతుంది ఆ డబ్బుతో పరోక్షంగా శంకరశాస్త్రి కూతురు పెళ్ళికి ఉపయోగపడుతుంది శంకరశాస్త్రి పేరుతో ఒక పాత బంగళా కొని కళాప్రాంగణంగా మార్చి కచేరి పెట్టిస్తుంది వృద్ధాప్యం, అనారోగ్యంతో ఉన్న శంకర శాస్త్రి గాత్రం ఇబ్బంది పడుతుంటే తులసికొడుకు ఆ పాట అందుకుని పూర్తిచేస్తాడు తన కాలి గండపెండేరం అతని కాలికి తొడిగి కన్ను మూస్తాడు శంకరశాస్త్రి ఆయన పాదాలకు నమస్కరిస్తూ ఊపిరి వదులుతుంది తులసి

ఈ కథను చెప్పటానికి ముందు నాటకీయదృష్టికోణాన్ని ఎన్నుకున్నాడు రచయిత, దర్శకుడు కె విశ్వనాథ్

నదిలో లాంచీ కదులుతూ ఉండగా, తులసి ఏడేళ్ళ కొడుకుతో లాంచీలో వస్తుండగా, ఆ కుర్రాడి ఆలాపనలో టైటిల్స్ నడుపుకుంటూ, ఆ గానామృతానికి అమ్మ మురిసిపోతూ ఉండటం చూపించాడు

ఇక్కడే ఈమె ఎవరు? ఈ బిడ్డ ఎవరు? ఎక్కడికి బయలుదేరింది అన్న కూతుహలాన్ని రేకెత్తించి, కథాప్రారంభంలోనే చిత్రకథ మీద పట్టు సాధించాడు ఆ తర్వాత బిడ్డ నిద్రపోతుండగా వెలుగునిస్తూ సూర్యుడు ఉదయించటం, ఆమె ఎవరి కోసం ఎదురు చూస్తోందో ఆ శంకర శాస్త్రి పాదాల మీద పాత్ర పరిచయం చెయ్యటం, ఆయన నడుస్తుండగా ఆమె ఒదిగి నమస్కారం చెయ్యటం, ఆయన బట్టలు ఉతుకుతుంటే ఆమె కన్నీటి పర్యంతం కావటం, ఆ కన్నీటి పొరలు చెదిరిన అలలుగా మారి పూర్వకథకు (Flash Back) వెళ్ళటం! అణువణువునా శిల్పమే

ఇక్కడిదాకా నాటకీయదృష్టి కోణంలో నడిచి ఉత్తమపురుష దృష్టి కోణానికి మారుతుంది కథ తన ఎదురుగా తన గానామృతాన్ని ఆస్వాదించకుండా వేశ్యా మాతతో ఒక జమిందారు మాట్లాడుతూ ఉండగా చూసి కచేరీ ఆపేసి వెళ్ళిపోతాడు శంకర శాస్త్రి ఈ జమిందారే తర్వాత తులసి జీవితాన్ని కలుషితం చేస్తాడు ఆయన ఎంత మొండివాడో చూపించటానికి ఏడేళ్ళకూతురు శారదను నీటిలోగొంతువరకు కూర్చోబెట్టి సంగీత సాధన చేయిస్తూ ఉండగా, ఆ గానానికి నాట్యం చేస్తూ ఉంటుంది తులసి పాట ఆపి, మళ్ళీ కొనసాగిస్తాడు ఆమె నాట్యం కొనసాగిస్తుంది

వాళ్ళ జీవితంలో సంగమాన్ని చూపిస్తుంది ఈ అంశం ముందు ఆశీర్వాదం, తర్వాత విడిపోవటం ఇక్కడ ప్రధానపాత్రలు రెండింటికీ రెండు మహత్తరమైన ఆశయాలున్నాయి శాస్త్రీయ సంగీతాన్ని సజీవంగా ఉంచాలన్న ఆశయం శంకరశాస్త్రిది ఆ సంగీతానికి సరిపడా నాట్యం చేసుకోవటం తొలిఆశయం, ఆ సంగీతాన్ని తన బిడ్డ నేర్చుకోవాలన్నది మలిఆశయం, కథానాయకురాలిది

ఈ కథానాయకుడు కథానాయిక ప్రేమికులు కారు భార్యాభర్తలు కారు అసలు ఒకరి నొకరుకోరుకోరు ఒకరి కళను ఒకరు ఆరాధిస్తారు ఆత్మీయ సాక్షాత్కారం పొందాలని కోరుకుంటారు ఈ విచిత్రం కథాశిల్పం పరమాద్భుతంగా నిలబడటానికి కారణం ఇద్దరి ఆశయాలు సిద్ధించటమే

తులసి పాడుచెయ్యబడినా పాత్ర పవిత్రత చెడలేదు ఎందుకంటే ఆమె ఆశయం శీలసంరక్షణ కాదు సంగీత ఆరాధన జమిందారుకి అప్పగించబోతోంది అని తెలిసి పారిపోతూ ఉంటే తల్లీ మేనమామ వెంటపడతారు యాదృచ్ఛికంగా శంకరశాస్త్రి **కంపార్ట్ మెంట్‌లో** ఎక్కుతుంది

ఇది కథాశిల్పానికి కావల్సిన మొదటి మలుపు రైలు వెళుతున్న దృశ్యంతప్ప వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకున్నారో తెలియదు ఉదయం దిగినప్పుడు వాయిద్యం వాళ్ళు దిగ్భ్రాంతులై ఉండగా ఏమీ ఎరగనట్లు తీసుకు వెళతాడు

అతన్ని ప్రశ్నించే ధైర్యం, నిలదీసి మాట్లాడగలిగే నిబ్బరం, అతని చిన్ననాటి స్నేహితుడు మాధవకు లేదని తెలియజేయటం ఈ కథశిల్పానికి ఉపయుక్తం కావటానికే

మరో కచేరీకి వెళ్ళినప్పుడు తల్లి చూసి శంకరశాస్త్రిని నిందించి పెళ్ళి చేసుకోబోతున్న పిల్లను లేపుకొచ్చేస్తావా? అని అల్లరి చేసి తీసుకెళ్ళిపోతే దండలు తీసి కచేరీ చెయ్యకుండానే వెనుదిరిగి వెళ్ళిపోతాడు శంకరశాస్త్రి

బలవంతంగా జమిందారు అనుభవిస్తాడు తులసిని ఆ దృశ్యంలో ఉన్న శిల్పాన్ని సంఘటనా శిల్పంలోపరిశీలించాల్సి ఉంది అతన్ని చంపేస్తుంది తులసి ఆ రక్తపు చేతులతోనే వెళ్ళి శంకరశాస్త్రి పాదాలకు ఆ రక్తం రాస్తుంది నిష్కాగరిష్ఠుడైన శంకరశాస్త్రి జీవితంలో నాదమే వేదంగా జీవిస్తున్న మనిషి, తులసి చేసిన ఆ పనిని తిరస్కరించలేదు జరిగిన కథను శంకరశాస్త్రికి వాగ్రూపంలో చెప్పించకుండా ఒక అభినయంతో పూర్తి చెయ్యటం కూడా అభినయశిల్పానికి సంబంధించిన విషయం

తులసిని విడుదల చేయించమని అడుగుతాడు కోర్టులో ఏం జరిగిందో చెప్పకుండా తల్లికి శిక్ష పడిందని, తులసికి శిక్ష పడలేదని చెప్పటం కూడా కథాశిల్పమే ఎందుకంటే ఈ కథకు ఆ హత్య ఎందుకు జరిగిందీ, ఏ పరిస్థితిలో జరిగింది అన్న వాదోపవాదాలు అనవసరం ఆమె నిర్దోషిగా శంకరశాస్త్రి దగ్గరకు రావాలి, మేనమామ బలవంతంగా లాక్కుపోబోయి శంకరశాస్త్రి చూపుకు భయపడి వెళ్ళిపోవటం, ఆ తర్వాత బండిలో తులసిని ఊళ్ళోకి తీసుకొస్తుంటే ఊరంతా ఆడిపోసుకోవటం, వంట మనిషి అనాచారం అని చెప్పి వెళ్ళిపోవటం, చిన్న శారద మడి కట్టుకుని బిందె

మొయ్యి లేకపోవటం, కిందపడటం, నువ్వు పెయ్యిచ్చుగా అని చెప్పటం, వంట నీకు చేతకాదా అనటం, అన్నీ కథను చకచకా నడిపించే అంశాలే గనుక, కథాశిల్పంలో కథ నత్తి నడక నడవకుండా వేగంగా నడపటం ఒక భాగం గనుక, ఈ భాగమంతా అద్భుతమైన శిల్పంతో నడిచింది

ఆచార వ్యవహారాలు మనుష్యుల్ని క్రమమైన పద్ధతిలో నడిపించటానికి తప్ప కులం పేరుతో విడదియ్యటానికి కాదు అనే అభ్యుదయవాదం పలుకుతాడు శంకరశాస్త్రి అంత అభ్యుదయం ఆయన హృదయంలో లేకపోతే, వేశ్య కూతుర్ని, మానభంగానికి గురైవచ్చిన దాన్ని, హత్యచేసి వచ్చినదాన్ని చేరదియ్యడు

ఇంటిలో ఆశ్రయం ఇవ్వటం వరకు క్షమించిన కులం వారు, పెద్దలు, వాయిద్య గాళ్ళు అందరూ కచేరీలో తులసి వీణఅందుకోవటంతో లేచి వెళ్ళిపోతారు

ఈ అంశం శంకరశాస్త్రి సంస్కారానికి, నాటి సంప్రదాయానికి నిదర్శనం దీన్ని తట్టుకోగలిగిన తులసి, శంకరా అంటూ శంకరశాస్త్రి శివుడితో పెట్టుకున్న మొరకు నలిగిపోయింది

ఒక మహానుభావుడి స్వచ్ఛమైన జీవితంలో తను ఒక మచ్చ కాకూడదని వెళ్ళిపోయింది వెళ్ళిపోతూ ఏ పాదాలకు నమస్కరించిందో అదే పాదాలు పూర్వకథకు (Flash Back) ప్రారంభానికి ముందు మళ్ళీ చూడటం శిల్పంలో భాగమే

వెళ్ళిపోతూ తను గర్భవతిని అని ఆసుపత్రిలో పరీక్షద్వారా తెలుసుకుని బయటకు వస్తుంది ఒక గుర్రపుబండి మీద శంకరశాస్త్రి బొమ్మ చూసి, తన కడుపులో ఒక దుర్మార్గుడు చేసిన తప్పుకి ప్రతిరూపం పెరుగుతోందని చెప్పటం ఈ దృశ్యం ఒక్కటే ఈ చిత్రంలో చందమామలో మచ్చలాంటిది

ఈ గర్భం శంకరశాస్త్రి మూలంగా వచ్చిందేమోనని ప్రేక్షకుడు అనుమానిస్తాడన్న భయంతో కథారచయిత ప్రేక్షకుణ్ణి అవమానించినట్లుగా ఉంది ఎందుకంటే ప్రేక్షకుడు శంకరశాస్త్రిని అనుమానిస్తే, ఈ కథను గంగలో కలిపినట్లే రచయిత, దర్శకుడు కె విశ్వనాథ్‌ని సంప్రదిస్తే-

> *కొన్ని విషయాలు తొడపాశం పెట్టినట్లుగా చెప్పాలి అనే వారు కె వి రెడ్డి గారు, బీ.సీ థియేటర్లలో పొరపాటుగా శంకర శాస్త్రిని అనుమానిస్తే చిత్రం మొత్తం దెబ్బతింటుందని అలా చేసాను*[18] అని చెప్పాడు

ఆ తర్వాత కాలం గడిచి పోయింది అన్న కథను చెప్పటానికి కొన్ని షాట్లు తీసి, అందులోనే శాస్త్రీయ సంగీతానికి విలువ తగ్గి, పాశ్చాత్య సంగీతం మోజులో జనం

పడ్డారు అని కథను ఎనిమిది సంవత్సరాలు నడిపించటం కూడా, రచయిత ప్రదర్శించిన కథాశిల్పమే ఎందుకంటే ఆ క్రమం నశించింది అని చెప్పటానికే ముప్పై, నలభై దృశ్యాలు వాడుకోవచ్చు ఈ కథలో ప్రధానపాత్రల ఆశయం అది కాదు

ఈ కథను రెండు భాగాలు చేసుకున్నాడు రచయిత, దర్శకుడు ఒక సంగీత సామ్రాట్ జీవితంలోకి వచ్చి, ఒక వేశ్యకూతురు అతని జీవనగమనానికి తను అడ్డంకి కాకూడదని వెళ్ళిపోయింది

ఒక రకంగా అక్కడికి ఒకకథ పూర్తయ్యింది మళ్లీ ఆమె అతని జీవితంలోకి రాదు అన్న అనుమానం వస్తుందని కూడా బండి దృశ్యం వాడాడు రచయిత నాకు పుట్టబోయే బిడ్డకు మీ పేరేపెట్టి మీ వద్ద విద్యాభ్యాసం చేయిస్తాను అంటుంది ఇది కథానాయిక రెండో ఆశయం ఈ ఆశయ సాధన కోసం మాత్రమే ఆ దృశ్యాన్ని వాడుకుని ఉంటే బాగుండేది

ఏమైనా రచయిత చిత్రకథలో కథాశిల్పం ఎలా ఉపయోగించాడో చూడాలి

నిజానికి శంకరశాస్త్రి గానామృతాన్ని వినటానికి తులసి రావటంతో కూడా ఈ చిత్రం ప్రారంభించవచ్చు అదే జరిగిఉంటే కథలో ఈ బిగి ఉండదు అందుకే బిడ్డతల్లి అయిన తులసి లాంచీలో రావటంతో ప్రారంభించి, శంకరశాస్త్రిని చూపించి, వారి అనుబంధం ఏమిటి అన్న ఉత్కంఠను ప్రేక్షకుడిలో రెచ్చగొట్టి - తులసి శంకరశాస్త్రి ఇంటి నుంచి నిష్క్రమించి మళ్ళీ ఏడు సంవత్సరాల కొడుకుతో తిరిగివచ్చి, శంకరశాస్త్రి పాదాలకు నమస్కరించి కొడుకును ఆయన వ్యక్తిత్వం వైపుకి ఆకర్షింప చెయ్యటంతో, రెండో ఆశయం ప్రారంభమవుతోంది

ఆమె అంత ఆరాధిస్తున్న శంకరశాస్త్రిని నేటి నాగరికులు ఎలా అవమానిస్తున్నారో ప్రారంభించి, శంకరశాస్త్రి ఎంత పేదరికంలోకి వెళ్ళిపోయాడో చూపించి, శాస్త్రీయసంగీతాన్ని నమ్ముకొన్న అతను అప్పుచేసి అందులో కొంత తనను వదిలివెళ్ళిపోయిన వాయిద్యకారుడికి ఇస్తుండగా కథానాయిక గమనిస్తోందని చూపించటం ఒక శిల్పం

ఎందుకంటే ఆమెకు కలిగిన ఆర్ద్రతే, తల్లి మరణం తర్వాత శంకరశాస్త్రి కూతురి పెళ్ళికి, ఆఖరికి అతని పేరుతో కళాభవననిర్మాణానికి కారణం అయ్యింది

మధ్యలో ఆయన కూతురు శారద, కాముడి ప్రేమకథ, పిట్టకథే అయినా అందులో కూడా పెళ్ళి చూపుల్లో పాడిన పాటలో కూడా, స్వరం మారిందని ఆగ్రహించి కన్న కూతురిపెళ్ళి చెడగొట్టుకుంటాడు శంకరశాస్త్రి ఈ విషయాలు పాత్రశిల్పానికి సంబంధించినవి

కథాశిల్పం పతాకస్థాయికి చేరింది పతాకసన్నివేశంలోనే!

అనారోగ్యానికి గురయిన శంకరశాస్త్రి గొంతు పలకలేక ఆగే వరకూ, తులసి కొడుకు అందుకునే వరకూ, ఆయన జీవితంలోనుంచి నిష్క్రమించి దూరంగా ఉండిపోయిన ఆయనకు కనిపించకుండా చేసి ఇప్పుడు చూపించటం కథాశిల్పమే! ఏ స్త్రీ ఆయన జీవితంలోకి వచ్చిందని సభికులు నిష్క్రమించారో, వాయిద్యకారులు నిష్క్రమించారో, ఆ స్త్రీ కన్నబిడ్డ, ఆయనతో అంతరించకుండా ఆయన సంగీత వైదుష్యానికి వారసుడై, సభికులను రంజింపచేసాడు ఆయన తన కాలి గండపెండేరం పసివాడికి తొడగటం, ఒకేముహూర్తకాలంలో శంకరశాస్త్రి, తులసి మరణించారు అని భావించటం కూడా అద్భుతమైన శిల్పం

ఆయన సంగీతం అయితే ఆమె గీతం
ఆయన ఆలాపన అయితే ఆమె ఆరాధన
ఆయన గొంతులో లయ, ఆమె పాదంలో విన్యాసం
పాట ఆగితే సముద్రంఒడ్డున ఆమె పాదం ఆగింది అక్కడ
ఆ గొంతు శాశ్వతంగా మూగపోతే ఈ శ్వాస ఆగిపోయింది ఇక్కడ

ఇంత అద్భుతమైన శిల్పచాతుర్యాన్ని తన కథలో రంగరించాడు రచయిత, దర్శకుడు కె విశ్వనాధ్

**బడిపంతులు** • ఇది ఒక సాధారణమైన బడి పంతులు కథ వెనక్కి తిప్పి చెప్పటం గాని, ముందుకు వెళ్ళి వెనక్కి రావటాలు గాని, చిత్ర కథలో సాధారణంగా కథ చెప్పటానికి చేసే మాయలు గాని ఏమీ అనుసరించకుండా, నిజాయితీగా, ఉన్నది ఉన్నట్లుగా, జరిగింది జరిగినట్లుగా రాయబడ్డ కథ ఇది

ఒక సాధారణ బడి పంతులు ఒక ఊరికి కొత్తగా వచ్చి, ఒక స్కూల్లో చేరిన దగ్గర నుంచి అవసాన దశవరకు జరిగిన ఇతివృత్తాన్ని హృదయానికి హత్తుకునేలా చెప్పటమే రచయిత ఉద్దేశం అందుకే ఈ కథలో వాస్తవికత, కుటుంబసంబంధాలు, మానవసంబంధాలు ఎలా జోడించి రచయిత ఈ కథాశిల్పాన్ని ప్రదర్శించాడు అన్నది మాత్రమే పరిశీలించాలి

ఇలాంటి కథ రాసుకునేటప్పుడు రచయిత తాను ఏది ప్రేక్షకుడిదృష్టికోణంలోకి తీసుకురాదలుచుకున్నాడో ముందే ప్రణాళిక వేసుకుంటాడు

ఇందులో రాఘవయ్య ఒక చిన్న గ్రామానికి ఒక మాష్టారుగా వచ్చి ఆ పాఠశాలను ఒక క్రమపద్ధతిలో పెట్టటానికి చేసే ప్రయత్నంలో ప్రతి కథానాయకుడితో గొడవ పడటం సహజం

చిన్నపిల్లలు కలాలూ, పుస్తకాలూ దొంగతనంచెయ్యటం అతిసహజమైన విషయం అలాగే రాము అనే విద్యార్థి ఏకంగా మాష్టారి కలమే దొంగతనం చెయ్యటం, అతనిలో మార్పు తీసుకువచ్చి, ఆ కలాన్ని అతనికే మాష్టారు బహుమతి ఇవ్వటం అతిసహజమైన సంఘటనే

మాష్టారు తన దోపిడీకి అడ్డు వస్తున్నాడన్న కోపంతో మాష్టారి ఇల్లు ప్రతికథానాయకుడు తగలబెట్టించటం ఇప్పటి రోజుల్లో కృత్రిమమేగాని, 50వ దశకంలో 60వ దశకంలో కొన్ని ఊళ్ళల్లో గ్రామకక్షలు తీర్చుకోవటానికి కొంపలు తగలబెట్టుకున్నారు, కుప్పలు తగలబెట్టుకున్నారు అన్న సంగతి గుర్తుకు తెచ్చుకుంటే అది వాస్తవానికి దగ్గరగా అనిపిస్తుంది

పిల్లల చదువు కోసం బడిపంతులయినా తండ్రే కాబట్టి ఆయన అప్పు చెయ్యటం కూడా సహజమయిన విషయమే ఆ అప్పు సరిగ్గా కూతురి పెళ్ళి కోసం దాచుకున్న డబ్బులో నుంచి ఇవ్వవలసిరావటం, నాటకీయత అని అనిపించవచ్చు గాని, అప్పుఇచ్చినవాడు వసూలు చేసుకోటానికి అలాంటి సమయాన్నే ఎంచుకుంటాడు అన్నది కూడా సహజమైన విషయమే

అయితే చిత్రకథారచయిత శిల్పచాతుర్యం మొత్తం, అతి సహజంగా జరిగిపోతున్నాయి అని ప్రతిపాదించిన విషయాలతోనే ఉత్తరార్థంలో అద్భుతమైన కుటుంబ, మానవీయ సంబంధాలను ప్రదర్శించటంలో కనిపించింది అదీ కథాశిల్పం

అంటే వీటన్నింటినీ తాను ముందు దర్శించి, ప్రేక్షకులకు దర్శింపచేసాడు

ప్రతికథానాయకుడు బడిపంతులు ఇల్లు తగలబెట్టినందుకు, మత్తుపదార్థం సేవించి తనఇల్లు తనేతగలపెట్టుకుంటాడు ద్వితీయార్థంలో ఎక్కడ ప్రథమార్థసన్నివేశం జ్ఞాపకం ఉండదోనన్న శంకతో ద్వితీయార్థంలో మాష్టారి ఇల్లు వేలం వేయించాక, ఆ రాత్రి తను తన ఇల్లు తగలపెట్టుకుంటాడు

చిన్ననాడు మాష్టారి ఇల్లు తగలబడితే రాము (కలం దొంగ) తన స్నేహితుల సహకారంతో మాష్టారి ఇల్లు కట్టిస్తాడు సరిగ్గా ఇల్లు వేలం అవుతున్న సమయంలో భార్య సహకారంతో (నగలు ఇస్తానంటుంది) మాష్టారి ఇల్లు వేలంలో పాడి కాపాడతాడు

ఏ పిల్లల చదువుకోసం జీవితం ధారపోస్తాడో, ఆ పిల్లలు మాష్టారు ఉద్యోగ విరమణ చేసాక, తల్లిదండ్రులిద్దరూ అయితే తమకు భారమని పెద్దకొడుకు తండ్రిని, చిన్నకొడుకు తల్లిని పంచుకుంటారు

సామాన్యంగా మానవులు ఆస్తులు పంచుకుంటారు, పశువుల్ని పంచుకుంటారు,

పంటలు పంచుకుంటారు, కన్న తల్లిదండ్రులని పంచుకోవటం చరిత్రలో గాని, పురాణాల్లో గాని కనిపించదు అందుకే ఈ చిత్రం విడుదలయినప్పుడు ప్రేక్షకుల నోట్లోనానిన విషయం ఇదే **శుభలగ్నంలో** భర్తనుఅమ్మేయటం ఎంతగా చెప్పుకున్నారో **బడిపంతులులో** తల్లిదండ్రుల్ని పంచుకోవటం అంతగా చెప్పుకున్నారు

ఈ పంపకం కరుణరసోత్పాదనకి శ్రీకారం చుట్టింది ఏకోరసఃకరుణఏవ అని నమ్మి మొత్తం చిత్రాన్ని కరుణరససముద్రంలో ముంచేస్తే జనాదరణ కష్టం అందుకే హాస్యంతో కరుణరసానికి అడ్డుకట్టవేస్తూ, **పరాయీకరణ** (alienation) **పద్ధతిని** ఆశ్రయించి ఏ డబ్బు ప్రతి కథానాయకుడికి ఇవ్వటం మూలంగా, కూతురి మామగారికి నోటు రాసిచ్చారో, ఆ అల్లుడి కుటుంబ దృశ్యాలలో హాస్యాన్ని పండిస్తూ అల్లుణ్ణి హాస్య కథానాయకుడి ప్రతిపత్తికి పెంచి రస సమన్వయం సాధించాడు

తల్లిదండ్రుల్ని కొడుకులిద్దరూ పంచుకుంటుంటే అల్లుడు మామ రాసిన నోటుని చించేస్తాడు కళ్ళల్లో నీళ్ళు కారుతుండగానే ఆ కరుణరసాన్ని నెట్టివేసుకుంటూ హర్షాతిరేకంతో ప్రేక్షకులు చప్పట్లు కొడతారు అదొక ద్వంద్వానుభూతి, భావానుభూతి ఏడుపు, ఆనందం కలబోసిన అనుభూతి

కథాశిల్పంలో ఇంకా ఈ రచయిత ఏం సాధించాలనుకున్నాడు? భార్యా, బిడ్డలని విడదీసాడు అలాగే ఏ కొడుకు దగ్గరికి వెళ్ళిన భార్యా భర్తలు ఆ కొడుకు ఇంట్లోనే తనువు చాలించి ఉంటే *బడిపంతులు* చిత్రం గురించి పరిశోధనాస్థాయిలో ఆలోచించాల్సిన పని లేదు

అక్కడ భర్త, ఇక్కడ భార్య ఇద్దరూ విడిపోయిన దుఃఖంతోపాటు, ఎడబాటు తెచ్చిన వ్యధతోబాటు, ఆయా గృహాలలో కోడళ్ళు, చిన్న కోడలి అమ్మ, పెద్ద కోడలి తండ్రి (ఇతను ప్రతికథానాయకుడు) మూలంగా అవమానాలు పడుతూ ఉంటారు

రచయిత పాత్ర పరంగా కరుణరసాన్ని సాధిస్తూ ప్రేక్షకుడిహృదయంలో మెల్లగా క్రోధం అనే స్థాయీభావాన్ని, రౌద్రం అనే రసాన్ని నింపుతున్నాడు దానికి పరిష్కారం కోసం ప్రేక్షకుడి కళ్ళు వెదుకుతున్నాయి

చిన్న కొడుకు తిరగబడి భార్యను తిడితే బాగుండును, పెద్దకొడుకు తిరగబడి మామను కొడితే బాగుండును అన్న భావం పేరుకుపోయేంతగా అక్కడి దృశ్యాలు పండించాడు భర్తతో కనీసం ఫోనులో మాట్లాడనివ్వకుండాచేస్తే, నడిచయినా పెద్దకొడుకు ఇంటికి వెళ్ళిపోతానని బడిపంతులుభార్య బయలుదేరుతుంది మనమరాలు పరుగెత్తుకుంటూ వచ్చి తను దాచుకున్న డబ్బులిస్తుంది లేని క్షయ రోగాన్ని

అంటగట్టటంతో బడిపంతులు కూడా తట్టుకోలేక బయలుదేరతాడు ఆవిడ ఇటు, ఈయన అటు ప్రేక్షకుడికి ఉత్కంఠ! కలుసుకోకుండా అటూ, ఇటూ వెళ్ళిపోతారేమోనని భయం

ఇద్దరూ కలుసుకున్నారు, కథ పూర్తయ్యింది అని ప్రేక్షకుడు అనుకోకుండా అక్కడే దొంగతనం నేరంతో రాఘవయ్య మాష్టారి అరెస్ట్ ఇది కథాశిల్పమే! లేకపోతే భార్యాభర్తలిద్దరూ కలవగానే ప్రేక్షకుడు లేచేస్తాడు ఈ కలయికకు పూర్వమే దొంగతనం అంటగడతాడు ప్రతి కథానాయకుడు

ఈ చిత్రం కథాశిల్పం పరాకాష్ఠ ఆఖరి రెండు దృశ్యాలలో ఉంటుంది

కలం దొంగతనం చేసాడని మాష్టారు నైతికప్రవర్తనలో ఎవరిలో మార్పుతెచ్చాడో అతను ఇన్‌స్పెక్టర్ గా కుర్చీలో కూర్చుంటే, నేరస్తుడిగా మాష్టారు రావటం సర్వోత్కృష్టమైన సన్నివేశం ఆయన్ని ఇంటికి పంపించి భార్యతో కలిసి దండలతో సత్కరించి, ఇక ఈ ఇల్లు వదిలి మీరు వెళ్ళగూడదు అదే మీకు శిక్ష అని చెప్పి, అలా రాసివ్వమని తనకు మాష్టారిచ్చిన కలాన్నే తిరిగి ఇవ్వటం, నాటకీయతే అయినా హృదయాన్ని కదిలించే అంశం ఆ కలం ద్వారా అతను చిన్నప్పుడు తన దగ్గర చదువుకున్న రాము అని ఆయన గుర్తించటం, ఆ తర్వాత కుటుంబ సభ్యులు క్షమాపణ కోరుతూ రావటం, పంచభక్ష్య పరమాన్నం తిన్న పిదప తాంబూలం వేసుకున్నట్టే

ఆఖరిదృశ్యంలో కుటుంబ సంబంధాలను, మానవీయసంబంధాలను జోడించి తల్లిదండ్రుల్ని పంచుకోవద్దు, వృద్ధాప్యంలో వారిని ఒకచోటేఉంచి దేవతల్లా పూజించుకోండి, అని నీతి చెప్పటమే గాక, గురు శిష్య సంబంధాలను ఉత్కృష్టంగా చూపించిన ఈ కథలో శిల్పం అడుగడుగునా హంస తూలికా తల్పమే

**రోజులు మారాయి .** ఈ చిత్రం విడుదలయిన రోజుల్లో ఆంధ్ర రాష్ట్రంలో అభ్యుదయవాదుల గాలి నడుస్తోంది ఈ చిత్రానికి రచన, సంభాషణలు కొండేపూడి లక్ష్మీనారాయణ రాస్తే, స్క్రీన్‌ప్లే సి వి ఆర్, కొండేపూడి, చాణక్య రాసారు దర్శకత్వం తాపీ చాణక్య చేసాడు

ఈ వివరాలు ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే ఈ చిత్రంలోని పాత్రలు గాని, సంఘటనలు గాని ఏ ఒక్కరినీ ఉద్దేశించినవి కావు, కేవలం కల్పితాలు అని ఒక మనవి చేసారు

అంటే నాటి సమకాలీన పరిస్థితుల్లో ఇందులోని సంఘటనలు, పాత్రలు కొందరిని గుర్తు చేసే ప్రమాదం ఉందని భావం

బంజరుభూములు భూమి లేని వాళ్ళు సాగు చేసుకోటానికి ఇవ్వాలి, వరకట్న

దురాచారాన్ని ఎదిరించాలి అనే రెండు సాంఘిక విషయాల మీద ఈ కథ రాయబడింది వాటిని అలాగే రాసుకుంటే డాక్యుమెంటరీ అయ్యే ప్రమాదం ఉంది అందువల్ల ఈ కథ కోసం ఒక శిల్పాన్ని సమకూర్చుకున్నారు రచయిత, దర్శకులు పైగా చిత్ర నిర్మాత సి వి ఆర్ కూడా స్క్రీన్‌ప్లే రచనలో భాగం పంచుకున్నాడు

రచయిత, నిర్మాత, దర్శకుడు ముగ్గురూ స్క్రీన్‌ప్లేలో పాల్గొనటం సమష్టి కృషికే గాక, రేపేదయినా జరిగితే సమష్టి బాధ్యతకు కూడా సిద్ధమయ్యారన్నమాట అంటే వాళ్ళు ఒక సాంఘిక దురన్యాయాన్ని, సాంఘిక దురాచారాన్ని సినిమా మాధ్యమం ద్వారా నిర్మూలించదలచి ఈ చిత్రం తీసినట్లుంది అయితే వాటిని యధాతధంగా తీస్తే సినిమా ఆర్థిక విజయానికి ప్రమాదం గనుక, కుటుంబ సంబంధాలను వాడుకున్నారు

వేణు అనే యువకుడికి తండ్రి కోటయ్య, తల్లి, చెల్లి ఉన్నారు ఆ ఊరి జమిందారు సాగరయ్య, కరణం సాంబయ్య, రౌడీ పోలయ్య పేదల పాలిట యమధర్మరాజులు వేణుకి, చెల్లి పెళ్ళి గోపాలంతో చెయ్యటం, పేదలతో బంజరుభూమి సాగుచేయించటం అనేవి రెండు ఆశయాలు ఈ ఆశయాలు సిద్ధిస్తే ఈ కథకు ఫలప్రాప్తి జరిగినట్టే

అయితే అతనికి ప్రతిబంధకాలు ఎవరు? చెల్లి పెళ్ళికి తండ్రే ప్రతిబంధకం అయ్యాడు వేణు - రాధ అనే కులం తెలియని అమ్మాయిని పెళ్ళి చేసుకోవటం మూలంగా వియ్యంకుడు ఐదొందలు బదులు వెయ్యి రూపాయల కట్నమడిగితే, కోపం వచ్చి కోటయ్య వృద్ధుడికిచ్చి పెళ్ళి చేద్దామనుకుంటాడు తన కూతుర్ని

బంజరుభూముల విషయంలో సాగరయ్య ప్రతిబంధకం అధికారం ద్వారా అడ్డుకోవాలని చూసి వీలుపడక అవినీతి మార్గాలను అవలంభిస్తాడు వాటిని అధిగమించి వేణు ఎలా తన ఆశయాన్ని సాధిస్తాడు అన్న దిశలో ఉత్కంఠాభరితంగా కథ నడపటమే కథాశిల్పం

ఈ శిల్పం ప్రదర్శించటానికి వేణు పాత్రకి ఒక చెల్లిని, ఒక తండ్రిని సృష్టించుకున్నారు చెల్లి సాంఘిక దురాచారానికి ప్రతి రూపమయిన వరకట్నానికి, తండ్రి సాంఘిక దురన్యాయం అయిన పెత్తందారీతనానికి లొంగేవాడిగా చూపించి, ఆ సమస్యలు వ్యవస్థాపరమైనవిగా గాక వ్యక్తిపరంగా చిత్రించబడి, కథలో బిగువు వచ్చింది

కథ ఎత్తుగడలోనే పొలియో పొలి అంటూ కుప్ప నూర్పిడి చూపించి, చేతికి పంట అందగానే రౌడీపోలయ్య, కరణంసాంబయ్యను వెంటపెట్టుకుని వచ్చి, వాళ్ళు పండించిన నాలుగెకరాల భూమిలో పంట తనదని, అది బంజరు కాదని, బి.ఫారమ్ తన పేర ఉన్నదని కరణంతో చెప్పిస్తాడు తప్పనిసరై సాగరయ్య దగ్గరకు తీర్పుకెళితే,

పొలం పోలయ్య పేరనుందిగనుక ఎకరాకి మూడు బస్తాలకాడికియ్యి అని చెప్పి, వాళ్ళ తాత చేసిన అప్పు 16 బస్తాలు కట్టమని, కాస్సేపటికి బెట్టు సడలించి సగమన్నా తీర్చటానికి అంటే ఎనిమిది బస్తాలు తీర్చటానికి అంగీకరిస్తాడు కూతురిపెళ్ళి అనుకున్నాను అని మొత్తుకున్నా వినిపించుకోడు సాగరయ్య

ఇలా ప్రారంభంలోనే ఇది సామాజికమైన చిత్రమని, సామ్యవాదస్థాపక చిత్రమని ఊహను అందిస్తారు ఇందులో వేణు, రాధ ఒకరినొకరు ఇష్టపడతారు అని తెలియజేస్తూ ఆ రాధ తల్లికి భర్తెవరో తెలియదని ఒక మాజీ సిపాయి చేరదీసాడని చెప్పి ఆ పుట్టుక ఈ పెళ్ళికి బాధకం కావచ్చు అనే సూచన చేస్తూ, పోలయ్య బావా అంటూ పిలుస్తూ రాధను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడని తెలియచేయుటంతో, వారి పెళ్ళి విషయికమయిన బెంగను స్థాపించటం కథాశిల్పం

ఈ ప్రేమ బయటపడడమే కథలో మొదటి మలుపు ఎందుకంటే ఆ రోజులకి అంటే కథాకాలానికి ఇంకా కులం పట్టింపులు బాగానే ఉన్నాయి ఆ పెళ్ళి మూలంగానే కోటయ్య కొడుకుని ఇంట్లోనుంచి పొమ్మంటాడు ఈ పెళ్ళిమూలంగానే ఒప్పుకున్న పెళ్ళికి వెంకటాద్రి, గోపాలం తండ్రి, ఉత్తరార్థంలో కట్నం పెంచుతాడు ఇది ఇంతగా ఎందుకు ఉద్ధృతం చేసి చూపించారంటే - ఆ తర్వాత *కల్టక్టర్* రాగానే పేదవాళ్ళకు న్యాయం జరిగిపోయింది కథానాయకుడి ఆశయం నెరవేరినట్లుగా ప్రేక్షకుడు భావిస్తే కథ పూర్తిఅయిపోయిన భావం కలుగుతుంది అందుకే *కలెక్టర్* బంజరుభూములకు ***బి ఫారాలు*** ఇచ్చినట్లు సూచనమాత్రంగానే చెప్పి వాచ్యంచెయ్యకుండా ఏరువాక పాటకు వెళ్ళిపోయారు

ఇక్కడి నుంచి సాగుకి ప్రతిబంధకాలు చెయ్యటం మొదలుపెట్టాడు సాగరయ్య తన పొలంలోనుంచి పంట కాలువ రానివ్వడు, కాలువ తవ్వుకుంటారు వేణు వాళ్ళు ఊళ్ళో ఉన్న నారంతా కొనేస్తాడు సాగరయ్య వేణు, గోపాలం సాయంతో పొరుగూరు నుంచి నారు తెస్తాడు అది గమనించిన సాగరయ్య ఆ వేణు చెల్లిని గోపాలం పెళ్ళి చేసుకోకుండా వెంకటాద్రి మీద ప్రభావం చూపిస్తాడు

ఒక పక్క చెల్లి పెళ్ళి ఆగిపోవటం ఇంకో పక్క పంటకు అనుక్షణం సాగరయ్య అడ్డు తగలటం అనే క్షణక్షణ మార్పులతో కథను వేగంగా నడిపి విషమ స్థితికి తీసుకువచ్చి ముసలివాడికిచ్చి తన కూతురి పెళ్ళి చెయ్యాలన్న నిర్ణయం కోటయ్య తీసుకునేలా చెయ్యటం శిల్పం దానికి పరిష్కారం గోపాలం తిరుగుబాటు చేసి పెళ్ళికి ఒప్పించినా, పెళ్ళివారిని దోవలోనే, దొంగల్లాగా సాగరయ్య రౌడీలు ఎదుర్కోవటం, పెళ్ళి పందిరి

సాంబయ్య తగలబెట్టటం, పెళ్ళి జరుగుతుండగా సాగరయ్య చెరువుకట్ట బద్దలుకొట్టి పనలమీద ఉన్న పంటను నాశనం చేస్తున్నాడని తెలిసి తాళి కట్టకుండా గోపాలం పరుగెత్తటం అంతా ఉత్కంఠాభరితమే

పంటపొలాల పక్కనే రాధ కొడుకును కనటం, పంటచేలోనే గోపాలం తాళి కట్టటం, అక్కడే తండ్రీ, కొడుకులు కలవటం అన్నీ ఒక దాని తర్వాత ఒకటిగా జరిగిపోయి కథాశిల్పం పూర్తవుతుంది

ఉమ్మడి వ్యవసాయమే లక్ష్యమనీ, పేదలంతా కలసికట్టుగా ఉంటే, కట్ట బద్దలుకొట్టకు వచ్చే చెరువులాంటి సాగరయ్యను ఎదిరించటం చాలా తేలిక అనే నీతిని, సామ్యవాద సిద్ధాంతాన్ని ప్రదర్శించే ఈ కథాశిల్పం ఇన్ని సంవత్సరాలు గడిచినా వినూత్నంగానే ఉంటోంది

చలనచిత్రాలలో కథాశిల్పం ఎలా ఉంటుందో పరిశీలించటం జరిగింది కథనంలో భాగమయిన పాత్ర తాలుకూ పాత్రచిత్రణశిల్పాన్ని ఇప్పుడు పరిశీలించాలి

## పాత్రచిత్రణశిల్పం :

పాత్ర గురించి ఇది నాన్సీ స్మిత్ ఉద్దేశం

*'That characters make your story is a truism'* [19] పాత్రలు కథని నిజమని నమ్మిస్తాయంటున్నాడు ఆ పాత్ర, చిత్రకథలో రూపు దిద్దుకునే తీరే పాత్ర చిత్రణ శిల్పం

*కావ్యంలో శిల్పమున్నది కేవలం సౌష్ఠవంతో కాని, అంగాంగీ భావాన్ని సాధించడంతో కాని, సువిభక్త అంగసంస్థితితో కాని ఆగిపోయేది కాదు ఒక శిల్పానికి జీవాన్ని తెచ్చేది ఆశిల్పి పనితనం, అతని చేతిలోని మార్దవం, తాను చెప్పినట్లుగా రాయి తన మాటను వినడం, తాను మలచిన రీతిని రాయి ఒదగడం మహాశిల్పిచే నిర్వహింపబడిన కావ్యం కూడా అంతే ఆకవి పనితనమెక్కడ గోచరిస్తే, అక్కడ శిల్పం ఉన్నదని మనమనుకోవాలి తద్గతమైన సౌందర్యం కేవలము సౌష్ఠవాది ప్రక్రియల వల్ల సాధింపబడినది కాకపోవచ్చు కాని ఆ శిల్పం ఇంతవరకు వివరించిన శిల్పం కన్న మిన్న అయినదే కాని, తక్కువయినది మాత్రం కాదు* [20]

పై భావం వడలి మందేశ్వరరావుది శిల్పి రాయిని తను కోరుకున్న రీతిలో చెక్కి ప్రాణప్రతిష్ఠ చేసినట్లే, కవి తనబుద్ధితో పాత్రను చెక్కి ప్రాణప్రతిష్ఠ చేస్తాడు

ఆ పాత్ర ఎందుకు ఉద్దేశించబడింది? ఆ నియమాన్ని గాని, నీతిని గాని ఎందుకు

ఉల్లంఘించింది? ఆ ఉల్లంఘన ప్రజామోదమైనదేనా? ఇవన్నీ ఆలోచించవలసి ఉంటుంది

శ్రీరాముడు ఇంకా కొద్ది సేపట్లో అయోధ్య సింహాసనాన్ని అధిష్ఠించబోతున్న సమయంలో దశరధుడు పిలిచి కైక వరం గురించి చెప్పాడు పదునాలుగేళ్ళు వనవాసానికి వెళ్ళవలసి వచ్చింది

'నేను ఎందుకు వెళ్ళాలి?' అన్న ఒక్క మాటగనుక శ్రీరాముడు అనిఉంటే వేల సంవత్సరాలుగా ఆరాధిస్తున్న ఆయన పాత్రచిత్రణ ప్రశ్నార్థకం అయి ఉండేది అలా అనలేదు కాబట్టే ఇన్నివేలసంవత్సరాలుగా ఆరాధ్యుడయ్యాడు

కృతయుగంలో హరిశ్చంద్రుడి పాత్ర సత్యమే నీతి అని తెలియజేయటానికి, త్రేతాయుగంలో రాముడిపాత్ర ధర్మమే నీతి అని తెలియజేయటానికి, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడి పాత్ర రాజకీయమే నీతి అని చెప్పటానికి ఎలా ఉపయోగపడ్డాయో అలాగే ప్రతిచిత్రంలో పాత్ర ఒక నీతి కోసమో, ఒక సిద్ధాంతంకోసమో, ఒక ఆశయంకోసమో కట్టుబడి ఉంటుంది ఆయా నీతి, సిద్ధాంత, ఆశయాలకు అనుగుణంగా పాత్ర మలచబడిందా లేదా అన్నదే శిల్పం

*సాగరసంగమంలో బాలకృష్ణ, మాధవి, శైలజ పాత్రలు మూడూ, శిల్ప పరిశోధనకు అనువుగా ఉన్నాయి బాలుకి నాట్యం అంటే ఇష్టం, ప్రాణం మాధవి అంటే ఇష్టం శాస్త్రీయ నాట్యాన్ని ఆరాధిస్తాడు ఎవరయినా అవమానిస్తే తట్టుకోలేడు తను దైవంగా భావించే తల్లి చనిపోవటం, తను అర్ధభాగంగా కోరుకున్న మాధవి దూరం కావటంతో ఆ బాధ తట్టుకోలేక మధుపానానికి దగ్గరై, అనారోగ్యానికి గురై మృత్యువుకి చేరువై ఒకనాటి ప్రియురాలు మాధవి కోరిక మీద ఆమె కుమార్తెకి నాట్యం నేర్పి, తనువు చాలిస్తాడు*

ఈ పాత్రను కధకుడు, దర్శకుడు కె విశ్వనాథ్ ఎలా మలిచాడో చూడాలి

**బాలకృష్ణ (సాగర సంగమం):** ఉదర పోషణార్థం తల్లి ఒక వంటలమనిషి దగ్గర కూరగాయలు కొయ్యటానికి కుదురుకుంటే, జీవ పోషణార్థం బాలకృష్ణ ఒక సినిమా నృత్యదర్శకుడి దగ్గరకు వెళ్ళి, అతను మత్తుమందుసేవిస్తూ నాట్యాన్నిదృశ్యీకరణ కోసం సిద్ధంచెయ్యటం చూసి, అసహ్యంచుకుంటాడు ఆ బాలూనే తర్వాత మందుకి బానిస అవుతాడు అందుకే ఈ పాత్రను పరిచయం చేస్తూనే తాగుబోతు అని చూపించాడు దర్శకుడు అతను తాగుబోతు అని ప్రేక్షకుడి మనసులో ముద్రపడ్డాక, ఇతను తాగుణ్ణే అసహ్యంచుకుంటున్నాడు అన్నవిషయం పూర్వకథలో వస్తుంది ఇప్పుడు ప్రేక్షకుడికి

ఇలాంటివాడు ఎందుకు తాగుబోతు అయ్యాడు? అన్న ఉత్సుకత బయలుదేరుతుంది ఆ పాత్ర కథ మొత్తం తెలుసుకోబుద్ధవుతుంది అంతేకాదు మిసిసిపి నడవటానికి చెప్పులు కావాలి ఆ పాదరక్షలు ప్రారంభంలో పారేస్తాడు బాలు నా కాళ్ళ మీద నేను నిలబడగలను అన్న కర్మ సిద్ధాంతం ఇది

కె విశ్వనాథ్ ప్రదర్శించిన పాత్రపరిచయశిల్పం ఇది అంతేకాదు ఇతను అద్భుతమైన నాట్యకళాకారుడు అన్న విషయాన్ని - శైలజ నాట్యంలోని పంచభూతములు అనే చరణానికి భరతనాట్యం, కథక్, కథాకళి ఆడి చూపించిన సందర్భంలో నిరూపించాడు ఇంత గొప్ప కళాకారుడు ఎందుకు తాగుబోతు అయ్యాడు అని అతన్ని గురించి తెలుసుకోవాలన్న కుతూహలాన్ని రేకెత్తించి, అప్పుడు అతని పూర్వకథ (Flash Back) ప్రారంభించాడు

నాట్యం నేర్చుకోటానికి డబ్బు కట్టలేక, గురుసేవచేసి ఋణం తీర్చుకుంటానన్న అతి పేదవాడయిన బాలు జీవితంలోకి మాధవి వచ్చింది అతనిలోని నాట్య పిపాసకు చేయూతనిచ్చింది తల్లికి ఎలాగయినా తన నాట్యం చూపించాలన్న అతని తాపత్రయం తీర్చటానికి మంచిప్రదర్శన ఏర్పాటు చేసింది అతని జీవితంలో మొదటి దురదృష్టం తల్లి తన నాట్యం చూడకుండా కన్ను మూసే పరిస్థితిలో ఉండటవేం తట్టుకోలేకపోతాడు ఈ చిత్రంలో ఉద్బోధక పాత్ర అయిన అతని స్నేహితుడి మాట వింటూ ఉంటాడు

తల్లి పాతికరూపాయలిస్తే ఇదే స్నేహితుడు కొప్పడితే తిరిగి ఇచ్చేసాడు ఈ స్నేహితుడి కోసమే శైలజకు నాట్యం నేర్పటానికి బయలుదేరతాడు ఈ స్నేహితుడు సభామందిరం నుంచి తీసుకు వెళుతుంటే విగతజీవుడై వెళ్ళిపోతాడు ఉద్బోధక పాత్రను ఈ పాత్ర ఆనుసరిస్తోందన్న సూత్రం చిత్రమంతా ఒకే విధంగా ఉంది ఇప్పుడు ప్రాణం లేదు ఎవడో తీసుకు వెళ్ళవలసిందే అదీ కర్మసిద్ధాంతమే కర్మసిద్ధాంతంతో మొదలై కర్మసిద్ధాంతంతో పాత్ర ముగిసిపోతుంది

ఆత్మీయత పెరిగిన తరువాత మాధవిని పెళ్ళి చేసుకోటానికి ప్రతిపాదన పెడతాడు ఆమెకు అప్పటికే పెళ్ళయ్యిందని భర్తకుదూరమై బతుకుతోందని తెలిసి సముద్రం ఒడ్డున పిచ్చివాడిలా నాట్యం చేస్తాడు ఇలా ఆవేశభరితంగా నాట్యం చెయ్యటం అతని అలవాటు సినిమానృత్యదర్శకుడి దగ్గర పిచ్చినాట్యం ప్రదర్శించినప్పుడు, భగవంతుడి దగ్గర క్షమానాట్యం చేస్తాడు

అయితే మాధవిభర్త వచ్చి మీరే మాధవికి సరైనజోడీ అని చెప్పి వాళ్ళిద్దరినీ ఒకటి చేయాలని చూసినప్పుడు మాధవిని భర్తతోనే పంపిస్తాడు

ఇది స్వయంకృతం ఈ స్వయంకృతం వెనుక నీతిఉంది భర్త మారివచ్చినప్పుడు ఆమె అతని దగ్గరకే వెళ్ళిపోవటం ధర్మం ఈ ధర్మం కోసం స్వార్థం వదిలిపెట్టాడు త్యాగం అయితే చెయ్యగలిగాడు గాని, బాధను మరిచిపోటానికి మత్తుమందే శరణ్యం అన్నాడు మరో దేవదాసుగా మారిపోయాడు

అయితే అతను సాంఘిక నీతుల్ని గురించి మాట్లాడడు, మంచిపాటను పాడుచేసారని, మంచినాట్యం వద్దన్నారు అని చెబుతాడు నాట్యం అంటే పోలీసుకవాతులు, కామక్రీడలు కాదు అనేది అతని సిద్ధాంతం అందుకే శైలజ కుప్పి గంతులను భరించలేకపోయాడు

తనతో తన నాట్యకళ అంతంకాకూడదు అని, తన కూతురికి నేర్పించమన్నది మాధవి ఆఖరికోరిక అని తెలిసి, నేర్పి, ఆ మహా తల్లికి కృతజ్ఞత చెప్పి వెళ్ళిపోయాడు

అతని పాత్రఆశయం శాస్త్రీయనాట్యం నిలబడాలి అన్నదే అదే శైలజకు నేర్పి వెళ్ళిపోయాడు పాత్ర శిల్పం ఎక్కడా చెడలేదు

**మాధవి (సాగర సంగమం)**: చిత్రంలో కథానాయిక పాత్ర పరిచయం అయినప్పుడు అప్పటికే పెళ్ళి అయిపోయి విధవరాలు అని చూపించాడు కాని బాలకృష్ణను తలచుకోవటంతో ఆమె అతన్ని ఇష్టపడుతుంది అని ప్రతిపాదిస్తాడు బాలకృష్ణ ఈమె ప్రియుడైతే వాళ్ళిద్దరి పెళ్ళి ఎందుకు జరగలేదు అన్న ఉత్సుకతను ప్రారంభిస్తూ, పాత్రపరిచయశిల్పాన్ని ఈ పాత్రపరిచయంలో కూడా ప్రదర్శించాడు దర్శక, రచయిత

అందుకే, ఇందులో పూర్వకథ రెండుసార్లు చూపించాడు మొదటిది నాటకీయ దృష్టి కోణంలో బాలకృష్ణ కథ చెప్పాడు బాలకృష్ణ కోసం వాకబు చెయ్యటం మొదలుపెట్టాక మాధవి దృష్టికోణంలో విఫలమైన ఆమె ప్రేమకథను పూర్వకథగా చూపించాడు

అంటే చెప్పబడే ఆ పూర్వకథలో వీరిద్దరి ప్రేమ పరాకాష్ఠకు చేరటంతో, ప్రేక్షకుడు వాళ్ళు విడిపోవటం భరించలేడేమోనన్న కథాశిల్పంతో పాటు, తన మాధవి ఉత్తమురాలు, అందుకే ప్రేమ కంటే సంప్రదాయానికి విలువ ఇచ్చి భర్తతో వెళ్ళిపోయిందని చెబితే ప్రేక్షకుడు ఆ పాత్రను క్షమించాడు అందుకే విధవరాలు, బిడ్డతల్లి అని పాత్రను పరిచయం చేసి ఈమెకు బాలకృష్ణతో ఎలా సంబంధం కలిగింది? ఎలా ప్రేమలో పడింది? ఎందుకు విడిపోయింది అన్న ప్రశ్నలకు ప్రేక్షకుడి చేత సమాధానం వెతికించాడే తప్ప, ఆ పాత్రను అనుమానించటమో, అసహ్యించు కోవటమో చెయ్యనివ్వలేదు

ఈ పాత్ర మొదట బాలూని తీసిన ఫోటో గాల్లోఉంది ఇష్టపడ్డాక తీసిన ఫోటోలో ఆమె కెమేరా వంక చూస్తుంటే బాలు వీపు మాత్రం కనిపిస్తుంది కారు దిగి కలవబోతే మరో కారు విడదీస్తుంది ఇలా ఒకటి రెండు దృశ్య సంబంధమైన షాట్లు తీసి ఈ ప్రేమ నిలబడదు అని స్థిరీకరిస్తూ వెళ్ళాడు ఈ పాత్ర ఆశ నెరవేరదు అని ప్రేక్షకుణ్ణి ఆలోచనలో పడేసి కథాగమనాన్ని పాత్రప్రవర్తన ద్వారా కాపాడుతున్నాడు

అయితే తను అప్పటికే పెళ్ళయి భర్తకు దూరమయిన అమ్మాయిని అని ఆమెకు తెలుసు? ఎందుకు దగ్గరయ్యింది? ఇక్కడ పాత్రచిత్రణ చక్కగా అమరింది ఎన్నడూ మాధవి అతన్ని అడగలేదు పెళ్ళయి విడిపోకుండా ఉంటే తప్పుగాని, విడిపోయిన అమ్మాయికి మరో పెళ్ళి చేసుకునే హక్కు ఉంది అయినా ఆమె అడగలేదు పెళ్ళిచేసుకుందాం అని బాలూయే అడిగాడు నిజానికి ఆమె ఎగిరి గంతు వెయ్యలేదు సంశయంలో పడింది సంశయంలో పడ్డాకే ప్రేక్షకుడికి అనుమానం మొదలవుతుంది అంతే కాదు పైట సర్దుకోబోతే దాని మూలంగా గులాబీలు కిందపడిపోతాయి

అతను పద్ధతిప్రకారం మాధవి తండ్రిని అడిగాక బయటపడుతుంది నిజం అయినా బయలుదేరి అతన్ని స్వీకరించే ఉద్దేశంలోనే మాధవిపాత్ర సముద్రంఒడ్డున కలుసుకోటానికి వెళ్ళింది కానీ అక్కడొక సంఘటన జరిగింది తన ఒకప్పటి భర్త అక్కడ కూర్చుని ఉన్నాడు పరుగులు తీస్తూ బాలు బాహువుల్లో ఒదిగిపోదామనుకున్న మాధవి రక్కన ఆగిపోయింది భర్త వారిద్దరి కలయికను ప్రశ్నిస్తే, అవమానిస్తే, ఈ పాత్ర ప్రవర్తన వేరే విధంగా ఉండేది ముందు తన ప్రవర్తనకు క్షమాపణ కోరాడు ఆమెభర్త దానితో మాధవి ప్రవర్తనలో మార్పు ప్రారంభమయ్యింది మీ ఇద్దరూ కలిసి ఉండటమే ధర్మం అనటంతో ప్రియురాలు వెనకడుగేసి - ఒకనాటి భార్య ముందడుగు వేసింది ఇద్దరినీ ఒకటిచేసి మీ ఇద్దరికీ దూరంగా కెనడా వెళ్ళిపోతాననటంతో పూర్తిగా ప్రియురాలు సముద్రకెరటంలా వెనక్కివెళ్ళి సముద్రంలోకలిసిపోయి మళ్ళీ ఒడ్డుకి చేరేసరికి అగ్నిపునీత సీతలాగా జలపునీత అయి భార్యగా బయటికొచ్చింది భర్తతో కలిసి కెనడా వెళ్ళిపోయింది బాలుకి, తనూ తన భర్తనీ కలిపి, బాలూ తీసిన ఫోటోని జ్ఞాపకంగా ఇచ్చి వెళ్ళిపోయింది ఆమె పక్క స్థానం భర్తదేనని చెప్పటం ఇది

ప్రస్తుతానికి వస్తే, తను భర్తని పోగొట్టుకుంది బాలూ జీవితాన్ని పోగొట్టుకున్నాడు తాను దూరంఅవటంవల్ల అతను మత్తుపదార్థాలకు దగ్గరయ్యాడని తెలుసుకుని అతన్ని బతికించుకోటానికి చూసింది ఆ ప్రయత్నంలో జరిగిన సంఘటనే ఆమె బొట్టు

పెట్టుకునే సంఘటన తను భర్తను పోగొట్టుకున్నానని తెలిస్తే అతనికి ఏమవుతుందోనన్న భయంతో చేసిందా పని నూతిలో పడిపోయేంత ప్రమాదంలో ఉండటం చూసి పెట్టుకుంది అది కూతురు చూసినప్పుడు, బాలూకి తనకూ ఉన్న సంబంధాన్ని అనుమానించి మాట్లాడినప్పుడు కూడా బాలూ వైపుకే మొగ్గింది

అతని జీవితంలో దగ్గరై, అతనిప్పుడు అలా అయిపోటానికి తనే కారణం గనుక, ్క అతను బతకడు అని నిర్ధారించుకున్నాక, అతని నాట్యాన్నన్నా బతికించాలని తాపత్రయపడింది తన కూతురిలో అతని నాట్యాన్ని చూస్తూ శేషజీవితాన్ని గడపాలనుకుంది

ఈ పాత్ర ఆశయం, శాస్త్రీయ నాట్యం నిలబడటానికి సహాయపడటం ఆ పనే చేసింది బాలకృష్ణలోని నాట్య విన్యాసాన్ని తనకుమార్తెకు వచ్చేలా చేసింది ఒంటరిగా మిగిలిపోయింది

ఒక రకంగా శంకరాభరణంలోని శంకరశాస్త్రికి, తులసికి ఈ చిత్రంలో బాలకృష్ణకీ, మాధవికీ చాలా పోకడలలో పోలికలున్నాయి మూలకథలో అక్కడ శాస్త్రీయ సంగీతం, ఇక్కడ శాస్త్రీయ నాట్యం తేడా తప్ప పాత్రల నడక ఒక్కటే

**కుమారి శైలజ (సాగర సంగమం)·** ఇది ఉత్ప్రేరక పాత్ర ఈ పాత్ర లేకపోతే బాలకృష్ణ పాత్ర గొప్పతనం తెలియదు మాధవి పాత్ర గొప్పదనం బయటపడదు చీకటి ఉంటేనేకదా వెలుగు బయటపడేది

ఈ పాత్ర బాలకృష్ణతో క్షమాపణ చెప్పించుకోవాలని చూసి, అతనిలోని నాట్య విన్యాసాన్ని బయటపడేలాచేసింది ఈ పాత్ర మాధవికి బాలకృష్ణ అనే మాజీ ప్రియుడి గురించి గుర్తు చేసింది చెరువులా కదలిక లేకుండా ఉన్న ఆమె హృదయాన్ని పారే కాలువలాగా మార్చింది

ఈ పాత్ర బొట్టు పెట్టుకున్న తల్లిని నిలదీసి ఆమె పాత్ర ఔన్నత్యానికి కారణం అవ్వటమే గాక, నాటకీయతకు పుష్కలంగా ఉపయోగపడింది

బాలకృష్ణ ఆశయం శాస్త్రీయ నాట్యం నిలబడటం, మాధవి ఆశయం అది నిలబడటానికి సహాయపడటం ఈ ఇద్దరి ఆశయాలకు భౌతికంగా ఉపయోగపడింది ఈ పాత్ర తనకు తెలిసి కాదు ప్రవర్తన ద్వారా ఉపయోగపడింది కాబట్టి ఇది చక్కని ఉత్ప్రేరక పాత్రగా మలచబడింది

ఈమెలో మార్పు ఏక్షణంలో వస్తే ఆ క్షణంలో కథాగమనం ఆగిపోతుంది కనుక తుది క్షణాలవరకు పట్టుతప్పకుండా కాపాడుకు వచ్చి ఆఖరి నిమిషంలో బాలకృష్ణ

మాధవి సభలో చేసిన ఉపన్యాసాలు విని మారుతుంది అక్కడి దాకా ఆ పాత్రశిల్పాన్ని అలా కాపాడుకు వచ్చాడు దర్శక, రచయిత

ఇప్పుడు కలికాలంలో చంద్రశేఖరం, జానకమ్మ, ఆనంద్ పాత్రల్ని పరిశీలించటం జరుగుతోంది

**చంద్రశేఖరం (కలికాలం)** మధ్య తరగతి కార్మికుడు నెలకు 2900 జీతం **కటింగ్‌లు** పోగా 800 చేతిలో పెట్టుకుని వస్తాడు 2900 జీతం అన్నప్పుడు అతని ఆనందం, **కటింగ్‌లు** పోగా మిగిలిన జీతం అందుకునేప్పుడు అతని నిరాశ, మధ్యతరగతి జీవితాల ఆశా నిరాశలకు ప్రతిబింబం ప్రస్తుతానికి వాళ్ళ ఇంట్లో వాళ్ళందరూ ఇష్టమే లందరి కోర్కెలూ తీర్చటం ఇష్టమే కాని ఆర్థిక స్తోమతే లేదు అందుకే భార్య ఒళ్ళో పడుకుని నేను మహారాజులాగా భావించేది నీ ఒళ్లో పడుకున్నప్పుడే అని చెప్పించటం మధ్య తరగతి మందహాసాన్ని నిర్వచించటానికే ఆ కాస్తహాయి కూడ ఉండనివ్వకుండా ఇంటిఓనరు అద్దెసంగతి అడుగుతూ ఆ హాయి చెడగొడతాడు

**ఫ్యాక్టరీ మేనేజర్** నీ కొడుక్కి ఉద్యోగం ఇస్తున్నాను అని స్థిరీకరించి కార్మికులతో సమ్మె మానిపించు అన్నప్పుడు లొంగని ఈ మధ్యతరగతి కార్మికుడు, తర్వాత కూతురి పెళ్ళికోసం ***వాలంటరీగా*** రిటైరయ్యి 50,000 కట్నంకోసం సమకూర్చటానికి సిద్ధపడతాడు

అతను చచ్చిపోయాడని తెలుసుకుని అతని కొడుకు ఆనంద్‌కి ఉద్యోగం ఇస్తారు **ఫ్యాక్టరీ** వాళ్ళు లక్ష రూపాయలు **ఎల్.ఐ.సి** కింద వస్తుందని తండ్రి మరణం కంటే, వచ్చే డబ్బు గురించి ఆలోచనలో ఉంటారు కొడుకు, కూతురు

ఈ పాత్రశిల్పం కనిపించేది "నాన్నా నువ్వు పోయావనుకొని, నాకు ఉద్యోగం వచ్చింది, ఎల్ ఐ సి డబ్బు రాబోతుంది" అని చెప్పినప్పుడు మౌనంగా భరించి ఇంట్లో స్టోర్‌రూంలో దాక్కోవటంలో, ఇన్నాళ్ళూ వాళ్ళ ఆనందం కోసమే బతికిన నేను ఇప్పుడు వాళ్ళ సంతోషం చెడగొట్టటం ఎందుకు అన్న మనస్తత్వచిత్రీకరణలోనే!

ఈ రోజు మధ్యతరగతికుటుంబంలో కొడుకులూ, కూతుళ్ళూ పెంచలేనప్పుడు మమ్మల్ని ఎందుకు కన్నావని నిలదీస్తున్నారు ఇది భారతదేశంలోమాత్రమే కనిపించే ప్రక్రియ

పైగా ఈ మధ్యతరగతిమానవుడికి భార్య తప్ప కొడుకు, కూతురు ఆఖరికి తండ్రి అండగా ఉండరు కుంగదీసే మనుషులే గాని చేయూత నిచ్చే మనుషులు కాదు

ఏసుక్రీస్తు కోసం డబ్బులు పోగుచేసి వాటిని దొంగతనంచేసేకొడుకు, నా కొడుకు చచ్చిపోయాడు కర్మకి సాయం చెయ్యండి అని ఆంగ్లంలో అడుక్కునే తండ్రి, వాళ్ళ కోసం ఏదయినా భరించటానికి సిద్ధపడ్డాడు ఆఖరికి తన కళ్ళముందే భార్య బొట్టుచెరిపేస్తున్నా, తన కళ్ళముందే తన ఏడూరు జరిపిస్తున్నా భరించాడు తన భార్య ఇక తనకు లేదనుకున్నప్పుడు కూడా చనిపోటానికి వెళ్ళాడుతప్ప, తిరగబడి, కొడుక్కీ కూతురుకీ బుద్ధి చెప్పలేదు చివరకు భార్యాభర్తలిద్దరూ కలుస్తారు

ఈ ఇల్లు బాగుపడాలంటే మీ మనసులో ఉన్న మధ్యతరగతిహద్దుల్ని చెరిపేసుకోండి అని భార్య పూర్వార్ధంలో చెప్పిన మాటను ద్వితీయార్ధంలో చివరిదాకా పాటించలేకపోతాడు చివరకు తెలుసుకుంటాడు తను బతకలేనిది తన భార్య లేకపోతేనే అని తెలుసుకుంటాడు

**జానకమ్మ (కలికాలం)** మధ్యతరగతి స్త్రీకి తార్కాణంగా చిత్రించబడిన పాత్ర 2900 రూపాయల బదులు 800 రూపాయలు భర్త చేతిలో పెడితే చిరునవ్వుతో భరించే సహనం, వీధిలో అప్పు చేసినా వాళ్ళ దగ్గర ఇంకా గౌరవం పొందుతున్న శీలం, కొడుకు కిరస్తానీ అమ్మాయికి గర్భం చేసాడని తెలిసి సరాసరి కోడలుగా ఆ అమ్మాయిని ఇంటికి తీసుకు రాగలిగిన ఔదార్యం, కొడుకు ఉద్యోగం కోసం భర్త అవినీతి చేయకుండా కొడుకుని నిలదీసే తీర్పరితనం, భర్త చనిపోయాడని మౌనంగా మారిపోయిన దైన్యం, భర్త బతికివచ్చాడని తెలిసి కొడుకు, కూతురు స్వార్ధంకోసం వెళ్ళిపోమని చెబుతుంటే భరించే ఓర్పు, భర్త పక్కన ఉండగానే కొడుకు బొట్టు చెరిపేస్తుంటే మూగపోయిన గొంతుతో నిలబడిన నిస్సహాయత, భర్త గదిలో ఎదురుగా ఉండగానే కర్మకాండని (ఏ ఇంతికీ పట్టకూడని దౌర్భాగ్యం) సహించే మనస్తత్వం, భర్త తను బతికిఉంటే ఇంటి నుంచి వెళ్ళలేడని, వెళ్ళకపోతే కొడుకూ, కూతురూ సుఖపడరనే బాధతో ఇల్లు వదిలే త్యాగ నిరతి, అన్నీ కలబోసిన పాత్ర జానకమ్మపాత్ర

అయితే ప్రథమార్ధంలో పాత్రకీ, ద్వితీయార్ధంలో పాత్రకీ పాత్రచిత్రణలో చిన్న మార్పు కనిపిస్తుంది

ప్రథమార్ధంలో తిరుగుబాటు మనస్తత్వంతో ప్రదర్శించినపాత్ర ద్వితీయార్ధానికి వచ్చేసరికి అలిసిపోయింది ఆ అలిసిపోవటానికి కారణం భర్త పోయాడనుకున్న బాధలోనుంచి తేరుకునే సరికి, భర్తతో కొడుకు, నువ్వు ఇంట్లో ఉండటానికి వీల్లేదని ఎదురు తిరగటం కావచ్చు అతని కోరికలో ఎక్కడో మధ్యతరగతిఅవసరం ఆమెలోని తిరుగుబాటుని తొక్కిపారేసింది

కథలో కలికాలం లక్షణం చూపించే ప్రదేశం ఇదే కన్న పాపానికి కలికాలపు బిడ్డల స్వార్థానికి లొంగిన స్త్రీపాత్రగా చక్కగా మలచబడింది

**ఆనంద్ (కలికాలం) :** చంద్రశేఖరం, జానకిల కొడుకు నూరుశాతం స్వార్థపరుడు తనకు మేరీ కావాలి అక్కడ కథానాయకుడిలా కనిపిస్తాడు

ఏసుక్రీస్తు డబ్బులుకాజేసిన దొంగ, బ్లాక్‌మార్కెట్లో టిక్కెట్లుఅమ్మిన నేరస్తుడు, ఇలాంటివాడు తండ్రిని వెళ్ళిపొమ్మని అనకపోతే ఆశ్చర్యం గాని, అంటే కొత్తగా లేదు

కాని నాలుగేళ్ళ ముందు మిమ్మల్ని చూసి కలెక్టరవుతారు అని అనుకున్నాం అని మేరీ చెప్పినప్పుడు, నేను డాక్టర్ని అవుదామని అనుకుంటే నువ్వే బి ఎ చదివించావ్ అని తండ్రి మీద ఇతను తిరగబడినప్పుడు, ఈ పాత్రను రచయిత, దర్శకుడూ ఫ్రస్ట్రేషన్‌లో ఉన్న విద్యావంతుడిగా తీర్చి దిద్దుదామనుకున్నారు అని అనిపిస్తుంది ఎప్పుడయితే జీతం తెచ్చి తన వాటా అంటూ డబ్బులిస్తాడో అప్పుడు మళ్ళీ ఇతని ప్రథమ గుణం, ఆఖరి గుణం స్వార్థమే అనిపిస్తుంది

ఆ స్వార్థానికి పరాకాష్ఠ తండ్రి చావుమూలంగా, తనుపొందిన ఉద్యోగం పోతుందన్న భయంలో, ఎల్.ఐ సి లక్ష రాదు అన్న బెంగలో నువ్వు వెళ్ళిపో నాన్నా అని అడగటంలో కనిపిస్తుంది ఆఖరికి పిల్లవాడి నోటి దగ్గర పాల పీక లాగేసి, ఈయన ఇంట్లో ఉంటే నా ఉద్యోగం ఎలాగూ పోతుంది అప్పుడయినా వాడు చావాల్సిందే అని అన్నప్పుడు, అమ్మ బొట్టు చెరిపేసినప్పుడు, తండ్రి కర్మకాండ (బతికి ఉండగానే) జరిపించినప్పుడు మొత్తం స్వార్థాన్ని పోతపోసిన పాత్ర ఇది అన్న అర్థాన్ని పూర్తిగా కాపాడటం జరిగింది కథానాయకుడా అనిపించే ప్రతికథానాయకుడిగా తీర్చి దిద్దటంలో శిల్పం అడుగడుగునా ఉంది

**సమరసింహారెడ్డి (సమరసింహారెడ్డి) :** పాత్రచిత్రణశిల్పానికి చక్కని ఉదాహరణ సమరసింహారెడ్డి పాత్ర ఈ పాత్ర రాజసంతో ఉన్న పాత్ర పూర్వకథలో రైల్వే స్టేషన్‌లో అతన్ని స్వాగతించటానికి వచ్చిన తండ్రి, సహచరుల హంగామాతో అది అర్థమవుతుంది ఎస్.పి పాత్ర చెప్పినట్లు రాయలసీమ మొత్తం అతన్ని అన్నా అని పిలవటానికి సిద్ధంగా ఉంటుంది ఒంటరిగా ప్రతికథానాయకుడి ఇంటికి వెళ్ళి అతన్ని కొడుకులిద్దరినీ చంపి, వీరరాఘవరెడ్డిని రెండు కాళ్ళు, ఒక చెయ్యి నరికి అశుద్ధం కడిగే చేతితో అన్నం తినరా అని చెబుతాడు ఇలాంటి పాత్ర ఆ తర్వాత వెళ్ళి పప్పురుబ్బవలసి వస్తుంది ప్రేక్షకుడు ఈ మార్పుని భరించలేడు అందుకే పాత్ర అసలు కథని ద్వితీయార్థంలో పూర్వకథగా చెప్పటానికి దాచుకుని ప్రథమార్థంలో చిన్నప్పుడు పారిపోయిన వాసే అతను అని నమ్మించి కథాశిల్పంతో పాత్ర ఔన్నత్యాన్ని కాపాడటం జరిగింది

వాసు అనే కుర్రాడున్నాడు అతనికి ముగ్గురు చెల్లెళ్ళున్నారు పిన్నిని ఎదిరించి ఇంట్లో నుంచి పారిపోవలసి వస్తుంది

ఆ తర్వాత కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి చిన్నప్పుడు తీసుకు వెళ్ళిన చెల్లెళ్ళతో దిగిన ఫోటోని బట్టి అతను వాసే అనుకుంటాడు ప్రేక్షకుడు అలా వాసు చెల్లెళ్ళు అనుకోవాలని సమరసింహారెడ్డి మనసుకూడా

చిత్రం మకుటం సమరసింహారెడ్డి పారిపోయినప్పుడు ఆ కుర్రవాడి పేరు వాసు తిరిగొచ్చి అతను పిలిపించుకుంటున్న పేరు అబ్బులు అతను వాసు అని తెలిసినా చెల్లెళ్ళు ఆ విషయం బయటపెట్టకుండా అలా పిలిపించుకుంటున్నాడు అని అనుకుంటారు

కానీ ప్రేక్షకుడి మనసు పీకుతూ ఉంటుంది దాన్ని ధ్రువ పరచటానికి రాయలసీమ నుంచి వచ్చిన వీరరాఘవరెడ్డి కొడుకులు సమరసింహారెడ్డి ఫోటో చూపించి వీడు కావాలి, వీడి కోసం వెతుకుతున్నాం అంటారు ఎస్.పి. అతన్ని చూసి రెండుచేతులూ జోడించి నమస్కరిస్తాడు తప్పకుండా ఆ పాత్ర సమరసింహారెడ్డే అని ప్రేక్షకుడు భావిస్తాడు అబ్బులు అని దొంగ పేరుతో పిలిపించుకుంటున్నట్లే, రాయలసీమ వెళ్ళిన వాసు సమరసింహారెడ్డిగా పిలిపించుకున్నాడా? అని అనుమానం

అందుకే ఈ పాత్ర తాలూకూ విశేషాలన్నీ నిగూఢనిధిలా ఉండి ప్రేక్షకుణ్ణి ఊరిస్తూ ఉంటాయి ఎప్పుడయితే అతను సమరసింహారెడ్డే, అంతే కాదు ఈ చెల్లెళ్ళ అన్నయ్య వాసుని చంపాడు అని తెలుస్తుందో అక్కడినుంచి ప్రేక్షకుడి మస్తిష్కం వేడెక్కుతుంది (ఆ వేడి చల్లార్చటానికే హాస్యనటులతో పైది ఆకాశం, కిందది భూదేవి అయినప్పుడు ఆడు అబ్బులు కావాలిగాని సమరసింహారెడ్డి ఎట్టా అవుతాడు అని చిత్రించి, నవ్వించటం జరిగింది)

ఈ పాత్ర శిల్పం ఇక్కడే ఉంది అతనెవరో నిలదీసినా చెల్లెళ్ళకు చెప్పడు చెబితే తను చంపిన వాసుకిచ్చిన మాట తప్పినవాడవుతాడు నిజంగానే అన్నయ్యను చంపిన హంతకుడు అని ద్వితీయార్ధం మొదట్లోనే తెలిసిపోతే చెల్లెళ్ళు మానసికంగా పూర్తిగా దూరమైపోతారు పాత్రఆశయం దెబ్బతింటుంది

ఈ సమరసింహారెడ్డి పాత్ర ఒక ఆశయంతో ప్రారంభం కాదు పగ, ప్రతీకారం అతని ఆశయాలు కావు అందుకే అతను హత్య చేసాడని తెలిసే ఎస్.పి నమస్కారం చేస్తాడు *గెలిచిన ఆనందంలో మనం ఉన్నాం, ఓడిన బాధలో వాళ్ళున్నారు .. పోనివ్వండి నాన్నా* అని క్షమా హృదయాన్ని చూపిస్తాడు రైలు దిగగానే తన వాళ్ళందర్నీ చంపాడు అని తెలిసిననాడు *వీరుడిలా వెళ్ళి నీ ఇంటికొచ్చా, నీ నట్టింటికొచ్చా* అంటూ

నరికిపారేస్తాడు అలాంటి పాత్ర, తలచుకుంటే కోట్లు ఖర్చుపెట్టగల పాత్ర, తలలు నరకగల పాత్ర, హోటల్లో పనిచేస్తూ, రాత్రి పూట టాక్సీ తోలుతూ ఎందుకు బతికింది?

యాదృచ్ఛికమే అయినా వాసు అతని చేతిలో చచ్చిపోయాడు చెల్లెళ్ళ పెళ్ళి తను కష్టపడి సంపాదించిన డబ్బుతో చెయ్యాలని అతని కోరిక ఇంతటి సమరసింహారెడ్డి ఒక కోటి రూపాయలిచ్చి వాసు చెల్లెళ్ళకు మంచి జీవితం ఇవ్వవచ్చు అలా ఇస్తే వాళ్ళ అన్న చనిపోయిన సంగతి, తనే చంపిన సంగతి చెప్పవలసి వస్తుంది కాబట్టి వాసు స్థానంలోకి తను మారిపోయాడు

వాళ్ళ అన్నయ్య స్థానం భర్తీ చెయ్యటానికి వచ్చిన తను నిజం చెబితే వాళ్ళు దూరమైపోతారు భ్రమలో అయినా వాళ్ళ అన్నయ్య బ్రతికే ఉన్నాడు అని సంతృప్తిని వాళ్ళకు మిగల్చాలి అంతేకాదు ఈ పాత్ర విషం తాగేవరకూ పూర్వకథ చెప్పకపోవటానికి కూడా, పాత్ర ఔచిత్యాన్ని కాపాడటమే కారణం నిజంగా చంపాడని చెప్పేస్తే ప్రేక్షకుడికి కూడా అతని మీద ప్రేమ తగ్గిపోతుంది అదే విషం తాగాక అయితే, చావు బతుకుల్లోకి అతను వెళ్ళే సమయంలో చిన్న గీత పక్క పెద్ద గీత అవుతుంది అంటే ప్రమాదంలో అన్నయ్య చచ్చిపోయాడు ఈ అన్నయ్య కూడా చచ్చిపోతే ఎలా అని ఆ చెల్లెళ్ళు ఎప్పుడు భావిస్తారో అప్పుడు పూర్వకథ తెలియటంతో ఈ పాత్ర మీద సానుభూతే మిగిలింది తప్ప, వ్యతిరేకత లేదు ఇది దశరథుడు శబ్దవేధి విద్యతో ముసలి దంపతుల బిడ్డ శ్రావణకుమారుణ్ణి చంపటంలాంటిదే ఇక్కడ ముసలిదంపతుల స్థానంలో చెల్లెళ్ళున్నారంతే

తను కోటీశ్వరుడయినా ఆ చెల్లెళ్ళకు అన్నతనాన్ని అందించటానికి, వాసు కోరిక నెరవేర్చటానికి కష్టపడిన డబ్బుతోనే వాళ్ళకు ఉపయోగపడటానికి ప్రయత్నించింది పాత్ర

ఆ ప్రయత్నంలో రైలుపట్టాల దగ్గర చావుకి సిద్ధపడింది అంజలి అవమానించి కొట్టేస్తుంటే భరించింది విషం తాగమని చెల్లెళ్ళు అడిగితే తాగేసింది అదే ఈపాత్రలో శిల్పం తను ప్రాణం తీసిన వాసుకోసం ప్రాణాలు ఇవ్వటానికి సిద్ధంగా ఉంది

అంతేకాదు పరాకాష్ఠలో కూడా నా చావు మీకు ఆనందాన్ని ఇస్తుంటే చంపెయ్యండిరా అని కత్తులివ్వటం పాత్ర ఔన్నత్యాన్ని చూపిస్తుంది పూర్వ కథలో గొడవలొద్దు మనమే అలా వెళదాం అని చెప్పిన పాత్రలో ఇప్పుడూ మార్పు లేదు మధ్యలో సంఘటనాపూర్వకమైన సంఘర్షణలు తప్ప, నైతిక మార్పులు లేవు

అందుకే ఇంత అద్భుతశిల్పంతో మలచబడ్డ ఈ పాత్ర ఏనాటికి ప్రేక్షకుల మనః ఫలకాల మీద ముద్ర వేస్తూనే ఉంటుంది

**వీర రాఘవరెడ్డి (సమరసింహారెడ్డి)** సమరసింహారెడ్డిలో ప్రతికథానాయకుడు అవమానాన్ని భరించలేడు *తొడ గొడితే ఆ సౌండ్‌కి చస్తావురా నువ్వు* అని కథానాయకుడు అనటాన్ని అవమానంగా భావించి కథానాయకుడి కుటుంబం మొత్తాన్ని చంపేస్తాడు కథానాయకుడు వచ్చి తన కాళ్ళూ, చెయ్యి నరికేసినా, తన కొడుకులిద్దరినీ చంపినా భయపడడు ఇతనికి ప్రాణం అంటే భయం లేదు కొడుకులు అసమర్థులయ్యారని కోడళ్ళ మెడలో తాళిబొట్లు తెంచేస్తాడు తను మళ్ళీపెళ్ళి చేసుకుని సమరసింహారెడ్డిని చంపేసే బిడ్డని కంటానంటాడు కొడుకులు అరెస్టయ్యారని విని తన కూతురు అంజలిని పంపుతాడు ఆ పిల్ల పూర్వకథ విని మారిపోతే - సమరసింహారెడ్డి కిచ్చి పెళ్ళిచేస్తాడు ఆశీర్వాదం కోసం వచ్చిన కూతుర్ని కూడా పొడిచి తాళికట్టకముందు నిన్ను చంపితే వీరరాఘవ రెడ్డి సొంతకూతుర్ని చంపుకున్నట్లు, తాళికట్టాక చంపితే సమరసింహారెడ్డి పెండ్లాన్ని చంపినట్లు అంటాడు అంతేకాదు కొడుకులు, అనుచరులు అందరూమారిపోతే మీతరంమారుతుందేమోగాని మాతరంమారదు అంటూ కుర్చీకర్ర గుండెకు పొడుచుకుని చచ్చిపోతాడు ప్రారంభం దగ్గరనుంచి పోయేవరకు ఒకేతీరు అందుకే సమరసింహారెడ్డి పాత్రకు ఎంతటి ఆదరణలభించిందో, ఈ పాత్రకూ ప్రతికథానాయకుడయినా అంతటి ఆదరణ లభించింది

**అంజలి (సమరసింహారెడ్డి)** వీరరాఘవరెడ్డి కూతురు నిజానికి ప్రతికథానాయికే, కానీ ఉత్ప్రేరక పాత్ర ఈ పాత్ర రాకపోతే సమరసింహారెడ్డి - వాసు చెల్లెళ్ళ జీవితంలో వాసన్నయ్యగానే స్థిరపడిపోయేవాడు అన్నలు తీర్చలేని పగతీర్చి తండ్రిని సంతోష పెట్టటానికి లండన్ నుంచి వచ్చిన ఈ పాత్ర ప్రతికథానాయిక స్థితిలోకి వెళ్ళిపోయి, ఎస్ పి ద్వారా విన్న పూర్వకథలో తప్పు తన వాళ్ళదేనని తెలుసుకుని ఏ సమరసింహారెడ్డిని చంపేద్దామనుకుందో ఆ సమరసింహారెడ్డికి ఇల్లాలుగా మారిపోయి, కన్నతండ్రి చేతిలో చనిపోటానికి సిద్ధపడి కథానాయిక స్థితికి పరివర్తన పొందింది ఈ పాత్ర ఫ్యాక్షన్‌ఆపాలని ప్రయత్నంచెయ్యదు కథానాయకుణ్ణి పెళ్ళిచేసుకుంటుంది దాని మూలంగా చావబోతుంది ఫ్యాక్షన్ వద్దు అని పతాకస్థాయిలో కథానాయకుడు నిర్ణయం తీసుకోటానికి ఇదే కారణమవుతుంది

**నరసింహనాయుడు (నరసింహనాయుడు)** నరసింహనాయుడు చిత్రం ఏడు దశాబ్దాల చలన చిత్ర రికార్డులన్నింటిని బద్దలు కొట్టటానికి కారణం నరసింహనాయుడి పాత్రను తీర్చిదిద్దిన తీరే

రెండుగ్రామాలమధ్య కక్షలమూలంగా నరసింహనాయుడి తండ్రి ఇంటికొక బిడ్డను

బలిదేవుడిగా ఇచ్చి గ్రామాన్ని కాపాడుకుందాం అని అడిగితే, అన్నలు భయపడితే, ఆఖరివాడయిన నరసింహనాయుడు అంగీకరించి కలంపట్టవలసిన వయసులో కర్ర పట్టాడు తర్వాత కత్తి పట్టాడు అంతవరకూ కథ చూపించి జరిగిన కథను పూర్వకథగా చెప్పే రీతినే ఈ కథకూడా అనుసరించటంవల్ల ఆతర్వాత కర్రపట్టిన నరసింహనాయుడు, కాలికి గజ్జెకట్టి నాట్యాచారుడిగా నర్తనశాలలో అర్జునుడి వలే పౌరుషాన్ని ఎదిరి సాధువుగా బిడ్డతో బతుకుతుంటాడు

అన్నా వదినలు లేకుండా పెళ్ళిచేసుకోను అని అతను పెళ్ళిపీటల మీద నుంచి లేచి వెళ్ళి, అన్నావదినల పటంతెచ్చుకుని, ఎదురుగా పెట్టుకుని పెళ్ళిచేసుకోవటంతో అతని అమాయకత్వం కాదు అతని అభిమానం బయటపడింది ఆ అన్నలే తర్వాత ఇంటికొస్తారు చదువురాని వాడిగా ఇతన్ని అనుక్షణం అవమానిస్తూ ఉంటారు అన్నింటినీ భరిస్తాడు అతనిభార్య భరించలేక అన్నల్ని తూలనాడితే భార్యనే త్యాగంచేస్తాడు పుట్టింటికి పంపేస్తాడు ఆ విషయంలో తండ్రినికూడా ఎదిరిస్తాడు ఇంతచేసినా ఆ అన్నలు భరించలేకవెళ్ళిపోతుంటే అన్నా వదినలకు తోడు వస్తానంటే విసుక్కొని వెళ్ళిపోతారు దోవలో స్టేషన్ దగ్గర వాళ్ళను శత్రువులు మట్టుపెట్టబోతే ప్రాణాలకు తెగించి క్షతగాత్రుడై వాళ్ళందర్నీ కాపాడతాడు ఇది ఆశయసిద్ధి

వాళ్ళను కాపాడటానికి వెళ్ళి భార్యను కోల్పోతాడు అక్కడ తండ్రి,ఈ ఊరు వదలి వెళ్ళిపో అంటే బిడ్డను తీసుకుని వెళ్ళిపోతాడు

ఈ పూర్వకథలో అతను ఊరికోసం తండ్రిని అవమానించిన వాణ్ణి చంపేస్తాడు అన్నల్ని తూలనాడిందని భార్యని త్యజిస్తాడు అన్నా వదినల్ని కాపాడటానికి ప్రాణాలకు తెగిస్తాడు తండ్రి చెప్పాడని ఊరు వదలి వెళ్ళిపోతాడు అంటే తనకోసం కాక, తను ఏ ప్రమాణం పసితనంలో చేసాడో ఆ ప్రమాణానికి కట్టుబడి ఉన్నాడు

చివరకు తన కొడుకు, కుప్పుస్వామినాయుడి కూతురులో అమ్మను చూసుకుంటుంటే, తండ్రి "ఇంతమందికి ఇన్నిచేసావ్ ఆ పసిబిడ్డకు తల్లిని తీసుకురాలేవా?" అంటే రుక్మిణిని శ్రీకృష్ణుడు తీసుకువెళ్ళినట్లు తీసుకువెళ్ళటానికివచ్చి ఆమెని స్వీకరిస్తాడు

ఇలాంటి పాత్రలు అరుదుగా వస్తాయి కథవల్ల పాత్రకు బలంవచ్చిందా? పాత్ర వల్ల కథకు బలంవచ్చిందా అనిఅడిగితే పాత్రవల్లే కథకు బలంవచ్చింది త్యాగాన్ని, పౌరుషాన్ని, సమపాళ్ళతో రంగరించటం అంత తేలికయిన విషయం కాదు

రాముడువేరు, అర్జునుడువేరు, ఇద్దరూ కలిస్తే నరసింహనాయుడు! అందుకే అంత ఆదరణ **కత్తులతో కాదురా కంటిచూపుతో చంపేస్తాను** అన్నమాటే అతని పాత్ర

చిత్రణ నిజంగా కంటిచూపుతోనే జయించాడు అతను కరుణించి వదిలేసినప్పుడు చూసిన చూపే కుప్పుస్వామి నాయుణ్ణి మానసికంగా చంపేసింది

అందుకే విశ్వనాధ సత్యనారాయణ - ప్రవరుని పాత్ర చిత్రణ శిల్పం గురించి రాస్తూ-

"-ఆ కంటికి కట్టినట్లు వ్రాయుట ఒక తక్కువ విషయము

మనస్సునకుద్దీపించినట్లు వ్రాయుట యెక్కువ విషయము"[21] అంటాడు

కంటికి కనిపించే దృశ్యాల నుంచి మనసునుద్దీపింపజేసే ఒకానొక తాదాత్మ్య స్థితికి తీసుకు పోవటమే సినిమాలో శిల్పం చివరివరకు ప్రవరుడు మారడు కాని కొన్నిసినిమాలలో పాత్రలు వాటి ఆశయాలను పరివర్తన చేసుకుంటాయి

**పరివర్తన** · కొన్నిపాత్రలు ముందు ఒకఆశయంతో ప్రారంభమవుతాయి కాని కొన్నికారణాల వల్ల పరివర్తన చెందుతాయి అలా చెందినప్పటికి ఆ పాత్రలఔచిత్యశిల్పాలు దెబ్బతినవు

*ఖైదీలో* సూర్యం ముందుఆశయం *కల్కక్టర్* కావాలని అతనెప్పుడూ మధుతో ప్రేమకోసం పెళ్ళికోసం ఆరాటపడలేదు అది అతని ఆశయంగా చూపబడలేదు కాని చివరకు అతను *కల్కక్టర్* కాలేదు హంతకుడు అయ్యాడు కాని ఆ చిత్రకధ, ఆ పాత్ర ప్రజామోదాన్ని పొందాయి కధాశిల్పం అతని పాత్రశిల్పాన్ని కాపాడింది అతని ఆశయం వీరభద్రయ్యనుచంపటంలా ప్రస్తుతకధలో చూపించి పూర్వకధలో అతని ఆశయం కల్కక్టరవ్వటంఅని చెప్పటం జరిగింది ప్రస్తుతానికే ప్రేక్షకుడు విలువ ఇస్తాడు కాబట్టి ప్రస్తుతం అతని కోరిక వీరభద్రయ్యను చంపటం గనుక అతని పాత్రశిల్పం దెబ్బతినలేదు

*శుభలగ్నంలో* రాధ డబ్బుంటే చాలు ఏదయినా సాధించవచ్చు అనుకుంది ఆ డబ్బు వచ్చాక భర్తకు, బిడ్డలకు ఆఖరికి సంతోషానికి దూరమయ్యింది ఆశయం మార్చుకుంది మార్చుకున్న ఆశయం ప్రేక్షకుడికి నచ్చిన ఆశయం అందుకే ఆ పాత్రశిల్పం ఎదిగింది

*బొబ్బిలిపులిలో* **మేజర్‌చక్రధర్** పాత్రకూడా ఆశయాన్ని మార్చుకున్నట్టు కనిపిస్తుంది ఆశయం ఒక్కటే గాని, చట్టపరంగా చెయ్యటం, చట్టాన్ని చేతుల్లోకి తీసుకొని చెయ్యటం అనే శిక్షాస్మృతిలో వచ్చిన మార్పు ఆశయాన్ని మార్చినట్లయ్యింది సైనికుడుగా చంపితే వీరుడు, మామూలు మనిషిగా చంపితే నేరస్తుడు తనకేమయినా ఫరవాలేదు శత్రువుని సంహరించవలసిందే దేశరక్షణే ఆశయంగా నడిచిన పాత్ర కాబట్టే రెండుదశాబ్దాల తర్వాతకూడా ఆ పాత్రను ప్రేమిస్తున్నారు

ముత్యాలముగ్గులో కాంట్రాక్టర్ పాత్ర అంతే భార్యా భర్తల్ని విడదీసి సంపాదిస్తాడు దొంగ పెళ్ళి చేయించి డబ్బు సంపాదిస్తాడు కానీ, ఒక భార్యాభర్తలని విడదీసిన పాపం తనకే కొట్టి తన కూతుర్ని అల్లుడు వదిలేసే ప్రమాదం ఏర్పడితే ఆశయంతప్పని తెలుసుకుని చెంపలు వేసుకుంటాడు పశ్చాత్తాపపడితే క్షమించటం భారతీయుల నైజమని ఘోరి మహ్మదు, పృధ్వీరాజుల కధ మనకు తెలియజేస్తుంది ఈ పాత్రకు వాడిన సంభాషణలు విశేష ప్రాచుర్యం పొందాయి సంభాషణ వైశిష్ట్యంతో పాత్ర నిలబడింది

కన్యాశుల్కంలో గిరీశంపాత్ర అంతే అందమైనవెూసం చేయటం అలవాటుచేసుకున్న గిరీశం, బుచ్చమ్మను మోసంచేయాలనుకుని, ఆశయంమార్చుకుని బుచ్చమ్మని పెళ్ళిచేసుకుంటాడు

ప్రతిధ్వనిచిత్రంలో బలగం పొట్టిసీతయ్యపాత్ర రాజకీయనాయకులలో అధికారంలో ఉన్నవాళ్ళు, ప్రతిపక్షంలోఉన్నవాళ్ళు అని రెండురకాలుంటారు అధికారంలో ఉన్నవాళ్ళు ఏంచేసినా దాన్ని విమర్శించటానికి ప్రతిపక్షం రెండు ప్రకటనలు సిద్ధం చేసుకుని ఉంటుంది ఇది సమాజానికి తెలియచెయ్యటానికి సృష్టించబడిన పాత్ర అందుకే ఆ కోణంలో ప్రయాణించి *కోర్టులో నాలాగా డబుల్ స్టేట్‌మెంట్స్ ఇచ్చే రాజకీయనాయకుల్ని చెప్పు తీసుకొని కొట్టండి ఇది నా సింగిల్ స్టేట్‌మెంట్* అని పాత్ర తన పరమార్థాన్ని పూర్తిచేసుకుంటూ ముగిసిపోతుంది

ఒక చిత్రంలో కనీసం పదిహేను, ఇరవై పాత్రల చొప్పున వేలాది పాత్రలను కధారచయితలు, చిత్రకధారచయితలు శిల్పచాతుర్యంతో తీర్చిదిద్దినతీరు అమోఘం

## సంఘటనాశిల్పం :

సంఘటన అనుకోకుండా జరుగుతుంది ప్రతికధానాయకుడు వ్యూహాత్మకంగా కదిలినప్పుడు అనుకోనిది జరుగుతుంది అయితే అది కధానాయకుడికి లేదా ఆ సంఘటనకు గురి కాబోతున్న పాత్రకు తెలియదు ప్రేక్షకులకు తెలిసిపోతుంది అప్పుడే అనుభూతో, సానుభూతో మొదలవుతుంది ఆ సంఘటనను తెరమీద సందర్భస్వభావానుకూలంగా ప్రదర్శించే ఉత్కృష్ట నిర్మాణ చాతురీవిశేషమే శిల్పమవుతుంది ఆ సందర్భం సంఘటనకు దారి తీస్తే అది సంఘటనాశిల్పం అవుతుంది

**శంకరాభరణం :** శంకరాభరణంలో తులసిజీవితంలో ఒక సంఘటన జరిగింది అది ఆమె మానభంగానికి గురి కావటం అదే సమయంలో హత్య చేయటం ఈ రెండూ నిజానికి రెండుసంఘటనలు

ఒకటి శీలాన్ని కోల్పోవటం

రెండు హంతకురాలిగా మారిపోవటం

ఇందులో శిల్పం ఏముంది?

అనేకచిత్రాలలో, ఈ మానభంగ దృశ్యాలుంటాయి నిజానికి కొన్నాళ్ళపాటయితే మానభంగం లేని సినిమా ఉండేది కాదు అన్నది నిజం ప్రత్యేకించి కొందరు నటీమణుల బొమ్మ పోస్టర్‌లో కనిపిస్తే మానభంగ దృశ్యం ( రేప్ సీన్) ఉందని చెప్పుకునేవారు

అనేకచిత్రాలలోఉన్న దృశ్యాన్ని చూపించటంలో శిల్పంఏమిటి? ఎక్కడుంది? శంకరాభరణంలో ఈ సంఘటన ఎలాఉందో పరిశీలించాలి

శంకరశాస్త్రిపటాన్ని ఎదురుగాపెట్టుకుని తులసి వీణవాయిస్తూ అంతకుముందు శంకరశాస్త్రి పాడిన పాటవింటూ, దాన్ని సాధనచేస్తూఉంటుంది ఎన్నాళ్ళగానో ఆమెమీద మనసుపెట్టుకున్న జమిందారు వస్తాడు

ఈ జమిందారు తులసికోసం కళాప్రాంగణానికి వచ్చినప్పుడు, అతను ఏకాగ్రత చెడగొడుతున్నాడని శంకరశాస్త్రి, గానంఆపేసి వెళ్ళిపోయాడు

ఇదే జమిందారుతో తొలిరాత్రి చెయ్యాలని తల్లి ప్రయత్నంచేస్తేనే పారిపోయి రైల్లో శంకరశాస్త్రి ఆశ్రయం పొందింది

శంకరశాస్త్రి దగ్గరనుంచి నిందవేసి తల్లి తీసుకువస్తున్నప్పుడు ఆమెకు తెలియదా? ఇంటికి వెళితే ఏం జరుగుతుందో? తెలిసి ఎందుకు వచ్చింది? సిద్ధపడి వచ్చిందా?

ఆ రోజు ఆమెఅలా వీణవాయించుకుంటూ సంగీత సముద్రంలో ఓలలాడుతోంది ఎంత కర్మసిద్ధాంతాన్ని నమ్మివచ్చినా తను పారిపోయిందిగనుక ఈసారి తల్లి అలాంటి పిచ్చిపనులు చెయ్యకపోవచ్చునన్న ఆశో, నమ్మకమో ఆమెహృదయంలో ఉండిఉండవచ్చు

ఆమె రసావేశానికి భంగంకలిగిస్తూ జమిందారు ఆమె భుజంమీద చెయ్యివేసాడు ఆమె అణువణువు సంగీతరసభరితం అతని అణువణువు కామప్రకోపితం అతని ఉద్దేశాన్ని అర్థంచేసుకొని ఎదురుతిరిగింది బలవంతంగా లోపలకుతీసుకెళ్ళి తలుపువేశాడు

సామాన్యంగా ఆ రోజులలో మానభంగదృశ్యం ప్రేక్షకుడికి శృంగారరసాన్ని అందించిన సందర్భాలు అనేకం నిజానికి ఉత్పత్తి అవ్వవలసింది కరుణరసం దీన్ని వ్యాపారానికి ఉపయోగించుకునేవారు

కాని విశ్వనాథ్ కళాతపస్వి తపస్సుకి భంగంచేసే శృంగార ప్రక్రియను

కరుణరసాత్మకంగానే తీస్తాడు తియ్యాలి అందుకే ఆమెజీవితం తెగటడిపోతుంది అనటానికి గుర్తుగా ఊదుకడ్డీలు కాలిపోతున్న షాట్ వేసాడు

ఆ తర్వాత శంకరశాస్త్రి పాడినపాట, గ్రామ్‌ఫోన్‌తో ఆగిపోయి, రికార్డు మీద నీడిల్ వెనక్కు ముందుకీ జరుగుతున్న షాటు తలుపులు తెరుచుకున్నాయి అనుభవించిన ఆనందంతో జమిందారు బయటకువచ్చాడు మంచంమీద శీలంపోగొట్టుకున్న చింతతో తులసి ఆమె వెక్కి-వెక్కి ఏడవటం లేదు భయంకరంగా తిట్టలేదు మౌనంగాకూర్చుంది అందుకు సిద్ధపడి వచ్చిందా? అన్న అనుమానం ప్రేక్షకుడికి కలగవచ్చు)

ఇన్నాళ్ళు ఊరించావ్, ఇకనువ్వు ఏమయితే నాకేంటి అన్నట్టు మాట్లాడాడు అతనికోరిక తీరిపోయింది జీవితాంతంఅక్కర్లేదు తులసి అతనికి కొత్తరుచికావాలి ఆరగించేసాడు ఆ ఆరగింపులో ఇంతకుముందే దక్కవలసిన ఈ అనుభవాన్ని దూరంచేసిన శంకరశాస్త్రి పటం కనిపించింది **సంగీతంతప్ప సరసంతెలియని వీడి దగ్గరకుపో** అని పటాన్ని ఒక్క తన్నుతన్నాడు పటం వెళ్ళి కిందపడి భళ్ళున పగిలింది

చూసింది తులసి లేచింది గాజుముక్క తీసుకుంది సంఘటన జరగగానే సంఘర్షణ జరిగి తీరుతుంది గదా మానభంగం అన్న సంఘటన జరిగినప్పుడు మౌనంగాఉందేగాని మనసులో ఘర్షణ పడుతూనే ఉంటుంది గదా! ఒక పవిత్రమైన మూర్తి నీడలో ప్రశాంతంగా బతుకుదామనుకున్న తులసి చెరవబడటాన్ని అంత తేలికగా తీసుకోలేదు ఏడవలేకపోయినా మనసు కుమిలింది ఆ కమిలిన గుండె మీద సుత్తి దెబ్బలాగా పటాన్ని బద్దలు కొట్టాడు

ఏం చేద్దాం అనుకుంటున్న తులసికి ఇది చెయ్యి అని మనసు ఆదేశం అందించింది అంతే వెళ్ళి వెనకపాటుగా అతన్ని పొడిచి చంపింది ఇంతటితో ఈ ఆవేశం పూర్తి కాలేదు

శంకరశాస్త్రి దగ్గరకు బయలుదేరింది శంకరశాస్త్రిని చూపించిన తీరు హృద్యంగా వుంది కుమార్తెను గుండెల మీద పడుకోబెట్టుకుని ఉంటాడు అంటే తులసి కూడా కుమార్తె లాంటిదే అలాంటి ఆదరణే ఇస్తాడు అన్న సూచన వచ్చింది ఆ రక్తపు చేతులతోనే వచ్చింది రక్తాన్ని ఆయన పాదాలకు రాసింది ఆయన అయోమయంగా చూడలేదు అర్థవంతంగా చూసాడు ఆ రోజు రైల్లో కలిసినప్పుడు తల్లి తనను ఏం చెయ్యబోయిందో చెప్పే ఉంటుందిగా, అర్థం చేసుకున్నాడు

మరి ఈ సంఘటనలో మానభంగాన్ని ప్రతీకాత్మకంగా చూపించిన శిల్పం, కుమార్తెలాగా ఆదరిస్తాడనిపించాలి అని చూపించిన శిల్పం, ఎవడయితే పాదంతో శంకరశాస్త్రి పటాన్ని తన్నాడో అతని రక్తంతో ఆయన పాదాలకు పారాణి రాసిన శిల్పం ఒక ఎత్తయితే, తనకు మానభంగం జరిగినందుకు గాక, తన దైవాన్ని అవమానించినందుకు జమిందారుని చంపటమే అన్నింటినీ మించిన శిల్పం

ఒక సంఘటన సంఘర్షణకు తద్వారా అనేక దృశ్యాలకు ఆ విధంగా ఒక సన్నివేశ సృష్టికి ఆధారభూతం కావాలన్న లక్షణాన్ని ఈ సంఘటన చక్కగా పుణికి పుచ్చుకుంది

**బొబ్బిలిపులి** బొబ్బిలిపులిలో **మేజర్‌చక్రధర్** పోలీసుల్నించి తప్పించుకుని శ్మశానానికి పారిపోతాడు కాటికాపరి వద్ద ఆశ్రయం పొందుతాడు

కాస్సేపటికి ఒక స్త్రీశవం వస్తుంది అది అతనిభార్యదే!

ఆ నిజంవిని కాటికాపరి నీ భార్యను నువ్వే తగలబెట్టుకో అంటే **మేజర్‌చక్రధర్** కాటి కాపరిగా వెళ్ళి, భార్యకు దహనసంస్కారం చేసే సంఘటన హృదయాన్ని కదిలిస్తుంది

అంతకుముందు ఆమె ఆశ్రయంలోనే ఉంటాడు తప్పించుకుని వచ్చాక ఆమెను చంపారని తెలుసుకుంటాడు కాటికాపరి అవతారం ఎత్తుతాడు

పోలీసులు వెళ్ళిపోయిన తర్వాత వచ్చిన రౌడీలను చితక బాదగలిగిన చక్రధర్ పోలీసుల్నీ చితకబాదగలడు కాని ఈ సంఘటనలో అతను కాటికాపరి అవతారం ఎత్తటంలో - హరిశ్చంద్రుడు, చంద్రమతి జ్ఞాపకం వస్తారు అక్కడ కుమారుడి శవం, ఇక్కడ భార్య శవం

కాటికాపరి తలకొరివి పెట్టే అర్హతకలవాడు అందుకే ఆ ఆహార్యం! అంతేకాదు భర్త, భార్యకు చితిపెట్టటం హైందవధర్మం

ఈ సంఘటన తరువాతి కథలో ప్రసాద్‌ని, తండ్రిని కూడా చంపుతున్నాడు సామాన్యంగా ఒక కథానాయకుడు ప్రతీకారపద్ధతుల్లో చంపుకుంటూ వెళ్ళేటప్పుడు, ఒక్కొక్కసారి ప్రధాన పాత్ర మీద ప్రేక్షకుడికి ఏవగింపు కలిగే ప్రమాదం ఉంది ఎందుకంటే అంతకుముందే చాలా మందిని చక్రధర్ చంపాడు ఇంకా కొంతమందిని చంపబోతున్నాడు రెండింటికీ మధ్య కథానాయకుడు గొప్ప కష్టాన్ని అనుభవిస్తే, పగ పచ్చిగా ఉంటుంది మళ్ళీ ప్రేక్షకుడికి కథానాయకుడి మీద సానుభూతి ఏర్పడుతుంది ఆ సానుభూతిని సాధించటానికి, కన్నతండ్రినే చంపబోతున్న వైనాన్ని జీర్ణం చేసుకోటానికి ఈ సంఘటనాసృష్టి అనాధశవంలా భార్యశవం శ్మశానవాటికకు వస్తే కాటి కాపరిలా ఆమెకు దహనసంస్కారం చెయ్యాల్సిరావటం కడుపు తరుక్కుపోయే సంఘటన

**మహాకవి కాళిదాసు** మహాకవి కాళిదాసు - అవంతీరాజు తన కుమారుడికి, కూతుర్ని ఇవ్వనన్నాడన్న కోపంతో మంత్రి ఒక వెర్రికాలుణ్ణి తెచ్చి మోసం చేసి పెళ్ళి చేస్తే, ఆ నిజం తెలుసుకున్న రాజకుమారి స్పృహతప్పి పడిపోతే, వెర్రికాలుడు కాళిదాసుగా మారి గతంమరిచి వెళ్ళిపోతే, భార్యా భర్తలిరువురూ మరలా ఎలా కలిసారు? అన్నదే కథ

ఇందులో అద్భుతమైన సంఘటన కాళిదాసుకి పెళ్ళయిన రాత్రి జరిగిన సంఘటన ఆ సంఘటనను కథ, మాటల రచయిత పింగళి నాగేంద్రరావు, దర్శకుడు కమలాకర కామేశ్వరరావు ఎలా తీర్చిదిద్దారో పరిశీలించాలి

ఒక అమాయకుడు తను నేర్చుకున్న 'త్రిపీడాస్తు' అన్న మాటతో మహారాజు మనసు గెలిచాడు అంతకుముందు ఏ నిమిషానయినా అతను పండితుడు కాదని వెర్రికాలుడు అని తెలిసిపోతే అతనికీ, మంత్రికీ, పండితుడికీ శిక్ష పడుతుంది అది మరణశిక్ష కావచ్చు ఎంత ఉత్సుకత ఉన్నా జ్యోతిష్యుడు కాలుణ్ణి చూసినప్పుడు ఇతను మహారాజు పుత్రికను పెండ్లాడతాడు అని చెప్పాడు కాబట్టి, అతని వాక్కు నిజమవుతుందన్న నమ్మకంఉందిగనుక ప్రేక్షకుడు కంగారుపడడు

కాని ఎప్పుడయితే పెళ్ళిజరిగి శోభనంగదిలో కలుస్తున్నారో అప్పుడే కుతూహలం మొదలవుతుంది ఇప్పుడు ఏదో ఒకటి జరిగి తీరుతుంది అని తెలుసు ఎందుకంటే ఇప్పుడతనికి ఎవరూ సాయం లేరు ఒంటరిగా భార్యతో ఉన్నాడు ఆమె విద్యాధికురాలు ఒక్క తప్పు మాట మాట్లాడినా చాలు పట్టేస్తుంది

అందుకే ఈ సంఘటన ఇలా జరుగుతుంది అని ఊహించకపోయినా, ఇక్కడ ఏదో జరిగి తీరుతుంది అన్న గట్టినమ్మకంతో మాత్రం ప్రేక్షకుడు ఉంటాడు

దృశ్యం మొదలయిన దగ్గరనుంచి ఆ ఉత్సుకతను ప్రేరేపించారు రచయిత, దర్శకుడు భార్యను ఆట పట్టించటానికి మంచం మీద దూకాడు పిచ్చివాడని కనిపెట్టేస్తుందేమో అనుకుంటారు ప్రేక్షకులు *మీ మహాగ్రంథాన్ని చూడాలని ఉంది* అంటుంది అందులో గొంగళి ఉంది అని అంతకు ముందే ప్రేక్షకుడికి తెలియజేసారు ఇప్పుడు బయటపడుతుందేమోనన్న శంక ఊడదీసి చూసింది *మన ఇంటి దగ్గర చలి ఎక్కువలే ఇది బాగా ఉపయోగపడుతుంది* అంటే అయోమయంలో పడింది *మేకల్ని కాసుకుందాం, ఇక్కడ నాకు నచ్చలా* అంటే ముందు శంకించి, తర్వాత తేరుకుని నన్ను పరీక్షిస్తున్నారు అంది

ఆమెకూ జోతిష్యుడు చెప్పాడు - గొప్పకథకు కథానాయికవు అవుతావని

అభిజ్ఞానశాకుంతలంలో శకుంతల ఈవిడే మేఘసందేశాన్ని అందుకునే ప్రియురాలు ఈమే కుమారసంభవంలో ఉమకూడా ఈమేఅయ్యింది మరి భగవంతుడన్నా, జ్యోతిష్యం అన్నా అంత నమ్మకంఉందిగనుకే అంతతేలికగా అనుమానించదు ఇంకా తనను పరీక్షిస్తున్నాడనే అనుకుంటోంది

ఆఖరికి గొంగళి ఎప్పుడు చూసిందో అప్పుడు మొదటి సారి అనుమానించింది **నీకు ఇష్టంగా ఉన్నట్లు లేదు. నేను వెళ్ళిపోతాను** అన్నాడు ఆ తర్వాత జరగబోయే సంఘటనకు ముందే ఎప్పుడన్నా చల్లగా జారుకోవాలంటే మార్గాలున్నాయా అంటే మీరు అడగక **పోయినా చెప్పాలి** అని ఒక చిత్రపటం వెనుక నుంచి అమ్మవారి ఆలయానికి దోవచూపించి **అటునుంచి ఎక్కడికయినా వెళ్ళిపోవచ్చు** అని చెప్పేసింది

**మంత్రి నీతో పెళ్ళి చేయిస్తానంటే అమ్మోరికి కొబ్బరి కాయలు కొట్టాను** అని నిజంచెప్పి వెళ్ళబోగా, **స్వామీ నన్ను వదిలి వెళ్ళవద్దు** అని కాళ్ళమీదపడిన ఆమె, అమ్మవారిదగ్గరకు పరుగెత్తింది

లయితే అక్కడికివెళ్లి ఎందుకిలాఅన్యాయంచేసావు అని అమ్మవారిని నిలదియ్య లేదు నా భర్తనువిద్యావంతుణ్ణిచెయ్యి, నీకు ఏదీ అసాధ్యంకాదు అని ఆక్రోశిస్తూ స్పృహతప్పి పడిపోయింది

ఇప్పుడు కంగారుపడటం కాలుడివంతు అయ్యింది తనుతప్పుచేసానన్న భావం మొదలయ్యింది అందుకే అమ్మవారిని నిలదీయాలనుకున్నాడు పల్లెటూర్లో పంతులు చెప్పినట్టు ఇప్పుడు గుడిలో అమ్మవారు ఉండిఉండరు అని నమ్మి గర్భగుడిలోకి వెళ్ళి తలుపు మూసాడు నాకు విద్య నేర్పితేనే తలుపు తెరుస్తాను అని బేరం పెడతాను అనుకున్నాడు

**ఐ అమ్మోరు నీకు మొక్కను, ఐ అమ్మోరు నాకు విద్యివ్వు** అంటూ పదే పదే పలకసాగాడు

మరా మరా మరా అంటూ రామనామ జపం చేసిన వాల్మీకి లాగా, ఐఅమ్మోరు, అమ్మోరు నుంచి, ఐం అంటూ మహాదేవి బీజాక్షరాలలో ఒకటిగామారి ఆ అక్షరాన్ని జపించటం మొదలు పెట్టాడు ఇది రచయిత చమత్కారమే

, అమ్మవారు కాసేపు ఆ అమాయకుడితో ఆడుకుంది లోపల నుంచి బయటకు వెళ్ళింది కాలుణ్ణి పిలిచింది చూసి సంతోషించాడు తనకి అవకాశం దొరికిందనుకొని సంతోషించాడు తనకి విద్య నేర్పితేనే తలుపు తీస్తానన్నాడు

అమ్మకు పసిపిల్లాడి మంకుపట్టు నచ్చినట్టు అమ్మవారికి అతని మొండితనం నచ్చింది ఇంకా ఉడికించాలనుకుంది తలుపులు తెరుచుకుని వచ్చేసింది అంత

అమాయకుడూ ఆమె శక్తిని గమనించాడు గర్భగుడి నుంచి బయటకు వచ్చాడు వివరంగా చెప్పు, అంటే భార్యను అడిగాడు కానీ ఆమె ఇంకా స్పృహలేనిస్థితిలోనే ఉంది అదే చెప్పాడు నీకు ఏం కావాలో అడుగు అంటే తనకు విద్య రాకపోతే భార్య చనిపోతుందని, భార్య వచ్చిపోతే తనూ బతకలేనని గుడి గుమ్మానికేసి తల బాదుకోసాగాడు అది తట్టుకోలేక అమ్మవారు **మళ్ళీ నీకేం కావాలో స్పష్టంగా అడుగు అంటే ఉన్న తెలివి పోయి కొత్త తెలివి రావాలి** అన్నాడు తథాస్తు అంది

అంతే **మాణిక్య వీణాం ఉపలాలయంతీమ్** అంటూ అమోఘమైన ఛందోబద్ధమైన కవిత్వం చెప్పి, స్మృతిని కోల్పోయి భార్యను వదిలి వెళ్ళిపోయాడు

నిజానికి మంత్రిఆశయం ఒక అమాయకుడికిచ్చి పెళ్ళి వేయాలని అతని ఆశయం గెలిచి ఓడిపోయింది కాళుడి ఆశయం మహారాజకుమార్తెను పెళ్ళిచేసుకోవాలి అదీ జరిగిపోయింది అందుకే ఒక మహాకవి కథనుగురించిన కుతూహలాన్ని పక్కకుపెట్టి, ఈ భార్యా భర్తలు మళ్ళీ కలుస్తారా లేదా అన్న కొత్త ఆలోచనను ప్రేక్షకుడి మస్తిష్కానికి పంపి, చివరికంటా ఆ కుతూహలాన్ని సజీవంగా నిలిపి, తుదికంటూ ఆ శంకను అలాగే నిలిపి, పతాకస్థాయిలో కూడా అఖరిక్షణాల్లో ముడి విప్పారు

ఒకసంఘటన, సంఘర్షణకు తద్వారా దృశ్యాలకు, దానినుంచి సన్నివేశనిర్మాణానికి ఉపయోగపడుతుంది గదా కాని ఈ సంఘటన చిత్రకథమొత్తానికి ఆలంబనగా నిలబడింది ఈ శిల్పాన్ని పింగళి నాగేంద్రరావు, కమలాకర కామేశ్వరరావు హృద్యంగా మలిచారు

కేవలం కవికథ అయితే ప్రేక్షకులందరికీ నచ్చే అంశం కాదు అందుకే దానిని సార్వజనీనమైన భార్యాభర్తల అనుబంధానికి దర్పణంగా నిలబెట్టి విజయం సాధించారు

**పాతాళ భైరవి** పాతాళ భైరవిలో తోటరాముడు రాకుమారికోసం కోటలోకి వచ్చి చిక్కి ఓడిపోవటం సంఘటన దీనికి బీజం తోటలోకి వచ్చిన రాకుమారికి సర్పదర్శనం అవ్వటం దీనిమూలంగా రాజుగారు జ్యోతిష్యులను పిలిచి అమ్మాయి జాతకం చూపిస్తే వాళ్ళు గ్రహదోషాల గురించి మాట్లాడగానే ఈ చిత్రంలో ప్రతికథానాయకుడయిన భేతాళమాంత్రికుడు పరిచయం అవుతాడు అతను వామహస్తాన్ని నరుక్కుని పాతాళభైరవిని సంపాదించటానికి ఒకస్వచ్ఛమైన యువకుణ్ణి బలిఇవ్వాలని తెలుసుకుంటాడు దుర్భిణిలో చూస్తే తోటరాముడు కోటప్రాకారం దాటుతూ కనిపించాడు అక్కడే సంజీవనితో చెయ్యి మళ్ళీ అతికించుకుంటాడు

ఇన్ని క్షుద్రవిద్యలు తెలిసిన ఒక మాంత్రికుడి దృష్టిలో తోటరాముడు పడ్డాడు ఆ తోటరాముడు ఈ మాంత్రికుడితో చెయ్యి కలపాలంటే అతనికొక అవసరం కావాలి ఆ అవసరం అతను రాజుకి దొరికిపోవటం మూలంగా ఏర్పడింది ఎందుకొచ్చావ్ అంతఃపురంలోకి అంటే నిజం చెప్పమన్నారా? అబద్ధం చెప్పమన్నారా? అని అడిగితే రాజుగారు చెంపలు వాయించాడు వీణ్ణి చెరసాలలోపెట్టి రేపు ఉరితియ్యండి అన్నాడు

రాజాజ్ఞకి తిరుగులేదు ప్రేక్షకుడికి గొంతులోకి వచ్చింది గుండెకాయ కాని కథానాయకుడు గదా! నమ్మకం! రెండోది అంతకు ముందే రాకుమార్తెతో నిన్ను ప్రేమిస్తున్నాను, అని తోట రాముడు, బలవంతంగానయిన ఆమె మనసులో ఇష్టాన్ని బయటపెట్టించాడు అదొక ధైర్యం ఆమె కాపాడుతుందేమోనని నిజంగానే చెరసాలకు వచ్చి పారిపొమ్మంది అవతల రాజు తన కూతుర్ని ఎవరో మాంత్రికుడులాంటివాడు చెరపడుతున్నట్లుగా కలగన్నాడు

నిజానికి మాంత్రికుడు బయలుదేరింది తోటరాముడి కోసం ఇందుమతి కోసం కాదు కానీ రాజు ఇందుమతిని అతను బలాత్కరించి తీసుకుపోతున్నట్లు కలగన్నాడు

కథానాయకుడి మీద ఉన్న విశ్వాసం ప్రేక్షకుడికి కథానాయిక మీద ఉండదు- అంటే తనను తాను కాపాడుకోవటంలో! ప్రారంభంలో తోటరాముడు రాజకుమారిని చూసినప్పుడు, ప్రాణం పోతేనేమిటి ఒకసారి రాజకుమారి పక్కన నిలబడితే చాలు అని అనిపించారు ఇది భావి సూచిక

రాకుమారి వెళ్ళమంటే రాజాజ్ఞను ధిక్కరించి వెళ్ళమంటావా అన్నాడు నిన్ను వదిలి వెళ్ళలేను అన్నాడు ఈ మాటలు రాజకుమారితో పాటు మహారాజు విన్నాడు అందులో కూతురి మీదప్రేమ అతనినిజాయితీ, రెండూ నచ్చాయి అందుకే **రాకుమారి అంటే ఏమనుకున్నావ్? అంతరం చూసుకోవద్దా?** అని ఆగ్రహించి, స్థాయి పెంచుకుని వస్తే కూతుర్ని ఇస్తానని చెప్పాడు

ఇదే తోటరాముడు మాంత్రికుణ్ణి కలవటానికి అతన్ని నమ్మి వెంటవెళ్ళి అతన్నిచంపి పాతాళభైరవిని సాధించటానికి కారణమయ్యింది

అంటే ఈ సంఘటన ప్రేయసీప్రియుల సంఘర్షణకు దారితీసింది ఎలాగయినా రాకుమారిని పొందాలని తోటరాముడు మాంత్రికుడి వెంట వెళ్ళాడు అతను మాయలవాడని తెలుసు అంతకు ముందు అతని కనికట్టువిద్య చూసాడు అయినా వెళ్ళాడు అందుకే నేపథ్యంలో ప్రేమకోసమై వలలో పడెనే అయ్యో పాపం పసివాడు అని వినిపిస్తుంది

అతను పసివాడు కాదు ప్రాయంలో ఉన్నాడు ప్రేమలో కూడా పసివాడు కాదు కోటలోకి దూకే సాహసం చేసాడు మరెందులో పసివాడు! ప్రేమకోసం చావుని వెతుక్కుంటూ (మాంత్రికుడు బలి ఇస్తాడని ప్రేక్షకుడికి ముందే తెలుసు) వెళ్లాడు ప్రేమకోసం పసివాడు!

అందుకే ఈ సంఘటనను వీర, కరుణ, అద్భుత, భయానక రసాలను సమంగా పోషించి రక్తి కట్టించారు

## సంఘర్షణ శిల్పం :

> *"Conflict is the stuff of drama, without it, there is no story, no play"*[22]

సంఘటనమూలంగా ఉత్పత్తిఅయ్యేది సంఘర్షణ ఒక సంఘటన జరిగాక సంఘర్షణ జరగకపోతే ఆ సంఘటన మన్నుతిన్నపాములాంటిది లాభం ఏముంది నాన్సీస్మిత్ చెప్పినట్లు ఈ సంఘర్షణ నాటకీయతకు ప్రాణం అది లేకపోతే కథ లేదు నాటకమూ లేదు

ఈ సంఘర్షణ సంభాషణపరంగా ఉండవచ్చు మౌనంగా భరించవచ్చు మౌనంగా ఎదిరించవచ్చు కొత్త ఎత్తుగడలతో ఉండవచ్చు

మల్లీశ్వరిలో పల్లకీ వచ్చినప్పుడు, ఇంతకు ముందు పరిశీలించినట్లు, సంఘర్షణ మౌనంగా జరిగింది

రాచరికాన్ని ఎదిరించే ధైర్యం మల్లీశ్వరికి లేదు వాళ్ళ తండ్రికి లేదు తల్లికి లేదు మామకు లేదు పైగా పల్లకీ రావటం అమ్మకీ, మామకీ ఆనందాన్ని కలిగించిన విషయం గుడిపూజారి దుఃఖించాడు ఎదిరించలేదు అంత కరుణరసమయంగా సాగిపోవటానికి బి ఎన్ రెడ్డి ఈ శిల్పాన్ని ప్రదర్శించాడు

మౌనపోరాటంలో భర్త చేసిన అన్యాయాన్ని ఎదిరించటానికి కథానాయిక మౌనపోరాటం చేసింది పోలీస్ స్టేషన్‌లో ఆమెను 'లం ' అంటే కులట అని అభివర్ణిస్తాడు కథానాయకుడు అంతే కాదు ఆమెకు పుట్టే వాడు 'లం కొడుకు' అంటాడు (ఆ పదాలు నిజానికి సినిమా రచనలో వాడకూడదు అయినా ఆ పదాల వాడుకే ఆమె మౌనపోరాటానికి కారణం అయ్యింది కనుక సెన్సార్ వారు యథాతథంగా వదిలి పెట్టారు) ఒక ఉత్తమ ఇల్లాలికి ఏం జరుగుతుంది? అయితే గుండె ఆగిపోవాలి లేదా గొంతుపడిపోవాలి అదే జరిగింది ఆమె మాట్లాడటం మానేసింది నిమిషం రెండు నిమిషాలు కాదు

అక్కడి నుంచి చిత్రం పతాక స్థాయికి చేరే వరకూ మౌనంగా ఉంది చివరకు అతను ఆమెను భార్యగా స్వీకరించిన తరువాత మాట్లాడుతుంది అంటే రచయిత, దర్శకుడు కలసి చేసిన శిల్పచాతుర్యం ఇది తనను కులట అన్ననోటితో భార్య అని అతను అంగీకరించేవరకు ఆమెమాట్లాడగూడదు సంతకాలుఅయ్యాక, బిడ్డను అందుకున్నాక మాట్లాడింది అదీ కారు ఎక్కే ముందు సంఘర్షణ పూర్తయ్యేవరకు ఆమె మౌనంగా ఉండాలను కోవటమే శిల్పం

ఈ చిత్రం విడుదలయ్యాకచాలామంది మోసపోయిన ఆడపిల్లలు, ఉరితాటికో, డబ్బా కిరసనాయిలుకో ఒక అగ్గిపుల్లకో బలికాకుండా మౌనపోరాటాలు చేసారు ఏ పిల్ల ఎదురుతిరిగితే ఆ అమ్మాయి పేరుతో **మౌనపోరాటం** అని పత్రికలు మకుటాలుపెట్టి వార్తలురాసాయంటే, ఈ శిల్పం యువమహిళాలోకం మీద ఎంతప్రభావం చూపించిందో అర్థంచేసుకోవచ్చు

*సర్పయాగం*లో కథానాయకుడు ప్రాణాలుపోసే చేతులతో ప్రాణాలు తియ్యవలసివచ్చినందుకు సంఘర్షణ అనుభవించటం అభినయపూర్వకంగా చూపబడింది

*బొబ్బిలిపులి*లో సంఘర్షణ పోలీసు ఆఫీసరుకీ, చక్రధర్‌కీ మధ్య సంభాషణ పరంగా జరిగింది

అనార్కలిలో, అనార్కలిని ప్రేమించినవాడు ఈ సభలో ఉంటే ధైర్యంగా ముందుకు రావాలి అన్నప్పుడు సలీంరాడు తన మందిరానికి వెళ్లి అనార్కలి అనుభవించిన సంఘర్షణ అద్భుతం ఆమె సిపాయి అనుకున్నవాడు ఇప్పుడు యువరాజు అని తెలిసింది తనకు దక్కడు రాజు అవకాశం ఇచ్చినా అతను రాలేదు అదీ బాధ ఎవరితోనూ పంచుకోలేని ఆవేదన తర్వాత సలీమ్ వస్తాడు సంఘర్షణ సంవాదరూపంలో జరిగాక ఆవేశం అణగారిపోయి, ఆవేదనతరిగిపోయి హాయిగా హత్తుకుపోతారు

## సన్నివేశకల్పనాశిల్పం :

ఒకేఅంశం లేదా ఊహ (Idea) మీదనడిచే కొన్నిదృశ్యాలసమూహం సన్నివేశం అవుతుంది అని, ఇంతకుముందు నిర్వచించటం జరిగింది అయితే వ్యర్థ సన్నివేశాల కలయిక ఉత్తమ సన్నివేశంకానేరదు ఆ సన్నివేశానికి ఒక అర్థమో పరమార్థమో, ఆశయసిద్ధి వైపుకి తీసుకుపోవటమో, ఆశయభంగానికి దారితియ్యటమోజరిగితే,

ఆ సన్నివేశకల్పన మనోహరమైన శిల్పార్ధత పొందుతుంది ఇది కొన్నిచిత్రాలలో ఎలాఉందో పరిశీలించాలి

**అసెంబ్లీరౌడి .** ఈ చిత్రంలో శివాజీ కథానాయకుడు ఆతనెపుడూ జీవితంలో ఓటు వెయ్యలేదు రాజకీయం అంటే అంత అసహ్యం పదోతరగతికి పాఠాలు చెప్పే మాష్టారు **ఎమ్.ఎల్ ఏ**గారి ఆగ్రహానికిగురై ఒకటో తరగతి పిల్లలకు పాఠం చెప్పేటట్టుగా ఉద్యోగంలో వెనక్కు పంపబడి వచ్చిన నిజాయితీ పరుడైన పంతులుగారు తల్లి మహాలక్ష్మి సామాన్యమధ్యతరగతి మహిళకు ప్రతీక

ఆ ఊళ్ళో భాషా అనే ప్రతికథనాయకుడున్నాడు అతను చెముళ్ళపాలెంలో రౌడీ రాజ్యం చేస్తూ ఉంటాడు అతని అన్యాయాలకు విరుద్ధంగా ఒకచిన్నపిల్ల పిటీషన్ పెడితే **ఎంక్వయిరీ** కోసం వచ్చిన **ఆఫీసర్ని** భాషా మనుషులు వెంటపడి తరుముకుంటూవస్తే అతను శివాజీఇంట్లో దూరతాడు అతన్ని ఎంపే క్రమంలో శివాజీతల్లినికూడా గాయపరుస్తారు సహజంగానే ఆవేశపరుడైన శివాజీ వాళ్ళమీద తిరగబడ్డాడు ఆ క్రమంలో ఒక రౌడీ శివాజీని చంపబోయి శివాజీ తప్పుకోగానే ఆ కత్తి ఇంకో రౌడీ కడుపులో దిగబడి అతను చచ్చిపోయాడు శివాజీని పోలీసులు అరెస్ట్ చేస్తారు ఇది అనుకోని సంఘటన

ఈ సంఘటనలోంచి సంఘర్షణ ఎలా పుట్టి అది సన్నివేశ కల్పనగా మారిందో అందులో శిల్పమేమిటో ఇప్పుడు గమనించవలసి ఉంది

నిజానికి హత్య కేసులో ఇరుక్కున్న శివాజీ యావజ్జీవితశిక్షకో, మరణశిక్షకో గురి కావలసి ఉంది ఈ సంఘటన మూలంగా అతను **ఎమ్.ఎల్ ఏ** అయ్యాడు ఆ పర్యవసానం ఎలా సంభవించింది?

నిజంగా శివాజీ హత్య చెయ్యలేదు కాని భాషా మనుషులు అతనే హత్య చేసాడని **కోర్టులో** చెప్పారు తల్లిదండ్రులు అల్లాడిపోయారు చాలా తక్కువ శిక్షతో బయిట పడతాడనుకున్న కొడుకు మరణశిక్షకు గురయ్యే పరిస్థితిరాగానే ఆ పాత్రలు సంఘర్షణకు గురయ్యాయి మౌనంగా రోదించలేదు భాషా ఇంటికివెళ్ళి తిరగబడే ధైర్యం ఆ పాత్రలకు లేదు అందుకే ఇంటింటికీ తిరిగి మా కొడుకునిర్దోషి అని సాక్ష్యంచెప్పమన్నారు ఆ అడగటంకూడా ***భవతి భిక్షాం*** దేహి అని చెంగుచాచి తల్లి, పైపంచె పట్టి తండ్రి యాచించారు ఇదొక శిల్పం మాష్టారి స్థానం నుంచి ఆ పాత్ర భిక్షమెత్తి, అదీ ధర్మాన్ని ధర్మంచెయ్యమని, న్యాయాన్ని భిక్షవేయమని అడగటం శిల్పం ఇది తమిళమాతృకలో లేదు తెలుగులో రచయితలు సృష్టించారు దర్శకుడు అనుభూతి తీసుకువచ్చాడు

అయినా వారి ఆశ అడియాస అయ్యింది కోర్టులో భయపడి అందరూ శివాజీకి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పారు జడ్జితీర్పుని వేసవిసెలవుల తర్వాతకు వాయిదావేసాడు

ఇప్పుడు లాయర్ సలహాతో గ్రామప్రజల్ని రహస్యంగాకలుసుకుని రాబోయేఎన్నికల్లో తన కుమారుణ్ణి నిలబెడుతున్నాడు కనీసం సాక్ష్యం చెప్పలేకపోయినా, ఓటుతోపాటు శివాజీ నిర్దోషి అనేకాగితంకూడా వెయ్యమని అడుగుతాడు తండ్రి

శివాజీకి తండ్రి ఎన్నికలగురించి చెబితే నమ్మబుద్ధికాలేదు ఒకప్పుడు తనతండ్రి ఓటు వెయ్యటానికే ఇష్టపడలేదు అని అతనికితెలుసు అయినా నిలబడ్డాడు

భాషా, ఎవరు ఓటువెయ్యటానికి వచ్చినా చంపేస్తానని బెదిరించాడు అప్పటికే శివాజీ తండ్రి గాయపడి హాస్పటల్లో ఉన్నాడు అనుక్షణం ఉత్కంఠరే ఒక ముసలివాడు వచ్చాడు ఓటెయ్యటానికి వీడొక్కడు వెళ్ళి ఓటు వేస్తే ఏమవుతుందిలే అని వదిలిపెట్టారు అదే వాళ్ళు చేసిన తప్పు చెరువుగట్టుకి కన్నం పడినట్లయ్యింది ముసలివాడు రెచ్చగొట్టటంతో అందరూ వచ్చి ఓటు వేసారు శివాజీ 35 వేల మెజారిటీతో గెలిచాడు

ఈ సన్నివేశంలో 'అనూహ్యత' అనే శిల్పం అనుక్షణం నడిచింది

మొదటిది, శివాజీ వచ్చి తల్లి దెబ్బచూసి ఊహించకుండా తిరగబడ్డాడు

రెండోది, ఊహించకుండా అతను తప్పుకోగానే ఒక రౌడీ చచ్చిపోయాడు

మూడోది, కేసులో అతనే హత్య చేసాడని అనూహ్యంగా ఆరోపణ జరిగింది

అనూహ్యంగా, భవతి భిక్షాందేహి అంటూ, నారాయణరావు, మహాలక్ష్మి న్యాయాన్ని అడుక్కున్నారు

అనూహ్యంగా, సాక్షులు తిరగబడ్డారు

అనూహ్యంగా, ఎన్నికల్లో శివాజీని నిలబెట్టాలని నిర్ణయం తీసుకున్నారు

అనూహ్యంగా, ఓటు వేయకుండా భాషా ఆపేసాడు

అనూహ్యంగా, ముసలివాడు రెచ్చగొట్టటంతో జనం ఓట్లు వేసారు

పని లేదు పని లేదు అని తండ్రి చేత నిత్యం చివాట్లు తినే శివాజీకి, అనూహ్యంగా ఎమ్ ఎల్ ఏ పదవి దొరికింది

అందుకే అతను ఒక రౌడీని కొట్టి పని దొరికిందనుకున్నాడు అది తప్పనుకున్నాడు ఒక రౌడీని చంపటంతో పని పూర్తయిందనుకున్నాడు అది తప్పు అని తెలుసుకుని లక్షల మందికి సేవ చేసే పని దొరికిందని తెలుసుకున్నాడు అది వాస్తవం

ఇలా అనుక్షణం ఉత్కంఠను రేకెత్తిస్తూ ఊహించని మార్పులతో కథ కదులుతూ ఈ సన్నివేశం చక్కగా మలచబడింది

**పాతాళభైరవి .** తోటరాముడు అంతఃపురంలో దొరికిపోయిన సంఘటన, మాంత్రికుణ్ణి చంపి రాజకుమారిని పెళ్ళి చేసుకోటానికి రాజుగారు ఒప్పుకునే వరకు ఒక సన్నివేశంగా ఎదగగా -

మాంత్రికుడు బతకటం అనే సంఘటన ప్రస్తుత సన్నివేశంగా ఎదిగింది

తోటరాముడు రాచరికపు ఆహార్యంలోకి వెళ్ళిపోయి, మాయామహలు నిర్మాణం చేసుకుని పెళ్ళికి సిద్ధపడ్డాడు

ఇక్కడే కథ రెండో మలుపు తిరిగింది తోటరాముడి చెలికాడు అంజి, మాంత్రికుడి శిష్యుణ్ణి కలిసి అనవసరంగా తోటరాముడు రాకుమారిని పెళ్ళిచేసుకుంటున్నాడు అనిచెప్పగానే అతనికి విషయం అర్థమై, వెంటనే పరుగెత్తి దుర్భిణిలో గురువు పాతాళభైరవి గుహలో విగతజీవుడై పడిఉన్నాడని తెలుసుకున్నాడు

నిజానికి ఇది జరిగిఉండకపోతే తోటరాముడు రాకుమారిని మనువాడేవాడు రాజులా హాయిగా కాలం గడిచిపోయేది చిత్రంపూర్తయ్యేది కథానాయకుడి ఆశయం పూర్తయిపోతోంది ఇక కథేముంది? ఏమీ లేదు, పెళ్ళి కాగానే శుభం

ఇదోరకమైన శిల్పం కథ పూర్తయిపోయినట్లుగా చూపించి ఏదో ఒకపాత్ర ద్వారా కొత్త సమస్యను సృష్టించి, అనుక్షణం ఉత్కంఠను లేవనెత్తటం ఒక శిల్పం ఆ శిల్పమే ఈ సన్నివేశం నిండా అనుక్షణం పరుగులు తీస్తుంది

సదాజపుడు సంజీవనితో మాంత్రికుణ్ణి బతికించాడు ఈ సంజీవని మహత్తుని, దుర్భిణి ప్రయోజనాన్ని మాంత్రికుడి పాత్ర పరిచయమప్పుడే చూపించారు గనుక, ఎప్పుడయితే సదాజపుడు మాంత్రికుణ్ణి చూసాడో ఆక్షణంనుంచి, ఉత్కంఠ ప్రారంభమవుతుంది

మాంత్రికుడికి నిజం తెలిసిపోయింది మళ్ళీ ఉజ్జయినికి వచ్చారు పెళ్ళి జరిగిపోతున్న సంగతి సదాజపుడు చెప్పాడు అప్పుడే రాణిగారి తమ్ముడు వీరశూరసేనుడు ఆత్మహత్య చేసుకోబోతుండగా, మాంత్రికుడు ఆపి విషయం తెలుసుకున్నాడు తన దుర్భిణిలో పాతాళభైరవి విగ్రహాన్ని చూపించాడు ఆ బొమ్మతెచ్చిఇస్తే రాజకుమారితో పెళ్ళిచేస్తానన్నాడు సాహసంచేస్తే రాకుమారి లభిస్తుంది అని తోటరాముడికి చెప్తాడు, అదే పాట మళ్ళీ రాణిగారితమ్ముడిదగ్గర పాడాడు

నిజానికి అంజి, సదాజపుడు, వీరశూరసేనుడు ముగ్గురి పాత్రలు హాస్య రసోత్పత్తి కోసం ఈ కథలో సృష్టించబడ్డాయి కాని ఆ ముగ్గురిపాత్రలే ఇప్పుడు ఈ సన్నివేశకల్పనకు ఉపయోగపడుతున్నాయి

హాస్యంకోసం అంజి మేలమాడితే దుర్భిణిలోచూసి సదాజపుడు మాంత్రికుణ్ణి బతికించుకున్నాడు

ఉత్తుత్తినే ఆత్మహత్యచేసుకుంటూ ప్రేక్షకులకు వినోదం కలిగించేసమయంలో, అమాయకుడైన వీరశూరసేనుడు మాంత్రికుడి వలలో చిక్కి, పాతాళభైరవిని దొంగలించలేకపోతే బాగుంటుందన్న ఆశ

పెళ్ళిలో, పెళ్ళిపెద్దలా తయారయివచ్చాడు పెళ్ళిమర్యాదలు చేస్తున్నట్లు నటించాడు పెళ్ళికూతురుని చూసి దుఃఖాన్ని ఆపుకున్నాడు

పూజామందిరం దగ్గర తల్లి ఉంది ఆ తల్లికి తోటరాముడు పాతాళభైరవి గురించి జాగర్త చెప్పాడు అమ్మయ్యా తోటరాముడి తల్లి ఉందిలే, ఇతను కాజేయలేడు అని మళ్ళీ ఆశ అక్షింతలు వెయ్యటానికి రమ్మంటున్నారు అని చెప్పి పంపేసి బొమ్మను కాజేసాడు

ఊరిబయటకు వచ్చి, తెలియకుండా నుదుటిమీద పాతాళభైరవి బొమ్మ పెట్టుకుని, జైపాతాళభైరవి అన్నాడు దేవి ప్రత్యక్షమై 'నరుడా ఏమి నీ కోరికా' అంటే పారిపోబోయాడు మళ్ళీ ఎదురొచ్చింది ఈ చిన్ని దృశ్యం కూడా హాస్యం కోసం లాగా అనిపించినా దీని మూలంగా వీరశూరసేనుడు పాతాళభైరవిరహస్యం తెలుసుకుంటే బాగుండు, ఈ బొమ్మను మాంత్రికుడికి ఇవ్వకుండా ఉంటే బాగుండు అని ఆశ అదీ జరగలేదు నువ్వు తోటరాముడి పక్షం, నువ్వు పో అనగానే దేవిమాయమైపోయింది మళ్ళీ ఉత్కంఠ!

మాంత్రికుడి దగ్గరకువచ్చి బొమ్మ ఇచ్చాడు నేను చెప్పినట్లు చెయ్యి అని దూరంగా పంపాడు పాతాళభైరవిని పిలిచి ఉజ్జయినీ రాకుమారిని వెంటనే ఇక్కడికి తీసుకురా అన్నాడు రాకుమారి కెవ్వుమనటంతో చూసిన వీర శూర సేనుణ్ణి కళ్ళు మూసుకునే ఉండరా, నీకోసం సిద్ధం చేస్తున్నాను అని చెప్పి రాజకుమారిని, తనను, శిష్యుణ్ణి తీసుకు వెళ్ళమనగానే మాయామహలుతోసహా తీసుకు వెళ్ళిపోయింది దేవి

తోటరాముడు కొలనులో స్నానంచేసివచ్చినప్పుడు ఎలాఉన్నాడో ఆ ఆహార్యానికి మారిపోయాడు రాణిగారు నిలదీస్తూ ఉండగా రాణి గారి తమ్ముడు జరిగింది

చెప్పటంతో రాజు గారి దగ్గర, తల్లి దగ్గర ఆశీస్సులందుకుని, రాజకుమారిని తీసుకువస్తానని మాటఇచ్చాడు

ఇలా అనుక్షణం ఈ సన్నివేశమంతా ఉత్కంఠను కలిగిస్తుంది విపరకు రాజకుమారిని తేవటం అనే ఆశయాన్ని కథానాయకుడి వేలు ప్రకటింపవేయటంతో సన్నివేశం పూర్తవుతుంది

**నర్తనశాల** . సుదేష్ణ దగ్గర సైరంధ్రి 'సఖియా ఏవరించవే' అన్న గీతాన్ని ఆలపిస్తుండగా కీచకుడు చూడటం మలుపు ఈ మలుపు తర్వాత విరహంతో కీచకుడు సైరంధ్రితో మధువు తెప్పించుకుని చెరపట్టబోయే సంఘటనగా ఎదిగి, ద్రౌపదిమానసంరక్షణ విషయికమైన సంఘర్షణగా రూపొంది, కీచకసంహార సన్నివేశంగా పర్యవసిస్తుంది

మలుపు మొదలవగానే సైరంధ్రి రూపం మాసి వ్యామోహంలో ఉన్న కీచకుణ్ణి నీకు గొప్ప సౌందర్యాన్ని చూపిస్తాను రమ్మని తీసుకువెళ్ళి ఏలబడి రూపంలో ఉన్న భీముణ్ణి చూపిస్తాడు ఉత్తరుడు

రచయిత, దర్శకులు ఇక్కడ నర్మగర్భమైన శిల్పాన్ని చూపించారు అదేమిటంటే, సైరంధ్రి రూపం నీకుతెచ్చింది వ్యామోహం, అది వదులుకోకపోతే నీకు ప్రాణసంకటం ఈ రూపం అని తెలియజేసారు కొంచెం వాచ్యం కూడా చేస్తూ **ఏమిటీ ఆప్యాయత ఎందుకీ అభిమానం** అని కీచకుడి చేతఅడిగించి, **ఒకచోట పనిచేసినవాళ్ళం** అని చెబితే, బలగర్వితుడయిన కీచకుడు అహంభావపూరితంగా మాట్లాడాడు

సైరంధ్రిని ఆపాడు అయిదుగురు భర్తలకు భార్యవయిన నీవు ఆరవవాడిగా నన్ను అంగీకరించలేవా అని నిలదీసాడు

అక్క దగ్గరకు వచ్చాడు **కామాతురాణాం నభయం న లజ్జా** అన్న ఉక్తిని నిజం చేస్తూ అక్కగారైన సుదేష్ణతో సిగ్గువిడిచి సైరంధ్రి తనకు కావాలన్నాడు నిరుత్తరురాలయిన సుదేష్ణ ఏదో విధంగా తప్పించాలన్న భావంతో పరిచారికతో ఏమిటి అంది అయినా వినిపించుకోలేదు మహారాణిగా కాదు అక్కగా చెబుతున్నాను అని మనసు మార్చాలని చూసింది సూర్యాస్తమయంలోపు ఆ సుందరి నా మందిరానికి రావాలన్నాడు

శృంగార ప్రక్రియకు ఎవరయినా రాత్రిపూట నిర్దేశించుకుంటారు సూర్యాస్తమయంలోపు రావాలి అనటంతో 'అస్తమయ' శబ్దం అతనికి జరగబోయే అస్తమయానికి సూచికగా నిపతించారు

సైరంధ్రి బృహన్నల దగ్గర వాపోయింది అజ్ఞాతవాసం ముగిసే సమయంలో మనం జాగ్రత్తగా ఉండాలన్నాడు కామాంధుని దురాగతాలు మితిమీరితే అని అడిగితే ఏదో ఉపాయం ఆలోచించి మట్టుపెట్టటమే అన్నాడు

సుదేష్ణ తమ్ముడి మాటలు పదే పదే గుర్తుకు తెచ్చుకుని, మహారాణిని అని మరిచిపోయి కుమిలిపోతోంది సైరంధ్రికిఎలా చెప్పాలో తెలియక అలమటిస్తూ నా మనసు బాగోలేదని చెబితే మదిర పుచ్చుకుంటే మనసు కుదుటపడుతుందేమో అనగానే వెంటనే ఆలోచన వచ్చి, తమ్ముడి ఇంట్లో మంచి మదిర దొరుకుతుందని తీసుకు రమ్మంది ఆశ్రయం ఇచ్చిన రోజు పరుల ఇళ్ళకు పంపను అని మాట ఇచ్చారు అంటే నిన్ను వెళ్ళమంది పరుల ఇంటికి కాదు నా తమ్ముడి ఇంటికి అంటే మీ మందిరంలో నన్ను చూసినది మొదలు మీ సోదరుని తీరు, మాటా ఏదో అపాయాన్ని సూచిస్తున్నాయి అంటే సుదేష్ణ తన రాజ వంశానికి రాబోయే అపాయాన్ని తప్పించుకోటానికే అన్న ధ్వనితో ముందు మాట్లాడి, తర్వాత నిజం చెప్పేసింది

సైరంధ్రి చేతులు పట్టుకుంది ఆనాడు నీకు ఆశ్రయంఇచ్చాను ఇప్పుడు నువ్వే మా రాజ్యం రక్షించాలి అంది సైరంధ్రి, సైరంధ్రి కాదు నిజమయిన పరిచారిక అయితే అంగీకరించి ఉండేదేమో సైరంధ్రి ద్రౌపది! పాండవుల పట్టమహిషి చేతులుపట్టుకుని యాచించినప్పుడు సుదేష్ణ కోరికతీర్చాలి

స్త్రీగా ఆ పని చెయ్యలేదు చెయ్యాలి అంటే అర్జునుడు చెప్పినట్లే కీచకుణ్ణి గుట్టుగా మట్టుపెట్టటమే అది ఏ పరిస్థితులకు దారితీస్తుందోనన్న భయం

ఒక స్త్రీగా మీరు ఇలా అడగవచ్చా, నా శీలాన్ని బలిపెట్టమంటారా అంటే నీకు ఏ ఆపదా రాదు, నీవు మహాబలవంతుల ఇల్లాలివని పాండవులశౌర్యాన్ని గుర్తుకు తెచ్చింది లది గుర్తుకు రాగానే 'సరే వెళతాను, విధి బలీయం' అంది

పాండవుల్ని గుర్తుకు తెచ్చుకోకుండా ద్రౌపది కీచకుడి మందిరానికి కదిలిఉంటే ద్రౌపది పాత్రశిల్పం దెబ్బతిని తద్వారా ఈ సన్నివేశశిల్పానికి భంగంవాటిల్లేది ఆమె నిశ్చయం కీచకుడి కోరిక తీర్చటంకాదు అతనివధకు పథకం సిద్ధంచెయ్యటం అందుకే విధిబలీయం అంది ద్రౌపది దృష్టిలో కీచకమరణం సుదేష్ణ దృష్టిలో శీలాపహరణం విధిబలీయం అన్నమాట ఏ పాత్ర దృష్టిలో ఆ పాత్రపద్ధతిలో నడిచింది

ఎవరయితే ఒకనాడు సభలో తనమర్యాదను కాపాడాడో ఆ కృష్ణుణ్ణే స్తుతించింది ఇది ఆమె పాత్రను, తద్వారా సన్నివేశాన్ని కాపాడటమే

సోకు చూసుకుని సిద్ధంగా ఉన్నాడు కీచకుడు తనలో తానే వస్తుందా రాదా, అక్క పంపిందా లేదా అని మథన పడి, మదిరలో ఆమె బింబాన్ని చూసి తాగబోయి, శిల్పాన్ని సైరంధ్రిగా భావించి, తాగకుండా వెళ్ళి ముట్టుకుని భ్రమ అనుకున్నాడు

అతను సైరంధ్రిని మధువులో కలిపి శరీరంలోకి పంపగూడదు అందుకే భ్రమలో పెట్టారు నిజంగా సైరంధ్రి వచ్చింది మహారాణి గారు మదిర తీసుకు రమ్మన్నారు

అంది నీవు మాటలు నేర్చిన ప్రతిమవు అన్నాడు సైరంధ్రి ఇంకా రాలేదు ఆమెను బలాత్కరించి అయినా నా దానిని చేసుకోవాలి అనుకున్నాడు అది విన్నది సైరంధ్రి

ఎంత భర్తలున్నారన్నా ఆడది ఆడదే కదా! తెలియని భయం! అంతఃపుర దాసిని కామించటం ధర్మంకాదు అంది అగ్ని గుండాన్ని అమృత భాండమని భావించకు అని పురాణ గాథలు చెప్పి చూసింది కడసారిగా హెచ్చరించింది తన భర్తల గురించి హెచ్చరించింది

కామాతురుడయిన కీచకుడు బలాత్కరించబోతే పారిపోయింది వెంటనే సభలో వలలుడి కండలను ప్రదర్శించటం శిల్పం ఈచేతులే, ఈబలమే అతన్ని చంపబోతున్నది సైరంధ్రిని వెంటాడుతూ ఆ సభలోకే వచ్చాడు

ద్యూతసభలో అడిగినట్లే ఇక్కడా ద్రౌపది ధర్మమే అడిగింది అందరూ తలలు వంచారు సభామర్యాద పాటించమని భయపడుతూ అడిగిన విరాటుని మాట మన్నించి రేపటి వరకూ నీకు గడువిస్తున్నా అని వెళ్ళిపోయాడు కీచకుడు

ఇప్పుడు భీముడు ఆవేశంలో పచ్చని వృక్షాన్ని పెకిలించబోయాడు ఆశ్రయం ఇచ్చే పచ్చని చెట్టుని వంటకోసం పాడుచెయ్యరాదు అన్నాడు ధర్మరాజు మనం విరాటునిఆశ్రయంలో ఉన్నాం, నువ్వు పదిమందిలో ఇప్పుడు ఏమన్నా చేస్తే మన ఆశ్రయాన్ని పోగొట్టుకోవటమే కాదు మళ్ళీ పదమూడేళ్ళు అరణ్య, అజ్ఞాతవాసాలు అని నర్మగర్భంగా సూచించాడు

దానిని సైరంధ్రి దెప్పి పొడుస్తుంది నీ భర్తలు ఏ కారణం చేత ఆగారో పదిమందిలో పతుల పరువు తియ్యటం పతివ్రతల లక్షణం కాదు అంటే అవును నాట్యకత్తెను నేను, నా భర్తలు నటులు, జూదరులు అని దెప్పి పొడిచి వెళ్ళిపోయింది భారతం కథ అందరికీ తెలుసు ద్రౌపదికి మానభంగంజరగదు అనితెలుసు, కీచకవధ జరుగుతుందనీ తెలుసు మరి ఏ అంశం రక్తి కట్టిస్తుంది? చివరన తెలియజేయటం జరుగుతుంది

భీముణ్ణి కలిసింది ఆవేశపరుడయిన భీముడు అన్నగారిని తూలనాడితే, అర్జునుడు సర్ది చెప్పాడు ద్రౌపది కూడా ధర్మరాజు మీద విసురుగా మాట్లాడిన పద్ధతిని సమర్థించుకుంది అర్జునుడు ఆమెను ఓదార్చి అన్నగారు ప్రతీకారానికి అంగీకరించారని మార్గం చెప్పాడు పాపం కాదా? అంటే పతిఆజ్ఞ పాటించటం పాపం కాదు అన్నాడు

ఒక రోజు ఆగవలసిన భీముడికి వంటవాళ్ళ మాటలతో ఓదార్పు కలిగింది రేపటి వరకు ఆగవలసిన కీచకుడి మనో వైకల్యం అతన్ని ఇంట ఉండనివ్వ లేదు ఆవేశంగా వచ్చిన వాణ్ణి దరికి రాబోకు రాబోకు రాజా అంటూ అయోమయంలో పడవేసింది ద్రౌపది స్త్రీ హృదయాన్ని తెలుసుకోలేవు అన్న మాటలకు బిత్తరపోయాడు కీచకుడు

నర్తనశాలకు రమ్మంది ఒంటరిగా రమ్మంది కామాతురుడికి సిగ్గు భయం లేకపోవటమే కాదు, బుద్ధి కూడా పని చెయ్యదు ఇంత తెగనాడిన ఇంతి, పూబంతిలా ఎందుకు తయారయి వచ్చి కవ్విస్తోందని ఒక్క క్షణం ఆలోచించి ఉంటే ఏమిజరిగుండేదో!

నలుగురిలో నగుబాటుచేసి మానవతికి ఆగ్రహంకలిగించటం తప్పే అన్నాడు

కీచకుడు స్త్రీ పరిజనంతో సుగంధాలు రాయించుకుంటుంటే, వలలుడికి ఆడవేషం కట్టింది ద్రౌపది సంభాషణ చతురతతో నడిచిపోవటంతో ముగిసిన ఈ సన్నివేశంలోని ఆఖరిదృశ్యంలో నిజంగా రెండుకొదమసింహాలు కలబడ్డాయి మల్లయుద్ధం అలాంటి మల్లయుద్ధం జరిగేటప్పుడు సింహనాదాలు చేసుకోవాలి కాని చెయ్యలేదు

రహస్యం బయటపడితే తన పరువు పోతుందని కీచకుడు, రహస్యం బయటపడితే అజ్ఞాతవాసం బయటపడుతుందని భీముడు, సామాన్యమయిన శబ్దాలు తప్ప సింహనాదాలు చెయ్యలేదు ఒళ్ళు గగుర్పొడిచే ఆ మల్ల యుద్ధాన్ని భయాందోళిత విహ్వల హృదయంతో చూస్తున్న ద్రౌపది, కీచకుడి ఆఖరిక్షణాలను ఆనందంతో చూసింది

చనిపోయేముందు నీవెవరివో నాకిప్పుడర్థమైంది నీవు భీమసేనుడివి, ఆమె! అనగానే అతని నోరుమూసాడు కీచకుడు మరణించాడు

తెలిసినకథలో ఏ అంశం ఆసక్తికరంగామారి ఈ సన్నివేశశిల్పాన్ని కాపాడింది?

ఈ సన్నివేశం మొత్తాన్ని ద్రౌపది, కీచకుడు, సుదేష్ణ, వలలుడు, బృహన్నల, విరాటుడు, కంకుభట్టు మొదలైన పాత్రపోషణల సౌందర్యంతో నింపటమే కాక, ప్రతి పాత్రకు రాసిన సంభాషణ నర్మ గర్భంగా ఉంది తుదిదృశ్యంలో నిశ్శబ్దమల్లయుద్ధాన్ని చూపించి, మహత్తరంగా సన్నివేశాన్ని ముగించారు పాత్రలు, సంభాషణ మహత్తరంగాఉండి ఈ సన్నివేశానికి మనోహరత్వాన్ని ఆపాదించాయి

అంతేకాక కీచకవధ ఊరుభంగకథకు ప్రతిధ్వని ఊరుభంగకథ భారతకథనంతా విస్తరించి ఉండగా, కీచకవధ విరాటపర్వానికి పరిమితమై ఉంది రెండవకథవల్ల ప్రధానకథకు పుష్టి కల్గింది భారతకథలో దుర్యోధనవధాకథాశిల్పానికి ఇది ప్రతిధ్వనిగా భాసిల్లికూడా సన్నివేశాన్ని రక్తికట్టించింది

అనార్కలి ఈ చిత్రానికి **సినేరియో, డైరక్షన్** వేదాంతం రాఘవయ్య మాటలు సముద్రాల రాఘవాచార్య **సినేరియా** అంటే *Plot of a Movie* అని, ప్లాట్ అంటే *Main Story Development* అని అర్థం

అంటే అనార్కలి అనే చారిత్రకకథకు కథావిస్తరణ వేసుకున్నది దర్శకుడు దానికి సముచితమైన సంభాషణలు రాసింది సముద్రాల రాఘవాచార్య

ఈ చిత్రంలో తొలి చూపులోనే సలీం, నాదిర (అనార్కలి) ప్రేమలో పడతారు జీవితమే సఫలము అని చిత్రంలో కథానాయిక పాత్ర పరిచయం కావటమే ప్రేమకోసం మరణించటంలో కూడా సాఫల్యంఉందన్న సందేశం ఉంది

తోటలో ఇద్దరూ ప్రేమానందలహరిలో ఓలలాడుతూ ఉండగా జలాలుద్దీన్‌అక్బర్ పరివారంతో వచ్చాడు ఆయన్ని చూసి సలీం పారిపోయాడు ఇది సంఘటన

వస్తున్నది అక్బర్ అని తెలియదు పారిపోయిన వాడు ఆయన కుమారుడు అని తెలియదు మా ఏకాంతానికి భంగాన్ని కలిగించారని సంఘర్షణకు దిగింది ఇదే విషయాన్ని అక్బర్ పాదుషాకి చెబుతానని భయపెడుతుండగా సైనికులరాకమూలంగా ఆయనే అక్బర్ పాదుషా అని తెలిసింది క్షమాపణలు కోరింది ఇప్పుడాయన నీ పాట వినిపిస్తావా అంటే మన్నించండి ఆ పాట మళ్ళీ పాడలేను అంది ప్రియుడిసమ్ముఖంలో బయటకువచ్చిన ప్రియగీతిక అంది మెల్లగా సంవాద రూపంలో సాగుతున్న సంఘర్షణ ప్రేమను గురించి వర్ణించటం మానేసి మెల్లగా ప్రియుడు పిరికివాడని, అతని ప్రేమ సత్యం అని నమ్మకు అంటే వాగ్యుద్ధానికి దిగింది

పతాక స్థాయిలో అనార్కలికి, ఆలంపనాకు జరగవలసిన సంఘర్షణ ఇప్పుడు జరుగుతోంది అయితే ఇక్కడ తను ప్రేమించింది ఆయన కొడుకుని అని నాదిరాకు, ఆమె ప్రియుడు తన కొడుకని అక్బర్ పాదుషాకు తెలియకపోవటంతో, ఇది కేవలం ప్రేమవిషయికమైన సంవాదంలా అనిపించినా, ప్రేక్షకులకు నిజంతెలుసుగనుక ఏమిజరుగుతుందోనన్న ఉత్కంఠకి బదులు కుతూహలం మొదలవుతుంది ఎందుకంటే అక్బర్ సలీంని చూడలేదు మళ్ళీ సలీం రాడు అని ప్రేక్షకుల విశ్వాసం

ఈ కుతూహలం శిల్పంగా మలచటానికి అతను ఎన్నటికీ రాడు అని సవాలు విసురుతాడు అక్బర్ తండ్రి ఎదురుగా ఎలా వస్తాడు అన్న ప్రశ్న ప్రేక్షకుడి హృదయంలో-

*ప్రేమను జయించటం, దేశాలు జయించటం కాదు ప్రభూ . దేవతలు కూడా దానికి తలవంచారు* అంటుంది మెల్లగా ప్రారంభమైన ఈ వాదానికి అంతెక్కడ?

సలీమ్ తిరిగి ఆ ఉద్యానవనానికి వస్తే సరిపోతుంది కానీ ఎలా వస్తాడు? ఎదురుగా ఉన్న తండ్రి ఏమంటాడో అన్న భయం కంటే, తను సిపాయిని కాదు యువరాజుని అని తెలుసుకుంటే, నాదిరా తనకు ఎక్కడ దూరమైపోతుందోనన్న వెరపు సలీంకి

పందెంకట్టి పాట పాడటం మొదలుపెట్టింది మహారాజు అనితెలిసి పందెంకట్టింది ఓడిపోతే ఏమవుతుందోనన్న పర్యవసానం ఆలోచించలేదు వస్తాడన్ననమ్మకంతోనే

పాడుతోంది తనను చూసి పారిపోయినవాడు తన ఎదుటికి ఎలా రాగలడు అన్న విశ్వాసంతో కూడిన చిరునవ్వు అక్బర్‌ది

ప్రేక్షకుడికి ఎక్కడో చిన్నఅనుమానం విత్తనంలా మొదలవుతుంది ఒక వేళ అక్బర్ కొడుకుని చూసాడా? చూసే వెనక్కి తిరిగి రప్పించి చర్య తీసుకోవాలనుకుంటున్నాడా? ఆయన ప్రియుడు గురించి మాట్లాడిన కొన్ని మాటలు అలా అనుమానాన్ని కలిగించాయి ఇప్పటికి అక్బర్ పాత్ర మీద ప్రేక్షకుడికి ఇంకా భయం కలగలేదు పేదరాలిని అంత గౌరవిస్తున్న ఆయన ఒక వేళ వాళ్ళ ప్రేమను ఆశీర్వదిస్తాడేమోనన్న నమ్మకం

*ప్రియురాలికి ఓటమి ఇవ్వొద్దు, ప్రభువుకి ఓటమి ఇవ్వు* అంది వచ్చాడు ఆమె గెలిచింది కాని కుతూహలాన్ని చంపేయటం రచయితకూ, దర్శకుడికి బొత్తిగా ఇష్టం లేదు అందుకే *నేను అంత తేలిగ్గా ఓటమిని అంగీకరించను, నీ ప్రియుణ్ణి చూపించు* అన్నాడు

ఇప్పుడు తొండముదిరితే ఊసరవెల్లి అయినట్లు కుతూహలం ముదిరి ఉత్కంఠ మొదలయింది ఇప్పటిదాకా వస్తాడా? రాడా? రాడులే తండ్రి ఉన్నాడు గదా, రాకపోతే ప్రియురాలు ఓడిపోతుంది గదా అని పరి పరి విధాలా ఆలోచించిన వాళ్ళందరూ అమ్మో వచ్చేసాడు! ఇప్పుడు అక్బర్ చూస్తే ఏమవుతుంది అన్న ఉత్కంఠను భరిస్తూ ఉండగా, అతని చేతిని, పాదాన్ని చూపించి పందెం గెలిచింది

మనకి భయమేమిటి, రా బయటకు అని అడగలేదు ఎందుకంటే ఆమె దృష్టిలో అతను సిపాయే పాదుషాకి ఎలా ఎదురు పడతాడు? అందుకే పారిపోయాడనుకుంటోంది

నీకేం కావాలో కోరుకో అంటే మీ చేతిలో అనార్‌మొగ్గలు ఇవ్వండి అంది ఆమె సంస్కారానికి ఆయన ఆశ్చర్యపోయాడు నువ్వడిగితే సామ్రాజ్యం ఇచ్చి ఉండేవాడిని అన్నాడు కాని ఆమె కోరిక పతాక స్థాయిలో ఆయన తీర్చబోవటం లేదు అందుకే అనార్ మొగ్గలు, ప్రేమకు సూచికలైన అనార్ మొగ్గలడిగింది అప్పుడే మొగ్గతొడుగుతున్న ప్రేమను ఆశీర్వదించమని అడిగిందన్నది అంతర్గతంగా ఉన్న శిల్పం

ఆమెకు అనార్కలి అని బిరుదు ఇచ్చాడు ప్రేమవిజయాన్ని, అధికారపరాజయాన్ని అంగీకరించాడు

*నీ ప్రేమ, నీ పేరు నిత్య కోమలమై చిరస్థాయిగా చరిత్రలో నిలిచిపోవాలని దీవిస్తున్నాను అనార్కలి జిందాబాద్* అన్నాడు

నిజానికి ఉత్తరార్ధంలో ఆయన వారి ప్రేమకు *జోహార్* పలకబోతున్నాడు

ఇంటికి వెళ్ళి అమ్మతో ఆనందంగా చెప్పుకుంది అనార్కలి రాణితో చెప్పుకున్నాడు ఆమె మోహనరాగం గురించి అక్బర్ ఇదేదో ఉపయోగపడుతుంది అన్న ఉత్కంఠను ముగిస్తూ, కథా శిల్పంతో సేనాపతి మాన్‌సింగ్‌ని ప్రవేశపెట్టి, అతని చేత దండయాత్రకు సర్వసైన్యాధిపత్యం వహించి, సలీం కాబూల్‌కి బయలుదేరాలన్న విషయం చెప్పించటంతో ఈ ప్రేమకు వియోగం మొదలయింది

ఈ సన్నివేశం ఎత్తుగడ శిల్పంలో, సంభాషణ శిల్పంలో, పాత్ర చిత్రణ శిల్పంలో, అభినయ శిల్పంలో, కథనశిల్పంలో అణువణువునా పరిపూర్ణమై చక్కగా ముగిసింది

సన్నివేశానికి కూడా ప్రారంభం, మధ్యమం, ముగింపు మూడూ ఉంటాయి ప్రారంభం తండ్రి రాకతో కుమారుడు కనుమరుగు కావటం, మధ్యమం అక్బర్‌కీ, నాదిరాకు మధ్య సంవాదం మూలకంగా ఉత్పన్నమైన పంతం, నిజానికి అనార్కలి గెలుపుతో ముగిసిపోవాలిసిన ఈ సన్నివేశం, యువరాజు యుద్ధానికి, అనార్కలి దేశం విడిచివెళ్ళిపోవటానికి కారణమై, తదనంతర ప్రేమ విషాదయోగానికి దారి తీసి హృద్యంగా మలచబడింది

**స్వాతి :** సన్నివేశ కల్పనాశిల్పానికి మరో చక్కటి ఉదాహరణ స్వాతి స్వాతి అనే అమ్మాయి తన తల్లి సరస్వతిని జనం వేశ్య అనటం భరించలేకపోతుంది పక్కింటివాళ్ళు గౌరీవ్రతానికి పిలవకపోతే తట్టుకోలేకపోతుంది ఆఖరికి దూరపుబంధువు నిన్ను, నీ కూతుర్ని ఉంచుకుంటాననటంతో చెంప పగలగొడుతుంది అలాంటి సమయంలో ఆమె స్నేహితుడు జగ్గు సలహాతో తల్లికిపెళ్ళి చేయాలని నిర్ణయించుకుంటుంది అది ఆమె ఆశయం కాదు ఆ ఆశయం ఆమె హృదయంలో పుట్టలేదు స్నేహితుడి చేత ప్రేరేపించబడింది ఆయినా పెళ్ళి చేసింది కూతుర్ని తల్లి అత్తారింట్లో దింపి వచ్చినట్టు, తల్లిని అత్తారింట్లో దింపి వచ్చింది అప్పుడు యాదృచ్ఛికంగా సత్యం అనే వ్యక్తిని కలిసింది అతన్ని రోడ్డు మీద జనం కొడుతుంటే కాపాడి తీసుకు వెళ్ళింది తీసుకు వెళ్ళాక తెలిసింది అతనే తన కన్న తండ్రి అని

సత్యాన్ని కాపాడి తీసుకు వెళ్ళటం సంఘటన అతనే తన తండ్రి అని తెలియటం సంఘర్షణ ఈ సంఘర్షణలో నుంచి పుట్టిన దృశ్యాలన్నీ కలిసి ఇలా సన్నివేశంగా పెరిగాయి

1 సత్యాన్ని స్వాతి కాపాడి తీసుకు వెళ్ళటం
2 స్వాతికి సత్యం తన తండ్రి అని తెలియటం
3 ఫ్లాష్‌బాక్‌లో సత్యం ఉద్యోగానికి వెళ్ళటం
4 సత్యం ఒకతన్ని హత్య చేయటం పోలీసులు అరెస్టు చేయటం

5 ఫ్లాష్ ఇన్ - సత్యం తను సరస్వతి కోసం ఎంత దిగులు పడింది చెప్పటం
6 జగ్గును కలిసి ఆ విషయం చెప్పి తల్లి ఆయన గురించి ఏమనుకుందో చెప్పటం
7 ఫ్లాష్‌బాక్ - రౌడీలు నీ భర్త నిన్ను మాకు అమ్మేశాడని కంఠంమీద కత్తి పెట్టి బెదిరించటం
8 ఫ్లాష్ ఇన్ - జగ్గు దగ్గర తల్లి పెళ్ళి చేయట ం తప్పా? ఒప్పా? అని అడగటం
9 డాక్టరు కూతురికి ఇంట్లో చీరలు కొంటుంటే చూడటం
10 ఫ్లాష్ ఫార్వార్డ్ - ఈ నిజం విని సరస్వతి కత్తితో పొడుచుకోవటం
11 ఫ్లాష్ ఇన్ - అలా ఊహించుకుని, ఆ నిజం తల్లికి చెప్పకూడదని నిర్ణయించుకోవటం
12 సత్యానికి సీరియస్‌గా ఉందని లెటర్ చదివి హాస్పటల్‌కి పరిగెత్తటం
13 సత్యానికి లుకేమియా అని స్వాతికి తెలియటం అతని కోరిక తెలుసుకొని తీరిస్తే తృప్తిగా చచ్చిపోతాడని డాక్టరు చెప్పటం
14 సరస్వతికి భర్త ద్వారా స్వాతి ఎవరినో హాస్పటల్‌లో ట్రీట్ చేయిస్తోందని తెలిసి బయలు దేరటం
15 జగ్గుకి తండ్రి లాంటివాడని ఏదో చెబుతూ సత్యాన్ని చూడకుండా చేయాలని చూడటం సత్యం బెడ్‌మీద లేకపోవటం
16 రక్తంకక్కుతున్న సత్యానికి సేవ చేయటం చనిపోయేలోపు సరస్వతిని చూడాలన్న అతని కోరిక విని, బాధ భరించలేక డాక్టరుతోనిజం చెప్పటం
17 స్వాతి తన కూతురని సత్యానికి తెలియటం (గ్లాసు పగిలిన శబ్దంతో ప్రతీకాత్మక శిల్పంతో తెలియ చేయటం)
18 సత్యం మీ అమ్మని చూడాలని చెప్పి తనకి నిజం తెలిసిన సంగతి తెలియ చేయటం
19 పెళ్ళిలో భార్యని చూడాలని సత్యం తాపత్రయం సత్యం, డాక్టరు మీద, సరస్వతి మీద అక్షింతలు వేయటం సత్యం భార్యని చూసి చనిపోవటం సత్యం కాళ్ళకి సరస్వతితో నమస్కారం పెట్టించటం

సంఘర్షణ ప్రారంభంకాగానే ముందు స్వాతి మానసికస్థితి రెండురకాలు ఫోటోలో తన తల్లితోఉన్న ఈ వ్యక్తి తనతండ్రేనా? అయితే తన తల్లిని మోసం చేసిన వ్యక్తిగా ద్వేషించాలి కాని వాస్తవం తెలుసుకోవాలి గనుక ముందు ప్రశ్నించింది ఆ ప్రశ్నతో సత్యం పూర్వకధ చెప్పాడు ఆ పూర్వ కధలో అతను భార్యను మోసం చెయ్యలేదు రాత్రి పూట తిరిగి వస్తూ ఉండగా భార్యను చులకన చేసిన వ్యక్తిని ఆవేశంలో హత్య

చేసాడు పోలీసులు అరెస్ట్ చేసి తీసుకువెళ్ళారు ఇప్పుడు భార్య కోసం వెతుకుతున్నాడు తనను మరిచిపోతే దూరంగా వెళ్ళిపోదామని, తనే నమ్ముకుని ఉంటే కోల్పోయిన జీవితాన్నివ్వాలని అనుకుంటున్నాడు ఇది తెలిసిన తర్వాత మరీ ఇబ్బంది పడిపోయింది ఇంత మహానుభావుడికి ఇల్లాలిని దూరం చేసానా అని తల్లడిల్లిపోయింది జగ్గుని కలిసింది అతనేమయినా కర్తవ్యం చెబుతాడేమోనని ఇంత గొప్పవాణ్ణి ఎందుకు అనుమానించవలసి వచ్చిందో ఆ దృశ్యాన్ని పూర్వాకథలో చూపించారు రౌడీలు వచ్చి నీ భర్త రెండు వేలకు అమ్మివేశాడు అని చెప్పి కంఠం మీద కత్తి పెడతారు ఆ తర్వాత సరస్వతిని వాళ్ళేం చేసారు అనేది చూపించకపోవటం శిల్పం ఆమెను వేశ్య అంటున్నారని వాగ్రూపంగా ఇంతకు ముందు చెప్పారు కంటికి దృశ్యంగా చూపిస్తే సరస్వతి పాత్ర చిత్రణ దెబ్బతింటుంది

అయినా ఈ నిజం తల్లికి చెప్పి ఆమె తీర్పు కోరటమే మంచిదని వెళ్ళింది డ్యాక్టరుగారి అమ్మాయికి గుడ్డలు కొంటోంది సరస్వతి ఇక్కడ ఫ్లాష్‌ఫార్వార్డ్ రూపంలో అంటే స్వాతి ఊహలో ఒక దృశ్యం చూపించారు నిజం తెలుసుకున్న సరస్వతి కత్తితో పొడుచుకుంటుంది ఈ దృశ్యాన్ని ఊహించుకుని చెప్పటం మానేసింది చెబితే ఏం జరిగి ఉండేదో! ఈ శిల్పం ఇలానడిచేది కాదు కథాశిల్పం మారిఉండేది సంఘర్షణ స్వాతిపాత్ర నుంచి సరస్వతిపాత్రకు మారిఉండేది

ఇది జరిగాక ఇంటికవచ్చిన స్వాతి, సత్యాన్ని జగ్గు హాస్పటల్‌కు తీసుకెళ్ళిన విషయం తెలిసి వెళ్ళింది అక్కడ ఆమెకు సత్యానికి లుకేమియా అని, బ్రతకడని తెలిసింది ఇప్పుడు స్వాతి పరిస్థితి మరీఇబ్బందికరంగామారింది నిజం తెలిస్తే అమ్మ అఘాయిత్యం చేసుకుంటుందని నమ్మింది గనుక ఈ సంగతి సరస్వతికి తెలియకుండా ఉంచాలని అనుకుంది కాని డాక్టర్, ప్రస్తుతం ఆమె తండ్రి, అతని ఆఖరికోరిక తీరిస్తే ప్రశాంతంగా చచ్చిపోతాడని చెప్పాడు ఇది స్వాతి పాత్ర దృష్ట్యా విషమ స్థితి ఏ నేరమూ చెయ్యని కన్నతండ్రి ఆఖరికోరిక తీర్చాలా? వద్దా?

గణేష్‌పాత్రో, క్రాంతికుమార్‌ల మేధస్సు ఇక్కడే సన్నివేశ కల్పనా చాతుర్యానికి ఉపయోగపడింది నిజానికిక్కడే ముగింపుకి లీడ్ తీసుకోవచ్చు కాని డాక్టర్ చేత సరస్వతికి స్వాతి ఎవరినో పేషంట్‌ని జాయిన్‌చేయించింది అని చెప్పించి, నాకు తెలియని బంధువులు దానికెవరు అన్న అనుమానం మొలకెత్తించి, సరస్వతి ఆసుపత్రికి వచ్చేలా చేసారు ప్రేక్షకుడికి అనుక్షణం ఉత్కంఠ స్వాతి గుండెచప్పుడు ప్రేక్షకుడి గుండె చప్పుడుగా మారిపోతుంది ఒకవేళ సరస్వతి సత్యాన్ని చూసేస్తుందేమో!

ఇప్పుడేమవుతుంది? ఇదే ఉత్సుకత! కానీ తెలివితేటలతో ఆమె వచ్చే సమయానికి సత్యం బెడ్‌మీద లేకుండా చేసారు గొప్ప రిలీఫ్ ప్రేక్షకుడికి! ఇంతకుముందునుంచి అనుభవిస్తున్న కరుణరసానికి తరువాత అనుభవించబోయే కరుణరసానికి మధ్య ఈ ఉత్కంఠాభరితమైన దృశ్యాన్ని నడిపి, అమ్మయ్య అని ప్రేక్షకుడి చేత అనిపించకపోతే, కరుణరసం మోతాదు ఎక్కువై ప్రేక్షకుడు తలభారం సహించలేని పరిస్థితి వస్తుంది

ఇప్పుడు సత్యం రక్తం కక్కుకుంటే డాక్టర్ దగ్గరకు వచ్చింది ఆమె అంతగా ఎందుకు చలించిందోనని డాక్టర్ ప్రశ్నిస్తే నిజం చెప్పేసింది ఇక్కడ కూడా కరుణరసాన్ని ప్రేక్షకుడి హృదయంలో ఇప్పుడు డాక్టర్ ఏ నిర్ణయం తీసుకుంటాడు అన్న కుతూహలంతో జయిస్తూ, ఉత్కంఠాభరితంగానే నడిపారు సరస్వతిని అతనికి చూపించాల్సిందే అని నిర్ణయించాక ఈ విషయం సత్యం వినేశాడని, గ్లాసు పగిలిన శబ్దంతో ప్రతీకాత్మక శిల్పం ద్వారా తెలియజెయ్యటం దర్శకత్వ ప్రతిభకి మచ్చు తునక

ఆ తర్వాత తండ్రీ కూతుళ్ళ మధ్య నిజం తెలిసిందన్న దృశ్యాన్ని కరుణరసాత్మకంగా నడిపి అతని కోరిక సరస్వతిని చూడటం అనేది స్థాపించారు గనుక, సరస్వతి అతన్ని చూడకుండా అతను సరస్వతిని చూసే అవకాశాన్ని కల్పిస్తూ, పెళ్ళి పందిట్లో చూడగలడా లేదా? అన్న ఉత్కంఠను నడుపుతూ కరుణరసాత్మకంగా తీర్చిదిద్ది అతను కన్నుమూసాక సరస్వతితో అతని పాదాలకు నమస్కరింపజెయ్యటంతో సన్నివేశంతోపాటు, చిత్రాన్ని కూడా ముగించారు

ఈ సన్నివేశంలో రసాత్మక శిల్పం, ప్రతీకాత్మక శిల్పం, సంభాషణ శిల్పం, పాత్ర చిత్రణ శిల్పం, సంఘర్షణ శిల్పం, సంఘటనా శిల్పం, అంతర్లీనంగా అడుగడుగునా నడిచి సర్వోత్కృష్టమైన సన్నివేశకల్పనాశిల్పంగా రూపుదిద్దుకుంది హృదయాలను కదిలించే రచయితలు కొద్దిమందే ఉంటారు అందులో తను అగ్రశ్రేణి రచయితనని నిరూపించుకున్నాడు గణేష్‌పాత్రో

## సంభాషణశిల్పం :

సినిమా పుట్టిన చాలాసంవత్సరాలవరకూ మూకీ చిత్రాలే విడుదలయిన సంగతి ఆవిర్భావంలో పరిశీలించటం జరిగింది

సంభాషణ అనేది అవసరం అని భావించి సంభాషణలు ప్రారంభించారు అనవసరం అని పరిశ్రమ నమ్మి ఉంటే పరిశ్రమ మళ్ళీ మూకీయుగం వైపుకి వెళ్ళి ఉండేది

కాబట్టి సంభాషణ సినిమాలలో తప్పనిసరి అని అర్థం అవుతోంది ఈ సంభాషణలు రచించటంలో ఒక్కొక్క రచయిత ఒక్కొక్క శిల్పాన్ని అనుసరిస్తాడు

ఆయా చిత్రాలలో సంభాషణశిల్పం ఎన్ని విధాలుగా ఉందో ఆయా చిత్రాలఆధారంగా పరిశీలించాలి

**క్లుప్తత :**

సినిమా ప్రధానంగా దృశ్యం కావటంచేత ఎక్కువ సంభాషణలు ఉపయోగించవలసిన చోట తక్కువ సంభాషణలు ఉపయోగించటం, అంటే క్లుప్తత, ఇదొక శిల్పం

**శంకరాభరణం :**

శంకరాభరణంలో ఈ కింది దృశ్యాన్ని పరిశీలించాలి

వీధుల్లో గుండా శంకరశాస్త్రి బండిలో ఇంటికి
వెళ్తుంటే
దారి పొడుగునా చూస్తున్న జనం విస్తుపోతూ
చెవులు కొరుక్కొంటూ ఉన్నారు
ఇంటికెళ్ళాక
శంకరశాస్త్రి వినేలాగా ఎత్తి పొడుపుగా

**వంటత్త** ఇట్లాంటి అనాచారం నేనెక్కడా చూళ్ళేదు
అంటూ సొంటూ లేని ఇంట్లో ఒక్క
క్షణం కూడా ఉండలేను శారదమ్మ తల్లీ
నా దోవ నేను చూసుకుంటున్నాను
అడ్డమైన వాళ్ళని కొంపలో చేర్చుకుంటే
పంచమహాపాతకాలు పట్టుకుంటాయి
మడీ, దడీ, పట్టింపు ఉన్న కొంప కాబట్టే
ఇన్నాళ్ళు ఉండ గలిగాను ఇప్పుడు కొత్త
బుద్ధులు పుట్టుకొచ్చి, కొత్త మనుషుల్ని
కొంపలో ఉంచుకుంటే నాకు పంచాగ్ని
మధ్యలో ఉన్నట్టని పిస్తుందమ్మా ఊ!
ఇకనేనుండ లేను, ఏ గుళ్ళోనో కృష్ణా, రామ
అనుకుంటూ కూర్చుంటా
వింటున్నావా అమ్మా ఊ, ఇన్నాళ్ళూ
ఫలానా వాళ్ళ ఇల్లంటే అగ్నిహోత్రమంత

పవిత్ర మైందనుకునే వాళ్ళు నలుగురూ ఇప్పుడా నలుగురే దవళ్ళు నొక్కుకుంటూ ఉన్నారు ఇక నేనుండ లేనమ్మా శారదమ్మ తల్లీ

అంటూ బయల్దేరింది
తండ్రితో

శార — నాన్నా, వంటత్తయ్య

అని ఏదో చెప్పబోయింది

శంక — నువ్వెళ్ళి పూజ గది సిద్ధం చెయ్యమ్మా

అంటూ పురమాయించాడు కూతురికి
వంటత్త వెళ్ళిపోయింది
శారద తనే మడి కట్టుకొని
తండ్రి పూజకి సిద్ధం చేస్తోంది
నీళ్ళ బిందె లోనికి మోసుకొస్తూ

శార — అమ్మా!

అంటూ కాలు జారి పడింది
శంకరశాస్త్రి, తులసి రియాక్ట్ అయ్యారు
తులసి సహాయం చెయ్యాలనుకున్నా
వెనకాడింది కింద పడి లేస్తూ

శార — బిందె పడిపోయింది నాన్నా నైవేద్యానికి తొందరగా వంట చేద్దామని వస్తుంటే, ఆ

సంజాయిషీ ఇవ్వబోయింది
తులసి నుద్దేశించి

శంక — ఏం నీకు వంట చెయ్యటం రాదా?

తులసి రియాక్ట్ అయ్యింది

శంక — పసిపిల్ల, అది మడి కట్టుకుని వంట చెయ్యలేక అవస్థ పడుతుంటే చేతనైన వాళ్ళు వెళ్ళి సహాయం చెయ్యొచ్చు గదా

తులసి రియాక్ట్ అయ్యింది

శంక — ఆచార వ్యవహారాలు మనసుల్ని క్రమమైన మార్గంలో పెట్టటానికి తప్ప కులం పేరుతో విడదియ్యటానికి కాదు

తులసి వంటచేయటానికి పొయ్యి వెలిగించింది వేదమంత్రాలు ఆ మంట మీద పోస్టు అయ్యాయి

– కట్ –

ఆమెను ఇంటికి తీసుకురావటం పెద్ద ఉదారంగా రాసినా తమను భావించారు నిజానికి ఇక్కడ పుటం మీద పలుకు సంభాషణలు రాసుకోవచ్చు

అందరి తరుపున నాలుగు మాటలు అని పంటలు చెప్పి వెళ్ళిపోయింది, అంటూ సొంటూ లేసి ఇంట్లో ఉండటమేంటని? ఆయనకి చెప్పడేలా అని నిష్క్రమించింది ఒక వేళ ఆమెను పంపి తనను అపురూపమైనా కన్న ఆశ కూడా ఉంది ఆమె మాటల్లో

ఆమె పని శంకరశాస్త్రి కూతురు శారద చెయ్యటానికి పూనుకుని చిన్న పిల్ల అవ్వటం చేత బిందె మొయ్యలేక పడిపోయింది ఇదే చెప్పింది తండ్రితో

ఏం నీకు వంట చెయ్యటం రాదా? అని శంకరశాస్త్రి ప్రశ్నకు వచ్చు అని సమాధానం రాసుకుని ఉంటే అది సంభాషణ రచనే కాదు తను వేశ్య కుమార్తె పైగా మానభంగానికి గురయినది ఇంకా హత్య చేసి హంతకురాలిగా న్యాయస్థానానికి వెళ్ళి తిరిగి వచ్చింది నీకు వంట వచ్చా? అని అడిగితే వచ్చు అని ఎలా చెబుతుంది ఈ ప్రశ్న నాకు వెయ్యటం ఏమిటి? అని శంకించింది అర్థం అయ్యీ అర్థం కాని అభినయాన్ని అందించింది

పసిపిల్ల మడి కట్టుకుని వంట చెయ్యలేక అవస్థ పడుతుంటే చేతనైన వాళ్ళు వెళ్ళి సహాయం చెయ్యవచ్చు గదా అన్నాడు అయోమయంలో ఉంది! చేత నయిన వాళ్ళు అన్నాడు తప్ప, నువ్వెళ్ళి సాయం చెయ్యవచ్చుగదా అనలేదు **ఆచార వ్యవహారాలు మనసుల్ని క్రమమైన మార్గంలో పెట్టటానికి తప్ప కులంపేరుతో విడదీయటానికి కాదు** అన్నాడు

ఈ మాట తర్వాత ఒక్కపదం రాసినా ఆ రచయితకు సంభాషణమీద పట్టులేనట్టే అందుకే అంతటితో సంభాషణ ముగిసింది

విశ్వనాథ్ కథా రచయిత జంధ్యాల మాటల రచయిత ఏం కావాలో విశ్వనాథ్‌కు తెలుసు ఎంతవరకు రాయాలో జంధ్యాలకు తెలుసు

పైగా జమిందారు మానభంగం చేసిన సన్నివేశం ప్రేక్షకుడు చూసాడు ప్రేక్షకుడు చూసిన దాన్ని మళ్ళీ పాత్రకు చెప్పవలసి వస్తే, అభినయశిల్పాన్ని అడ్డు పెట్టుకుని తప్పుకోవాలి తప్ప, తెలిసిందే మళ్ళీ చెబుతుంటే పునరుక్తి దోషం పట్టి సంభాషణ శిల్పం దెబ్బ తింటుంది ఇద్దరూ చెయ్యి తిరిగిన సాంకేతిక నిపుణులు గనుక జాగ్రత్త పడ్డారు సంభాషణ సౌందర్య సౌరభాన్ని అందించారు

**అతి నాటకీయత :** అతి అనగానే సంభాషణ అతిగా ఉండకూడదు అన్న వాల్టర్ బెర్న్‌స్టేన్ మాట గుర్తుకు వస్తుంది

> సంభాషణలు రాసుకునే సదుపాయం నీకుంది అంటే నువ్వు చిక్కుల్లో పడ్డట్టే శబ్ద సౌందర్యంతో నువ్వు గొప్ప సంవాదం రాసి ఉండవచ్చు నిజానికి సంభాషణ దృశ్యం నడకకు సరిపడా ఉంటే చాలు [23]

ఈయన ఉద్దేశం సదుద్దేశమే కాని ఒక బాపు, ఒక విశ్వనాధ్ లాంటి వాళ్ళు కూడా *పైనేదో మర్డర్ జరిగినట్టు లేదూ?* లాంటి పదవైచిత్రులు చూపిస్తూ ఉన్న చలనచిత్ర చిత్రకథల్లో సంభాషణలు మరీ వాస్తవంగా ఉండకూడదు

నాటకంలో కూడా అతిసహజసంభాషణలు కాసేపు భరిస్తారు గాని, ఎక్కువసేపయితే విసుగు చెందుతారు అందుచేత **వాల్టర్ బెర్న్ స్టేన్** నిర్వచనం ఆంగ్లచిత్రాలకు గాని ఆంధ్రభాషా చిత్రాలకు అంతనప్పదు

టామ్ రిక్ మాన్ నిర్వచనం కూడా అంతే

ఒక్కొక్కసారి అతి నాటకీయత సాధించటానికి అవసరాన్ని మించి కూడా సంభాషణలు రాయటం జరుగుతుంది

అసెంబ్లీరౌడీలో శివాజీ ఎమ్.ఎల్.ఎ. గా గెలిచిన తరువాత కధ తాత్కాలికంగా ఆగింది సంఘటన జరగలేదు దృశ్యాలు వెళుతుంటాయి తప్ప సన్నివేశంగా ఎదగదు ఒక రకమైన శూన్యం ఏర్పడుతుంది

అలాంటి శూన్యాన్ని ఒక్కోసారి హాస్యంతో, ఒక్కొక్క సారి అద్భుతమైన సంభాషణలతో నింపుకుంటూ వెళుతూ ఉంటారు

**అసెంబ్లీరౌడీలో శివాజీ ఎమ్ ఎల్.ఏ.** అయ్యాక తల్లిదండ్రులు చనిపోయే వరకు మళ్ళీ సంఘటన జరగలేదు మధ్యలో సంవాద పూర్వకమైన సంఘర్షణ జరిగింది

1 శివాజీ భాషాను కలవటం

2 **పోలీస్ స్టేషన్‌లో** శివాజీ భాషాను అప్పచెప్పినప్పుడు ఓడిపోయిన **ఎమ్.ఎల్.ఏ** రావటం

3 పదిలక్షలిచ్చి తనను కొనబోతే మంత్రి సత్యనారాయణ దగ్గరకు వచ్చినప్పుడు దృశ్యం

భాషా ఇంట్లో ఒంటరిగా కూర్చుని
మృదంగం వాయిస్తున్నాడు
బయట నుంచి వచ్చిన శివాజీ
అతని దగ్గరకు వెళ్లాడు నేరుగా

శివాజీ అరెరె! ఏం వాయిస్తున్నావయ్యా నిన్ను కుక్కను కొట్టినట్లు కొడదామని వచ్చా! నీలో ఉన్న కళాకారుడికి దాసోహమయ్యాను భాషా పెద్ద రౌడీ నా కొడుకని జనమంతా అనుకుంటుంటే, ఇంతింత పెద్ద మీసాలు, గుబురు గడ్డం, మెడలో తాయెత్తు, చేతికి రాగి కడియం, కిందా పైనా ఒత్తుతూ, నోటికి ఓడాయి ఇచ్చే నలుగురు ఆడోళ్లు, ఆజ్ఞో, గొప్ప సెటప్‌తో ఉంటావనుకుంటే, నువ్వేంట్రా, పిచ్చి ముండా కొడుకులా డముటుకు డముటుకు అంటూ మద్దెల వాయించుకొంటూ సింగిల్‌గా కూర్చున్నావు? నీ దగ్గర స్పూన్ల, చెంచాలా, అదేనోయ్! రౌడీస్! వసూళ్లకు పంపావా? అసలు నాకు తెలియక అడుగుతాను, జనం దగ్గర డబ్బులెందుకురా వసూలు చేస్తున్నావ్? నీ అబ్బగాడి సొమ్మా? నువ్వేమన్నా అండర్ గ్రౌండ్ కింగ్ ననుకున్నావా? డాన్ ననుకున్నావా? కుత్తే నేను పాత శివాజీలా ఉండి ఉండుంటే, చెంప దెబ్బ, చెయ్యి దెబ్బ, కాలి దెబ్బ, కర్ర దెబ్బ, దెబ్బ మీద దెబ్బతో నీ మొఖం మంగళగిరి సంత చేసుండేవాణ్ణిరా! అనవసరంగా ఎమ్మెల్యేనయ్యి జంటిల్‌మాన్‌గా మారిపొయ్యా అరె భాషా! నీ లాంటి ఆకు రౌడీల్ని నేను హాఫ్ నిక్కర్లు వెయ్యక ముందే చూశాను గాని, ఈ రోజు నుంచి జనం జోలికి వెళ్లకు బే వెళ్ళావనుకో, నా సంగతి తెల్సుగా, ఎమ్మెల్యేనన్న సంగతి మర్చిపోయి, డముటుకు డముటుకుమని నువ్వు మద్దెల వాయిస్తావే, అలా వాయిస్తాన్రా నిన్ను భడవా రాస్కెల్

భాషా భడవ కాదు బే భాషా

శివాజీ భాషా, వేషం మార్చినంత మాత్రాన గొప్ప వాణ్ణి అనుకున్నావా? బందరు సెంటర్లో ప్లేట్లు, చిత్తూరులో చిత్తు కాగితాలు అమ్ముకునే సోంబేరి వెధవా

•భాషా రేయ్!

శివాజీ • ఛీ! ఆడదాని జాకెట్టు చించినంత మాత్రాన మగవాడివి అయిపోవు బే నిన్ను నిలబెట్టి తిట్టిన తిట్టు తిట్ట కుండా తిట్టి, నిన్ను కొట్టిన దెబ్బ కొట్ట కుండా కొట్టి, నువ్వు కట్టిన బట్ట లూడ్చి వెళ్ళకపోతే నేను వీరశివాజీని కాదురా బేవకూఫ్

భాషా శివాజీ ముఖం మీద ఫట్ మని కొట్టాడు

భాషా • చూశావా భాషా దెబ్బ?

శివాజీ • నువ్వు భాషా దెబ్బ చూపిస్తే నేను బాదుషా దెబ్బ చూపిస్తానుబే

అంటూ భాషా మీద పడ్డాడు ఫైట్

ఒక ఎమ్.ఎల్.ఏ. ఒక రౌడీ ఇల్లు వెతుక్కుంటూ వచ్చి మాట్లాడిన మాటలివి నిజానికి పరిశీలిస్తే హాలులో కూర్చున్న ప్రేక్షకుల రక్తప్రసారం పెరిగే పద్ధతిలో సంభాషణలు ఉన్నాయి తప్ప, రౌడీయిజం మంచిది కాదు అనే పద్ధతిలో సంభాషణ జరగలేదు ప్రేక్షకుల్ని రెచ్చగొట్టే విధంగా ఉన్నాయి

భాషాని పోలీస్ స్టేషన్‌కి తీసుకు వస్తే అతనికీ, ఓడి పోయిన ఎమ్ ఎల్.ఏ కి మధ్య ఏం జరిగిందనేది రెండవ దృశ్యం

భాషాని పోలీసు స్టేషన్ సెల్‌లోకి తోసి తాళం వేశాడు శివాజీ తాళం చెవి ఎస్ ఐ కిస్తూ

శివాజీ సారీ యస్ ఐ గారూ, మీ పని ఎమ్ ఎల్ ఏ చెయ్యకూడదని నాకు తెలుసు కాని ఏం చెయ్యమంటారు? తప్పని సరి పరిస్థితుల్లో

చెయ్యాల్సి వచ్చింది భాషాగారు గవర్నమెంట్ స్థలాన్ని ఆక్రమించుకొని పట్టా కూడా పుట్టించుకున్నారు ఇది న్యాయమేనా? ఇక్కడ మరి ఇదీ అపేక్ష జాకెట్లు పంచుతున్నారు ఇది ధర్మమేనా? ఓటుకోటా నెక్లెస్ చెంప చెళ్లు మనిపించారు చూడండి, బుగ్గంతా ఎర్రగా కందిపోయింది ఇచ్చేశాను, యక్ష ఇక అర్థంచేసుకోండి

మాజీ రేయ్! ఎస్ ఐ!

శివాజీ మిమ్మల్ని ఒరే అంటున్నాడు! మీ నాన్నా? మీ అన్నా? మీ బాస్మర్దా? లేక మీ వైఫ్ తరుపా?

మాజీ మర్యాదగా భాషని వదిలిపెట్టు లేకపోతే నీ అంతు చూస్తా

శివాజీ ఒరేయ్! పదవిలో ఉన్నవాడు, పదవిలో లేని వాడు, పాలిటిక్స్‌లో తిరిగే ప్రతి ఉద్యోగుడు, ఇలా భయపెట్టబట్టే మన పోలీసు డిపార్ట్‌మెంట్ పనైపోయింది మాజీగారూ!

మాజీ - ఓడిపోయినంత మాత్రాన ఫ్రీ అయిపోయాననుకోకు

శివాజీ - సిగ్గులేదు అలా మాట్లాడటానికి ఎమ్ ఎల్ ఏ అంటే అర్థం ఏంటో తెలుసా నీకు ఎమ్ అంటే మంచిని, ఎల్ అంటే లాభం చూసుకోకుండా ఏ అంటే అందిరికీ పంచేవాడని కాని నువ్వేం చేస్తున్నావ్? ఎమ్ అంటే మర్డర్స్, ఎల్ అంటే లూటీస్, ఏ అంటే అర్హత ఉన్నవాడే ఎమ్ ఎల్ ఏ అని మారుస్తున్నావ్

మాజీ శివాజీ

శివాజీ అరవకు మాజీ హాజీ అనటానికి, రాజీ పడటానికి బేజారవటానికి, నన్ను కన్న మాతాజీ నాకు మామూలు నెత్తురివ్వలేదు

మాజీ రాజీకి రాకపోతే నీకే ప్రమాదం

| | | |
|---|---|---|
| | శివాజీ | యహో! తాడేపల్లిగూడెంలో తాండ్రఅమ్ముకుంటాను, లేకపోతే రాజమండ్రిలో లాండ్రీషాపు పెట్టుకుంటాను, అంతేగాని నీలాంటి రాస్కెల్ గాళ్లతో రాజీకెలా వస్తాను? |
| | మాజీ | నేనోడిపోవచ్చు కాని మా పార్టీ గెలిచింది |
| | శివాజీ | వెళ్లి టీపార్టీ చేసుకో నేనెవరికీ భయపడేవాణ్ణి కాదు ఇండిపెండెంట్‌ని తప్పుచేసిన వాడి తుప్పు లేపే హక్కున్నవాణ్ణి |
| | మాజీ | ముందుంది ముసళ్లపండగ |
| | శివాజీ | డబ్బింగ్ టైటిల్ సినిమాకి పనికొస్తుంది వెంటనే వెళ్లి పెట్టుకో |
| | మాజీ | నిన్నేం చేస్తానో తెల్సా? |
| కట్‌చేస్తూ | శివాజీ | వన్స్ అపాన్ ఎ టైమే ఏం చెయ్యలేకపోయావు, ఇప్పుడేం చేస్తావ్? పీకుతావా ఎమ్ ఎల్ ఏ పదవి నుంచి పిచ్చికుంకా |
| | మాజీ | ఏయ్! |
| | శివాజీ | ఏయ్! అరిస్తే చరుస్తా చరిస్తే కరుస్తా కరిసే నిన్ను కూడా బొక్కలో వేస్తా ఖబడ్దార్ |

అంటూ హెచ్చరించి వెళ్లాడు

ఎమ్ ఎల్ ఏ. అంటే ఎలా ఉండాలి అనేది కూడా చమత్కారంగా చెప్పటం జరిగింది ప్రేక్షకుల హర్షామోదాలు పొందే సంభాషణ రచనాప్రయత్నమే జరిగింది తప్ప పోలీసులు, ఎమ్ ఎల్ ఏ ల నైతిక వర్తన గురించి మాట్లాడలేదు

హాల్లో మంత్రి, పత్రికా విలేఖర్లు
వెయిట్‌చేస్తున్నారు
శివాజీ లోపలకు వస్తుంటే

| | | |
|---|---|---|
| | ఒకడు | గుడ్మార్నింగ్ సార్ |
| | శివాజీ | గుడ్మార్నింగ్ |

మరో　రండి

అంటూ ఆహ్వానించారు

పత్రికా విలేఖర్లకు లభివాదం చేస్తూ

శివాజీ　నమస్కారం సార్, నమస్కారం సార్, ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రభూమి, మరియు ఈనాడు, ఉదయం, మొదలైన పత్రికా విలేఖర్లందరూ వచ్చారా?

విలేఖ　వచ్చాం సార్ ఆ శుభవార్తేమిటో చెప్పండి

మంత్రి　నేను చెప్తాను ఈ రోజు నుంచి ఈ వీర శివాజీ

కట్ చేస్తూ

శివాజీ　నన్ను చెప్పనివ్వండి మంత్రి గారూ స్పెల్లింగ్ మిస్టేక్స్ లేకుండా చెప్తాను

శివాజీ చేతిలో ఉన్న సూట్కేస్ ఓపెన్ చేస్తే దాన్నిండా డబ్బు!

పది లక్షల రూపాయలు! నేనాయనకు మద్దతునిచ్చిన మరుక్షణం ఆయన నాకిచ్చేడబ్బు! తీసుకోమంటారా? వన్స్ అపాన్ఎ టైమ్ ఈయనకొడుకు పదవ క్లాసులో కాపీ కొడుతుంటే, పట్టుకున్నందుకు మా నాన్నను ఒకటవ తరగతికి రివర్ట్ చేశాడు ఇప్పుడు నేనాయనకు మద్దతునిస్తే మా నాన్నను హెడ్మాస్టర్ని చేస్తాడంట చేరమంటారా?

మంత్రి　శివాజీ! నేనెవరో తెలిసే మాట్లాడుతున్నావా?

శివాజీ　గుంటూరులో గుగ్గిళ్ళమ్ముకునే చవటను గాను నేను, మీరెవరో నాకు తెలుసు - 1943లో బెజవాడ ధర్మాసుపత్రిలో ఓ సి గా పుట్టావు అడ్రసు లేని వాడివి

మంత్రి　పత్రికల వాళ్ల ముందు నా పరువు తీస్తావా?

శివాజీ　బోఫోర్స్ నుంచి ఏ ఫోర్స్ గురించయినా బయట పెట్టేది ఈ పత్రికల వాళ్లే వ్యభిచారం చేసే వాడు నీతి, అపచారం చేసేవాడు జాతి తలవకూడదు మంత్రి గారూ మనిషికి ఐదు లక్షలు, పది లక్షలు ఇచ్చి

కొంటావా? కూరగాయల మార్కెట్‌లో దొరికే పల్లీలనుకున్నావా యం ఎల్ ఎ లంటే? డబ్బుకి అమ్ముడు పోయేది వేశ్య! పదవి అమ్ముకొనే వాళ్ళ పేరేంటి? బ్రోకర్! బ్రోతల్ ఛీ! ప్రపంచంలో ముందు ముందు ఇలాంటి వాళ్లు వస్తారని తెలియక డిక్షనరీలో ఆ పదం కూడా రాయలేదు ఒక పార్టీ పేరుతో, ఒక నాయకుడి అండతో గెల్చి ఈ రోజు నుంచి ఆయన రామచంద్రుడు, నేను హనుమంతుణ్ణి అని చెప్పి రేపు కుప్పిగంతులు వేస్తే ఆ తప్పుకి తంతారు జనం నీలాంటి రాజకీయ నాయకుల్ని తలచుకుంటే, నీతో చేతులు కలపాలన్న ఆలోచన వస్తేనే పసితనంలో తాగిన అమ్మపాలు కూడా కక్కేంత వికారం పుడ్తుంది

విలేఖర్లనుద్దేశించి

డియర్ ఫ్రెండ్స్! కొత్తగా కాపురానికొచ్చినపిల్ల మొగుడు కొజ్జా వాడని తెలిస్తే ఎంత అల్లాడిపోతుందో, కొత్తగా అసెంబ్లీ లోకి అడుగు పెట్టిన నేను, ఇలాంటి కొజ్జాలను, మతి లేని వెధవల్ని చూసి సిగ్గు పడుతున్నాను వీడు నన్ను చంపిస్తాడో, నా వాళ్లను చంపిస్తాడో నాకు తెలియదు కాని నేనిలాంటి లోఫర్లకి, డాఫర్లకి భయపడే వాణ్ణి కాదు ఫైనల్‌గా ఈ వార్త రాయొద్దని మీకు లంచం ఇవ్వటానికి కూడా ట్రై చేస్తాడు, జాగ్రత్త

మంత్రి దగ్గరకు నడిచాడు

**శివాజీ** ఇచ్చింది యాజిటీజ్‌గా తిరిగి ఇవ్వ కూడదంటారు పెద్దలు అందుకే నీ పది లక్షలకు -

తలలో వెంట్రుక పీకి

ఈ వెంట్రుక జాయింట్ చేసి ఇస్తున్నాను

మంత్రికి సూట్‌కేస్ ఇచ్చేశాడు

కోపంగా

**మాజీ** రేయ్!

**శివాజీ** అరిస్తే చరుస్తా చరిస్తే కరుస్తా కరిస్తే ఉరితీస్తా!

వెళ్ళిపోయాడు

మూడోదృశ్యం మంత్రితో మాట్లాడిందిమాత్రం సమాజపరంగా ఎమ్ ఎల్ ఏలు అమ్ముడు పోగూడదన్న నీతి, రాజకీయాల్లో అవినీతి ఎలాపాతుకుపోయిందో, పదవిని అమ్ముకునేవాడు ఒళ్ళు అమ్ముకునే వేశ్య కంటే ఎంత హీనవెూ, ఒకనాయకుడి వ్యక్తిత్వంతో గెలిచి ఆ నాయకుణ్ణి వదిలిపెట్టటం ఎంత తప్పో చెప్పటంజరిగింది

ఈ మూడు దృశ్యాలలో ఉండవలసిన దాని కంటే వెూతాదు మించి సంభాషణలున్నాయి సంభాషణ లేకుండా మెలోడ్రామా నడపవచ్చు, సంభాషణతో నడపవచ్చు అందుకే అతి సంభాషణ, అతినాటకీయతను సముపార్జించిపెట్టింది శూన్యాన్ని గుర్తుకురానివ్వలేదు కనుక ఇది అతి నాటకీయ సంభాషణశిల్పంగా మారింది

**పాత్రౌచిత్య పాలన** ఒక్కొక్కసారి ఒక్కొక్క పాత్రౌచిత్యాన్ని కాపాడటానికి సంభాషణ రాయవలసి వస్తుంది

**మేజర్** చక్రధర్ ఒక నిబద్ధ నియమసంస్కారవంతుడైన సైనికాధికారి పరమవీరచక్ర బిరుదాంకితుడు, అలాంటివాడు మామూలు నేరస్తుడి స్థాయికి దిగిపోయి హత్యలు చేసాడు న్యాయస్థానానికి పట్టుబడ్డాడు ఒక హంతకుడిగా న్యాయస్థానం ముందు నిలబడ్డాడు అతని సంజాయిషీ చెబుతున్నాడు

అతను తన భార్యను చంపినందుకు, తన బావను చంపినందుకు ప్రతీకారంగా ఈ హత్యలు చేసిన సాధారణప్రతీకారనాయకుడిస్థాయికి పడిపోగూడదు

సమాజానికి అధర్మం చేసేవాడు, అన్యాయం చేసేవాడు ఎవడయినా అతని దృష్టిలో శత్రువే దేశానికి హానిచేసేవాడు శత్రువే ఆ శత్రువు సరిహద్దు ఆవల ఉన్నాడా? ఈవల ఉన్నాడా అన్నది ప్రశ్న కాదు ఎవరు శత్రువో వాడు మరణశిక్షకు అర్హుడు

ఇది అతని పాత్ర స్వభావం ఈ స్వభావం కాపాడబడటం పాత్రౌచిత్యం ఆ పాత్రౌచిత్యం సంభాషణ ద్వారా కాపాడబడటం పాత్రౌచిత్య సంభాషణ శిల్పం

## బొబ్బిలిపులి:

కోర్టుగంటలు వినిపిస్తుండగా పోలీసులు
సంకెళ్లతో బొబ్బిలిపులి చక్రధర్‌ని
విచారణ కోసం కోర్టులోకి
తీసుకొచ్చారు
చక్రధర్ బోనులో నిలబడ్డాడు

కో.గు దేవుని మీద ప్రమాణంచేసి

| | | |
|---|---|---|
| | చక్ర | దేవుని మీద ప్రమాణం చేసి |
| | కో గు | అంతా నిజమే చెప్తాను |
| | చక్ర | అంతా నిజమే చెప్తాను |
| | కో.గు | అబద్ధం చెప్పను |
| | చక్ర | అబద్ధం చెప్పను |
| ప్రమాణం చేయించి గుమస్తా వెళ్లాడు లేడీ లాయర్ బొబ్బిలి పులి దగ్గరకు వచ్చింది ప్రశ్నించటానికి | | |
| | లాయ | మీ పేరు? |
| | చక్ర | బొబ్బిలి పులి |
| | లాయ | అసలు పేరు |
| | చక్ర | బొబ్బిలి పులి |
| | లాయ | ఇదివరకు రెండుసార్లు కోర్టులో హాజరైనప్పుడు మీ పేరు చక్రధర్ అన్నట్టు గుర్తు |
| | చక్ర | ఆ కోర్టులతోను, ఆ తీర్పుల తోనూ, ఆ చక్రధర్ ఆనాడే చచ్చిపోయాడు |
| | లాయ | మనిషిగా చచ్చిపోయాడా? |
| | చక్ర | మానసికంగా చచ్చిపోయాడు |
| | లాయ | కారణం? |
| | చక్ర | ఈ సమాజంలో ఉన్న కుళ్లును చూడలేక |
| | లాయ | మాకు అందరికీ కనిపించని కుళ్లు మీకు ఒక్కరికే కనిపించిందా? |
| | చక్ర | మురికి కాలవ ప్రక్కన కాపురం చేసే వాళ్లకి, వాళ్లల్లో కూడా ఆ వాసన జీర్ణించి పోతుంది కొత్తగా వచ్చిన వాళ్లే ఆ వాసన భరించలేక పారిపోతారు |

లాయ కొత్తగా మీరెక్కడి నుంచి వచ్చారు?

చక్ర నీతి, నిజాయితీ, క్రమశిక్షణా, త్యాగం, ధైర్యం ఉన్న చోటు నుంచి

లాయ ఇవన్నీ సమాజంలో లేవు కాబట్టి, మీరు బొబ్బిలి పులిగా మారి మీ ఇష్టం ఉన్న వాళ్ళందర్నీ చంపేశారన్న మాట?

చక్ర ఇష్టం ఉన్న వాళ్ళను కాదు, దేశానికి నష్టం తెస్తున్న వాళ్ళని

లాయ ఆ నష్టం దేశానికి మీ వల్లే కలిగిందని మేం అనుకొంటున్నాం

చక్ర కాబట్టే నన్నీ బోనెక్కించారని నేను అనుకొంటున్నాను

లాయ చక్కెర ఫ్యాక్టరీ ఓనరు రాజారావు గారిని చంపింది మీరేనా?

చక్ర . అవును

లాయ సిమెంట్‌ఫ్యాక్టరీ భాగస్థులు పేర్రాజు గారిని చంపింది కూడా మీరేనా?

చక్ర వారి కేసును తప్పు దారి పట్టించిన ఇన్‌స్పెక్టర్ రాయుణ్ణి చంపింది నేనే! ఏ తప్పుడు కేసు వచ్చినా భుజాన వేసుకొని మోసే లాయరు కృష్ణ మూర్తిని చంపింది కూడా నేనే! హాస్పటల్లో చేరకుండానే చేరానని తప్పుడు సాక్ష్యం చెప్పిన డాక్టర్ వెంకటేష్‌ని చంపింది కూడా నేనే! సిస్టర్ అన్న పదానికి మచ్చ తెచ్చిన ఆ నర్సుని చంపిందీ నేనే! నా చెల్లెలి జీవితాన్ని నాశనం చేసిన ఆ దుర్మార్గుణ్ణే చంపాలని ప్రయత్నించిందీ నేనే! దేశద్రోహి అయిన నా కన్నతండ్రిని చంపుకున్నది కూడా నేనే!

జడ్జీ వంక చూస్తూ

లాయ అంటే, ఈ హత్యలన్నీ మీరే చేశారా?

చక్ర నేనే! నేనే! నేనే! ఎన్ని సార్లు చెప్పమంటారు?

లాయ ఇన్ని చేసి మీరు సాధించిందేంటి?

చక్ర మీరు సాధించలేనిది

లాయ ఐసీ, తెలియక చేశారా? ఆవేశంలో చేశారా? తెలిసీ కావాలని చేశారా?

చక్ర తెలిసీ, కావాలనే, వాళ్లను చంపాలనే తీసుకు వెళ్లి, నరికి ముక్కలు చేశాను

లాయ యువరానర్! బొబ్బిలిపులిగా ముద్ర బడిన మేజర్ చక్రధర్ అనబడే ఈ ముద్దాయి, ఈ హత్యలన్నీ, కోరి కావాలని, కక్షతో ఏదో సాధించాలనే పట్టు దలతో చేశానని కోర్టు వారి ముందు తనకు తానే ఒప్పుకొంటున్నాడు సంఘానికి అతి అవసరమైన, అతి ముఖ్యమైన కొందరు వ్యక్తుల్ని కేవలం తనపంతం నెగ్గించుకోవటం కోసం, గతంలో తనను వాళ్ళందరూ అవమానించారన్న కక్షతో, ప్రతీకారం తీర్చుకోవటంకోసమే ఈ హత్యలు చేశానని ఒప్పుకొన్నాడు యువరానర్! ఇన్నాళ్ళూ దేశాన్ని, ప్రజల్నీ భయాందోళనలతో ముంచెత్తిన బొబ్బిలిపులిని కఠినంగా శిక్షించి, దేశానికి ప్రశాంతపరిస్థితిని ఏర్పరచవలసిందిగా కోరుతున్నాను యువరానర్! మిస్టర్ చక్రధర్‌ని శిక్షించి, న్యాయానికి న్యాయం చేకూర్చ వలసిందిగా -

దుఃఖంతో మాట్లాడ లేకపోయింది

జడ్జి బొబ్బిలిపులిగా పిలవబడుతున్న మేజర్‌చక్రధర్ అనబడే ఈ ముద్దాయి, తను చేసిన నేరాలన్నింటిని కోర్టు వారి ముందు ఒప్పుకున్న కారణంగా ఐ పి సి 300, 302, 307 సెక్షన్ల ప్రకారం, శాంతి భద్రతల దృష్ట్యా, సమాజ శ్రేయస్సు దృష్ట్యా, ముద్దాయి

చక్రధర్‌కి కోర్టువారు ఉరిశిక్ష విధిస్తున్నారు నేరాలన్నీ తనకు తానే స్వయంగా చేశానని ఒప్పుకొన్న కారణంగా, శిక్షతగ్గింపు కోసం, పై కోర్టుకు అప్పీలు చేసుకోవటానికి, ముద్దాయికి అవకాశం కూడా కలగజేస్తున్నారు

చక్ర ఒక్క నిమిషం నాకు అవకాశం ఇవ్వగలరా?

జడ్జి యస్

చక్ర పై కోర్టుకి వెళ్లటానికి నాకు అవకాశం ఉందా?

జడ్జి అవును! ఉంది

చక్ర పైకోర్టుకి వెళ్లితే ఏం జరుగుతుంది యువరానర్?

జడ్జి శిక్ష తగ్గించవచ్చు లేదా అదే శిక్షను ఖాయం చేయవచ్చు

చక్ర అంటే ఈ కోర్టులో వేసిన శిక్ష పై కోర్టులో పోవచ్చు, ఆ కోర్టులో వేసిన శిక్ష ఆ పై కోర్టులో పోవచ్చు, లేదా కింది కోర్టు వారు వేసిన శిక్షనే పై కోర్టు వారు కూడా ఖాయం చేయవచ్చు! అంటే ఒక కోర్టుకి ఇంకొక కోర్టుకీ సంబంధం ఉండవచ్చు! ఉండక పోవచ్చు! కోర్టు కోర్టుకి! తీర్పు తీర్పుకి ఇంత మార్పుంటే ఈ న్యాయస్థానంలో న్యాయం ఉన్నట్లా యువరానర్! ఒక్కొక్క కోర్టులో ఒక్కొక్క తీర్పు ఉంటుంది గనుకనే నేరస్తుడు తాను చేసిన నేరం ఏవిటో మరిచిపోయిన తర్వాత గాని శిక్ష పడదు తెలివిగా పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గారు రామరాజును చంపావా, భీమరాజును చంపావా అని అడిగారేగాని, వాళ్లను ఎందుకు చంపావు అని ఎందుకు అడగలేదు యువరానర్?

జడ్జి కేసు వివరాలన్నీ కాగితాల్లో ఉన్నాయి కదా?

చక్ర ఓహో, అంటే కాగితాలేనా మీకు ఆధారం? యువరానర్! జస్ట్ ఎ మినిట్, మీరు జడ్జీ అని మర్చిపోండి, ఇది న్యాయస్థానమని మర్చిపోండి, మనిషిగా, హృదయమున్న మనిషిగా ఆలోచించండి యువరానర్ నేను చంపిన వాళ్లందరు

కూడా వాళ్లవాళ్లయొక్క వ్యక్తిగత జీవితాలు, చరిత్రపుటలు, తిరగవేసి చూడండి నేను విధించే శిక్షకు వాళ్ళు అర్హులో కారో మీరే తేల్చి చెప్పండి యువరానర్

జడ్జీ అదంతా కేవలం వ్యక్తిగతం

చక్ర ఆ! దేర్ యు ఆర్, దేర్ యు ఆర్ యువరానర్, ఈ రోజుల్లో వ్యక్తి గతంగా కాక సంఘపరంగా ఎవరు ఆలోచిస్తున్నారు యువరానర్! ప్రతి వ్యక్తీ తనకు కావలసిందేదో అది సాధించటం కోసం, తన స్వార్థం కోసం, తనఅడ్డును తొలగించుకోటానికి ప్రయత్నిస్తారు ప్రభుత్వం కళ్లు మూసేస్తారు న్యాయస్థానం కళ్లు కప్పేస్తారు న్యాయం కాపాడవలసిన కొందర్ని డబ్బుతో కొనేస్తాడు అందుకే ఆ నేరస్థుల్ని నా చేతుల్తో నేనే స్వయంగా చంపాను కాని యు షుడ్ నాట్ గెట్ లా ఇంటూ యువర్ హాండ్స్, ప్రభుత్వాన్ని, చట్టాన్ని మీ చేతుల్లోకి తీసుకోకూడదూ అంటారు మీకు, మీ న్యాయస్థానానికి కావలసింది సాక్ష్యాలు, ఆధారాలు పంచదార గోడవునులో బస్తాలు తరలిస్తూ ఉండగా నా కళ్లతో నేను చూశాను కాని సాక్ష్యం ఎక్కడి నుంచి తేను యువరానర్ వచ్చిన సాక్షులు డబ్బుకు అమ్ముడయి పోయారు ఆ రోజు రోడ్డు మీద, నడి రోడ్డు మీద, మనిషిమీద కారుపోతూఉండగా వాళ్లు చచ్చిపోతూ ఉండగా, నేను నా కళ్లతో చూశాను దానికి ఉన్నది రెండే రెండు సాక్ష్యాలు ఒకటి నేను, రెండు ఆ భగవంతుడు! ఆ భగవంతుడు ఉన్నాడో లేడో తెలియదు, ఉన్నా ఇక్కడికి రాడు, రాలేడు ఉన్న ఒక్కణ్ణీ నేను వచ్చాను

హంతకులెవరో కోర్టుకి తెలుసు! నాకు తెలుసు! జరిగిందానికి ఆధారాలు లేవు ఆధారాలు లేందే మీరు శిక్షించలేరు కాబట్టి మీరు విధించలేని శిక్షల్ని నా ఆత్మసాక్షి ఆధారంగా, న్యాయస్థానాల పరువు ప్రతిష్ఠలు కాపాడటం కోసం నేను విధించాను ఓ కే! ఓ కే యువరానర్! మీరిచ్చే తీర్పుకు, మీరు వేసే శిక్షను అనుభవించటానికి నేను సిద్ధంగా

ఉన్నాను. కాని ఆఖరి సారిగా మిమ్మల్ని ఒకే ఒక మాట అడుగుతాను. నాకెందుకీ ఉరిశిక్ష విధించారు?

జడ్జి మనుషుల్ని చంపినందుకు

చక్ర ఓ! మనుషుల్ని చంపితే ఉరిశిక్షవేస్తారు గదూ! మరి ఆనాడు యుద్ధంలో నేను ఒక్కణ్ణే సుమారు నాలుగు వందల మందిని దారుణంగా చంపాను. అంటే హత్య చేశాను. మరి నాకు దానికి ఉరి శిక్ష విధించలేదే? పైగా నేనేదో గొప్ప ఘన కార్యం సాధించానని మహావీర చక్ర బిరుదు ఇచ్చి నన్ను సత్కరించారు. ఆ సత్కారం దేనికి యువరానర్? ఆ బిరుదు దేనికి యువరానర్?

జడ్జి శత్రువుల్ని చంపినందుకు

చక్ర శత్రువులంటే మనుషులు కారా?

జడ్జి కావచ్చు, కాని మనకు శత్రువులు?

చక్ర ఏ విధంగా మనకు శత్రువులు యువరానర్?

జడ్జి మన దేశాన్ని కబళించటానికి వచ్చిన వాళ్లు

చక్ర వాళ్ల దేశాన్ని కాపాడుకోటానికి వచ్చిన వీరులని కూడా అనుకోవచ్చుగా యువరానర్?

జడ్జి అఫ్‌కోర్స్, కావచ్చు

చక్ర వాట్ కావచ్చు యువరానర్? వాళ్లెవరో మనకు తెలియదు. మనకు సంబంధం లేని వాళ్లు, మన పొరుగువాళ్లు, మన తోటి సోదరులు, మనమెలా మన దేశాన్ని రక్షించుకోటానికి వెళ్లామో, వాళ్లు కూడా అలాగే వాళ్ల దేశాన్ని రక్షించుకోటానికి వచ్చిన వాళ్లు. వాళ్లను చంపితే సన్మానం, సత్కారం, మహావీర చక్ర బిరుదు ప్రదానం! మరి మన వాళ్లు, మన దేశాన్ని, దేశ ప్రజానీకాన్నీ, పేద ప్రజల్ని, న్యాయస్థానాన్ని,

న్యాయాన్ని రక్షించే స్థావరాల్ని కొల్లగొడుతూ, తమ స్వార్థానికి ఉపయోగించుకుంటున్న నేరస్థుల్ని చంపితే అది నేరం! దానికి బహుమానం ఉరిశిక్ష! ఆహా యువరానర్! నాకిచ్చిన మహావీరచక్ర బిరుదు ప్రదానం నా దేశాన్ని కాపాడుకోటం కోసమే అయితే, నా దేశాన్ని పరిరక్షించుకోవటం కోసమే అయితే, అది అప్పుడు కాదు యువరానర్ ఇప్పుడు ఇప్పుడు నాకివ్వాలి నిజంగా మన దేశాన్ని నేను ఇప్పుడు కాపాడాను వాళ్లు మన దేశానికే శత్రువులు వీళ్ళు మనదేశాభ్యుదయానికే శత్రువులు! వాళ్ళు ముందుకు వచ్చి తుపాకులతో పోరాడారు వీళ్లు వెనక్కి వచ్చి వెన్నుపోటు పొడిచారు వాళ్లలో నిజాయితీ ఉంది వీళ్లలో కుట్ర, కుళ్లు ఉంది వాళ్లను చంపితే సన్మానం, సత్కారం, వీళ్లను చంపితే ఉరి శిక్ష! భేష్! భేష్ యువరానర్! ఇదే మీ చట్టమైతే మీకూ, మీ చట్టానికి కోటి వందనాలు! ఇదే మీ న్యాయమైతే, మీకూ మీ న్యాయానికి శతకోటి అభివందనాలు! ఇదే మీ ధర్మమైతే, మీకూ మీ ధర్మానికీ అనంత కోటి సాష్టాంగ నమస్కారాలు!!

రెండు చేతులు జోడించాడు

ఆ కోర్టులతోనూ ఆ తీర్పులతోనూ ఆచక్రధర్ ఆనాడే చచ్చిపోయాడు - అనటం చట్టాన్ని, న్యాయాన్ని నమ్మిన చక్రధర్ నమ్మకం చచ్చిపోయిందని చెప్పటం అందుకే మానసికంగా చచ్చిపోయాడు అన్నాడు నమ్మకం పుట్టేది మనసులోనుంచే

తను, నీతీ, నిజాయితీ, క్రమశిక్షణ, త్యాగం, ధైర్యం ఉన్న చోటు నుంచి వచ్చానన్నాడు ఇష్టం ఉన్న వాళ్ళను కాదు, దేశానికి నష్టం తెస్తున్న వాళ్ళను చంపానన్నాడు ఇది పాత్ర స్వభావం

మీరు సాధించేందేవిటి? అంటే మీరు సాధించలేనిది అన్నాడు అంటే మీ లాయర్లు న్యాయస్థానం ద్వారా శిక్షలు పడేలా చూడాలి మీరు నిర్వీర్యమయి, నిస్సహాయులు అవబట్టి, నేనే ప్రత్యక్షంగా శిక్షించాల్సివచ్చిందని చెబుతున్నాడు పైగా ఆ నేరాలు తెలిసే, కావాలని చేసానని అంగీకరిస్తున్నాడు

అయినా అది నేరం కాదని అతని భావన, అతని వాదన ఒక కోర్టు విధించిన శిక్షను మరో కోర్టు తగ్గించవచ్చు, పెంచవచ్చు అన్న న్యాయపరమైన రంధ్రాన్ని కూడా వేలెత్తి చూపించాడు

నిజానికి ఆఖరి నాలుగు మాటలు చాలు ఈ సన్నివేశానికి సైనికాధికారిగా నాలుగు వందల మందిని చంపితే బిరుదిచ్చారు, ఇప్పుడు దేశద్రోహుల్ని చంపితే ఎందుకు శిక్షిస్తున్నారు అన్నదే సూటి ప్రశ్న దేశాన్ని పరిరక్షిస్తున్నందుకే తనకు మహా వీర చక్ర బిరుదం ఇస్తే అది ఇప్పుడు ఇవ్వాలన్నదే అతని నివేదన

ఈ ఒకటి రాసి ఊరుకుంటే సంభాషణ సరిపడినంత లేనట్లు ప్రేక్షకుడు భావిస్తాడు అందుకే సమర్ధనాపరంగా సుదీర్ఘసంభాషణ కొనసాగింది వెయ్యితిరిగిన రచయిత దాసరి ఈ చిత్రంతో ఒక సంచలం సృష్టించాడు

**కథౌచిత్య పాలన** కథ ఒక ఇతివృత్తం మీద ఆధారపడి ఉంటుంది అది ఏ దృష్టి కోణంలో చెప్పబడ్డా ప్రధాన పాత్రకు ఒక ఆశయం ఉంటుంది ఆ ఆశయ సాధనే చిత్రం ఆ ఆశయం గురించి చిత్రంలో అనేక పర్యాయాలు గాని, ఒక సన్నివేశంలోగాని, లేదా ఒక ముగింపు దృశ్యంలో గాని ఆ ఆశయ సమర్ధన కోసం సంభాషణ రాస్తారు అంటే ఆ కథౌచిత్యాన్ని కాపాడటానికి, అతను నిర్మించుకున్న కథానిర్మాణానికి పునాదిరాళ్ళవంటి సంభాషణలు రాసుకుంటాడు

ఇంతకు ముందు పరిశీలించిన **శుభలగ్నం** చిత్రంలో కథానాయిక ఆశయం డబ్బుంటే చాలు సుఖపడవచ్చు అని కాని ప్రేక్షకదృష్టి కోణంలో చిత్రం నడవబట్టి ఆ భార్యాభర్తలిద్దరూ కలిసిపోవాలని వారి ఆశయం అయ్యింది కథానాయిక ఆశయం తప్పు అని స్థాపించటానికి అనేక దృశ్యాలు సృష్టించబడ్డాయి ప్రతిదృశ్యంలో విషయంఒక్కటేకావటంవల్ల ప్రేక్షకుడికి విసుగుపుట్టే ప్రమాదంఉంది అందుకే ప్రేక్షకులు చప్పట్లతో ఆదరించే నీతులలాంటి మాటలు కావాలి ఆ మాటలు తూటాల్లాగా రాధ (కథానాయిక) కు తగలాలి

ఈ కింది సంభాషణలు పరిశీలిస్తే ఈ విషయం అవగతమవుతుంది

**శుభలగ్నం – కొన్ని సంభాషణలు :**

క) తన కూతురు బొచ్చు కుక్కని
చేతిలో పెట్టుకుని భేషజం
పోతున్నప్పుడు

**రాధ తల్లి** అంత డబ్బున్న పిల్ల లత లక్షణంగా చీర కట్టుకుని జడ వేసుకుంటే నువ్వేంటే క్రాఫింగ్ చేయించుకున్నావ్?

ఖ) పాతసామాన్లు పాత ఇంటి దగ్గర నుంచి తెచ్చిన సందర్భంలో ఈ ఇంటికి ఎందుకు తెచ్చారని రాధ అడిగితే

లత నేనే తెప్పించానక్కా, ఆ సామాన్లన్నీ ఆయన కష్టపడి సంపాదించిన డబ్బుతో కొన్నవి గదా, పారెయ్యటానికి మన సొప్పక

గ) మీనా తన ఇల్లు రాధకి అమ్మి ఫోటో తీసుకెళ్ళటానికి వచ్చినప్పుడు ''చూసావా నేనే గెలిచాను'' అన్నట్లుమాట్లాడితే

మీనా . నువ్వు నీ మొగుణ్ణి అమ్ముకొని నా బంగ్లా కొన్నావ్, నేను నా మొగుణ్ణి బతికించుకోవటం కోసం నా బంగ్లా అమ్ముకున్నాను నువ్వు నా కంటేఎప్పుడూ పేదదానివే

ఘ) కొత్తకార్లోవెళ్ళమని రాధ భర్తతో చెప్పినప్పుడు

మధు డబ్బొచ్చింది నాకు కాదు నీకు!

ఙ) లతతో పిల్లలు వెళ్ళారని సంతోషిస్తుంటే

మధు పిల్లలు లతకు దగ్గరయ్యారన్న మాట కాదు, నీకు దూరం అవుతున్నారు

చ) భర్త కలిసి గడుపుదాం అని అడిగిన పెళ్ళిరోజు మరిచి పోయిన సందర్భంలో, కంగారుగా మెట్లు దిగి వస్తుంటే

తల్లి ఇంతకంటే దిగిపోటానికి మెట్లు లేవే ఇవాళ నీ పెళ్ళి రోజు అనే విషయం గుర్తుందా?

రాధ గుర్తొచ్చే వచ్చేసాను

తల్లి మర్చిపోగూడని విషయాన్ని గుర్తొచ్చిందీ అని చెప్పటానికి సిగ్గుగా లేదు నీకు?

ఒదే సందర్భంలో పేకాట్టానికి వెళ్ళానని కూతురు చెపితే

తల్లి — పేరంటానికి అని అబద్ధం చెపితే ఎంతో సంతోషించేదాన్ని గదే! డబ్బుమైకంలో నువ్వు పెళ్ళిరోజు మరిచిపోయావ్, అల్లుడుగారు నిన్నుమరిచిపోయేరోజు రాగూడదని దేవుడికి దణ్ణం పెట్టుకుంటున్నాను వస్తాను

రాధ — అమ్మా! ఇంత కొంపలో ఒంటరిగా నేనెలా ఉండగలను వాళ్ళు వచ్చే వరకు తోడుండమ్మా

తల్లి — మా ఇంట్లో మా ఆయన ఒంటరిగా ఉన్నారమ్మా! ఆయనకి రెండో పెళ్ళాం గూడా లేదు

ఛ) ఇద్దరూ చేతికి గోరింటాకు పెట్టుకున్నప్పుడు, లత తన నుదుటి మీద బొట్టునే మధు నుదుట బొట్టుగా తీర్చిదిద్దినప్పుడు

మధు — దేనికయినా మనసుండాలి

జ) ఇంటి ఓనర్ కూడా మంచిమాటలు చెబుతాడు (అవి ఇదే వ్యాసంలో వ్యంగ్యాత్మ కతలో ఉన్నాయి)

ఝ)

తల్లి — డబ్బుంటే చాలు జీవితాన్ని సుఖంగా అనుభవించవచ్చు అనుకున్నావ్! ఇప్పుడు అనుభవించటానికి జీవితమే లేదు!

ఞ)

విధవరాలు. నాకు మొగుడు లేకా ఒకటే! నీకు ఉండీ ఒకటే!

ట)

లాయర్ — నువ్వు మెడలో వేసుకున్న తాళి అలంకారం కోసం మాత్రమే, నువ్వు బొట్టు పెట్టుకున్న విధవరాలివి!

ఇలా కథానిర్మాణ క్రమంలో భర్తను అమ్మటం తప్పు అని రాధ తెలుసుకోవాలి ఈసారయినా మారుతుందేమో, ఈ మాటకన్నా మారుతుందేమో అన్నఆశ ప్రేక్షకుడికి, డబ్బేముఖ్యం అనుకున్న రాధమనసుకీ తగిలింది - ప్రతిసంభాషణ చివరకు కథలో ఆశయంవైపుకి ఆమెను మరల్చటం జరిగింది

ఈ కథానిర్మాణ విషయంలో విలియమ్ గోల్డ్‌మాన్

*అద్భుతమైననటీనటుల చేతచెప్పబడాలిగనుక సినిమాకి రాయటం అంటేచాలా మంది సంభాషణా రచనే అనుకుంటారు నిజానికి కథారచయిత మూలంగా సంప్రాప్తించేది కథా నిర్మాణమే* [24] అన్నాడు

ఇది వాస్తవం నువ్వు సృష్టించుకున్న పాత్ర ఎంత గొప్పదో నువ్వు ఊహించుకున్న కథ అంత గొప్పదే పాత్రౌచిత్యం కాపాడినట్లే, కథౌచిత్యాన్ని కాపాడాలి

*గణేష్* చిత్రం పేదల కోసం ఏర్పాటు చేసిన ప్రభుత్వ ఆసుపత్రులలో వైద్యం సరైన స్థాయిలో లేదని, సరైనస్థాయిలో అందే ఖరీదయినఆసుపత్రులలో పేదలకుఅందుబాటులోఉండదు అన్న ఇతివృత్తంతో నిర్మించబడింది

ఇందులో కథానాయకుడు ఆసుపత్రులలో నిర్లక్ష్యం మూలంగా, నిరాదరణ మూలంగా తండ్రిని, చెల్లిని కోల్పోయి హంతకుడిగా మారిపోతాడు బొబ్బిలిపులిలో తను ఎందుకు చంపవలసి వచ్చిందో చెప్పాడు చక్రధర్ ఇక్కడ తను ఎందుకు చంపాడో చెప్పి, అది తప్పుకాదు అని గణేష్ సమర్థించుకోవటం లేదు రాష్ట్రంలో ఉన్న ఆసుపత్రులు దేవాలయాల్లా కాకుండా, విషవలయాల్లాగా ఉన్నాయని చెబుతున్నాడు

*గణేష్ దృశ్యం :*

గణేష్ — ఎవడైనా గన్‌పేల్చాడో అక్కడ మీ హెల్త్‌మినిస్టర్‌పేలిపోతాడు నిన్నటి వరకు జైల్లో ఉన్న నా దగ్గరకి ఇంత డబ్బు ఎలా వచ్చిందని ఆశ్చర్య పోతున్నారా? ఇది మీ డబ్బు, మీ డబ్బు, తీసుకోండి తీసు కోండమ్మా! యస్! ఇది ప్రజల డబ్బు! ప్రజల ఆరోగ్యం కోసం ప్రభుత్వం కేటాయించిన డబ్బు! దీన్ని ప్రజలకి చేరకుండా మీహెల్త్‌మినిస్టర్ దాచిపెట్టిన డబ్బు! వాడికి సహాయపడటానికి ఇలాంటివైట్‌కాలర్‌గాళ్ళు దోచిన డబ్బు! మీ లాంటి లీగల్‌గూండాలు మింగిన డబ్బు! నెల నెలా వాడు కక్కిన కూడు తినే మీలాంటి వెన్నెముక లేని వెధవల డబ్బు! ఇలా ఎవరికి అందినంత వాళ్ళు దోచేసారు

గనుకే, హాస్పటల్‌లోపలకు వెళితే బెడ్స్ కొనడానికి డబ్బు లేదంటారు, మిషనరీ కొంటానికి సొమ్ము లేదంటారు, ఎమర్జన్సీ మందులు కొంటానికి నిధుల్లేవంటారు, మరి ఇవన్నీ ప్రైవేట్ హాస్పటల్స్‌లో ఉన్నాయి కదా! ఇంత పెద్ద జనరల్‌హాస్పటల్‌లో ఎందుకు లేవని అడిగితే లోటుబడ్జెట్ అంటారు

వాట్ మిస్టర్ హెల్త్‌సెక్రటరీ, మీ డిపార్ట్‌మెంట్స్లో 43 కోట్లు లోటు బడ్జెట్‌ఉంటే 7 లక్షల ఆస్తిఉందని ప్రకటించిన మీ హెల్త్‌మినిస్టర్‌కి ఈ డెబ్బైకోట్లు ఎక్కణ్ణుంచొచ్చాయ్? ఎక్కణ్ణుంచొచ్చాయ్? కమాన్ టెల్ మీ!

సో డబ్బు ఉంది! దేరీజ్ మనీ! పెరుగుతున్న మంత్రులకు జీతానికి డబ్బుంది, పిర్రకి ఎర్ర చీమ కరిస్తే విదేశాలకి వెళ్ళి వైద్యం చేయించుకోటానికీ డబ్బుంది, ఏడాదికోసారి 750 కోట్లు ఖర్చుపెట్టి ఎలక్షన్ జరిపించటానికి డబ్బుంది, కానీ పేదవాడికివైద్యం చేయించటానికి మాత్రం డబ్బులేదు! ఏం, పేదవాడికి జబ్బు రాకూడదా? వస్తే వాడికి చావే సరైన మందా?

ఒక అంటే ఇక్కడ పేదవాళ్ళకి వైద్యమే జరగట్లేదా? ఇక్కడున్న డాక్టర్లందరూ చెడ్డవాళ్ళనా నీ ఉద్దేశం?

గణేష్ కాదు! మీలో మంచి డాక్టర్లూ ఉన్నారు కానీ మీ గుండెల మీద చెయ్యి వేసుకొని చెప్పండి ఆర్ ఆల్ఆఫ్ యూ జెనుయిన్ ఉన్న వాళ్ళు డొనేషన్లు కట్టి, డాక్టరైపంటికి బదులు కంటిని తీసిన వారు లేరా? కడుపు నొప్పని వస్తే కడుపుని చీల్చి అందులో కత్తెర పెట్టి కుట్టేసిన మేధావులు లేరా? జనరల్ హాస్పటల్‌కి వెళ్ళినవాళ్ళని ప్రైవేట్‌హాస్పటల్‌కి వెళ్ళమన్న బ్రోకర్‌గాళ్లు లేరా? ఆఖరికి తలనొప్పొస్తే కమీషన్‌కోసం ఊళ్ళోఉన్న అన్ని టెస్ట్‌లు చేయించుకు రమ్మనిచెప్పే ఏ క్లాస్ ఏజెంట్స్ లేరా? ఇప్పుడు రోగి తమ్వాధిని చూసి భయపడట్లేదయ్యా, మీ ట్రీట్‌మెంట్ గుర్తుకొచ్చి కంగారు పడుతున్నాడు యస్! ఇక్కడ వచ్చేది ఫినాయిల్

వాసనగాదు, పీనుగుల వాసన ఇక్కడ వరండాలో ఉమ్మెలు, వాంతులు మధ్య చచ్చేకంటే ఇంట్లో చాప మీద చావటం మేలనుకుంటారయ్యా జనం

ఒ డా  దిసీజ్ రెడిక్యులేస్ మిస్టర్ గణేష్! డు యు హవ్ ఎనీ సబ్స్టాన్షియల్ ఎవిడెన్స్ టు ప్రూవ్ యువర్ ఎలిగేషన్?

గణేష్  వాటీజ్ రిడిక్యులేస్? హేవ్ యు ఎవర్ గాన్ త్రూ మెడికల్ జర్నల్? డు యు నో దట్ సెవెంటీ ఫైవ్ క్రోర్ ఇండియన్ పీపుల్ ఆర్ రియల్లీ ఫైవ్ హండ్రెడ్ మైల్స్ ఎవే ఫ్రమ్ ఎ బేసిక్ ఆపరేషన్ టేబుల్, డు యు నో దట్ వన్ లాక్ ఉమన్ ఆర్ డైయింగ్ డ్యూ టు ద నాన్ ఎవైలబిలిటీ ఆఫ్ స్టెరిలైజేషన్ మెడికల్ బ్లేడ్ టు కట్ ద ఎంబ్రికల్ కార్డ్, డు యు నో దట్ ద కాస్ట్ ఆఫ్ వన్ బైపాస్ సర్జరీ ఈజ్ ఈక్వల్ టు టెన్ ఇయర్స్ ఇన్కమ్ ఆఫ్ ఏన్ ఏవరేజ్ ఇండియన్, ఈజ్ దిస్ ఇనఫ్ ఆర్ డు యూ వాంట్ మోర్ ఎవిడెన్స్?

డాక్టర్  ఏంటయ్యా పెద్ద సంస్కర్తలా డబాయిస్తున్నావ్? జనాభా పెరిగిపోతుంటే గవర్నమెంట్ మాత్రం ఎంతవరకు పని చేస్తుంది అందుకే గదా మేం ప్రైవేట్ హాస్పటల్స్ పెట్టి మెడికల్ సర్వీస్ చేస్తున్నాం

దగ్గరగా వెళ్ళి భుజం మీద చెయ్యి వేసి

గణే  రండి

ఒక  ఏయ్!

తీసుకు వస్తూ

గణే  రండి!

తీసుకొచ్చి నిలబెట్టి

ఈయనెవరో మీకు తెలుసా? డాక్టర్ రాజగోపాల్ ఎం బి బి ఎస్ , ఎఫ్ ఆర్ సి ఎస్ ఇదే సిటీలో మెయిన్ సెంటర్ చూసుకొని పెద్ద హాస్పటల్ కట్టాడు ఏడంతస్తుల బిల్డింగ్ సెంట్రలైజ్డ్ ఏ సి లేటెస్ట్ ఎక్విప్మెంట్, ఏడాదికో బ్రాంచ్ ఓపెన్ చేసి సర్వీస్ చేస్తాడట కానీ రెండున్నరలక్షలు లేకుండా

ఎవరైనా ఆసుపత్రిలోపలికి వెళితే ఒయటకు నెట్టేసి చంపేస్తాడు

డాక్టర్ మిస్టర్ గణేష్!

గణేష్ కీప్ క్వయిట్ డాక్టర్ రాజగోపాల్, ఆరోగ్యాన్ని అమ్మటాన్ని మీ మెడికల్ డిక్షనరీలో సర్వీస్ అంటారా? సిగ్గు లేదూ?

అసలెప్పుడయినా ఈ తెల్ల కోటు నీ ఒంటి మీదకు ఎలా వచ్చిందో ఆలోచించావా?

డాక్ట ఎం బి బి ఎస్ చదివితే వచ్చింది

గణేష్ • ఎవడబ్బ సొమ్ముతో చదివావయ్యా ఇలాంటి ఒక్కొక్క డాక్టర్ని తయారు చెయ్యటానికి ప్రభుత్వానికి 12 లక్షలు ఖర్చవుతుంది ఆ పన్నెండు లక్షలు ఎక్కడివి కూలీ నాలీ చేసుకునే పేద ప్రజలు, చాలీ చాలని సంపాదనతో బతికే సగటు మనుషులు, పదీ పరకా సంపాదించి ఆ డబ్బుతో ఉప్పో, పప్పో, ఉల్లిపాయో కొనుక్కుంటే అలా కొన్న ప్రతి వస్తువు మీద పన్ను వేసి, ఆ పన్ను రూపంలో వచ్చిన డబ్బులోనుంచి పన్నెండులక్షలు ఖర్చుపెడితే ఇడిగో ఈ, ఈ మహానుభావుడు డాక్టర్ అయ్యాడు

ఇది నువ్వు మర్చిపోతే ఎర్రటి రక్తాన్ని తెల్లని పాలుగా చేసి పెంచిన నీ తల్లిని మరిచిపోయినట్టే

ఒక ఏయ్ ముందు మా నాయకుడు ఎక్కడుండాడో చెప్పు

గణే ఎవడ్రా? ఎవడ్రా వాగింది?

అంటూ ఈడ్చి చెంప మీద కొట్టాడు

ఎవడ్రా మీ నాయకుడు? ఆ ఒంటి మీదున్న చొక్కాకి గుండీల్లేవు కట్టుకున్న పంచెకు ఉతుకు లేదు నిన్ను చూస్తుంటే మీ నాయకుడికి జిందాబాద్‌లు కొట్టి కొట్టి చచ్చేలా ఉన్నావ్‌రా! నీకు రోగం వస్తే మీ

నాయకుడు ప్రైవేట్ హాస్పటల్లో చేర్పిడురా! ఇక్కడే ఇదే జనరల్ హాస్పటల్లో పడేస్తాడు ఎలక్షన్స్ ముందొచ్చి చేతికో జెండా, జేబులో వందా పెట్టిగెలిచి, అడ్రస్ లేకుండా వెళ్ళిపోయేవాడు మీ నాయకుడా? ఎప్పుడ్రా తెలుసుకుంటారు ఆ! రేయ్ ఎప్పుడు తెలుసుకుంటారు?

ఇది గమనించి చంటి బిడ్డను ఎత్తుకున్న ముసలమ్మ గణేష్‌ను సమర్థిస్తూ

ముస గాళ్ళు తెలుసుకోలేరు గణేషా, గాళ్ళు జన్మలో తెలుసుకోలేరు గీళ్ళకన్నా మున్సిపాలిటీ కుక్కలు నయంగాదు ఛూ నీ బతుకులు చెడ! నువ్వు చెప్పింది నిజమయ్యా! చానా సత్యం ఈ దిక్కుమాలిన దవాఖాన ఎంతమంది పసిపిల్లల్ని అన్యాయం చేసుకుందో ఈ కళ్ళతోనే చూస్తున్నా కొడకా! గంతెందుకు ఈ చంటోణ్ణే చూడరాదు! ఒక కిడ్నీ లేదని వీళ్ళ అయ్యన్ని చంపిన్రు, వీళ్ళమ్మను చంపిన్రు, ఈ పోరణ్ణి దిక్కులేనోణ్ణి చేసిన్రు గణేషా! దిక్కులేనోణ్ణి చేసిన్రు

గణే • ఈ పిల్లాడే కాదమ్మా, నేను కూడా ఈ ఆసుపత్రి వల్లే అనాధనయ్యాను

ఒక • ఏంటి రివల్యూషనా?

గణే కాదు రియలైజేషన్! రియలైజేషన్ ఎట్ ఆల్ లెవల్స్! ఆత్మ విమర్శ అన్ని తరగతుల వారికీ రావాలి నాకొచ్చిన పరిస్థితి మరెవ్వరకీ రాకూడదు డబ్బు లేని కారణంగా మరో ప్రాణం పోగూడదు ఇంకో కుటుంబం నాశనం కాకూడదు

మన రాష్ట్రంలో డాక్టర్లు ఎన్నో సార్లు స్ట్రైక్ చేశారు ఎప్పుడు చేసినా మీ జీతాల కోసం చేసారే గాని ఆసుపత్రుల ఫెసిలిటీస్ బాగు పడాలని ఎప్పుడయినా చేసారా?

ఇక మీదయినా మీరు చేసే పని జీతం కోసం చేసే పనిగా భావించకండి దైవసేవగా భావించి చెయ్యండి

అంటూ వార్డుబోయ్ దగ్గరకొచ్చి

చద్దన్నంలో ఉల్లిపాయ నంజుకోటానికి కూడా గతి లేని పేదవాళ్ళ దగ్గర మెయిన్‌గేట్ నుంచి మార్చురీ దాకా కూడా లంచం అడిగే అలవాటు మానుకోండి మీ దగ్గర చాలినంత డబ్బు లేదనేగదా లంచం అడుగుతున్నారు వాళ్ళు మీ కంటే డబ్బు లేని వాళ్ళు కాదా? వాళ్ళని దోచుకోవచ్చా? నరనరాల్లో డబ్బుపిచ్చి జీర్ణించుకుపోయిన రాజకీయ నాయకులందరినీ అడుగుతున్నాను మనీప్రపంచం లోనుంచి మానవతాప్రపంచంలోకి రండి మీరు తీసుకునే లంచంలో సగం డబ్బు ఖర్చుపెడితే ఊరికొక జనరల్ హాస్పటల్ కట్టు కోవచ్చు వీధికో హెల్త్ సెంటర్ పెట్టవచ్చు ఇన్నాళ్ళూ మా నోట్లో మట్టికొట్టారు ఊరుకున్నాం మా పొట్టలుకొట్టారు సహించాం పనులు లేకుండా చేసారు ఓర్చుకున్నాం మీకు తోచినప్పుడల్లా పన్నుల మీద పన్నులు వేసుకుంటూ వచ్చారు నోరు మూసుకుని కట్టాం ఈ రాజకీయ మార్కెట్లో మా శ్రమనీ, నమ్మకాన్నీ జీవితాన్ని భవిష్యత్తునీ కిలోల్లెక్కన అమ్మేశారు కిక్కురు మనకుండా అమ్ముడుపోయాం కులపోరాటాలు పెట్టారు, మతకలహాలు పెట్టారు మేం కొట్టుకుచచ్చాంగానీ మిమ్మల్ని మాత్రం అధికారంలోనే కూర్చోబెట్టాం

అన్నింటికీ ఊరుకున్నాంగదా అని ఇకపై మా జీవితాలతో ఆడుకున్నా, మా ఆరోగ్యాన్ని అలక్ష్యం చేసినా, మా ప్రాణాల్ని మాంసంలా అమ్మాలని చూసినా -

ఒక · ఏం చేస్తారు మిస్టర్ గణేష్?

గణే చంపుతాం!

– కట్ టూ –

ఇది ఒక రకంగా సందేశం డాక్టర్ల దగ్గర నుంచి వార్డు బోయ్‌ల వరకు ఎవర్నీ వదల్లేదు మీ జీతాలు పెంచమని సమ్మెలు చేసారు తప్ప, ఆసుపత్రిలో సౌకర్యాలు పెంచమని ఎన్నడయినా అడిగారా అన్న ప్రశ్న విదేశాలలో కూడా చర్చనీయాంశమయ్యింది మాటల రచయితలుగా పరుచూరి సోదరులకు ప్రభుత్వ నంది పురస్కారం అందింది, సంభాషణ రచనకు

అందుకే పమెల్లా వాలస్ ఊసుపోక మాట్లాడే మాటలు సంభాషణలుగా ఎప్పుడూ

రాయవద్దు[25] అంటారు

అంటే ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించిన సంభాషణలే శిల్పానికి అర్హత పొంది ఉంటాయి ఈ సంభాషణ మొత్తం కథావస్తుసమర్ధనతో నడిచి కథౌచిత్య పాలన చేసింది

**పాత్రానుగుణత :** పాత్ర ఎలామాట్లాడాలో అదే పాత్రానుగుణ సంభాషణం వాటిని అర్ధవంతంగా ప్రయోగించటమే శిల్పం ఉదాహరణకు **భీష్మ** చిత్రంనుంచి ఈ కింది సంభాషణలు పరిశీలించాలి

తమ్ముడికి పెళ్ళి చేయాలని కాశీరాజు కుమార్తెలను అంబ, అంబిక, అంబాలికలను భీష్ముడు స్వయంవర విజయంతో తీసుకువచ్చాడు అప్పుడు వరుసగా మారే దృశ్యాలలో భీష్ముడు, అంబ, అంబను ప్రేమించిన సాళ్వుడు, మరలా భీష్ముడు, అంబల మధ్య సంభాషణలు ఇలా జరిగాయి

**భీష్మ :**

**సత్యవతి** అంబా ఏవిటమ్మా ఈ కన్నీరు

**అంబ** దేవి, తల్లివంటి దానివి నీవే నన్ను రక్షించాలి

**సత్య** నీకు వచ్చిన ఆపద ఏవిటి కుమారి భయం లేదు చెప్పమ్మా!

**అంబ** నన్ను ఇలా బలవంతంగా తీసుకువచ్చి ఎవరికో వివాహం చేయటం అన్యాయం కాదా దేవి?

**భీష్మ** కాదు శాస్త్ర సంబంధమైన క్షత్రియ పద్ధతి మీరు వివాహం చేసుకోబోయేది, భారత సామ్రాజ్యాధి నేత, మా సోదరుడు, విచిత్రవీర్య మహారాజుని

అంబ నాకిష్టముందో లేదో తెలుసుకోవలసిన అవసరం లేదా? పురుషులం బలాఢ్యులం అని మీ ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించటమేనా? ఆడవాళ్ళంటే గడ్డిపోచకంటే నీచంగా చూడటం న్యాయమేనా?

సత్య అమ్మా ఆవేశం లేకుండా శాంతంగా చెప్పమ్మా

అంబ • అమ్మా నా హృదయాన్ని ఒక రాజకుమారుని కర్పించాను మా అనురాగం, అన్యోన్యం, అపారం మా వివాహానికి జనకులు కూడా అంగీకరించారు స్వయంవరంలో నేనతన్ని వరించ బోతుండగా నన్ను బలవంతంగా తీసుకొని వచ్చారు, మా ప్రణయపాశాన్ని తుంచివేసారు

ఈ మాట వింటూనే భీష్ముడు స్పందించాడు పశ్చాత్తాపహృదయంతో

భీష్మ రాజకుమారీ క్షమించు మీ పూర్వఅనురాగం తెలియక తీసుకొచ్చాను నీ కోరిక ప్రకారం సగౌరవంగా నిన్ను నీ ప్రియుని వద్దకు పంపించే ఏర్పాట్లు చేయిస్తాను

అనగానే మిగిలిన ఇద్దరితో సత్యవతి

సత్య రండమ్మా

అంటూ అంబాలికను, అంబికను తీసుకు వెళుతుంటే అక్కడే నిలబడ్డ విచిత్రవీర్యుడు కంగారుగా

విచిత్ర . ఆగండి! అంబకున్న పూర్వానురాగాల్లాంటివి మనకేం లేవు కదా! అయితే పదండి

సత్య . రండమ్మా

## సాళ్వుడి మందిరం :

సాళ్వుడు అసహనంగా అటూ ఇటూ తిరుగుతూ ఉండగా, అంబ వచ్చింది

అంబ స్వామీ

సాళ్వ  ఎవరు?

అంబ  నేనే స్వామీ

సాళ్వ  నీవా!

అంబ  అవును స్వామి, నా హృదయం మీకర్పించి ఉన్నాను మన పరస్పర అనురాగం తెలిసిన తక్షణం, ఆ భీష్ముడు ఎంతో ఆదరంతో సగౌరవంగా నన్ను మీ వద్దకు పంపించాడు ఇంకా ఏ శంక లేకుండా నన్ను అనుగ్రహించండి

సాళ్వ  ఆగు! భీష్మునికున్నపాటి నీతి నాకులేదనుకున్నావా? యుద్ధంలో నన్ను జయించాడు నీవు భీష్ముని సొత్తు ధర్మ భిక్షగా తీసుకోమని నిన్నుపంపిస్తే, స్వీకరించటానికి నేను పౌరుషహీనుణ్ణి కాను అది రాజనీతి కూడా కాదు వెళ్ళు

అంబ  స్వామీ! చేసిన వాగ్దానాలన్నీ మర్చిపోయారా? ఎన్ని ఆటంకాలొచ్చినా, ఎవరు కాదన్నా మన పవిత్రప్రేమ ఆదర్శప్రాయంగా నిలవాలని మనం అనుకోలేదా?

సాళ్వ  అంబా! అదంతా ఒకస్వప్నం మరువక తప్పదమ్మా తప్పదు మరిచిపోవటానికే మహాప్రయత్నం చేస్తున్నా హృదయంలో నాటుకొనిఉన్న అనురాగాన్ని పెకిలించి వెయ్యటం మహా కష్టం ఆ కష్టాన్ని అధికం చెయ్యకుండా, అంబా దయచేసి నా ఎదుట కనపడకు వెళ్ళు!

అంబ  ఎక్కడికి పొమ్మంటారు? మీరులేని ఈ ప్రపంచం నాకు శూన్యమే! ఎక్కడికి పోగలను?

సాళ్వ  నిన్ను నాకు దక్కనీయకుండా, యుద్ధంలో జయించి తీసుకొని పోయిన ఆ భీష్ముని వద్దకే వెళ్ళు

అంబ  స్వామీ

సాళ్వ  నీకిక్కడ తావులేదు

అంబ  స్వామీ

## భీష్మ మందిరం

భీష్మ ఇది న్యాయం కాదు

అంబ దేనికదే న్యాయంకాదు నీ ధర్మశాస్త్ర ప్రకారంగా నావంటి అమాయకురాల్ని ఉభయభ్రష్టగా చేయటమేనా మీకు ధర్మం

భీష్మ ఆగ్రహావేశంలో అన్యులను నిందించి ప్రయోజనం లేదు ఇది నీ స్వయంకృతాపరాధం

అంబ అంతేనా! అంతేనా! దాంపత్య జీవితాన్ని గురించి నిర్మించుకున్న నా ఆశాసౌధాలన్నీ కూలిపోవలసిందేనా? స్త్రీ హృదయ సహజమైన మాతృప్రేమ నాలో నశించిపోవలసిందేనా?

భీష్మ నీ జీవితం నిరర్థకం కావాలని నేనెన్నడూ కోరుకోలేదు కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తాను, నీ ఇష్టం వచ్చిన వారిని వరించి వివాహం చేసుకో

అంబ చాలించు! విధిలేక ఎవరినో వరించానన్న అపకీర్తితో యావజ్జీవితం బ్రతకమనా నీ ఉపదేశం? ఇదేనా నీ వివేకం? సాళ్వుడు నిరాకరించటం న్యాయమన్నావ్! నీతమ్మునితో చెప్పటానికి నోరు రాదన్నావ్! బలాత్కారంగా తెచ్చిన వాడివి కాబట్టి నీవే -

భీష్మ అమ్మా! నాకు బ్రహ్మచర్య వ్రతం ఉందని -

అంబ తెలుసు! ఆ శపథం నువ్వే విరమించుకోవాలి ధర్మాచరణకు ఎటువంటి త్యాగమైనా చేయాలి పశుబలంతో పదిమంది రాజులను ఓడించినంత మాత్రాన నీవు వీరుడవు కావు బాధ్యతను నిర్వర్తించ గల మనోధైర్యం చూపినప్పుడే నీవు వీరుడవవుతావ్ మారు మాట్లాడక నీ బ్రహ్మచర్యాన్ని విడిచిపెట్టుకో

భీష్మ — ఏమైనా సరే, వ్రతభంగాన్ని చేసి నేను నరకానికి పోలేను

అని వెళ్ళిపోయాడు ఒంటరిగా మిగిలిన అంబ అక్కసుతో

అంబ — భీష్మా! స్త్రీలను ఉసురుపెట్టిన పాపం ఊరకనే పోదు సుమా! నువ్వు చేసిన ఈ అకార్యానికి తగిన ఫలం అనుభవిస్తావ్

ఇక్కడ భీష్మణ్ణే అంబ ప్రశ్నించినప్పుడు ఒక క్షత్రియధర్మం చెప్పాడు తను సాల్వుణ్ణే ప్రేమించానన్న మాట విన్నాక క్షాత్రధర్మం కాక క్షమాధర్మం పాటించాడు అదే సాల్వుడు ఆ క్షమాధర్మాన్ని భిక్షగా భావించి క్షత్రియధర్మం ప్రకారం నిన్ను గెలిచి తీసుకువెళ్ళిన భీష్మణ్ణే పెళ్లి చేసుకొమ్మన్నాడు ప్రతిజ్ఞా భంగం భీష్ముడు అంగీకరించడు అందుకే ఆమె కోరికను నిరాకరిస్తున్నాడు

ప్రేమను కోరుకున్న అంబ ముందు ప్రేమను గెలవాలనుకుంది కాని సాళ్వుడు నిరాకరించాడు ఉభయ భ్రష్టత్వం పొందగూడదు అన్నది పాత్రాను గుణమైనది ఈమె అంతటితో ఊరుకోలేదు తరువాత శిఖండిగాపుట్టి భీష్మ పతనానికి కారకురాలయ్యింది

భీష్ముడికి తన తమ్ముడు శృంగార పురుషుడు తప్ప శూరుడు కాదు అని తెలుసు అందుకే తమ్ముడి తరపున, వాళ్ల ముగ్గుర్నీ తీసుకువచ్చాడు భీష్ముడు హృదయం ఉన్నవాడు తండ్రి కోసం రాజ్యత్యాగం చేసాడు బ్రహ్మచారిగా ఉంటానని భీషణ ప్రతిజ్ఞ చేసాడు అందుకే ప్రేమించాను అంటే తిరిగి పంపాడు తిరిగివచ్చింది అంబ ఇంకొకరికి మనసిచ్చిన అంబను భావిభారత సామ్రాజ్యాధినేత అయిన తమ్ముడికిచ్చి ఎలా పెళ్ళి చేస్తాడు? అందుకే నీకు నచ్చినవాణ్ణే చూసుకో పెళ్ళిచేస్తానన్నాడు తను, తన ప్రతిజ్ఞ తప్పే ప్రసక్తిలేదన్నాడు ఇదీ పాత్రానుగుణంగా ఉంది

సాళ్వుడు క్షత్రియుడు అంబను స్వయంవరంలో కోల్పోయాడు ఆమె తిరిగి వచ్చింది తన శౌర్యంవల్ల అదిజరగలేదు భీష్ముడి ఔదార్యంవల్ల జరిగింది అది అతనుసహించలేడు ప్రియురాలు రేపు ఇల్లాలయితే జీవించి ఉన్నంత కాలం, దెప్పిపొడుపులు తప్పవుగదా! అందుకే నిరాకరించాడు ఒక రకంగా తృణీకరించాడు భీష్ముడి ప్రతిజ్ఞ అతనికీ తెలుసు అందుకే వెళ్లి భీష్మణ్ణే ఇరకాటంలో పెట్టటానికి అతన్ని చేసుకొమ్మన్నాడు అతడు అంగీకరించడని తెలుసు అంబ విషయికమైన పగవల్ల భీష్ముడిమీద ఓటమితాలుకూ బాధోపశమనం కోసం!

ఈ విధంగా ప్రతిపాత్రకు తదనుగుణమైన సంభాషణరచన అర్థవంతంగా సాగించటం ఒక శిల్పం ఈ శిల్పం, పైదృశ్యాలలో ఎక్కువగా అనుసరించబడింది

**రసాత్మకత** నవరసాలసమ్మేళనం సాహిత్యం అది కథకావచ్చు, నవలకావచ్చు, నాటకం కావచ్చు సినిమాకావచ్చు

ఆయా రసాలను ఆయా సన్నివేశాలలోగాని, దృశ్యాలలో గాని సంపూర్ణంగా పోషిస్తే రస శిల్పాన్ని చక్కగా పోషించినట్లే రచయిత

**మాతృదేవోభవ!** ఇది ఒక కరుణ రసాత్మక చిత్రం

ఒక తాగుబోతు అతని భార్య శారద ఆమెకు ప్రాణాంతక వ్యాధి తను ఎలాగూ చనిపోతుంది కాబట్టి భర్త తాగుడుమానేసి బిడ్డల్ని బాగా చూసుకోవాలని ఆమె కోరిక కాని దురదృష్టవశాత్తూ ఆమె కంటే ముందే అతను హత్య చెయ్యబడటంవల్ల చనిపోతాడు తను చనిపోయాక బిడ్డలు అడుక్కుతినే పరిస్థితి వస్తుందని శారద భయం అందుకే తను కన్నుమూసేలోపు అందరినీ ఎవరి కన్నా దత్తత ఇచ్చేయాలని సంకల్పం

అందులో మొట్టమొదటి సారిగా ఆఖరిబిడ్డను ఇచ్చేస్తుంది

దత్తత తీసుకున్న తల్లి డబ్బులివ్వబోతే ***బాబుని అమ్మటం లేదమ్మా, వాడికో అమ్మ కావాలని మీకు ఇస్తున్నాను*** అంటుంది

బిడ్డలు లేనివాళ్ళకు బిడ్డను దానం చెయ్యటంవేరు అవసరానికి ఇచ్చేయటం వేరు ఆమె వాడి అమ్మ తను బతికిఉంటే పాచిపనిచేసయినా బతికించుకుంటుంది అది అమ్మతనం కొనేవాళ్ళకు ఇవ్వటంలేదు కన్నవాళ్ళలా ఉండాలని ఆమె కోరిక అది ఆ వాక్యంలో స్ఫూర్తి

ఆ తర్వాత కవలపిల్లలు ఇద్దరిలో ఒకణ్ణే ఒక దంపతులు అడిగినప్పుడు వాళ్ళ సంభాషణ పరంగా కరుణరసం ఉత్పత్తి చెందుతుంది

***అంగవైకల్యం ఉన్నవాడు నాకెందుకూ అంటున్నారు,*** అన్నమాట కడుపు దేవేస్తుంది ఇవ్వను ఇద్దరూ అయితేఇస్తాను అనే పరిస్థితిలో ఆమెలేదు రోజులు దగ్గరపడుతున్నాయి అందుకే మాటమాట్లాడకుండా కళ్ళుమూసుకుని, పెదవులు బిగించి ఏడ్చింది ఈ మౌనమే ఇక్కడ లక్షవాక్యాల సంభాషణ అంతేకాదు ఆ బిడ్డను అప్పచెబుతున్నప్పుడు *గొడవ పడవద్దు అంటే అక్కడ ఎవరున్నారమ్మా గొడవ పడటానికి* అని కవల పిల్లల్లో ఒకకుర్రాడు అడిగినప్పుడు కలిగే ఆవేదన అంతాఇంతా కాదు అక్కడ సోదరుడు ఉండడు అమ్మ ఉండదు అన్నీ తెలిసి ఆ పసి హృదయం తప్పనిసరై,

అవసరానికి బయలుదేరుతోంది ఈ చిన్నమాట హృదయావేదన పెంచి కరుణరసాన్ని ఉప్పతిల్ల చేస్తుంది

ముసలిదంపతులు కూతురు రాధని అడిగినప్పుడు వాళ్ళు వచ్చి వెళ్ళాక రాధ **నేను వెళ్ళను** అంటుంది ఇదే వాక్యం దంపతుల ఎదుట **నేను రాను** అని రాధ చెప్పి ఉంటే రసభంగం జరుగుతుంది వాళ్ళు వెళ్ళాక తల్లితో చెప్పటం రసపోషణ కుపయోగపడింది ఆ మాటను వాళ్ళు వెళ్ళిన తరువాత రాయటమే శిల్పం

ఆఖరికి మిగిలిన అవిటి వాడు - **అమ్మా నేను ఈ అవిటి కాలితో పుట్టటం నా అదృష్టం కదమ్మా** అని ఈ కుంటితనం వల్లేకదా నేను నీ దగ్గరున్నాను ఇది నా అదృష్టమేకదా అనటం కరుణరసాన్ని పతాక స్థాయికి తీసుకువెళుతుంది

ఇది కరుణ రసానికి ఉదాహరణ ఇలాగే వీరము, అద్భుతము, హాస్యము ఇలా నవరసాలూ సమస్థాయిలో పోషించబడటానికి లేదా కథావసరాన్ని బట్టి పోషించటానికి, పాత్ర అవసరాన్ని బట్టి పోషించటానికి సంభాషణ ఎంతో ప్రాముఖ్యత వహిస్తుంది సమస్థాయిలో పోషించటమే శిల్పం కరుణరసాత్మకమైన ఈ చిత్రంలో సంభాషణపరమైన రసాత్మకత చక్కగా ప్రయోగించాడు రచయిత సత్యమూర్తి

అన్నమయ్య చిత్రంలో పతాకదృశ్యం అద్భుత, శాంత కరుణరసాల కలయిక అపురూపమైన శిల్పాన్ని అందించింది

కోట్లమంది ఆరాధించే కలియుగ దైవం ఏడుకొండల వెంకటేశ్వరుడు, అన్నమయ్య సంకీర్తనల ప్రతులు తీసుకుని తూలిపడబోతే అడ్డుకుని ఆపుతాడు సాక్షాత్ భగవద్దర్శనం అయినందుకు ఆశ్చర్యానందచకితుడవుతాడు అన్నమయ్య అంతకంటే ఆశ్చర్యం - భగవంతుడు అన్నమయ్యతో, మాలా నీకు నిత్య యవ్వనం ఇస్తాను నీ పాట ఇలాగే వినాలని ఉంది అని అడగటం దానిని సున్నితంగా తృణీకరించి తొంబై అయిదేళయ్యింది పుట్టి, నా జన్మ ఎందుకో అది పూర్తయ్యింది, నాకు మోక్షం కావాలంటాడు నీగానం వినకుండా ఎలాగయ్యా ఉండేది అంటూ **జో అచ్యుతానంద జోజో ముకుందా** అంటూ తను పాడి, ఇల్లాళ్ళతో కొన్ని కీర్తనలు పాడించుకుని, అన్నమయ్యతో పాడించుకుని అతని నిర్గమనాన్ని నిర్వికారుడై చూడవలసిన పరమాత్మ నిర్వేదంగా చూడటం ఆ సాంతం మధురం, మనోహరం కైవల్యానికి ఆనందం! కనులలో నుంచి ఉపిరిపంపటానికి కరుణం అడుగడుగునా రసాత్మకం రచయిత భారవి, దర్శకుడు రాఘవేంద్రరావు ప్రతిభ చిరకాలం నిలుపుతుంది అక్కినేని నాగార్జున జన్మచరితార్థం!

పదవైచిత్రి : కొన్ని సినిమాలలో అప్పటికి వాడుకలో ఉన్న పదాల్ని ఇంకో పద్ధతిలో గాని, అసలు నిఘంటువులలో గాని, వాడుకలో గాని లేని పదాలను సంభాషణలో స్ఫూర్తిమంతంగా ప్రయోగించటమే పదవైచిత్రి

పాతాళభైరవిలోని డింగరీ అనే పదం అన్నమయ్య కీర్తనలలో ఉంది అయితే అది విశేషంగా వాడుకలో లేకపోబట్టి అది పింగళివారి సృష్టే అని అనిపిస్తుంది సృష్టించినా, సృష్టిలో ఉన్నదాన్ని సమయోచితంగా ప్రయోగించినా అది ఉపజ్ఞతే

*సాహసం సాయరా డింభక*

*రాజకుమారి లభించునురా*

*జై పాతాళ భైరవి*

ఈ పదాలు ఏబై సంవత్సరాలుగా ప్రజల నాలుకమీద నానుతూనే ఉన్నాయంటే ఆ పద వైచిత్రిని అర్థం చేసుకోవచ్చు

ఈ పదవైచిత్రిని కొన్ని సినిమాలలో ఒక పాత్ర ద్వారా ఎక్కువ మాట్లాడించి, ఆ పాత్ర ఆ పదాలు విశేషంగా మాట్లాడటం ద్వారా, చిత్ర విజయానికి, జనబాహుళ్యప్రచారానికి ఉపయోగపడేలా చెయ్యటంకూడా ఒకశిల్పమే

బాపు **ముత్యాలముగ్గులో కాంట్రాక్టర్**పాత్ర, సంభాషణలకోసం ప్రేక్షకులు సినిమా హాలుకి పరుగులెట్టేలా చేసింది, ఈ కింది దృశ్యం పరిశీలిస్తే ఆ విషయం అర్థమవుతుంది

ఎర్రగా ఉంది ఆకాశం
నిట్టనిలువుగా నిలబడి ఆకాశాన్ని
చూస్తున్నాడు కాంట్రాక్టర్
వెనకనుండి కనిపిస్తున్నాడు

సెక్ర నారాయుడొచ్చాడండి

కాంట్రా వచ్చాడా? తీసుకొచ్చావా?

సెక్ర యస్సార్! తీసుకొచ్చాను చూస్తారా?

కంట్రా అబ్బా సెక్రట్రీ! ఎప్పుడూ పనులు బిగినెస్సేనా? ఆ! పర గడుపున కాస్తంత పచ్చి గాలి పీల్చి ఆ పెత్యక్ష నారాయుడి సేవ చేసుకోవద్దా?

సెక్ర : యస్సార్

కాంట్రా యస్ సార్ గాదు, కళ్ళెట్టుకు చూడు పైనేదో మర్డర్ జరిగినట్టు లేదూ? ఆకాశంలో సూర్యుడు నెత్తురు గడ్డలా లేడూ?

సెక్ర అద్భుతం సార్।

కాంట్రా ఆ మడిసన్నాక కాసింత కలాపోసణుండాలయ్యా! ఒట్టిగా తిని తొంగుంటే మడిసికి గొడ్డుకీ తేడా ఏటుంటది

సెక్ర యస్ సార్! మీరు ఒక సారి చూసి సరేననేస్తే మిగతా ఏర్పాట్లు చాలా ఉన్నాయి

కాంట్రా సరేలెద్దూ ఎదవ నూసెన్సు

అంటూ కారు దగ్గరకు వస్తున్నాడు
సిగిరెట్ తాగుతున్న రౌడీకి సెక్రట్రీ సైగ చేశాడు సిగిరెట్ కింద పడేసి డిక్కీ తెరిచాడు
అందులో నారాయుడి శవం ఉంది
తొంగి చూసాడు

కాంట్రా నారాయుడూ, ఆ ఎగ్సపార్టీ వాళ్ళిచ్చే డబ్బు నువ్వే ఇవ్వరా మిగిలిపోతావ్ అన్జెప్పితే ఇనిపించుకున్నావా? ఖర్చయి పోయావ్ కారెనక సీట్లో దర్జాగా కూర్చుని ఎల్లేవాడివి ఇవ్వాళ డిక్కీలో తొంగున్నావ్! దర్జా తగ్గిపోలా?

డిక్కీ మూసాడు

సెక్ర ఈ పేరుగలవాడు జ్వరవొచ్చి ఇవ్వాళే చచ్చిపోయినట్టు సర్టిఫికెట్ తీసుకుంటున్నాను సమాధి చేయిద్దామా! తగలబెట్టిద్దామా?

కాంట్రా ఏం సెకరటరీవయ్యా నువ్వు? మన చేతికి మట్టంటకుండా పనులు చెయ్యాలని లచ్చసార్లు చెప్పాను ఇప్పటికే ఈడి మీద బోలెడంత ఖర్చయ్యింది మళ్ళీ తగలెట్టటానికో కర్సా?

| | | |
|---|---|---|
| | సెక్ర | యస్సార్! అయితే దాన్ని అలానే దాచి ఉంచమంటారా? |
| | కాం(టా | బాగా పొద్దయ్యేదాకా మన షెడ్లోదాచుంచి ఆ తరువాత, |
| నవ్వి | | |
| | | ఈ శవాన్ని ఆడి మావాడి పక్కలో పడుకోబెట్టెయ్ |
| | సెక్ర | వాళ్ళిద్దరి మధ్య ఏవో ఆస్తి తగాదాలున్నట్టున్నాయిగా సార్! |
| | కాం(టా | అదేనో, ఆ డిఫరెన్సులున్నాయి గనుకే ఈణ్ణి ఆడి పక్కలో తొంగోబెట్టి పోలీసులకి ఫోన్‌గొట్టు, ఆళ్ళు ఆళ్ళు చూసుకుంటారు మనం సర్దాగా అలా షికారెళ్ళినట్టెళ్ళి పరామర్శ వేసి రావచ్చు |
| | సెక్ర | యస్ సార్ |
| | కాం(టా | అవును సెక్రట్రీ మనం అనుకున్న పని అయిపోయింది గదా, ఆ సావుకారు సొమ్మిచ్చాడా? |
| | సెక్ర | యస్సార్ |
| అని ఇచ్చాడు | | |
| | కాం(టా | బతికుండగా డబ్బుఇవ్వలేకపోయాడు పాపం చచ్చి ఋణం తీర్చుకున్నాడయ్యా నారాయుడు |
| అని లెక్క పెట్టుకుంటూ | | |
| | కాం(టా | ఇదేంటి సొమ్ము తక్కువ ఉంది? |
| | సెక్ర | కొంచెం అనుకోని ఇబ్బందులు వచ్చి నేను తీసుకున్నాను సాయంకాలం సర్దేస్తాను |
| చెళ్ళున చెంప పగలగొట్టాడు | | |
| | కాం | ఆ ముక్క నేను లెక్క పెట్టుకోక ముందు చెప్పాల అసల్నేను లెక్కపెట్టనని నీ ఎదవఆలోచన! తప్పు గదూ? డిక్కీలో పడుకో బెట్టేస్తా |
| ఎవరో వస్తున్నట్టుగా కారు శబ్దం | | |
| | | అలో అలో అలో! |
| అంటూ వెళ్ళాడు | | |

ఆకాశం శూన్యం అని అందరికీ తెలుసు అక్కడ మర్డర్ జరగటం ఏమిటి? ఆదేపదవైచిత్రి! కళాపోషణను కలా పోసణ అనటం, ఆ ముక్క నే లెక్క పెట్టుకోకముందు చెప్పాలనటం, డిక్కీలో తొంగున్నాడనటం, హలోని అలోఅలోఅలో అనటం చీర్స్‌ని చీరలు చీరలు అనటం కూసంత కలాపోసణ లేకపోతే మడిసికీ గొడ్డుకీ తేడా ఏం ఉంటాదనటం, ఇవన్నీ కొత్తగా ప్రయోగించబడి, సినిమాలో అదీ చిత్రకథలో సంభాషణల్లో పదవైచిత్రి అవసరాన్ని చాటి చెబుతాయి

అలాగే సమరసింహారెడ్డిలో - నేను గట్టిగా తొడకొడితే ఆ సౌండ్‌కి చస్తావురా అనటం నరసింహనాయుడులో - కత్తులతో కాదురా కంటిచూపుతో చంపేస్తా అనటం

ఇవన్నీ పదవైచిత్రులే 'వై లక్షణ్యం కళాసుచ' అన్నారు గదా! మరివన్నీ విలక్షణ ప్రయోగాలే ఈ రోజు సమాజంలో ప్రయోగించే అనేక చమత్కారవంతమైన పదాలు సినిమాలనుంచి స్వీకరించినవే!

నర్మగర్భత : కొన్ని సందర్భాలు, సన్నివేశాలు ప్రేక్షకులకు అర్థమై ఉంటాయి ఒక పాత్రకు తెలిసిన నిజం ఎదుటి పాత్రకు తెలియదు తెలిస్తే ప్రమాదం అని అనిపించే సందర్భంలో నర్మగర్భంగా సంభాషణ రాయటం రచయితలకు అలవాటు దాన్ని సుందరంగా అందిస్తే అది శిల్ప సౌందర్యంతో భాసిస్తుంది సాగర సంగమంలో బాలుకి మాధవి భర్త చనిపోయాడని తెలియదు తెలిస్తే ప్రమాదం తప్పనిసరిగా ఆమె అతనికి ఎదురు పడవలసి వస్తుంది అప్పుడు విధవరాలయినా నుదుట బొట్టు పెట్టుకుని వెళుతుంది ఆ సందర్భంలోది ఈ దృశ్యం

బొట్టు పెట్టుకోమని ఇచ్చాడు
ఏడుస్తోంది

| | | |
|---|---|---|
| | మాధ | ఏమిటండీ, ఈ వర్షంలో ఆ బావి మీద, కాలు జారినా, కళ్ళు తిరిగినా, ఆ! |
| | బాలు | మాధవీ నాకింత త్వరగా చచ్చే యోగమే ఉంటే, ఇన్నాళ్ళు బతికి ఉంటానా? నిన్నిలా |
| అంటూ బొట్టు ఇచ్చి | | పార్వతీదేవిలాగా నిన్నిలా చూడగలుగుతానా? |
| బొట్టు పెట్టుకుంటూ | | అవునూ నువ్వేంటిక్కడ? ఆ? |
| | మాధ | శైలజ ఎవరనుకుంటున్నావ్? |

బాలు లంటే! శైలజ! ఈజిప్ట్ మెరెలా? ఫ! ఎందుకు నేను?

చేతికున్న గజ్జెలు కిందపడ్డాయి
వెళ్ళి పెట్టె తెరిచి చూసాడు
లోపల మాధవి, భర్త దిగిన
ఫోటో ఉంది
తను తీసిందే

అదీ, తల్లి పోలిక కొడుక్కి, తండ్రి పోలిక కూతురికి వస్తే అదృష్టం లంటారు శైలజ అచ్చం ఆయనే! ఆయనే కదూ?

మాధ అది అదృష్టవంతురాలు గనుకనే నీ శిష్యురాలయ్యింది కానీ ఇంకా గురువు గారికే దయ కలగ లేదు

బాలు అది, అది కాదు మాధవీ

మాధ అదే అదే, భూతాలు, దెయ్యాలు నృత్యం, బిరుదు ప్రదానం లదేనా?

బాలు లదేం చేస్తుంది పాపం చిన్న పిల్ల ఎలా నేర్పుతారో అలా చేస్తుంది నేను పిచ్చి వెధవ, ఫూల్, ఫూల్, బ్లడీ ఫూల్, మిగతా లంతా బాగానే చేసింది కదా! చాలా బాగా చేసింది

బాలు ఆ ముద్ర అదీ, పర్ఫెక్ట్, పర్ఫెక్ట్, ఏదో ఎక్కడో ఒక చిన్న తప్పు చేస్తే ఇంత ఛండాలంగా, ఫూల్! రాయాలా?

మాధ ఉన్నది ఉన్నట్టు రాసావ్ అందులో నీ తప్పేముంది?

బాలు తప్పు లేదన్న తల బిరుసుతోనే ఆ రోజు శైలజకు క్షమాపణ చెప్పు కోమంటే చెప్పుకోలేదు ఇప్పుడిదంతా తెలిసిన తర్వాత క్షమాపణ చెప్పుకోటానికి సిగ్గు పడటం లేదు

మాధ చిన్న పిల్ల, దానికా?

బాలు నీకూ, మీ వారికి

మాధ ఆయన ఇక్కడ లేరు

| | | |
|---|---|---|
| | బాలు | ఓ అక్కడే ఉన్నారా? |
| పైకి చూస్తూ | మాధ | అక్కడే ఉన్నారు |
| | బాలు | ఎప్పుడొస్తారు? |
| | మాధ · | రారు, నేనే అక్కడికి వెళ్ళాలి, శైలజను నీ దగ్గర వదిలేసి |
| | బాలు | ఆ! అంత తేలిగ్గా వెళ్లనిస్తానా? నేనే అక్కడికి వెళ్ళి ఆయన్ని ఇక్కడికి తీసుకు వచ్చి శైలజ చేత నాట్యం చేయించి, ఆ నటరాజు చేత ఆశీర్వాదం ఇప్పించి, అప్పుడు మీ దంపతులు ఇద్దరి చేతా నేచెప్పినపాఠానికి మీరిచ్చిన జీతానికి లెక్క కట్టి, నీ ఋణం తీరిపోయిందిరా అని మీరు చెప్పిన తర్వాత నేనే వెళ్ళిపోతాను |
| | మాధ | ఎన్నిటికి లెక్క చూడమంటావ్? నువ్వు ఎన్నివర్ణాలు, కృతులు నేర్పావో చూడమంటావా? నువ్వు ఎన్ని బ్రాందీలు, విస్కీలు తాగావో చూడమంటావా? నీలోనరాలూ, నాడులూ ఎన్ని తెగిపోయాయో చూడమంటావా? నీలోరక్తం ఎంత నీరయిపోయిందో చూడ మంటావా? దేన్నిచూడమంటావు? |
| | బాలు : | లేదు మాధవీ, నాకెందుకిలా అలవాటయ్యిందో, నేనెందుకు ఇలా దిగజారిపోయానో ఇకనువ్వు అడగొద్దు ఇన్నాళ్ళూ ఆ దైవాన్ని మరిచిపోయాను సాధనా సంగీతాన్ని వదిలేసి పిచ్చివాడిలా తిరిగాను ఈనాడు నువ్వు దేవతలా ప్రత్యక్షమై ఆ దైవాన్ని గుర్తుకు తెచ్చావ్ |
| | | థాంక్యూ! |
| | | ఆయన పాదాల సాక్షిగా చెబుతున్నాను, ఆ తాగుబోతు బాలు ఇక లేడు, ఉండడు ఐ మీన్ ఇట్, ఐ మీనిట్ |

– కట్ టూ –

నీటికి కరిగిపోయినబొట్టును మళ్ళీపెట్టుకోమని ఇస్తున్నాడు తప్పించుకోలేక పెట్టుకుంటోంది శైలజ తనకూతురు అనిచెప్పాక, నీపోలికలు కాదు అని మీ ఆయన పోలికలు అని గుర్తుకుతెచ్చుకుంటూ అవునూ ఆయన ఎక్కడ అని అడిగాడు

ఆ ప్రశ్న, తనకు అతని నుంచీ ఎదురు కాకూడదు అనుకుంది మాధవి వచ్చేసింది చెప్పాలి? ఎలా చెప్పాలి? అబద్ధం చెప్ప గూడదు

ఆయన ఇక్కడ లేరు అంది ఓ అక్కడే ఉన్నారా? అంటే కెనడాలోనే ఉన్నాడా అని అతని అభిప్రాయం అక్కడే ఉన్నాడు అని పైకిచూసి చెప్పింది అంటే భగవంతుడిదగ్గర ఉన్నాడని చెప్పింది

ఎప్పుడొస్తాడు అన్నాడు మళ్ళీ ఏం చెప్పాలి? ఇక రాలేడు, రాడు అని చెప్ప లేదు అందుకే రారు నేనే అక్కడికి వెళ్ళాలి, శైలజను నీదగ్గర వదిలేసి అంది

నర్మగర్భంగా సంభాషణ శిల్పంతో సాగిన ఈ దృశ్యం బాలు ప్రవర్తనలో మార్పుకి కారణమై ప్రయోజనాత్మకమయ్యింది

వ్యంగ్యాత్మకం · నర్మగర్భ సంభాషణకూ, వ్యంగ్యాత్మక సంభాషణకూ తేడా ఉంది వ్యంగాత్మకతలో ఉన్న హేళన, లేదా ఎగతాళి నర్మగర్భసంభాషణలో ఉండదు

శుభలగ్నంలో ఇంటిఓనర్ రాధ దగ్గరకు వచ్చాడు ఆమె అంతకుముందు తనఇంట్లోనే అద్దెకు ఉండేది గనుక ఆమె మనస్తత్వం అతనికి తెలుసు అందుకే భర్తను కోటిరూపాయలకు అమ్ముకున్న తర్వాత ఆమెను పరామర్శించటానికి వచ్చి -

*బావుందమ్మా, చాలాబావుంది, అప్పుడు ఇరుకిల్లు, మొగుడుపిల్లలూ ఎప్పుడూ కళ్ళఎదుటే ఉండేవాళ్ళు చిరాగ్గా, ఇప్పుడు విశాలమైనబంగళా, ఎవరి ఏసీ రూములు వాళ్ళవి, హాపీగా, ఒంటరిగా ఉండవచ్చు, ఏమిటో! ఆడదానిజీవితంలో సగంటైము మొగుణ్ణి చూసుకోటానికే సరిపోతుందమ్మా, నీకా బాధలేదు ఎందుకుంటుంది. సవితుందిగా, అలాంటి చిన్నచిన్నపనులన్నీ తనే చూసుకుంటుంది ఏమిటో! ఆ టైమంతా ఎంచక్కా నువ్వు క్లబ్బులకు వెళ్ళో, టీవీలుచూస్తూనో గడిపెయ్యవచ్చు, ఎంత జాతకురాలివమ్మా కంగ్రాట్స్, అరె వెరీగుడ్, బ్యూటిఫుల్! ఇంట్లో సోఫా సెట్టుంది, కలర్ టీ.వీ ఉంది, ఫారిన్ వీ.సీ ఆర్ ఉంది, ఫోనుంది, ఫానుంది, అన్నింటినీ ఎంత అందంగా దర్జాగా అమర్చావమ్మా, నీ దర్జాయేదర్జా, ఇంతకీ మీ ఆయన్నెక్కడ దాచిపెట్టావమ్మా, వచ్చి ఇంత సేపయినా కనిపించడేం పాపం మానవుడు?*

ఇదేమాటను చూడమ్మా ఇన్నిఉన్నా భర్త లేకపోవటం వెలితిగాఉంటుంది, అన్నట్టుగా ఈ సంభాషణజరిగితే అందులో వ్యంగ్యం ఏముంది? ఇన్నిఉన్నాయి నీ మొగుడు కనిపించడేం అనటంలోనే పడింది చురక! ఇప్పడిప్పుడే కాలుతున్న ఇనుముమీద సమ్మెటదెబ్బలాంటి మాట!

అంతేకాదు లత, తనభర్త పిల్లలతోకలిసి జూకి వెళ్ళిందంటే అతనన్న మాటకూడా వ్యంగ్యాత్మకమే

వెళ్ళిఉంటుంది. డబ్బుల్లో పుట్టిన పిల్లగదా ఆ పిల్లకి డబ్బుకంటే మొగుడూ పిల్లలే ముఖ్యంలాఉంది. పిచ్చిమొద్దు నా ఉద్దేశం ఆ పిల్ల, అదేనమ్మా నీ సవతి జూకి వెళ్ళిందీ, జంతువుల్ని చూడటానికి కాదు. అక్కడ జంతువుల్నిచూసి నీ పిల్లలు కేరింతలుకొడుతూ నవ్వుతూఉంటారు గదా, వాళ్ళనవ్వుల్ని చూడటానికి వెళ్ళుంటుంది ఆ! వాళ్ళనవ్వుల్ని ఆటల్ని చూసి మురిసిపోయే ఆ మొగుడికళ్ళల్లో మెరుపుల్ని చూడటానికి వెళ్ళిఉంటుంది పిచ్చిపిల్ల, ఏమిటో నీ అంత తెలివి తేటలు దానికెక్కడవీ, పదివేలు పారేసి పిల్లల్ని నవ్వమంటేనవ్వరూ! హి! ఏమిటో! 20వేలు పారేస్తే మొగుడు సంతోషించడూ! ఏమిటో! ఎవరిపిచ్చివాళ్ళకానందం! నువ్వివేమీ పట్టించుకోకమ్మా, ఒంటరిగాఉంటే మాత్రమేం, హాయిగా సుఖంగాఉన్నావ్, నాకంతే చాలు. వస్తానమ్మా, ఇల్లు సోఫాలూ జాగ్రత్త, ఏమిటో!

ఇందులో ధ్వనిఉంది పైకిచెప్పేది ఒకటి లోపలఅర్థం మరొకటి ఇచట మాయత్త పండు నేనిట పరుండు లాంటి విశ్లేషణ! నిజానికి ఈ సుఖాలు డబ్బులోపుట్టిన ఆ పిల్ల అనుభవించాలి అలాంటిది ఆమె పిల్లలసంతోషం, అది చూసిన భర్తసంతోషం చూసి సంతోషించటానికివెళితే నువ్వు ఏసీలు, సోఫాలు, ఫోన్లు చూసి సంతోష పడుతున్నావని చివాట్లుపెడుతున్నాడు అది ఆమె అర్థం చేసుకుంది నిర్లక్ష్యంగా విని భరించటంలేదు ఆమెఅభినయంలో ఆందోళన, కళ్ళల్లోనీళ్లు ప్రారంభమయ్యాయి మార్పు వస్తోంది పశ్చాత్తాపం ప్రారంభమయ్యింది

పదివేలు పారేస్తే పిల్లలనవ్వులు దొరకవు, ఇరవైవేలు పారేస్తే మొగుడు సంతోషించడు, అదీ తెలిసింది ఇల్లు, సోఫాలు జాగ్రత్త అని చెప్పి వెళ్ళటం వ్యంగ్యానికి పరాకాష్ఠ

ఆమెను వ్యంగాత్మకంగా సంస్కరించదలచుకున్నాడు అనటానికి గుర్తుగా ఆమె ఊతపదం **ఏమిటో** అనే దాన్ని పదేపదే వాడి ఆమెకు సూటిగా తగిలేలాచూసాడు

దివాకర్‌బాబు ప్రజ్ఞ ఈ వ్యంగ్యాత్మకశిల్పాన్ని ప్రదర్శించటంలో చాలాచక్కగా బయటపడింది

ప్రతిఘటనలో ముగింపు సన్నివేశంలో కధానాయిక సంభాషణమొత్తం వ్యంగ్యాత్మకమే అందుకే మంత్రి చేత ***తిడతందా! పొగుడుతాందా!*** అని అయోమయంగా అడిగించటం ద్వారా అది వ్యంగ్యం అని స్పుటీకరించారు

ఇలా వ్యంగ్యాత్మకసంభాషణ ఒకశిల్పంగాప్రయోగించి ముఖ్యంగా పాత్రలమనోభావ సంస్కరణ కోసం, దృశ్యప్రయోజనం సాధించటం కోసం సినిమాల్లో రాసుకుంటూఉంటారు

ప్రాంతీయత, మాండలికత, యాస ఒక్కోసారి సినిమాలో పాత్రధారులకు ప్రాంతీయ భాష వాడుతూ ఉంటారు మాండలిక పదాలు వాడతారు యాస మాటలు వాడతారు దీనిని గురించి తెలుగులో మాండలిక కథాసాహిత్యం గురించి పరిశోధించిన ఎ కె ప్రభాకర్ ఏమంటున్నాడో చూడాలి -

> మాండలికం భాషలో ఉన్న పదజాలానికీ, స్వీకరణానికీ, ధ్వనులకీ సంబంధించిన దయితే, యాస కేవలం ఉచ్ఛారణకి పరిమితమైనది
> యాస ఉచ్ఛారణకి సంబంధించింది కాబట్టి రాతలో దాన్ని పట్టుకోలేం ధ్వనిశాస్త్రంలో ఉచ్ఛారణకి సంకేతా లేర్పరుచుకొన్నా సాహిత్యంలో దాన్ని అచ్చొత్తించడం కష్టం యాసద్వారా వ్యవహర్త ఏ ప్రాంతానికి చెందిన వాడో చెప్పవచ్చు అంతమాత్రాన యాస - మాండలికం ఒకటి కావు మాండలికలక్షణాల్లో ఒకటైన ఉచ్ఛారణ భేదమే యాస [26]

గోరింటాకులో శ్రీకాకుళం మాండలికం, **ముత్యాలముగ్గులో కాంట్రాక్టరు** వాడిన యాస **ప్రేమించుకుందాం రా, సమరసింహారెడ్డి, నరసింహనాయుడు** చిత్రాలలో స్థలజ్ఞతకోసం రాయలసీమ ప్రాంతంలో వాడేభాషను ఉపయోగించటం జరిగింది

దానిమూలంగా సినిమా వాస్తవంలా కనిపిస్తుంది పాత్రానుగుణంగా యాసకూడా వాడటం జరుగుతుంది

**మూగమనసులు** చిత్రంలో కథానాయకుడు, కథానాయికకు పాటనేర్పుతూ ఉంటాడు నాపాట నీనోట పలకాల *సిలకా* అంటాడు ఆమె *చిలకా* అన్నా, *సిలకా* అని పలికించటానికి ప్రయత్నిస్తాడు అది ఆ పాత్ర అమాయకత్వానికి నిదర్శనంగాఉంటుంది

**ఊతపదాలు** తెలుగు చలన చిత్రాలలో అనేక చిత్రాలలో ఊత పదాలు వాడటం జరిగింది

*నిజం చెప్పమన్నారా అబద్ధం చెప్పమన్నారా!*

*తప్పు తప్పు రాణీగారి తమ్ముణ్ణి* - అని **పాతాళ భైరవి**లో చెప్పిన రోజు దగ్గర నుంచి, ఈనాటివరకూ,

*అరిస్తే చరుస్తా చరిస్తే కరుస్తా, కరిస్తే నిప్స్ఫమిస్తా* అని **అసెంబ్లీ రౌడీ**లో చెప్పటం దాకా ఈ ఊతపదాల ప్రయోగాలు విశేషంగా ఉపయోగిస్తున్నారు

*ఏమిటో* అని ఒక కథానాయిక వాడే ఊతపదమే ఆమె పాత్రలో మార్పు రావటం కోసం ఎదుటి పాత్ర వ్యంగ్యంగా వాడి శిల్పాన్ని సాధించిన వైనం ఇంతకుముందే తెలియజేయటం జరిగింది

అలాగే హాస్యంకోసం, హర్షంకోసం, విషాదంకోసం కూడా ఊతపదాలను తిరిగి వేరే పాత్రల ద్వారా అదేచిత్రంలో ప్రయోగిస్తూ ఉంటారు

**ద్వంద్వార్థాలు :** నర్మగర్భంగా, వ్యంగ్యాత్మకంగా ఉండవలసిన పదాలను ద్వందార్థాల్లో ప్రయోగించి కొందరు శిల్ప సాధన పొందుతారు గాని, అది సమర్థనీయం కాదుకనుక ఉదాహరణలు ఇవ్వటం లేదు

**నటీ నట శైలి :** సంభాషణలు పాత్రోచితంగా రాయటం రచయిత ధర్మం సామాన్యంగా గ్రంధాల్లో, నాటకాల్లో పాత్రోచితంగాఉంటాయి కాని సినిమాల్లోమాత్రం నటీనటుల శైలినిబట్టి సంభాషణ రాయటం కూడా ఒకశిల్పమే

యస్వీ రంగారావు ఒకపద్ధతిలో, రావు గోపాలరావు ఒకపద్ధతిలో, రాజనాల ఒకపద్ధతిలో, కైకాల సత్యనారాయణ ఇంకోపద్ధతిలో సంభాషణలు పలుకుతారు వారిశైలికి సంభాషణను మార్చుకోవటమే ఈ శిల్పం

ఎన్ టి రామారావు, అక్కినేని, కృష్ణంరాజు, శోభన్‌బాబు, కృష్ణ, బాలకృష్ణ, చిరంజీవి, మోహన్‌బాబు, శారద, భానుమతి, వాణిశ్రీ ఇలా ఒక్కొక్కరికీ ఒక్కో డిక్షన్ ఉంటుంది ఆయా పాత్రలకనుగుణంగా రాయవలసిన సంభాషణలు ఆయా పాత్రధారులకనుగుణంగా రాయటమే ఈ శిల్పం

నాటకాల్లో కూడా కత్తి వెంకటేశ్వర రావు, మిశ్రో, మందుల వారివారిశైలితో సంభాషణలు రాయించుకున్నారు

**ఇతరాలు ·** ఇంతేకాకుండా ఆహ్, ఓహో, అలాగా అంటూ కాకువు ప్రయోగాలు చెయ్యటం, సంభాషణలో విరుపునుఅందించటం, అసలు సంభాషణరాయకుండా పాత్రలను మౌనంగాఉంచటం, అలా ఆ పాత్ర మాట్లాడకూడదు అని తెలిసినా, సందర్భానుసారంగా పాత్రకు అలాంటి సంభాషణలు రాయటం కూడా సినిమాసంభాషణరచయితలు వారి శిల్పచాతుర్యానికి నిదర్శనంగా ప్రదర్శించినవే **పెళ్ళిపుస్తకం**లో 'నేనూ' అని గుమ్మడి పలికినతీరు, **స్వర్ణకమలం**లో 'అర్థం చేసుకోరూ' అని భానుప్రియ సాగదీసినవైనం ఇదే!

ముఖ్యంగా ప్రతి సినిమారచయిత ఒక్కొక్కచోట కావాలనే కథాసూచన ఒక సంభాషణ ద్వారా చేస్తాడు, లేదా ఒక్కసంభాషణతో కథాశిల్పం మారేలా చేస్తాడు

**పాతాళభైరవి**లో అంజి తోటరాముడితో మీ ఇద్దరూ ***శ్రీరామచంద్రుడు సీతాదేవిలాగా ఉండాలంటాడు*** తోటరాముణ్ణి, రాకుమారిని తెలియకుండానే వియోగం, రావణాసురుడు లాంటి మాంత్రికసంహారంచేసి, రాకుమారిని తెచ్చుకునే కథాసూచన ఇది

ప్రేమనగర్‌లో కథానాయకుడు -

ఎందుకు చేసావీ పని?

అంటాడు కథానాయికతో ఆ మాట లేకపోతే ద్వితీయ భాగం అలా కొనసాగదు

ఇలా ఒక సంఘటన కోసం, సంఘర్షణ కోసం, కథలో మలుపు తిరగటంకోసం కూడా రచయితలు సంభాషణలు రచిస్తూ ఉంటారు

ఈ విధంగా చలన చిత్రాల్లో సంభాషణశిల్పం, చిత్రకథలో అర్థవంతమైనస్థానం పొందుతూఉంటుంది

ఇప్పుడు చిత్రకథలో నేపథ్యశిల్పం ఎలా ఉంటుందో పరిశీలించవలసి ఉంది

## నేపథ్యశిల్పం :

చలనచిత్రాలకు నేపథ్యంలో వాతావరణం, ధ్వని రెండూఉంటాయి

ఒకదృశ్యాన్ని తీసేముందు ఆ దృశ్యానికి సరిపోయే వాతావరణం ఏమిటి?

వర్షం కురిపించాలా?

ఉరుములు, మెరుపులు చూపించాలా?

ఎండిపోయిన కొమ్మల మధ్య తియ్యాలా?

ఎడారి భూముల్లోకి వెళ్ళాలా?

వెనుక శ్మశానం కనిపిస్తుండగా తియ్యాలా?

వెనుక సముద్రం ఉండగా తియ్యాలా?

సెలయేరు పరుగెత్తుతూ ఉండగా ఆ పక్క తియ్యాలా?

పచ్చని పైరు పొలాల్లో తియ్యాలా?

గుడిసెల మధ్య తియ్యాలా?

ఇవన్నీ చర్చించుకోవటం జరుగుతుంది జరుగుతున్న దృశ్యాన్ని ఎలివేట్ చేసే వాతావరణాన్ని సృష్టించటమే నేపథ్యశిల్పం ప్రేమలో దెబ్బతిన్నప్పుడు సామాన్యంగా ఎండిపోయిన చెట్ల మధ్య ప్రేయసినో, ప్రియుడినో కూర్చోబెడతారు ఇద్దరుప్రేమికులో, భార్యాభర్తలో విడిపోవాలి అనుకున్నప్పుడు సముద్రంపక్క చిన్నబండరాళ్ళ మీద కూర్చోబెట్టి, వాళ్ళ హృదయఘోష సముద్రపుఘోషలాగా సింబాలిక్‌గా ఉందనిపిస్తారు

బొబ్బిలిబ్రహ్మన్నలో ధర్మ పీఠానికి ముందు ఒక చెట్టు మొదట్లో కత్తి దిగబడి ఉండటం, వెనక ఆలయాలు, కుతూహలజనితమై, కంటికి కనిపించే ఆ కత్తి ఈ

బ్రహ్మాన్న ఎప్పుడు తీస్తాడు? ఎవరిని చంపుతాడు? అన్న ఉత్సుకతను కలిగిస్తూ ఉంటుంది

నేపథ్యంలో ధ్వనికూడా ఒకభాగం కాబట్టి, ఒక్కోసారి సంభాషణేతరమైన ధ్వనులు ప్రయోగించి ఒకవిధమైన అలౌకిక ఆనందాన్ని కలిగిస్తారు

**సాగరసంగమం** చిత్రంలో బాలూ తల్లి మరణించిన సన్నివేశంలో తొలుత నిశ్శబ్దం, ఆ తరువాత ఏ కాలికి గజ్జెకట్టి కొడుకు ఆడాలని ఆ తల్లి కోరుకుందో ఆమెకోరిక ఆమెఆత్మ వింటున్నట్లుగా కాలిగజ్జెలశబ్దాన్ని, తరువాత సంగీతధ్వనిని వినిపించారు

అలాగే **మల్లీశ్వరి** చిత్రంలో మహారాజు కానుక ఇస్తూఉండగా నేపథ్యంలో ఉరుములు, మెరుపులు రావటం ఈ మల్లీశ్వరి జీవితం ఒడిదుడుకుల్లో పడబోతోంది అని చెప్పటమే

సహజమైనధ్వనులు వాడటం ఒక పద్ధతి గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నట్టు, మనసు గుర్రంలా సకిలిస్తున్నట్టు ఇలా రక రకాల ప్రయోగాలు చేసి సినీ కథ, కథనరచయితలు దృశ్యానికి, సన్నివేశానికి బలాన్ని చేకూర్చారు

## అభినయశిల్పం :

సాహిత్య ప్రకియలో లేనిది, చలన చిత్ర ప్రక్రియలో ఉన్నది అభినయం

అతను తెల్లబోయాడు అని సాహిత్య రచయిత రాస్తే, ఎలా తెల్లబోయాడో ఊహకే తప్ప కంటికి కనిపించదు సినిమాల్లో అలా కాదు

**ప్రతిధ్వని** చిత్రంలో భర్త హత్యకు గురయితే కర్తవ్యనిర్వహణ కోసం అతనిభార్య పోలీస్ఆఫీసర్‌గా చావుఊరేగింపులో పాల్గొనటం అభినయశిల్పానికి మచ్చుతునక

అలాగే **బందిపోటు** చిత్రంలో కథానాయకుడు, ప్రతికథానాయకుడు మందుతాగి వచ్చినప్పుడు, అతన్ని ఆటపట్టించటంకోసం అద్దంతీసి తనే అతని ప్రతిబింబంలా కనిపిస్తూ ఏడిపించిన దృశ్యం మొత్తం అభినయశిల్పంతో నిండిఉంది

సంభాషణతో వాచ్యం చెయ్యటానికి వీలు లేని పరిస్థితుల్లో అభినయం ద్వారా ఆ సంభాషణ భావాన్ని పలికించటం కూడా అభినయ శిల్పమే

**పాతాళ భైరవి** సినిమాలో తోటరాముడు అంతఃపురానికి వచ్చి రాకుమారికి చిరునవ్వుతో నమస్కారం పెట్టినప్పుడు, సిగ్గుల మొగ్గయిన అభినయం, అతన్ని ప్రేమిస్తున్నానని కళ్ళతో చెప్పటం, ఇవన్నీ అభినయ శిల్పాలే

ముఖ్యంగా బాలచందర్, బాపు, కె విశ్వనాథ్‌ల దర్శకత్వాలలో, వారి స్క్రీన్‌ప్లే రచనలో, ఈ అభినయశిల్పానికి తావు ఎక్కువ ఇస్తారు

**సాగర సంగమంలో**, వర్షపునీటితో మాధవి నుదుటిబొట్టు కారిపోకుండా బాలు అరచెయ్యి అడ్డంగాపెట్టటం, శవానికి గొడుగుపట్టటం, **ముద్దులమావయ్య** చిత్రంలో కథానాయకుడు చనిపోయిన చెల్లిలికి గొడుగు పట్టటం, ఇలాంటివే

సామాన్యంగా సినిమా దృశ్యకావ్యం కాబట్టి అభినయశిల్పం ప్రదర్శన లేని చిత్రాలు తక్కువగా ఉంటాయి

నర్తనశాలలో వలలుడు సభలో కండలు ప్రదర్శించటం ఇలాంటిదే

పూనుకుంటే, ఈ అభినయశిల్పాన్ని లోతుగా పరిశీలిస్తే, ఈ అంశం మీదే ఒక పరిశోధనా వ్యాసం రాయవచ్చు

**శీర్షికాశిల్పం :**

సినిమాకి మకుటం పెట్టటంలోకూడా శిల్పం చూపిస్తారు కొందరు

నిజానికి చిత్రంలో ఏ కథ ఉందో దానికి సరిపోయే పేరుని పెట్టుకోవటమే న్యాయిం

**ముత్యాలముగ్గు** అన్నది అందమైన పేరులా కనిపిస్తుంది కాని అందులో ఒక శిల్పం ఉంది

బాపు, రమణ ఆ పేరే ఎందుకు పెట్టి ఉంటారు? ఇల్లాలి గొప్పదనం ఇంటి ముందు ముగ్గు చూస్తే తెలుస్తుందీ అంటారు ఒక పేదరాలు ఒక కోటీశ్వరుడి ఇంటికి అనుకోని సంఘటన ద్వారా కోడలిగా వచ్చింది తన అల్లుణ్ణి చేసుకోవాలని తాపత్రయ పడిన ఒక పెద్దమనిషి, **కాంట్రాక్టర్** సాయంతో ఆమె శీలంమీద నిందవేసి బయటకుపంపాడు తనకూతుర్ని ఆ ఇంటికోడల్ని చేద్దామనుకున్నాడు

కానీ ఆ ఇల్లాలు మళ్ళీ ముగ్గు వేసుకుంది అదే ముత్యాలముగ్గు ఆమె వేసుకున్నది పిండి ముగ్గయితే వాళ్ళ కాళ్ళ కింద నలిగినప్పుడు మట్టిలో కలిసిపోయేది కాని ఆమె ముత్యాలముగ్గు వేసుకుంది ముత్యాలు చెదురుతాయి తప్ప మట్టిలో కలిసిపోవు అందుకే మళ్ళీ అందమైన తన కాపురాన్ని ముత్యాల ముగ్గుతో తీర్చిదిద్దుకుంది

ఇదే ఆ చిత్రానికి **ముత్యాల ముగ్గు** అనటంలో విశేషం

**శుభలగ్నం** ఇంతకు ముందు పరిశీలించటం జరిగింది ఆ లగ్నం శుభలగ్నం కాబట్టి మళ్ళీ ఆమె జీవితంలో ఎన్నో విఘ్నాలు కలిగినా శుభలగ్నాలే రావాలి అని శీర్షిక ఉద్దేశం

**సమరసింహారెడ్డి, నరసింహనాయుడు** అనేవి ఒక మార్మిక ఉద్దేశంతో పెట్టబడినవి ఆ ప్రయోజనం ఆ నామధేయం వల్ల వాటికి సంప్రాప్తించింది

***పాతాళ భైరవి, గృహలక్ష్మి, రైతు బిడ్డ, రోజులు మారాయి*** – ఇలా కొన్ని వందల చిత్రాలను పరిశీలించుకుంటూ వెళితే ఆయా మకుటాలు మనిషిశరీరంమీద శిరస్సులమరినట్లు అమరుతాయి

– అయితే శీర్షికలో శిల్పం దెబ్బతిని చిత్రాలు దెబ్బతిన్న సందర్భాలు కూడా ఉన్నాయి ఆ చిత్రాల మకుటాలు బట్టి ఏదో ఊహించుకుని వచ్చే ప్రేక్షకుడు అలాంటి ఇతివృత్తం, సన్నివేశాలు కనిపించకపోతే నిరాశపడే అవకాశం ఉంది ఉదాహరణ **సీమసింహం, మా తెలుగు తల్లి.**

## నామకరణ శిల్పం :

చిత్రంలోని పాత్రలకు పెట్టే పేర్లు కూడా కొందరు కథా రచయితలు, సంభాషణ రచయితలు, స్క్రీన్‌ప్లే రచయితలు ఒక ఉద్దేశంతో, ఒక ప్రతీకాత్మకతతో పెట్టటానికి ప్రయత్నిస్తారు

ఒక ఆలోచనతో పెట్టినప్పుడే శిల్పం ప్రదర్శించినట్లవుతుంది

ఉదాహరణకు వేశ్య కుమార్తెకు శంకరాభరణంలో **తులసి** అని పేరు పెట్టాల్సిన అవసరం లేదు అసలు వేశ్యలకు అలాంటి పేర్లు ఉండవు విచిత్రమైన పేర్లుంటాయి ఆమె చేత పడుపు వృత్తి చేయిద్దామనుకున్న తల్లి అలాంటి పేరు ఎందుకు పెడుతుంది? కె విశ్వనాధ్ పెట్టాడు ఆ పేరు తులసి అని

చెడగొట్టబడినా ఆమె తులసే తులసీ జలంధరలో తులసి చెడగొట్టబడినా పతివ్రతే కదా!

ఈ విధంగా అర్థవంతంగా, పాత్రస్వభావాన్ని వ్యక్తీకరించటానికి పేర్లుపెట్టటం జరుగుతుంది అదే నామకరణ శిల్పం

## ప్రతీకాత్మక శిల్పం :

స్టీన్ బెక్ *(Stein beck)* తన *Journal of Novel* లో ప్రతీకవాదం *(Symbolism)* గురించి ఇలా అన్నారని నాన్సీ స్మిత్ ఉటంకించారు

> *"It is a kind of Psychological sign language It is Chosen to illuminate as well as to illustrate the whole"*[27]

కాల్పనిక భావనలను తాంత్రిక చిహ్నాల ద్వారానో లేదా మత విషయకమైన

ఔత్సాహికత ద్వారానో రూపించడంలోనే ప్రతీకవాదులు ఆసక్తి వహించారు [28] అని లలిత కళా పదకోశం చెబుతుంది

సినిమాలలో ఈ ప్రతీకవాదం ఒక శిల్పంగా అనాదిగా నడుస్తోంది

ఒక మానభంగదృశ్యాన్ని యధాతధంగా చిత్రించేటప్పుడు కొన్ని ఇబ్బందులు ఎదురవుతాయి కరుణరసానికిబదులు విశృంఖలశృంగారభావం ప్రేక్షకులహృదయంలో కలిగే అవకాశంఉంది అలాంటిసందర్భంలో చిత్రకధారచయితలు ప్రతీకవాదాన్ని ఆశ్రయిస్తారు

ఇప్పటికి అనేకదర్శకులు అనేకవిధాలుగా ఇది చూపించారు

కె విశ్వనాధ్, శంకరాభరణంలో తులసి మానభంగం జరుగుతున్నప్పుడు **సింబాలిక్‌గా** అగరొత్తులు తగలబడిపోవటం, *గ్రామ్‌ఫోన్‌నీడిల్* కదలిక, తులసి జమిందారుని చంపాక గద్ద పాముని పట్టిన **షాటు**, శంకరశాస్త్రి పాదాలకు రక్తం రాయటం చూపించాడు

మానభంగ దృశ్యాలప్పుడు మల్లెలు నలిగిపోయిన **షాటు**, గాజులు పగిలిపోయిన **షాటు,** లేడిని మెడపట్టిన పులి **షాటు**, ఆవు మీద దూకే సింహం **షాటు** ఇలా చాలామంది దర్శకులు ప్రతీకాత్మక శిల్పాన్ని ప్రదర్శించారు

తులసికి గర్భం వచ్చిందని వాచ్యంగా చెప్పకుండా ఆమె డాక్టర్ రూంలోనుంచి బయటకు రాగానే ఒక తల్లి ఒళ్ళో ఉన్న బిడ్డను చూపించి ఆమె గర్భవతి అని సజెష్టివ్‌గా చూపించటం కూడా ఈ ప్రక్రియే

ఈచరిత్ర ఏ సిరాతో చిత్రంలో ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్ దగ్గర నిరుద్యోగులను ఒక దళారి మాయమాటల్లో పడెయ్యాలని చూస్తుంటే ఎరతో చేపనుపడుతున్నట్లు చూపించిన **షాటు, మరోమలుపు** చిత్రంలో ప్రతికధానాయకుడు మనుషుల్ని ముదలకిస్తుంటే గొడ్లకాపరి పశువుల్ని అదిలిస్తున్న **షాటు**కూడా ఇలాంటివే

ఇది ఎక్కువశాతం దర్శకుడి ప్రతిభమీద ఆధారపడిఉంటుంది కధారచయితకంటే చిత్రకధారచయితే దీనిలో ఎక్కువభాగస్వామ్యం కలిగిఉంటాడు చూపించకూడదని వాటిని సజెష్టివ్‌గా చూపించటం, వాచ్యం చెయ్యకుండా అంతర్లీనంగా ఆ భావాన్ని ప్రేక్షకుడిఊహకు అందేలాచెయ్యటమే ఈ ప్రతీకాత్మకశిల్పానికి ప్రాణం

**కధనశిల్పం :**

ఇంతకు ముందు పరిశీలించిన శిల్పాలన్నీ కధనశిల్పంలో భాగాలే కధావస్తు కధ, మనిషి ప్రాణం, శరీరంలాంటివి కధ శరీరం అయితే కధనం ప్రాణం కధలేనిధ కధనం లేదు

కథనంలేనిదే కథ జీవంలేని శరీరంలాంటిది

ఊపిరితీయని శరీరాన్ని ఉత్తరానికి పంపుతారు అంతకుమించి ఆశరీరంతో ప్రయోజనం ఏముంది అలాగే కథనశిల్పంలేని కథ, ప్రాణంలేని శరీరంతో సమానం

కథ చాలాబాగుంది అని కూడాప్రజారంజకంగాని అనేకచిత్రాలు చలన చిత్రపరిశ్రమలో ఉన్నాయి దానికికారణం కథనలోపమే ఏ దశలోనయినా కథనమే కథకు ఊపిరి - ప్రాణం - జీవం - జవసత్వం ఇది సత్యం

## శైలి–శిల్పం :

సాహిత్యంలో శైలి, శిల్పం అని రెండింటి గురించి వినడం పరిపాటి ఈ రెండింటి మధ్య ఉన్న వ్యత్యాసం ఇప్పుడు పరిశీలించటం జరుగుతుంది శిల్పం అంటే ఏమిటో ఇంతకుముందు పరిశీలించటం జరిగింది శైలి అంటే ఏమిటో లలితకళాపదకోశం ఏమంటోందో పరిశీలించాలి

> *శైలి • ఒక ఆకృతిని ప్రతి కల్పించటంలో వినియుక్తమయ్యే ఒక ప్రత్యేక భావప్రకటనారీతి, శైలులు ఎన్నో కోవలకు చెందినవిగా - అంటే ఒక చారిత్రక యుగానికో, జాతికో లేదా ప్రదేశానికో, లేదా ఒక నిర్దిష్ట కళాకార బృందానికో చెందినట్లు - వింగడించబడుతున్నాయి ఒక కళాకారుడిలో విశిష్టంగా కానవచ్చే ఒక సాంకేతిక ప్రక్రియకూ, అతడిలో మాత్రమే కనిపించే ఒక లక్షణ సంపత్తికీ కూడాశైలి అనే పదం వాడతారు* [29]

అయితే - సాహిత్యంలో శిల్పం ఆయా రచయితల రచనా శైలి మీద ఆధారపడి ఉంటుంది నన్నయ్యదొక విధమైన పద్యశిల్పం తిక్కనది మరోరకం పోతనది ఇంకో రకం

పెద్దనది ప్రబంధశైలి శ్రీశ్రీది ఆధునికశైలి ఈ శైలిని ఆధారంగా చేసుకుని వారివారి శిల్పనైపుణ్యాలను దర్శిస్తూఉండటం అలవాటు

కాని చలనచిత్రంలో అలాకాదు ఇక్కడశైలివేరు శిల్పంవేరు సంభాషణరచనలో రచయిత శైలి - దృశ్యీకరణలో దర్శకుడిశైలి కనిపిస్తుంది

ఉదాహరణకు నాభి ప్రదేశంలో పువ్వో, పండో పడిందంటే అది కె రాఘవేంద్రరావు శైలి నిండుచీరలో తడిసో, వంగటంలోనో, కాలు నూతిమీదవేసి చెయ్యి అందించటంలోనో (సాగర సంగమం) ఆంగికాత్మకమైన శృంగార సాధన కె విశ్వనాథ్, బాపు (పెళ్ళి పుస్తకంలో కథానాయిక వంగి నిలబడ్డ భంగిమ) శైలి

అలాగే అభ్యుదయం, పురాణాల ఉదాహరణలు సంభాషణలలో కనిపిస్తే అది పరుచూరిశైలి, హాస్యం ఓలలాడుతుంటే అది జంధ్యాలశైలి, మనసు లేకుండా మాట

కనిపించకపోతే అది ఆత్రేయ శైలి, జీవితసత్యాలు, వాక్కులుగా కనిపిస్తే అది దాసరిశైలి, కన్నీళ్ళతో కూడిన సంభాషణ కూడా కరుకుగా వినిపిస్తే అది మహారథిశైలి అలనాటి పింగళి, సముద్రాల అయితే ప్రతిఅక్షరంలోనూ వారివారి శైలిని ప్రదర్శించారు

ఇలా రచయిత, దర్శకుడు ప్రదర్శించే శైలి వేరు, వారి కథనాల్లో వారు ప్రదర్శించే శిల్పం వేరు కథనంలోని భాగాలన్నీ శిల్పచాతుర్యంతో ప్రదర్శించబడటమే కథనశిల్పం

కథనానికి ఉత్తమచిత్రం **మల్లీశ్వరి**ని ఉదాహరణగా తీసుకున్నట్లు ,కథనశిల్పానికి సర్వోత్తమచిత్రం **మాయాబజార్**ని స్వీకరించటం జరిగింది **మాయాబజార్**లో లేని శిల్పం లేదు ఇంతకుముందు శిల్పంలో అన్నివిభాగాలూ వేరువేరుగా దర్శించినా, సినిమాసాహిత్యంలో 'కథనం'అనే విషయమ్మై ఉన్న అస్పష్టతను దృష్టిలోపెట్టుకుని, స్పష్టతకోసం, ఏకచిత్రంలో లక్ష్యలక్షణ సమన్వయసాధనకోసం, **మాయాబజార్** చిత్రం నుంచి, కథనశిల్పం పరిశీలించటం జరుగుతోంది

ఈ చిత్రంలోఉన్నకథ మహాభారతంలో ఎక్కడాకనిపించదు మహాభారతానికి ఆయువుపట్టులైన మయసభ, ద్యూతం, వస్త్రాపహరణం, అరణ్యవాస ఘట్టాలు సూచించబడ్డాయే తప్ప ఈ చిత్రంలో ప్రదర్శించబడలేదు

స్థూలంగా కథ ఇది

చిన్ననాడు శశిరేఖ, అభిమన్యులనుచూసి, బలరాముడు ముచ్చటతో నీకు ఏ వరం కావాలో కోరుకోఅమ్మా అని సుభద్రను అడిగితే, శశిని నా కోడల్ని చెయ్యమంటుంది బలరాముడు అంగీకరిస్తాడు

శశిరేఖా, అభిమన్యులు పెరిగి పెద్దవాళ్ళయ్యే సరికి మయసభలో దుర్యోధనుడు అవమానపడి, పాండవులను జూదానికి పిలిచి వారిని ఓడించి, అడవులకు అజ్ఞాతవాసానికి పంపాక, విధిచెడి సుభద్ర అన్నల పంచన చేరవలసి వస్తుంది

బలరాముడు హస్తినకు వెళ్ళి వారి సపర్యలకు సంతుష్టుడై శశిరేఖను దుర్యోధనుడి కుమారుడైన లక్ష్మణ కుమారుడికిచ్చి చెయ్యటానికి అంగీకరిస్తాడు సుభద్ర, అభిమన్యులు ఘటోత్కచుడి పంచన చేరతారు శ్రీకృష్ణుడి సహాయంతో ఘటోత్కచుడు మాయాశశిరేఖగా మారిపోయి ఈ వివాహం చెడగొట్టి నిజమైన శశిరేఖాభిమన్యుల వివాహం జరిపిస్తాడు

ఈ కథను ఎలాంటి కథాశిల్పంతో రచయిత, దర్శకులు ప్రదర్శించారో తొలుత పరిశీలించాలి

**కథా శిల్పం :**

ఈ చిత్రకథలో పాండవులగురించి వింటాంతప్ప, వారుకనిపించరు ఇదే ఈ కథలో ప్రదర్శించిన గొప్ప నైపుణ్యం

ఎందుకంటే ఈ కథాపరంగా ఆలోచిస్తే పాండవులపరంగా జరిగిన ప్రతిఘట్టమూ భారతస్థమే! మిగిలిన కథంతా కవికల్పితం పింగళి సృష్టి కె వి రెడ్డి కథనరచనా చమత్కృతి అందువల్ల ఈ కథకూడా నిజంగాజరిగిందే అని నమ్మించటానికి ఆధారంగా నిజంగాజరిగినదానిని ఉపయోగించుకుంటూ, నిజంగా జరగనిదానిని అడుగడుగునా రసవత్తరంగా నడుపుతూ, నిజంగాజరిగినభారతాన్ని ముట్టుకోకుండా, భారతాన్ని పంచమవేదంగా గౌరవించే భారత సంతతిని సంతృప్తిపరిచారు

జరగనిది జరిగిందేమో అని ముక్కు మీద వేలేసుకుని చేసేలా చెయ్యటమే కదా, అద్భుతం అంటే అది ఈ చిత్రంలోని ప్రతి ఫ్రేములోనూ ఉంది ఈ చిత్రకథ, శశిరేఖాభిమన్యుల చిన్నారి చిలిపి చేష్టలతో మొదలై, బలరాముడి చేత నా కూతురిని నీ కోడల్ని చేస్తున్నానని వాగ్దానం చెయ్యటంతో ఆరంభమౌతుంది

నిజానికి 30 నిమిషాలనిడివిలో రావలసినమలుపు సుమారు 70వనిమిషంలోగానిరాదు ఎందుకంటే ఈ చిత్రం నిడివి చాలాఎక్కువ సుమారు ఇరవై ఒక్కవేల అడుగుల కంటే ఎక్కువ ఉంది అందుకే 1/3వ భాగాన్ని మలుపుకి వాడుకున్నారు అక్కడిదాకా చిన్నప్పుడు పరిచయమయిన పాత్రలను ఎదిగినతరువాత మరలాపరిచయం చేసి, ఎదిగినతర్వాత కూడా ఏమార్పూ లేకుండా ఆయాపాత్రలన్నీ ఆశయసిద్ధి రూఢిలోనే ఉన్నాయి అని చూపించటం జరిగింది

నిజానికి ఏ చిత్ర కథలోనయినా ఆశయం కథానాయకుడికి, కథానాయికకు ఉంటుంది ఈ చిత్రం కథలో ఆశయం మొదట కథానాయకుడి తల్లి సుభద్ర నోటి వెంట బయటకు వస్తుంది దానిని ఆ ఇంటిపెద్ద, బలరాముడు ఆశీర్వదించాడు

ఈ ఆశయం పెరిగి పెద్దదయ్యాక కథానాయకుడు అభిమన్యుడు, కథానాయిక శశిరేఖల ద్వారా బహిర్గతమై బలీయమయ్యింది శ్రీకృష్ణుడి ఇష్టం కూడా అదే గనుక ఆశయభంగానికి ఎవరు ప్రయత్నిస్తారో, ఎలాప్రయత్నిస్తారో తోచదు పైగా భారతంలోలేని ఇతివృత్తం కనుక ప్రేక్షకుడు, ఊహలోనే ఉంటాడు

ఇలాంటిసందర్భంలో మయసభను **క్లోజ్ షాట్**లో చూపించి ప్రేక్షకుడు మయసభలో ఉన్నాడు అని భ్రమింపచేసి **ట్రక్ బ్యాక్** చేసి (అంటే ట్రాలీలో కెమేరాను వెనక్కు నడిపి) అది ఛాయాచిత్రం అని తెలియచేసి సాత్యకి మయసభ విశేషాలను చెబుతాడు రేవతివనాలూ, తటాకాలూ కూడా మణిమయాలు అని విని, అబ్బురపడుతుంది

పొగడ్తంటే ఇష్టపడే బలరాముడితో ***నువ్వు రాలేదని ధర్మరాజు విచారించాడు*** అని

శ్రీకృష్ణుడుచెప్పగానే బలరాముడు సంతుష్టుడయ్యాడు బలరాముడికి దుర్యోధనుడు ప్రియ శిష్యుడు పాండవుల వైభవానికి దుర్యోధనుడి మనసెలాఉందో అన్న ఆలోచనకు తావీయకుండా, ధర్మరాజు మీరురాలేదని విచారించాడని చెప్పి బలరాముడిమనసుని పాండవపక్షం చేసాడు శ్రీకృష్ణుడు

అంతేకాక, మీరు సత్యవ్రతులని ఈ సత్యపీఠాన్ని మీకిచ్చాడు, అని ఒక పీఠం చూపించాడు దాని మీద నిలబడితే **త్రికాలాల్లో దాచుకున్న సత్యాన్ని, త్రికరణ శుద్ధిగా వ్యక్తుల చేత బహిరంగం చేయించే దివ్య పీఠమిది** అని చెబుతాడు ఇది ఇక్కడ ఇలా స్థాపించటం అంటే, గోడకు తుపాకీ వేళ్ళాడుతోంది అనిరాస్తే కథపూర్తయ్యేలోపు అదిపనిచేయాలి అని చెకోవ్‌చెప్పినట్లు దీనికీ ఏదో పరమార్థంఉంది దాని ప్రయోజనం కథాశిల్పం ముగింపు సమయంలో ముచ్చటించాలి

దాని తర్వాత ప్రియదర్శిని, అని ఒక దూరదర్శిని ( టి వి. పెట్టె) ఇచ్చాడు కృష్ణుడు హడావుడిగా శశిరేఖ దాన్ని తీసుకుని వెళ్ళి పెట్టె తెరిస్తే, ఆమె ప్రియుడు అభిమన్యుడు కనిపించాడు ఆ తర్వాత పాత్ర సహజసిద్ధతకోసం, రేవతికి మణిమాణిక్యాలు కనిపిస్తే, బలరాముడికి దుర్యోధనుడు కనిపిస్తాడు కృష్ణా నీవుచూడు అంటే నాకు అర్జునుడు కనిపిస్తాడు అంటూ పెట్టె తెరిచాడు శకుని కనిపించాడు!

ఏయే పాత్రలకు ఎలాంటి సంబంధబాంధవ్యాలుండాలో నిర్దేశించేది కథే మరి కృష్ణుడికి అర్జునుడంటే ఇష్టం కదా! పాత్ర సంబంధం దెబ్బ తింటే కథాశిల్పం కూడా దెబ్బ తిన్నట్లే గదా? కాదు! శ్రీకృష్ణుడికి శకుని అంటేనే ఇష్టం! కొందరికి తనంతటి తెలివి గలవాడని, ఇంకొందరకి కౌరవ పక్షాన ఉన్నట్లు నటించినా అతని మనసులో కోరిక కౌరవవినాశనమే అని తెలుసుగనుక ఇష్టం అనిపిస్తుంది నిజానికి శ్రీకృష్ణుడి అవతారపరమార్థం ఏమిటి? ధర్మసంస్థాపన దుష్టశిక్షణ తద్వారా భూభారాన్ని తగ్గించటం ఆ కోరిక నెరవేరాలంటే పాండవులకూ, కౌరవులకూ యుద్ధం జరగాలి ఆయుద్ధానికి కారణం అరణ్య, అజ్ఞాతవాసాలు దానికి కారణం ద్యూతం అది ఆడినవాడు శకుని అందుకే కృష్ణుడికి అంతఇష్టం పైగా పాచికలు చూపిస్తూ నర్మగర్భమైన చిరునవ్వుతో కనిపిస్తాడు శకుని!

కథాశిల్పంలో మాత్రం శకునిని చూపించగానే, దృశ్యాన్ని హస్తినాపురానికి మార్చి, మయసభలో దుర్యోధనుడు పొందిన అవమానానికి ప్రతిగా జూదంలో ఓడించి నీ పగ తీరుస్తానన్నాడు నమ్మకం కోసం వారు అడిగిన అంకెలు పాచికలతోవేసి చూపించాడు అయినా దుర్యోధనుడు మెత్తబడలేదు

ధర్మరాజు ద్యూతవ్యసనుడు. ఓడినకొద్దీ ఒళ్ళుమరిచిపోతాడు ఒక్క రాజ్యాన్నే కాదు తమ్ముళ్ళనీ, తననీ, తుదకు ద్రౌపదిని కూడా నీ దాస్యానికి ఒడ్డమన్నా ఒడ్డి ఓడిపోతాడు. ఇక నీ ఇష్టమే ఇష్టం.

ఈ మాటతో దుర్యోధనుడికి శకుని పధకం నచ్చింది అతనికి కావలసింది రాజ్యం కాదు ద్రౌపదీ కృత పరాభవానికి ప్రతీకారం ఆమెను కూడా దాసిని చేసుకొనవచ్చును అన్న మాట నచ్చింది

నా పాచికలప్రభావం ఆ పాండవపక్షపాతి శ్రీకృష్ణునికికూడా తెలిసివస్తుంది అనగానే శ్రీకృష్ణుడి లీలలు రూపకంగా జరుగుతూ తర్వాతిదృశ్యం ప్రారంభమయ్యింది కాళిందీమర్దనం చేసిన శ్రీకృష్ణుడు, గోవర్ధనగిరినెత్తిన శ్రీకృష్ణుడు ఎవరికి సాధ్యుడు? ఎవరికీ కాదు అనటానికే అలా ప్రారంభించి, సరిగ్గా కాళిందిమర్దనం జరుగుతున్నసమయం ఆసన్నమైనప్పుడు హస్తిన నుంచి ద్రౌపది ఆర్తనాదం వినిపించింది తెరమీద ఛాయామాత్రంగా ఆ దృశ్యం కనిపిస్తుంది ఇక్కడకూడా ద్రౌపదిని, వలువలూడదీస్తున్న దుశ్శాసనుణ్ణి చూపించాడు తప్ప, పాండవులను చూపించలేదు

జరిగింది కృష్ణుడిద్వారా తెలుసుకుని ఆగ్రహావేశాలతో హస్తినకు బయలుదేరాడు బలరాముడు ఇదేచిత్రంలో నిజమైన మొదటిమలుపు ఇది ఈ మాయాబజార్ కధకు మలుపు

బలరాముడు వస్తున్నాడని తెలిసి శకుని మాయోపాయంతో అతన్ని ప్రసన్నుణ్ణి చేసుకుని, అమాయకుడయిన లక్ష్మణ కుమారుణ్ణి ఆయన పాదాలకు మొక్కించి శశిరేఖను లక్ష్మణుడికి ఇస్తానని ఒప్పించాడు

నిజానికి పాండవులపక్షాన బలరాముడు, శ్రీకృష్ణుడు ఉండకుండా రేపు జరగబోయే యుద్ధంలో యాదవులు కౌరవపక్షాన ఉండటానికి ఈ పెళ్ళి కారణం అని చెప్పారు కాని, అసలు కధలో ఇదే సంఘటన ఎందుకంటే **ఇంకా సందేహమా, ఇదిగో శశి నీ కోడలు సరేనా** అని ఈ బలరాముడే శశిచేతిని సుభద్రచేతిలో పెట్టాడు అభిమన్యుడిచేతిలో పెట్టించకపోవటం తెలివిడితనం ఇది రచయిత, దర్శకుల కధాదర్శనప్రజ్ఞ!

మరి అలాంటి బలరాముడు ఇక్కడ మాటిచ్చాడు, అక్కడా మాటిచ్చాడు ఎలా?

పాండవవనవాసాన్ని ఈ చిత్రకధారచయిత, దర్శకుడు, అభిమన్యుడు సుభద్ర ద్వారకకు రావటానికి ఉపయోగించుకున్నారు

బావ మరుదులు బతకకోరతారు, అన్నదమ్ములు చావుకోరతారు అని మనకొక నానుడి ఉంది ఎందుకంటే చెల్లెలు తలచెడినా, విధివంచిత అయినా చేరేది అన్నలపంచనే

అందుకే బావలు బాగుండాలని కోరుకుంటారు అదే అన్నదమ్ములయితే ఒకడు పోతే ఆస్తికలుస్తుందిగదా అని చావు కోరతారు అంటారు ఆ ప్రకారమే సుభద్ర అన్నల ఇంటికి చేరింది

వాస్తవానికి అక్కడ చేర్చింది కథాశిల్పం కోసం అభిమన్యుడు, శశిరేఖల ప్రణయం జరగాలి ఆ ప్రణయానికి బలరామరూపంలో అడ్డంకులూ కలగాలి అప్పుడే కథలో ఉత్కంఠ పెరుగుతుంది ప్రేక్షకుడిమనసులో ఒత్తిడిపెరుగుతుంది

బలరాముడు హస్తిననుంచి కానుకలతో వచ్చాడు రేవతికి అప్పటికే రాజ్యంపోయిన పాండవుల మీద, సుభద్రమీద, అభిమన్యుడిమీద అభిప్రాయంపోయింది భర్త ఏమంటాడో అనుకున్న సమయంలో భర్త *శశిరేఖను భావి సామ్రాట్టు లక్ష్మణ కుమారుని పట్టమహిషిని చెయ్యమని ప్రాధేయపడి అడిగారు,* సరే అన్నాను, అని చెప్పిన మాట సంగీతం కంటే శ్రావ్యంగా వినిపించింది

బలరాముడి మాటల్లో ముఖస్తుతికి లొంగిన దానికంటే భారత సామ్రాజ్యాధినేత తనను ప్రాధేయపడటం నచ్చింది అన్న ధ్వని ఉంది పైగా కౌరవులు క్షత్రియులు వీళ్ళు యాదవులు

*మామా రాజకీయంగా మీ ఎత్తు ప్రశంసించదగ్గదే, కాని తండ్రిని మించిన మానధనుడే మన లక్ష్మణ కుమారుడు. ఆ యాదవ కన్యను స్వీకరిస్తాడా* అని దుశ్శాసనుడితోనూ,

*సిగ్గు, సిగ్గు, ఆ అనాగరిక యాదవ సామంత రాజునకు నేను అల్లుడనగుటయా? అసంభవం* అని లక్ష్మణ కుమారుడితోనూ అనిపించటంలో, యాదవ కన్యను, క్షత్రియుడు స్వీకరించటం గొప్ప అని చెప్పబడింది అందుకు కూడా బలరాముడు లొంగి ఉండవచ్చు

ఒకనాడు అభిమన్యుడు చేసుకున్నా తనకుమార్తె భావి పట్టమహిషి, ఈనాడు లక్ష్మణ కుమారుడు చేసుకున్నా తన కుమార్తె పట్టమహిషి కాబట్టి రేవతి అంగీకరించింది

ఆలస్యం అమృతం విషం అని తెలిసిన శకుని దుర్యోధనుడితో ద్వారకకు వచ్చేసాడు నిజానికి పెళ్ళివిషయం అడగటానికి పెళ్ళికూతురు తరపువాళ్ళు, పెళ్ళికుమారుడితరపువాళ్ళదగ్గరకు వెళ్ళాలి అది మర్యాద, సంప్రదాయం అది తప్పించి పెళ్ళి కుమారుడి తరపు వాళ్ళనే తీసుకువచ్చాడు శకుని శ్రీకృష్ణుడు బలరాముడి మనసు మారుస్తాడేమోనన్న భయం

అతని అనుమానానికి సరిపోయినట్లే, అభిమన్యుడు శశిరేఖను బాణాలతో మెట్లు

ఏర్పాటు చేసి గదిలోనుంచి నౌకావిహారానికి తీసుకెళ్ళాడు ఇది ఎక్కడ బయటపడుతుందోనన్న ఉత్కంఠలోనుంచి ప్రేక్షకులను బయటపడేసింది శ్రీకృష్ణుడే అది ఊహించి, బలరాముడు రేవతి వచ్చేసరికి రుక్మిణితో కలిసి తను అదే పాట పాడుతూ నౌకావిహారం చేస్తూ కనిపించి, మరో సంఘటన జరక్కుండా కాపాడాడు

దుర్యోధనాదులు ద్వారకకు విచ్చేసి లగ్నాలకు కూర్చున్నారు శాస్త్రి లగ్నం చెప్పాడు లగ్నాలు కూడా మీరే పెట్టించుకు వచ్చారే అన్నాడు బలరాముడు యాదవుల పండితుడు శంఖుతీర్థులవారు, *పెట్టించిన లగ్నం బాగాలేదు, దగ్ధయోగం ఉంది* అని చెప్పాడు ఈ మాట ప్రేక్షకుల చెవులకి అమృతధార పెళ్ళిచెడిపోవటమే ప్రేక్షకుడు కోరుకుంటాడు

*"మీ శాస్త్రాలు సామాన్యులకోసం. మా కౌరవుల వంటి అసాధారణ అపూర్వ జాతకులకు కాదు"* అని తనమెడలోహారం ఇవ్వబోయాడు శకుని కాని పాపం శంఖతీర్థుడు యాదవుల పురోహితుడు గదా అందుకే కావచ్చు *"మరి శని ఈ గదిలో ఉండగా"* అని ఏదో చెప్పబోతుండగా శ్రీకృష్ణుడు వచ్చి, *"లక్ష శనిగ్రహాల పెట్టు మన శకుని బాబాయి ఈ గదిలో ఉండగా, అసలు శని ఏ గదిలో ఉంటే యేం. స్వీకరించండి తీర్థులవారూ. వారి సంప్రదాయం అదీ"* అని కానుక ఇప్పించాడు

ఏదోవిధంగా పెళ్ళిఅయిపోవాలని శకుని కోరిక - ఎలాగూ దగ్ధయోగంలో పెళ్ళి ఆగిపోతుంది అని శ్రీకృష్ణుడి నమ్మకం ఎవరి అవసరం వాళ్ళది లగ్నం నిశ్చయమైపోయింది

లోపల శశిరేఖ పరిచారికను చెంపమీద కొట్టింది కథాగమనంలో ప్రేక్షకుడి హృదయం మీద ఉత్కంఠ తాలూకు దెబ్బ తగిలినట్లే తల్లి వచ్చి మందలించింది మీ చిన్నాన్నే ఈ సంబంధానికి ఒప్పుకున్నాడు అని నమ్మించటానికి చూస్తూ ఉండగా సుభద్ర వచ్చింది

*శశిరేఖ నీ కోడలే అని చేతిలో చెయ్యివేసి ఇచ్చినమాట తప్పటం న్యాయమేనా* అన్నయ్యా అని అడిగింది సుభద్ర దానికి బలరాముడి దగ్గర సమాధానం లేదు వెంటనే రేవతి అందుకుని *ఇది మాట తప్పటమా? ఏదో మాటవరసకి చెల్లెలికి ఇచ్చినమాటానూ, కౌరవసభలో దుర్యోధన చక్రవర్తికి ఇచ్చినవరమూ ఒక్కటేనా* అంది

మాటవరసకు అనటంలోనే సుభద్రకు ఇచ్చిన మాటను కొట్టేసింది దుర్యోధనుడికిచ్చింది వరం అంటోంది పైగా అది సభలో అడగలేదు అంతరంగికమందిరంలో జరిగింది సభలోఅయితే భీష్మద్రోణాదులుండాలిగదా

వరంఅనటంలో ఇది మా కోరిక కాదు దుర్యోధనాదుల కోరిక అని చెబుతోంది అంతేకాదు ఆనాడూ మేం అడగలేదు, ఈనాడూ మేం అడగలేదు, ఆనాడు నీవు అడిగావు, ఈనాడు కౌరవులు అడిగారు, ఆనాడు మాటవరసకు అన్నమాట, ఈనాడు కౌరవసభలో ఇచ్చిన వరం కంటే తక్కువైనది అని ఈ ఘట్టంలో బలరాముణ్ణి కాపాడుతోంది రేవతి

అంతేకాదు ఏ శోభలూ లేకుండా, నీకు వలెనే నా కూతుర్ని కూడా పుట్టింట్లో పడి ఉండమంటావా అని సుభద్రను దెప్పిపొడిచింది ఇలా అనటానికికారణం అంత యాదవ సామ్రాజ్యంలో సుభద్ర, అభిమన్యుడు తినే గుప్పెడుమెతుకులు ఎక్కువనికాదు, వాళ్ళు ఈ మాటలకు గాయపడి ద్వారక వదలి వెళ్ళిపోవాలి చిన్నప్పటినుంచి ఒకరంటే ఒకరు ఇష్టపడిన శశిరేఖాభిమన్యులు ఒకచోట ఉండగూడదు ఇది రేవతి కోరిక రుక్మిణి ఏదో సర్దిచెప్పబోతే కూతుర్ని కని ఉంటే తెలిసేది అని ఆమెనోరూ మూయించింది

బలరాముడు ఈపెళ్ళి జరిగితీరుతుంది అని చెప్పగానే సుభద్ర అన్నగారిని ఉక్రోషంగా నిలదీస్తే - ప్రతాపాల పేరెత్తి నన్ను బెదిరిస్తున్నావా సుభద్రా? పాండవుల ప్రతాపాలు నాదాకా ఎందుకు? నా శిష్యుడు దుర్యోధనుడు చాలు అని నూటికినూరుశాతం కౌరవపక్షానికి మారిపోయాడు బలరాముడు

అభిమన్యుడు వచ్చి ఎదురుతిరిగితే కృష్ణుడు మందలించాడు ఇతను ధీరోదాత్త కథానాయకుడు స్వయంవరం ప్రకటించు వీరవిహారంచేసి తీసుకువెళతాను అంటే నిజంగా శౌర్యవంతుడివే అయితే ఇంతసేపు ఇన్ని వ్యర్థప్రలాపాలతో ఇక్కడ నుంచుంటావా అని కోపగించి పంపాడు శ్రీకృష్ణుడు సుభద్రకు దిక్కులేకుండాపోయింది నీకు దిక్కున్నచోటికి పొమ్మన్నాడు కృష్ణుడు

నిజానికి పతాక స్థాయికి ముందురావలసిన విషమపరిస్థితి ఇప్పుడే వచ్చేసింది జగన్నాటక సూత్రధారి ఆగ్రహించి, సోదరిని దిక్కున్నచోటికి పొమ్మన్నతర్వాత శశిరేఖాభిమన్యుల పెళ్ళి ఎవరు చేస్తారు? ఆ ఆశయం ఎలా సిద్ధిస్తుంది!

ఈ విషమ స్థితిలో పడిన కథలో ప్రాప్త్యాశ కలిగించటానికి, శ్రీకృష్ణుడు రథచోదకుడయిన దారుకుడితో ద్వైతవనానికి వద్దు, ఘటోత్కచుడిదగ్గరకు తీసుకువెళ్ళమని చెప్పాడు ఏదో జరుగుతుందన్న ఆశ, జరగబోతుందన్న నమ్మకం కల్పించారు

నిజానికి శ్రీకృష్ణుడికి కూడా అభిమన్యుడు ఇక్కడ ఉండటం ఇష్టం లేదు ఎందుకంటే అతను చిచ్చురపిడుగులాంటివాడు ఎక్కడ రెచ్చిపోయి కార్యభంగం

చేస్తాడోనని శ్రీకృష్ణుడి అనుమానం అందుకే పంపేసాడు అంతేకాదు పూర్తిగా తాను అన్నగారి పక్షమైనట్లు, సొంత చెల్లెలిని, మేనల్లుణ్ణి దిక్కున్న చోటికి పంపేసినట్లు బహిరంగంగా కనిపించకపోతే ఇతను ఏదో నాటకం ఆడుతున్నాడని శకుని అనుమానించి పై ఎత్తు వేస్తాడు పైగా ఈ దృశ్యం శకుని చాటుగా పరికిస్తూ ఉంటాడు కూడా

కథలో అభిమన్యుడు, సుభద్ర పాత్రలను ద్వారక నుండి నిష్క్రమింపచెయ్యటం అద్భుతమైన శిల్పం అదే పాడుకుంటూ వెళ్ళాడు రథచోదకుడు **బాగున్నదయా నీ మాయ** అంటూ

ఇప్పుడు పరిచయమయ్యాడు ధీరోద్ధత నాయకుడు ఘటోత్కచుడు తనను తాను స్తుతించుకుంటూ ఘటోత్కచాభిమన్యుల యుద్ధం, భావిభారతయుద్ధంలో వీళ్ళిద్దరు చాలు విజయానికి అన్నట్లు సూచించినట్లున్నా అది నిజం కాదు (ఇరువురూ విజయం సాధించకముందే మరణిస్తారు) వీళ్ళిద్దరూ కలిస్తే శశిరేఖాభిమన్యుల వివాహం జరిగినట్లే అని ప్రేక్షకుడికి విషమ స్థితి నుండి మనసుకి కొంత ఊరట కలిగించారు

ఈ ఆశకలగగానే విషమస్థితి ఎక్కడ చేజారిపోతుందోనని కథలో వెంటనే లక్ష్మణ కుమారుడు ఎలా పెళ్ళి చేసుకోవాలి, జీలకర్ర బెల్లం ఎలా పెట్టాలి? అని అభ్యాసం చేస్తున్నట్లుగా చూపించారు అంటే అతని ఆశయం శశిరేఖను పెళ్ళి చేసుకోవటమే అని మరోసారి గుర్తు చేసి కథా గమనంలో విషమ స్థితిని సజీవంగా ఉంచటం ఒక శిల్పం

దుర్యోధనాదులు ఒక రహస్య మంత్రాంగంతో ఈ వివాహం చేయిస్తున్నారు గనుక భీష్మ ద్రోణాదులెవరినీ ఈ పెళ్ళికి పిలవటం లేదు అని తెలియజేసి, ఒక వేళ వారికి తెలిసినా బాగుండును అన్న ఆశను చంపేసి, విషమ స్థితి కొనసాగింపునే శుభలేఖల దృశ్యంలో చక్కగా వాడుకుని, విడిదింటిలో శశిరేఖను లక్ష్మణ కుమారుడికి చూపించే ఏర్పాటుతో ముగించారు

కథలో దీని తరువాత ఘటోత్కచుడి సమక్షంలో చిన్నమయ, **మోహినీ భస్మాసుర** నృత్య రూపక ప్రదర్శన ఏర్పాటు చేస్తాడు ఇది కథకుఅవసరమా అనిపిస్తుంది కాస్సేపు కాని ఘటోత్కచుడు రాక్షసుడు భస్మాసురుడు రాక్షసుడు అతని వలే తన మరణాన్ని తనే తెచ్చుకున్నట్లు ఘటోత్కచుడు తన బలాన్ని నమ్మి కార్యభంగం చెయ్యగూడదు మోహినిరూపంలో విష్ణువు శివుణ్ణి రక్షించాడు ఆ విష్ణువు అంశే ఇప్పుడు శ్రీకృష్ణుడుగా అవతరించాడు నువ్వు ఎంత మాయగాడివైనా, శ్రీకృష్ణుడి ఆశీస్సులేనిదే కార్యంఫలించదు అని ఈ రూపకం ఘటోత్కచుణ్ణి మానసికంగా హెచ్చరించింది

ఇదే సమయంలో శశిరేఖ దిగులుగా ఉంది అభిమన్యుడు దిగులుగా ఉన్నాడు ఈ పరాయీకరణతో విప్రలంబ శృంగారాన్ని సాధించారు రచయిత, దర్శకులు

ఇప్పుడు కథలో తుదిమలుపు మొదలయ్యింది హిడింబితో సుభద్ర జరిగింది చెప్పింది అది విన్నాడు ఘటోత్కచుడు ఉద్ధతుడై రెచ్చిపోయాడు తల్లి, సుభద్రలు చెరొక మాట చెప్పారు

నీవు ద్వారకకు వెళ్ళి నీ మాయాజాలంతో శశిరేఖను ఇచ్చుటకి తీసుకురా ఈ సుపుత్రునికిచ్చి పెళ్ళి చేస్తాను అంది హిడింబి

సుభద్ర - చిన్నన్న కృష్ణుణ్ణి కలవమని, ఆయన ఉపాయాలు చెబుతారని చెప్పింది భస్మాసుర నృత్య రూపక ప్రభావం పని చేసి ఘటోత్కచుడు అస్తు అన్నాడు

ద్వారకకు వచ్చాడు అందరినీ సమ్మోహితుల్ని చేసాడు కానీ వృద్ధుడిరూపంలో ఉన్న శ్రీకృష్ణుణ్ణి మాత్రం మాయచెయ్యలేకపోయాడు ఆయనే శ్రీకృష్ణుడు అని తెలుసుకోవటమేగాక తనది చిన్నమాయ అయితే ఆయనది పెద్దమాయ అని, తాను చిన్నచేప అయితే ఆయన పెద్ద చేప అని తెలుసుకున్నాడు నృత్య రూపకంతోపాటు ప్రత్యక్ష నిరూపణ కూడా శ్రీకృష్ణుడి సహాయం తీసుకోటానికి కారణమై, శశిరేఖను, ఘటోత్కచాశ్రమానికి తీసుకువెళ్ళటం అనే సంఘటనకు దారి తీసింది అక్కడి నుంచి మాయా శశి అవతారం ఎత్తటానికి బయలుదేరుతూ, చిన్నమయను, లంబూ - జంబూలను తోడు తీసుకుని, తను ఆడబోయే మాయాశశినాటకాన్ని అభిమన్యుడి ముందే ప్రదర్శించి, శశిరేఖాభిమన్యులను కలిపి మాయాశశిరూపంలో తల్పంతోసహా ఎగిరిపోయాడు

నిజానికి కథ పూర్తయ్యింది కదా! శశిరేఖను తీసుకువచ్చేసాడు శశిరేఖ ఏమయ్యిందో తెలిసేలోపు అభిమన్యుడికీ శశిరేఖకూ ఘటోత్కచుడిఆశ్రమంలో పెళ్ళిచేసేస్తే ఆశయసిద్ధి పూర్తయిపోతుంది గదా? మళ్ళీ మాయాశశిరేఖగా ఘటోత్కచుడు ద్వారకకు ఎందుకు వెళ్ళాలి? ఇది ప్రతి ప్రేక్షకుడి హృదయంలో ఉదయించే ప్రశ్న దానికి సరైన సమాధానం దొరక్కపోతే ఈ చిత్రంలో కథాశిల్పం దెబ్బ తిన్నట్లే

బలరాముడు కొన్ని కారణాల చేత చెల్లెలికిచ్చిన మాటను మరిచి, ఒక విధంగా తప్పి, కుమార్తెను లక్ష్మణ కుమారుడికిచ్చి పెళ్ళి చెయ్యాలనుకున్నాడు ఆ పెళ్ళి జరగకపోవటానికి తన తమ్ముడు కృష్ణుడు కూడా ఒక కారణం అని తెలిస్తే శ్రీకృష్ణ బలరామ యుద్ధమే కదా! కురు పాండవయుద్ధంకంటే ముందే యాదవకులంలో ముసలం పుట్టిఉండేదిగదా దాన్ని తప్పించటానికి, శకునికుట్రను భగ్నంచెయ్యటానికి శ్రీకృష్ణుడు పూనుకున్నాడు దానికి సాధనంగా ఘటోత్కచుడి మాయాజాలాన్ని

వాడుకుంటున్నాడు అందుకే కృష్ణుడి చేత ఘటోత్కచుడి చెవిలో రహస్యంగా వినీవినబడనట్లు చెప్పించారు

ఇప్పుడిక మిగిలింది ఆడ వేషంలోఉన్న ఘటోత్కచుడికి, లక్ష్మణకుమారుడికి పెళ్ళి ఎలా జరుగుతుందనే కుతూహలం ప్రేక్షకుడికి ఉత్కంఠ లేదు ఎందుకంటే శశిరేఖ, అభిమన్యులు ఘటోత్కచుడి ఆశ్రమంలో ఉన్నారు వాళ్ళకే పెళ్ళి జరుగుతుంది

**మాయాబజార్**లో ఉన్నది అద్భుతరసం అని ఇంతకు ముందే చెప్పటం జరిగింది ఆ అద్భుతరససాధనకు ఉపయుక్తం అయ్యే పాత్రలు ఘటోత్కచుడు, అతను ధరించిన మాయా శశిరేఖ రూపం, చిన్నమయ, లంబు, జంబు పాత్రలు ఈ అద్భుతరసం వృద్ధుడి దగ్గర నుంచి పసి వాడి దాకా వినోదాన్ని అందించే పద్ధతిలో రాసుకున్నారు

కథా పరంగా శశిరేఖ భానుమతిని చూసినప్పుడు, శకునితో పాచికలు వేయించినప్పుడు ఈ రహస్యం బయటపడుతుందేమోనన్న అనుమానం కలిగింది

మరలా భానుమతి దుర్యోధనుడి సమక్షంలో **ఆ పెళ్ళి కుమార్తెను చూసిన తర్వాత నాకు తోచటం లేదు. ఆ పెళ్ళి మానుకునిపోదామా అనిపిస్తోంది** అని అన్నప్పుడు, ఇది కృష్ణమాయ అని కావాలని శశిరేఖ చేత ఈ నటనంతా చేయించాడు అని శకుని సమర్థించాడు లేకపోతే కథ ఇక్కడ మరోమలుపు తిరిగేది

చివరిఘట్టందాకా అద్భుతరసాన్ని ఆశ్రయించిన ఈ కథ, నిజం బయటపెట్టటానికి కూడా అద్భుతరసాన్నే ఆశ్రయించింది! శశిరేఖ, లక్ష్మణకుమారులపెళ్ళిలో శశిరేఖ కోతిలా కనిపించటం, పులిలా కనిపించటం, రాక్షసుడిలా కనిపించటం వినోదంకోసంలాగా అనిపించినా ఈ సందర్భంలో బెదిరిన లక్ష్మణకుమారుడి మనస్తత్వం, అతను ధీరుడుకాదని ఒక పిరికివాడికి తన కూతుర్ని ఇవ్వవలసివస్తోందని బలరాముడు బాధపడేస్థాయికి దృశ్యాన్ని తీసుకువెళ్ళాక, సత్యపీఠంమీద శకునిని నిలబెట్టి, అతనితో నిజంచెప్పించి, బలరాముడిపాత్రను పూర్తిగా మార్చేయటంజరిగింది

అదే కృష్ణుడికి కావాలి ఆఖరికి దుష్టచతుష్టయానికి శిక్ష కూడా అద్భుత రసంతోనే సాధించారు తప్ప వీరరసాన్ని ఆశ్రయించలేదు

ఈ కథలో కథానాయకుడు, నాయిక వారి ఆశయసిద్ధి కోసం పాటుపడకుండా ఘటోత్కచుడు పాటుపడటమే వైచిత్రి అందుకే ఆ పాత్రచేత అభిమన్యుణ్ణి హైహై బాలకా అని సంబోధింపచేసారు అంటే శూరుడయినా అతనింకా బాలకుడేనని తాత్పర్యం బాలకుడి తరుపున శ్రీకృష్ణుడు, ఘటోత్కచుడు, అతని పెదతల్లి హిడింబి, తల్లిసుభద్ర కార్యసాధనకు పూనుకున్నారు

లేనికథను ఉన్నట్లుగా, జరగనిదానిని జరిగినట్లుగా భ్రమింపచేసే ఈ కథాశిల్పం అర్ధ శతాబ్దం దగ్గర పడుతున్నా (27-03-1957న విడుదలయ్యింది) ఇంకా ఇంత జనాకర్షణ కలిగి ఉందంటే ఆ గౌరవం పింగళికి, కె వి రెడ్డికే దక్కుతుంది ప్రపంచ రంగస్థలదినోత్సవం రోజున విడుదలవ్వటం వరమో, ఆశీర్వాదమో అయిఉంటుంది

ఈ కథకు సరిపోయే పాత్రలు ఎలా నిర్మించబడ్డాయో ఇప్పుడు పరిశీలించాలి

## పాత్ర చిత్రణ శిల్పం :

ఇందులో పాత్రలన్నీ భారతంలో ఉన్నవే కాకపోతే ఆయా సన్నివేశాలకు అనుగుణంగా ప్రవర్తించాయి ఈ చిత్రానికి కథానాయకులు ముగ్గురు

*శ్రీకృష్ణుడు - ఇతడు ధీర లలితుడు మృదు స్వభావుడు, నిశ్చింతుడు[30]*

*అభిమన్యుడు - ఇతడు ధీరోదాత్తుడు మహాసత్త్వాది గుణ భూయిష్ఠుడు[31]*

*ఘటోత్కచుడు - ఇతడు ధీరోద్ధతుడు మాయాఛద్మపరాయణుడు[32] వికత్థనుడు*

ఇందులో శశిరేఖను పెళ్ళి చేసుకోవాలన్న ఆశయం అభిమన్యుడిది ఆశీస్సు శ్రీకృష్ణుడిది ఆచరణ ఘటోత్కచుడిది ఏక కార్యాన్ని ముగ్గురు సాధించారు

ముందు చెప్పుకొన్నట్టు ఈ **మాయాబజార్** చిత్రంలో అంగిరసం అద్భుతం కావటం వల్ల, ఆ రసోత్పాదకశక్తి ఘటోత్కచుడి దగ్గర, శ్రీకృష్ణుడి దగ్గరా ఉండటం వల్ల శ్రీకృష్ణుడి ఆశీస్సుతో, అతనిచ్చిన వ్యూహ రచనతో ఘటోత్కచుడు కార్య సాధన చేసాడు

అదే అభిమన్యుడు శశిరేఖను సాధించాలంటే వీరరసాన్ని ఆశ్రయించవలసి వచ్చేది దానికి అంగాలుగా రౌద్ర, భీభత్స, భయానకరసాలు వచ్చి ఉండేవి పిల్లాపాపలతోసహా ఈ చిత్రాన్ని ఆదరించారంటే దానికి కారణం అద్భుతరసం

నిజానికి రాక్షసుడయిన ఘటోత్కచుణ్ణి చూసి ప్రేక్షకులు భయపడాలి కానీ ప్రేమించారు కథానాయకుడి ఆశయ సిద్ధికి ఉపయోగపడుతున్నాడు గనుక ప్రేమించారు అతను చేస్తున్న, చేయిస్తున్న అద్భుతాలన్నీ ఆశ్చర్యంతో పాటు ఆనందాన్ని అందించాయి

శిల్పాన్ని గురించి పరిశీలిస్తున్నప్పుడు మానససిద్ధము, క్రియాసిద్ధము అని రెండు రకాలు అని చెప్పటం జరిగింది ఇక్కడ శ్రీకృష్ణుడి పాత్ర మానస సిద్ధము, ఘటోత్కచుడి పాత్ర క్రియా సిద్ధములుగా శిల్ప సాధనకుపకరించాయి

అంటే మనసులో, బుద్ధి వికాసంలో, సమాధిలో ఆలోచించి శ్రీకృష్ణుడు వ్యూహం పన్నాలి అతను ఎదుర్కొంటున్నది ఎవరినో కాదు స్వయానా అన్నగారినే

సుభద్ర ఏడుస్తున్నప్పుడు పోనీలే అన్నయ్యా ఒకనాడు మాటఇచ్చావు గదా, అభిమన్యుడికే ఇచ్చిచేద్దాము అంటే ఏమి జరిగిఉండేదో! అలా అనుకోలేదు వాస్తవాన్ని విశదపరచదలచుకున్నాడు అందుకే ముందు ప్రవాదం లేకుండా శశిరేఖను ఘటోత్కచఆశ్రమానికి చేర్చాడు మునుల నివాసాన్ని ఆశ్రమం అంటారు ఈ చిత్రంలో ఘటోత్కచుడిఆశ్రమం అన్నారు ఇది పదప్రయోగవైచిత్రి

పాండవులుసత్యవంతులు, కౌరవులుదుష్టులు అని బలరాముడుకి తెలియజేయాలి అందుకే మయసభకు వెళ్ళినప్పుడు ఏ పాండవులు సత్యపీఠాన్ని బహుమతిగా ఇచ్చారో - (పైగా బలరాముడికిచ్చిన బహుమతి అది), ఆ సత్య పీఠం మీదనే శకునిని నిలబెట్టి నిజాన్ని బయటపెట్టించి పాండవ మధ్యముడి కొడుకు అభిమన్యుణ్ణి, యాదవులకు అల్లుణ్ణి చేసాడు శ్రీకృష్ణుడు

శ్రీకృష్ణుడి ఉపాయం మేరకు క్రియా సిద్ధమైన పద్ధతిలో, అభ్యాసంతో తన పాత్రధర్మాన్ని పూర్తి చేసాడు ఘటోత్కచుడు

రేవతి, సుభద్ర పాత్రలు అలనాటి పౌరాణిక పాత్రలు అనిపించవు ఈనాటి సాంఘిక పాత్రల నేపథ్యంలో నడుస్తాయి ఆస్తి దగ్గరకు వచ్చేసరికి, అయినవారిదగ్గరకు వచ్చేసరికి, అమ్మాయి పెళ్ళి దగ్గరకు వచ్చేసరికి మహనీయులైనప్పటికీ మనుషులే అన్నట్లు ప్రవర్తిస్తాయి ఈ పాత్రలు ఈ పాత్రలకు కొంచెం మార్పుతో బలరాముడు

నిజానికి ఈ చిత్రంలో శిల్పలక్షణంలేని ఉపపాత్ర కూడా లేదు అనటానికి నిదర్శనం శశిరేఖ ఇష్ట సఖి! మాయాశశి తన భుజంమీద చెయ్యి వేసినప్పుడు చేసిన ఇబ్బందికరమైన అభినయం ఇందుకు ఋజువు ఆమెకు తెలుసు చెయ్యి వేసింది స్త్రీ కాదు పురుషుడు పైగా రాక్షసుడు ఇంత చిన్న పాత్ర విషయంలోనే ఇంత జాగ్రత్త తీసుకున్న రచయిత, దర్శకులు ప్రధాన పాత్రల విషయంలో ఎంత శ్రద్ధ తీసుకున్నారో వేరే చెప్పాలా?

## సంఘటనా శిల్పం :

ఈ చిత్రంలో చాలా సంఘటనలున్నా కథాగమనాన్ని మార్చిన సంఘటనే ముఖ్య సంఘటన అవుతుంది

ఇందులో కథా గమనాన్ని మార్చిన సంఘటనలు రెండు

ఒకటి బలరాముడు హస్తినకు పోయి శశిరేఖను, లక్ష్మణకుమారుడికిచ్చి వివాహం చేస్తాననటం

రెండు ఘటోత్కచుడు శశిరేఖను తన ఆశ్రమానికి తీసుకుపోవటం

ఇందులో మొదట జరిగిన సంఘటన సంఘర్షణకు దారి తీసింది రెండవ సంఘటనలో శశిరేఖ మారిందన్న సంగతి ఎవరికి తెలియకపోవటంవల్ల, సంఘర్షణ పతాక స్థాయి వరకూ జరగకపోవటం వల్ల, అంతవరకు అదే సంఘటన కొనసాగినట్లయ్యింది

ఇందులో మొదటి సంఘటన అద్భుతమైన శిల్ప చాతుర్యంతో నడపబడింది

పాండవులను మాయాద్యూతంలో ఓడించిన కౌరవులకు బుద్ధి చెప్పటానికి బలరాముడు బయలుదేరాడు కూతురుని లక్ష్మణ కుమారుడికిస్తానని వరం ఇచ్చి తిరిగి వచ్చాడు బలరాముడేమి అవకాశవాది కాదు అతన్ని లొంగదియ్యాలన్న లోబరుచుకోవాలన్న మాటలు కాదు

ఈ పక్షంలో శ్రీకృష్ణుడు ఎంత తెలివిగలవాడో ఆ పక్షాన శకుని అంత తెలివి గలవాడు, కాకపోతే శరుడు ప్రతికథానాయకుడు ఎంత గొప్పవాడయినా కథానాయకుడికి విజయం లభించటమే కథాలక్షణం గదా

శకుని ఎప్పుడయితే బలరాముడువస్తున్నాడని తెలుసుకున్నాడో అప్పుడే వ్యూహరచన చేసుకున్నాడు అతని ముందు ఇప్పుడు రెండు కర్తవ్యాలున్నాయి

ఒకటి ఆగ్రహంతో వస్తున్న బలరాముణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకుని అనుగ్రహించే విధంగా మార్చటం

రెండు అమాయకుడయిన లక్ష్మణకుమారుణ్ణి శశిరేఖను పెళ్ళాడటానికి ఒప్పించటం

ప్రతీహారుడు బలరాముడు వస్తున్నాడని చెప్పగానే *ప్రతీహారీ! సమయానికి శుభవార్త తెచ్చావు* అన్నాడు *అదేమిటి మామా ఆయనసలే ముక్కోపి* అనగానే, *ముక్కోపానికి విరుగుడు ముఖస్తుతి ఉండనే ఉందిగా* అని చెప్పి *అతనికి అఖండ సన్మానం చేయించి, సంతుష్టుడై ఉన్న సమయంలో శశిరేఖను లక్ష్మణ కుమారుడికి అడుగుదాం* అని చెప్పాడు *లక్ష్మణుడు అంగీరించడేమో* అంటే *నాదీ భారం* అంటూ వెళ్ళాడు

ముఖస్తుతి ఎంత గొప్పదో అంతకు మునుపు దుర్యోధనపాత్ర అనుభవంలోకి వచ్చిందే తనను పొగిడిన శాస్త్రి, శర్మలకు *దశాగ్రహార సహస్ర గోదానాలు ఇప్పించండి* అన్నాడు అందువల్ల ఈ ముఖస్తుతి కార్యక్రమానికి దుర్యోధనుడు వెంటనే అంగీకరించాడు

లక్ష్మణకుమారుణ్ణి పరిచయం చేస్తూనే ఇతడు నెలతక్కువబాలుడు అన్న పద్ధతిలో చూపించారు లేనిపోని భేషజం తప్ప ఏమీఎరుగని వాడు అని, అంతేకాదు దేనికీలొంగని

ఇతను అభిమన్యుడికంటే నువ్వు గొప్పవాడనిచెబితే ఉబ్బితబ్బిబ్బైపోతాడు అని తెలియజేసారు (అయిదవరోజు యుద్ధంలో అభిమన్యుడి చేతిలో హతుడవ్వటం తప్ప, ఈ లక్ష్మణకుమారుడి పాత్ర మరెక్కడా కనిపించదు)

*ఆంధ్రమహాభారతం, తెలుగు విశ్వ విద్యాలయ ప్రచురణ - పుట 64, 65*

**పురోగమించుట అతనికి తెలియును, తిరోగమించుట తమకు తెలియును** అని శర్మ చెప్పినా పురోగమనానికి తిరోగమనానికి తేడా తెలియని మూర్ఖుడు అని తెలియజేసారు **అభిమన్యుడికి అటు కూడినా, ఇటు కూడినా నలుగురే బాబాయిలు, మీకో నూటికి ఒక్కడే తక్కువ** అంటూ పొగిడారు

ఈ సమయంలో వచ్చాడు శకుని లోపలకు చల్లగా ముంతతెరిచి కొంతసమాచారం చెప్పాడు **శశిరేఖను నువ్వు చేసుకోవాలని** అనగానే **యాదవ సామంత రాజుకి నేను అల్లుణ్ణి కాను పొమ్మని** అన్నాడు **అయితే ప్రమాదమే ఆ పిల్లను అభిమన్యుడు వరించాట్ట** అని చెప్పగానే మారు మాట్లాడకుండా అంగీకరించాడు లక్ష్మణ కుమారుడు

అభిమన్యుభూతాన్ని చూపించి లక్ష్మణకుమారుణ్ణి, ఆభిజాత్యలోపాన్ని చూపించి బలరాముణ్ణి లొంగదీసుకున్నాడు యాదవులు సామంతులు అని చెబుతున్నాడు పైగా పాండవులు సర్వంకోల్పోయి అడవుల్లోఉన్నారు పదమూడేళ్ళ తరువాత అజ్ఞాతంలో బయటపడకుండా ఉంటే మళ్ళీ రాజ్యం వస్తేరావచ్చు ఎంతలేదన్నా బలరాముడు యాదవరాజు రాజ్యాధికార వైభవాన్ని చవిచూస్తున్న వాడు! పైగాతండ్రి! చూస్తూ చూస్తూ కుమార్తెను గోతిలోకి ఎలా నెట్టగలడు ఇది వాచ్యం చేస్తే బలరాముడి పాత్ర దెబ్బతింటుంది గనుక ముఖస్తుతితో ప్రసన్నం చేసుకోవటం

అందుకే గీతాలతో, నాట్యాలతో, స్తుతి పాఠాలతో తీసుకు వచ్చారు అభినయంలో క్షణ క్షణం మార్పు కనిపిస్తుందీ పాత్రకు పళ్ళెంలోపెట్టి కాళ్లు కడిగాక కళ్ళు చల్లబడ్డాయి!

ఈ సంఘటనలో అక్కడ దృశ్యాన్ని ఆపి లక్ష్మణ కుమారుడి దగ్గరకు వచ్చారు సినిమాల్లో సహజంగా చెప్పుకునే *ఔట్ ఆఫ్ సైట్ ఈజ్ అవుట్ ఆఫ్ మైండ్* సూత్రాన్ని పాటించటమే కాకుండా **ఈ జూదం కూడా భీష్మ ద్రోణ విదురాది ధర్మవ్రతుల అనుమతితో, వారి సమక్షంలోనే జరిగింది అంటూ హాఫ్ వేలో** మొదలు పెట్టి అంతకు ముందు ఏం చెప్పాడో అన్న సంగతిని **అవుట్ ఆఫ్ సైట్‌లో** పెట్టారు

అంతే కాకుండా నా రొమ్ము చీలుస్తానన్నాడు, నా రక్తం తాగుతానన్నాడు అని భీముణ్ణి ఒక అనాగరికుడిలా స్థాపించారు మరి ఆ ద్రౌపది - అంటూ వస్త్రాలు ఎందుకు విప్పవలసి వచ్చింది అని బలరాముడు అడిగేలోపే -

ఆ, ఆ ఒక్క ద్రౌపది వర్గమేనా, లోకమంతా తన పక్షం, ఇక కౌరవవంశం నాశనం తప్పదు అని ప్రళయం చేస్తూ ఉంటే, నేనూ పట్టలేక అనేశాను - మా రారాజు పక్షం కొండంత దేవులు బలదేవుడే ఉన్నారని అన్నాను ఐతే ఆ బలదేవుడి ఎదుటే ఈ దుర్యోధనుడి తొడలు విరగ్గొడతాను, ఏం చేస్తాడు ఆ ముసలి! ఆ యాదవుడు!

ఈ మాటతో పాండవుల మీద సంపూర్ణ ద్వేషం కలిగింది బలరాముడికి ఇక మిగిలింది శశిరేఖను అడగటం భారత సామ్రాజ్యాధినేత అయిన దుర్యోధనుడు బలరాముడిపక్క, సింహాసనంలో కాదుగదా సముచితాసనంలో కూడా కూర్చోలేదు బలరాముడి ఆసనం పక్క కింద నేలమీద కూర్చున్నాడు అంత గౌరవం గురువుకి శిష్యుడిచ్చినట్లుగా భావించలేదు బలరాముడు యాదవుడికి క్షత్రియుడిచ్చినట్లు, సామంతునికి సార్వభౌముడిచ్చినట్లు భావించాడు

అలాంటి సమయంలో భావి భారత సామ్రాట్టు కావలసిన లక్ష్మణ కుమారుడు వచ్చాడు శిరస్సు తెచ్చి ఆయన పాదాలకు అంటించాడు చిరంజీవి చిరకాల వాంఛ మీ శశిరేఖ తన పట్ట మహిషి కావాలని తపస్సు చేస్తున్నాడు, మీరు వరం కటాక్షించాలి అన్నాడు శకుని

పట్ట మహిషి, వరం ఇవి బలరాముణ్ణి కదిలించిన పదాలు అన్నీ మరిచిపోయాడు అవశ్యం అంతకంటేనా అని మాట ఇచ్చాడు

ఈ విధంగా సత్కారం, సన్మానం, పొగడ్త, ఉచిత పదప్రయోగాలతో ఈ సంఘటన అద్భుతంగా మలిచారు

## సంఘర్షణ శిల్పం :

ఈ చిత్రంలో అత్యుత్తమ సంఘర్షణ శిల్పం శశిరేఖ పెళ్ళి నిశ్చయం అయ్యాక సుభద్ర బలరాముణ్ణి నిలదీసిన సందర్భంలో జరిగింది

శశి నీ కోడలే అని చేతిలో చెయ్యి వేసి ఇచ్చిన మాట తప్పటం న్యాయమేనా అన్నయ్యా అని సుభద్ర నిలదీయటంతో ప్రారంభమయినట్లు కనిపించే ఈ సంఘర్షణ- శశిరేఖ నాకీ పెళ్ళి ఇష్టం లేదు అని తన మందిరంలో తిరగబడటంతో బీజాన్ని సంతరించుకుంది

నీకిచ్చిన మాట 'మాట వరస'కు, దుర్యోధనుడికిచ్చినది 'వరం', అని రేవతి చెప్పింది రేవతి శశిరేఖ అమ్మ అమ్మకు తన కూతురి సుఖంకంటే ప్రపంచంలో మరొకటిఅక్కర్లేదు తెలుసు ఆమెకు శశిరేఖకు బావంటే ప్రాణమని ఆమె ఉద్దేశంలో

ప్రేమకంటే సామ్రాజ్యం గొప్పది అడవుల కంటే హస్తిన గొప్పది ఇప్పుడు పెళ్లి చేస్తే శశిరేఖను కాపురానికి పంపవలసింది ద్వైతవనానికి

శత్రువులతో వియ్యమందడానికి తలపెట్టారు *బావమరుదులు నన్నెంత చులకనగా చూస్తారు?* అని సుభద్ర అడిగితే *అంత చులకనగా చూస్తే నువ్వు అక్కడికి వెళ్లనే వెళ్ళకు* అన్నాడు ఎలాగూ పదమూడుసంవత్సరాలు పుట్టింట్లో గడపటానికి సిద్ధపడే వచ్చింది సుభద్ర అందుకే ఆ మాటన్నాడు

ఆఖరి బెదిరింపు చేసింది సుభద్ర *శశి నా కోడలు కాకపోతే ఈ ఇంట్లో ఒక్క క్షణం కూడా ఉండను* అంది

ఇదే కావాలి రేవతికి *చివరకి ఇదటమ్మా నీ బెదిరింపు! ఏ శోభలూ లేకుండా నీకు వలెనే నా కూతుర్ని కూడా పుట్టింట్లో పడి ఉండమంటావా?* అంది రుక్మిణినీ నిందించింది, కూతుర్ని కని ఉంటే అమ్మ మనసు తెలిసి ఉండేదని

ఈ నిశ్చయించిన లగ్నానికి వివాహం జరిగి తీర వలసిందే అని బలరాముడు ఆఖరి మాట చెప్పాడు ఇక ఈ సంఘర్షణలో భాగస్వామ్యం పంచుకోవలసిన పాత్రలు అభిమన్యుడు, శ్రీకృష్ణుడు వాళ్ళు ప్రవేశించే లోపలే ఉక్రోషంతో పాండవుల శౌర్యాన్ని సుభద్ర గుర్తు చేసింది అసలే ముక్కోపి అయిన బలరాముడు ఆగ్రహించి వాళ్ళను నిగ్రహించటానికి నాశిష్యుడు దుర్యోధనుడు చాలు పొమ్మన్నాడు ఆవేడిలో వచ్చి వాడిగా మాట్లాడాడు అభిమన్యుడు అతన్ని ఖండిస్తూ శ్రీకృష్ణుడు మాట్లాడి పంపి -

*సుభద్రా వీర పత్నివి, వీరమాతవు, ఇంత బేలవవుతావని అనుకోలేదు. అన్నగారి తాత్పర్యం తెలిసిందిగా ఇంకా అల్లరెందుకు? ఇక్కడ నీ మొర ఆలకించే వాళ్ళెవరూ లేరు. ఇక నీకు దిక్కున్న చోటకు వెళ్ళవచ్చు* అన్నాడు

ఇందులో ప్రతిపదంలోనూ ధ్వనిఉంది ఆవేశంలో ఉన్న సుభద్ర అది అర్థం చేసుకోలేదు వీరపత్నివి, వీరమాతవు అన్నాడు అవసరంఅయితే నీ కార్యనిర్వహణకు వాళ్ళిద్దరూ చాలు అని అంటున్నాడు ఇంత బలహీనురాలివి కావద్దు అన్నాడు అంటే ఈ కార్యం జాణతనంతో చెయ్యవలసింది గాని బేలతనంతో చెయ్యవలసింది కాదు అని చెబుతున్నాడు అన్నగారి తాత్పర్యం తెలిసిందిగా అంటే అన్నగారు కూతురిసుఖం కోసం లొంగిపోయాడని తెలియజేస్తున్నాడు అల్లరెందుకు అన్నాడు అన్నా, నేను, నువ్వు ముగ్గురం ఏకోదరులం అల్లరయితే మనకేగా నష్టం అని తెలియజేసాడు ఇక్కడ నీ మొర ఆలకించేవాళ్ళు లేరు అన్నాడు తను ఉన్నాడు కానీ తను ఉన్నాను అని చెబితే ఆ క్షణం నుంచే అన్నగారితో వైరం ఇక్కడ లేరు గాని మరెక్కడో ఉన్నారని

ధ్వనింపచేసాడు నీకు దిక్కున్న చోటకు పొమ్మన్నాడు ఆ దిక్కు ఘటోత్కచుడు ఈ కార్యం అతనే సాఫల్యం చేసి పెట్టాలి అందుకే ద్వైతవనానికి వద్దు ఘటోత్కచుడి దగ్గరకు తీసుకెళ్ళమన్నాడు

ఈ సంఘర్షణ విషమ స్థితికి దారి తియ్యటానికి శ్రీకృష్ణుడు సుభద్ర వైపు కొమ్ముకాయక పోవటమే కారణం

క్షణ క్షణం ఉత్కంఠాభరితమైన ఈ దృశ్యంలో అనుక్షణం సంఘర్షణ శిల్పం పాత్ర వైచిత్రి, శబ్ద వైచిత్రితో నడిచింది

### సన్నివేశ కల్పనా శిల్పం :

ఈ చిత్రంలో మనోహరమైన సన్నివేశాలు అనేకం

మాయాబజార్ అనే విడిదిగృహనిర్మాణం దగ్గర నుంచి పెళ్ళిచెడిపోయి ఘటోత్కచాశ్రమానికి వెళ్ళి ఆశీర్వదించటం వరకూ ఏకసన్నివేశమే ఈ సన్నివేశం మొత్తం అద్భుత రసమయం సన్నివేశమంతా, కుతూహలం, అనుమానం, అయోమయం అనే అవస్థలతో నిండి ఆహ్లాదకరంగా ఉంటుంది

ముఖ్యంగా సన్నివేశాన్ని వినోదాత్మకంగా తీర్చిదిద్దాలనుకున్న రచయిత, దర్శకులు, కంబళికి బదులుగా గింబళిని, తల్పానికి బదులు గిల్పాన్ని సృష్టించటం, వాటి మూలంగా శర్మ శాస్త్రి, సారధి కష్టాలు పడటం, ప్రధాన పాత్రలన్నింటిని పక్కన పెట్టి ఈ వినోదాన్ని అందించటం, వంటకాలన్నీ వివాహ భోజనంబు (ఈ రోజుకీ ఈ పాట పెళ్ళిల్లో పాడుతూనే ఉన్నారు) అంటూ ఘటోత్కచుడు ఆరగించటం అంతా వినోదమే మాయాశశిరేఖ లక్ష్మణకుమారుణ్ణి ఏడిపించటంలో కుతూహలం, అనుమానం అనే అవస్థలు నడిస్తే, శశిరేఖను అనుమానించటం భానుమతి అవస్థ ఒక రకంగా శకుని కూడా అనుమానించాడు పడింది ఒక కన్నా, రెండు కళ్ళా, నాకన్నేమయినా చెదిరిందా? శశిరేఖ కనికట్టు నేర్చిందా? అన్నప్పుడు, విడిదింట్లో శశిరేఖ శకునితో పాచికలు వేయించిన దృశ్యం మొత్తం అనుమానావస్థలోనే నడిచింది, ఇదీ వినోదమే

అంతే కాదు అసలు ఈపెళ్ళి మానుకుని వెళ్ళిపోదామని అనిపిస్తోంది అని భానుమతి ప్రతిపాదించినప్పుడు -

*చూసావా అదేనమ్మా శ్రీకృష్ణుని మాయ ఇలా అసహ్యించుకుని మనమంతట మనమే పెళ్ళి చెడగొట్టుకుపోవాలని శశిరేఖ చేత ఈ నటనంతా చేయించాడు వాని మాయలో మనమా పడేది. ఆ మూడు ముళ్ళు పడనియ్యండి తర్వాత అన్నీ చక్కబడతాయి.*

అని సర్ది చెప్పాడు గాని అతనికీ లోపల అనుమానమే అందుకే పెళ్ళిలో లక్ష్మణ కుమారుడు కోతి అని, పులి అని రాక్షసి అని కంగారుపడి చివరకు మూర్ఛపోయినప్పుడు ఏమిటిదంతా మామా అని దుర్యోధనుడు అడగగా -

ఆ! ఏముంది కృష్ణుడు లగ్నాన్ని సమర్థించినప్పుడే సందేహించాను. పెళ్ళి కూతురుని విడిదిలో చూసినప్పుడే అనుమానించాను. ఆ! ఇప్పుడీ మాయాజాలం అంతా తెలిసిపోయింది నిర్భయంగా చెబుతున్నాను బలదేవా ఈ కనిపించేది నీ కూతురు శశిరేఖ కాదు. ఏదో రాక్షసి. ఇలా నిన్నూ, నన్నూ మోసం చేసింది నీ తమ్ముడు శ్రీకృష్ణుడే! అన్నాడు శకుని

ఇక్కడిదాకా కుతూహలం, అయోమయం, అనుమానం నడిచి ఇప్పుడే వాస్తవం బయటపడుతోంది గనుక, ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠ బయలుదేరింది ఎప్పుడో చూపించి వదిలేసిన సత్యపీఠం ప్రేక్షకుడికి అంతత్వరగా గుర్తుకు రాదు సాత్యకి తీసుకు వచ్చాడు దీని ద్వారా సంఘర్షణ లేకుండా బలరాముడు మనసుమార్చుకుని జరిగిపోయిన శశిరేఖాభిమన్యుల వివాహ ప్రదేశానికి ఆశీర్వదించటానికి వెళ్ళటంతో ఉత్కంఠ తగ్గింది ఆడపడుచుహృదయంలో పుట్టిన ఈ కథలోని ఆశయం - ఏ ఇంట్లో జరిగినా నాకు పట్టింపులులేవు వదినా అని ఆడపడుచు సుభద్ర, రేవతికి మాట తిరిగి చెప్పటంతో ఆడహృదయంతో పాటు, మాయాజగన్నాటక సూత్రధారిలీల ఇది అంటూ ఆయన స్తుతితో ముగిసిపోతుంది

ఈ విధంగా ఈ సన్నివేశమంతా, అద్భుత, ఆనంద, ఆశ్చర్య, అయోమయ, ఆహ్లాద, అతిశయోక్తులతో నడిచి సర్వాంగభూషితమై విలసిల్లింది

## సంభాషణ శిల్పం :

ఈ చిత్రంలో వాడిన ప్రతి మాటా అర్థవంతమే యుక్తియుక్తమేగనుక ప్రత్యేకించి సంభాషణకొరకు ఒకదృశ్యాన్ని చూడటంకంటే పింగళివారి పదవైచిత్రిని అభినందించటం మంచిది

ఎన్ని పదాలు సృష్టించారు! అసమదీయులు, తసమదీయులు, వెయ్యరా వీరతాడు, తల్పం, గిల్పం, కంబళి, గింబళి, హైహై నాయకా, వైవై నాయకా, అం అహ్, ఇం ఇహీ, ఉం ఉహూ అంటూ మంత్రం చదవటం, రాక్షసులకు అం-ఔట్-శస్, టా-బ్యాం-భిస్ అంటూ ప్రత్యయాలు నేర్పటం, ద్వారాన్ని దవ్వారం అని పలికించటం, ఇలా వెతికితే ప్రతి పదమూ ఒక ప్రయోగమే 'ఛాంగుభళా' అనే అన్నమయ్య ప్రయోగాన్ని కూడా వాడుకున్నారు

అదే మన తక్షణ కర్తవ్యం అంటూ దుశ్శాసనుడి ఊతపదం నేను చెప్పినట్టు చేయుముురా సుపుత్రా నేను మెచ్చుకుంటాను అని హిడింబి ఊతపదం అన్నీ కొత్త ప్రయోగాలే

అర్థవంతమైన సంభాషణ అడుగడుగునా ఉండటం చేత మాయాబజార్ చిత్రమంతా సంభాషణ శిల్పంతో నిండినట్లే

**నేపథ్యశిల్పం :**

నేపథ్యసంగీతాన్ని, సంగీతాన్ని అద్భుతంగా ఉపయోగించుకోవటమే గాక, జూదంలో పాండవులను ఓడించాలి అన్నప్పుడు వచ్చిన శబ్దసంకేతాలు, భూకంపవాతావరణం, ఘటోత్కచఆశ్రమంలో అభిమన్యుడువస్తున్న రథంతాలూకు గుర్రపుడెక్కల చప్పుడు దుందుభిలో వినిపించడం **ఘటోత్కచ! ఘటోత్కచ!** అంటూ అందులో నుంచి శబ్దం వచ్చాక ఘటోత్కచుడు కనిపించటం, అంతా నేపథ్య శిల్పమే!

**అభినయశిల్పం :**

శ్రీకృష్ణుని పాత్ర ద్వారా అనేక సందర్భాలలో ఈ అభినయ శిల్పాన్ని సాధించారు చిత్రం నుంచి బయటకు వస్తే అందరికీ శశిరేఖ అభినయమే గుర్తుంటుంది దానికి కారణం స్త్రీ రూపంలోఉన్న ఘటోత్కచుడి ఆంగికాభినయాన్ని ప్రదర్శించిన తీరు అమోఘం, అతనితర సాధ్యం అందుకే మాయా శశిరేఖ అభినయంలో అడుగడుగునా అభినయశిల్పమే బయట పడుతోంది

శశిరేఖతో పాట పాడి చేతులు అతుక్కున్న సందర్భంలో లక్ష్మణకుమారుడు ప్రదర్శించిందీ అభినయశిల్పానికి తార్కాణమే

**శీర్షికాశిల్పం :**

నిజానికి ఈ చిత్రానికి శశిరేఖాపరిణయం అన్నది సరైన పేరు ఇంకా కావాలంటే శ్రీకృష్ణ లీల, శ్రీకృష్ణ విజయం, ఘటోత్కచ విజయం ఇలాంటి పేర్లు అనేకం పెట్టవచ్చు

కాని ఈ చిత్ర కథ సృష్టే మాయ చిత్రం నిండా శ్రీకృష్ణుడు, ఘటోత్కచుల మాయతోనే నిండి ఉంది కౌరవులకు **మాయాబజార్**లోనే బుద్ధి చెప్పబడింది

అందువల్ల ఈ చిత్రానికి మాయాబజార్ అనే పేరు సముచితం

**నామకరణ శిల్పం :**

భారతంలో పాత్రలే ఎక్కువ గనుక పాత్రలకు పేరు పెట్టటంలో శిల్పం ప్రదర్శించవలసినంత అవసరం ఈ చిత్రానికి లేదు

కాని చిన్నమయ అనే పేరు శిల్పార్థతను పొంది ఉంది

పెద్దమయుడు మయసభ నిర్మాణం కావిస్తే చిన్నమయుడు మాయాబజార్ నిర్మాణం కావించాడు మయసభ నిజమయినప్పుడు మాయాబజార్ కూడా నిజమేనని ప్రేక్షకుణ్ణి నమ్మించటం

మయుడు అది నిర్మిస్తే, చిన్నమయుడు ఇది నిర్మించవచ్చు అన్న విశ్వాసం కలిగించటం కోసం ఆ పేరు పెట్టటం ఉపజ్ఞత లంబు, జంబు, తాన శర్మ, తందాన శాస్త్రి, శకునిని తాత పాదులు అని పిలిపించటం, ఇవి శిల్పంలో భాగమే

ఈ విధంగా ఈ చిత్రం ఆసాంతం కథనశిల్పానికి సరైన ఉదాహరణ

*నిజానికి కల్పితకథను, ప్రఖ్యాతకథనూ (జరిగినకథను) మిశ్రమం చేసి చెప్పటం ఈహామృగం లక్షణం*[33]

ఇక్కడ నిజంగానే పెళ్ళి కూతురు కోసం వేట జరిగింది

అయిదు దశాబ్దాలుగా పండిత, పామర జనరంజకమైన ఈ చిత్రంలో ప్రతివిభాగములోనూ ఒక ప్రత్యేక పరిశోధన చేసుకోటానికి సరిపోయేటంత విషయం ఉంది

ఈ రకంగా ఈ అధ్యాయంలో శిల్పం అంటే ఏమిటి అని నిర్వచించుకుని, ఆ శిల్పం వలన చిత్రాలలోని చిత్ర కథల్లో ఏ విధంగా ఒదిగిందో, పొదగబడిందో విపులంగా చర్చించటం జరిగింది

నిజానికి ఇందులో చెప్పబడిన శిల్పం మానసిక, క్రియా రూపాల్లో ఉంటుందన్న నిజం - రచయిత - దర్శకుల మేధస్సులో ఉంటుంది ఒకసారి సమాధిలో రచయిత ఇచ్చిన దాన్ని అభ్యాసంతో దర్శకుడు పూర్తి చేస్తాడు లేదా అభ్యాసంతో రచయిత ఇచ్చిన దాన్ని, సమాధిలో దర్శించి దర్శకుడు తెరమీద ప్రదర్శిస్తాడు

శిల్పానికున్న రెండర్థాలకు రచయిత, దర్శకులు కారకులవుతారు ఇది చలన చిత్ర చరిత్ర చెప్పే సత్యం

ఇంత విపులంగా గాక కథనశిల్పం చలన చిత్రాల్లో మరోరకంగాకూడా పరిశీలిస్తూ ఉంటారు చిత్రాలు చెప్పేకథ చిత్రకథ గనుక చిత్రం వెనకవచ్చేచిత్రం ఐ జర్క్ కలిగించకుండా అంటే కంటిని ఇబ్బంది పెట్టకుండా వెళ్ళటం ఒక పద్ధతయితే భాషతో, భావంతో, షాట్‌తో, చిత్రం నుంచి చిత్రానికి వెళ్ళటం మరోపద్ధతి

ఉదాహరణకు విమానం దిగింది దాని టైర్ల మీద నుంచి కారు టైర్లకు కట్ చేస్తే ఇంటి ముందు కారు ఆగుతుంది ఇది **షాట్ స్క్రీన్ ప్లే**

మాయాబజార్‌లో శకుని గురించి కృష్ణుడు మాట్లాడగానే అంతకు ముందు బలరాముడికి కనిపించిన దుర్యోధనుడు, కృష్ణుడికి కనిపించిన శకుని పాండవులను జూదంలో ఓడించాలని పన్నాగం పన్నటం ఇది థాట్ స్క్రీన్ ప్లే.

మనల్ని కాపాడటానికి ఎవరో ఎక్కడో పుట్టే ఉంటాడు అనగానే కథానాయకుణ్ణి పరిచయం చెయ్యటం ఇది డైలాగ్ స్క్రీన్ ప్లే.

ఒక చిత్రానికి కొన్ని వేలషాట్లు ఉంటాయి అందులో కొన్ని మాట్లాడతాయి, కొన్ని పాడతాయి, కొన్ని పోరాడతాయి, కొన్ని పోట్లాడతాయి, కొన్ని నిశ్శబ్దంగా ఉంటాయి, కొన్ని వాతావరణానికి మాత్రమే సంబంధించి ఉంటాయి

ఇలా అన్ని వేల షాట్లు చిత్రకథలో సక్రమంగా నడపటమే ఒకశిల్పం ఆకాశంలో ఒక నక్షత్రానికి తగలకుండా మరొక నక్షత్రం ఎలా కదులుతుందో అలా ప్రేక్షకుడి మనః ఫలకంమీద ముద్రింపబడుతున్న తారలబొమ్మలు కంటికి, చెవికి, మనసుకి, బుద్ధికి ఇబ్బంది కలగకుండా నడపగలగటమే మహోన్నతమైన శిల్పం

ఒక షాటు ఎక్కువ తియ్యగూడదు ఒక షాటు తక్కువ తియ్యగూడదు ఒక్క క్షణం విసుగు పుట్టనివ్వ గూడదు ఒక త్రుటికాలంలో కూడా కథాపరమయిన అనుమానం రానివ్వగూడదు ప్రేక్షకుడిఊహకు అందాలి! ఊహకుఅందగూడదు! శ్రీనాథుడు చెప్పిన తెలుగుస్త్రీ చీరకట్టులాగా కవ్విస్తూ ఉండాలి, తెనాలి రామలింగడిలా నవ్విస్తూ ఉండాలి, తిక్కనలా రసశిల్పం అందిస్తూ ఉండాలి, నన్నయ్యలా పద ప్రయోగం వడ్డిస్తూ ఉండాలి, నిగూఢత పాటిస్తూ, నిశ్చేష్టుణ్ణి చేస్తూ, నిరాశ పరచకుండా వహ్వా అంటూ ప్రేక్షకుణ్ణి సినిమాహాలులోనుంచి కథన శిల్ప చాతుర్యంతో ఏ దర్శకుడు బయటకు పంపుతాడో ఆ మనీషి మనుషులున్నంత కాలం, సినిమా కళ ఉన్నంతకాలం నిలబడి ఉంటాడు గనుక, సినిమాకి కథనమే - ఆ శిల్పమే అనల్పమైన ఊపిరి అని మరోసారి మనవి చేస్తున్నాను

# పంచమాధ్యాయం

# విహంగ వీక్షణం

1931 నుండి ఈనాటి వరకు సుమారు కొన్ని వేల చలన చిత్రాలు నిర్మించబడ్డాయి

అసలు చలన చిత్రం అంటే ఏమిటి? అది ఎప్పుడు ఎలా పుట్టింది? ప్రపంచంలో ఎలా పుట్టింది? భారతీయ సినిమా జననం ఎలా జరిగింది తెలుగు సినిమా ఎలా ఆవిర్భవించిందో పరిశీలించటం జరిగింది

తొలుత పౌరాణిక చిత్రాల నిర్మాణానికి పూనుకుందని, ఆ తర్వాత సాంఘికచిత్రాలలో ఒకప్రయోజనాన్ని ఆశించి *గృహలక్ష్మి*, ***రోజులు మారాయి, రైతుబిడ్డ*** లాంటి సినిమాలు నిర్మించారని, మెల్లగా సాహిత్యంలో ప్రబంధయుగం ప్రారంభమైనట్లే సినిమాకథలలో కూడా వినోదంకోసం సినిమా అనే పద్ధతికి వచ్చి, పాశ్చాత్యులతో పోటీగా సాంకేతికంగా మనవారూ ఎదిగి సినిమానిర్మాణాలు చేపట్టారనీ తెలుసుకోవటం జరిగింది

సినిమా కధకు, సాహిత్య కధకూ ఉన్న వ్యత్యాసాలు చూసుకోటం జరిగింది సాహిత్య కధ లక్షణాలతో పాటు సినిమాకధకు కొన్ని ప్రత్యేకలక్షణాలుంటాయని వర్ణించటం జరిగింది ఆ లక్షణాలన్నీ కూలంకషంగా పరిశీలించటం జరిగింది

కధనం అంటే స్క్రీన్‌ప్లే అని, ఇందులో కధాంగాలన్నీ భాగాలై ఉంటాయని తెలుసుకోవటం జరిగింది కధనంలో కధ ఎన్ని దృష్టికోణాల్లో చెప్పబడుతుందో తెలుసుకోవటం జరిగింది స్క్రీన్‌ప్లేలో కధకు రాసుకునే భూమికా రచనను పరిశీలించటం జరిగింది

పాత్రల గురించి, సంభాషణల గురించి, నేపధ్యం గురించి సంఘటన, సంఘర్షణ, దృశ్యం - దాని ప్రయోజనం, సన్నివేశం, శీర్షిక, నామకరణం, అభినయం అన్నింటినీ పరిశీలించటం జరిగింది

ఇంతవరకు స్క్రీన్‌ప్లే మీద తెలుగులో ప్రామాణిక గ్రంథం లేకపోవటం చేత **మల్లీశ్వరి** లాంటి ఉత్తమ చిత్రాన్ని ఆధారం చేసుకుని అందులో దృశ్య మాలికను చూపించి కథనం ఎలా ఉంటుందో పరిశీలించటం జరిగింది

శిల్పం అంటే ఏమిటో తెలుసుకుని, చలన చిత్రాలలో శైలికీ, శిల్పానికీ ఉన్న తేడాను గమనించి ప్రతివిభాగంలోనూ ఉన్న శిల్పాన్ని విడివిడిగా దర్శించి మరలా కథనశిల్పం రూపంలో **మాయా బజార్** చిత్రంలో మొత్తం శిల్పం ఎలాఉంటుందో ఏకచిత్రంనుంచి ప్రదర్శించటం జరిగింది

తెలుగుసినిమాసాహిత్యంలో రచయితకూ, సాహిత్యరచయితకూ ఉన్న తేడా ఇంతకు ముందు గమనించటం జరిగింది

సాహిత్య కథారచయిత కంటే సినిమాకథారచయితకు మేలు జరుగుతుంది ఒకప్పుడు కీడుజరుగుతుంది కథగాని, నాటకంగాని, నవలగాని రాసుకునే సాహిత్యరచయిత తన సామ్రాజ్యానికి తనే మకుటం లేని మహారాజు సినిమా రచయిత అలా కాదు

కథారచయితతో పాటు ఒక్కొక్కప్పుడు కథాసహకారం అంటూ, కథావిస్తరణ అంటూ కొందరు రచయితలు, సంభాషణ కోసం మరో రచయిత, స్క్రీన్ ప్లే రచన అంటూ ఇంకొందరు పాలుపంచుకుంటారు ఒకప్పుడు కథారచయితకు అమృతపుచుక్కలు లభించవచ్చు మరో సందర్భంలో కడివెడుపాలలో విషపుచుక్క పడవచ్చు అందువల్ల సమష్టి కృషిలో ఒకడు అవుతాడు తప్ప సినిమారచయిత ఒక్కడూ ఒక్కడే కాదు చలన చిత్రానికి

రచయితలసహకారంతో పాటు దర్శకుడినైపుణ్యంకూడా తెలుగుసినిమాసాహిత్యం శోభించటానికి కారణంఅయ్యింది, ఔతోంది

ఒక్కోసారి మహానటుల అభినయ వైదుష్యంతో మామూలు కథలు కూడా గొప్పగా రాణిస్తాయి గొప్ప కథలకు సామాన్య మైన నటీనటులు లభించినప్పుడు ఆ కథాసౌందర్యం దెబ్బతినే అవకాశం కూడా ఉంది

సామాన్యమైన సన్నివేశాలను హావభావాలతో రక్తకట్టించిన మహానుభావులు, చక్కని నేపధ్యం అందించి అనురక్తి కలిగించిన సాంకేతిక నిపుణులు ఎందరో ఉన్నారు

ఒకనాడు లక్ష్యలక్షణసమన్వితంగా కావ్యం ఎలాఉంటుందో అలా ఒక **మాయాబజారు, ఒక మల్లీశ్వరి, ఒక పాతాళభైరవి** లాంటి చిత్రాలు వచ్చి, ఆ కథలూ, అందులోని సంభాషణలూ, సంగీతం ఇప్పటికి అయిదు దశాబ్దాలుగా ప్రేక్షకుల హృదయఫలకాలమీద ముద్రింపబడే ఉన్నాయి అంటే ఆనాటిరచయితలు తీసుకున్నజాగ్రత్తలు అలాంటివి

మెలమెల్లగా తెలుగుసినిమాసాహిత్యం తొలినాళ్ళలోని కావ్యలక్షణాలను వదిలి, ప్రబంధకవులనాటి వినోదమే ప్రధానంగామారి, పాశ్చాత్య ప్రభావానికిలోనై, సంభాషణలలో ఆఖరికి చిత్రగీతాల్లోని సాహిత్యంలోకూడా ఆంగ్లపదాలను విస్తృతంగావాడుతూ, సినిమాసాహిత్యానికే విలువతగ్గిపోయే ప్రమాదానికి దారితీయించారు అనటం అనాలోచితం కాదు

పండితభాష, కవులభాషలాగానే సినిమాభాషకూడా ఉంది వేల్చేరు నారాయణరావు ఈ భాష గురించి ఏమంటున్నాడో పరిశీలించాలి

*సాహిత్యం భాషాకృతిలో ఉన్న కళ భాష సామాజికం భాషను ఎవరు ఎందుకు వినియోగించినా రెండు శరీరవ్యవస్థలమధ్య భావవినిమయమే దాని ప్రధానచర్య భాషని ఉపయోగించేసాహిత్యం అనివార్యంగా పాఠకుణ్ణో ఉద్దేశించి ప్రవర్తిస్తుంది* [1]

పాఠకుణ్ణి అనే పదంబదులు ప్రేక్షకుణ్ణి అనిరాసుకుంటే ఈనిర్వచనం సినిమాకి సరిపోతుంది సినిమాప్రేక్షకుల్లో భాష తెలియని వారు, జనభాష మాత్రమే తెలిసినవారెక్కువ

అందుకే, కారులో షికారుకెళ్ళే వారి బుగ్గల నిగ్గు నీకు వచ్చిచేరెను తెలుసుకో! అని రాసిన ఆత్రేయ - కసిగా ఉంది కసికసిగా ఉంది అని రాసాడు శంకరా అని నివేదించిన వేటూరి ఓలమ్మి తిక్క రేగిందా అని రాసాడు

ఈ ముక్కలు ఎందుకు చెబుతున్నానంటే సినిమా రచయితలకు మంచి భాష వచ్చు, కాని **బీసీ థియేటర్లస్థాయి**ప్రేక్షకభాషకు దిగిపోతారు కారణం వ్యాపారాత్మకత ఇది అందరూ ఒప్పుకోరు అందుకే -

*కథాచిత్రాల వ్యాపార రణరంగంలో కేవలం ఆర్థిక చట్రం పరిధిలో ఆలోచించినంత కాలం సినిమా వ్యర్థ వస్తువుగానే తోస్తుంది*[2]

అంటాడు జయధీర్ తిరుమలరావు భాష అలా ఉంటే మరి ప్రభావాల మాటేమిటి? సాహిత్యం మీద స్త్రీవాద, దళితవాద ప్రభావాలున్నట్లే సినిమాల్లో కూడా ఉన్నాయి అని చెప్పుకోవటం ఆత్మద్రోహమే ఎప్పుడో సినిమాపుట్టినకాలాల్లో

పురాణ ప్రభావాలు, అభ్యుదయవాద ప్రభావం, సమకాలీన సాంఘిక సమస్యలుపయోగించటం జరిగిందేమోగాని చాలా ఎక్కువగా ఇక్కడ - విజయవంతమైన సినిమాకథల ప్రభావమే పడుతోంది

ఆర్ నారాయణ మూర్తి ఎర్ర సైన్యం ఆడేస్తే ఎర్ర సినిమాలు లెక్కకు మిక్కిలిగా వచ్చేసాయి కమ్యూనిజంమీద ప్రేమకాదు కమిట్ మెంట్ అసలే కాదు సక్సెస్, విజయంకావాలి! అంతే!

అత్తకథలు ఆడుతుంటే అత్తకథలు, రెడ్డి పేరుతో చిత్రాలు ఆడుతుంటే వరుసగా ఆ పేరుతో చిత్రాలు, ప్రేమకథలు ఆడుతుంటే ప్రేమకథలు, ఫ్యాక్షన్‌కథలు ఆడుతుంటే ఫ్యాక్షన్ కథలు ఇలా ప్రభావాలుంటాయి తప్ప, ఆయా సిద్ధాంత ప్రభావాలు కానే కాదు

ప్రభావంకంటే, ఇక్కడ ట్రెండుని ఎక్కువ అనుసరిస్తారు ఫలానావాళ్ళ సినిమా ఎందుకాడుతోంది? మనకథలో కూడా అవన్నీపెట్టేయండి అని అడిగేస్తారు

కె రాఘవేంద్రరావు, దాసరి నారాయణరావు, కె విశ్వనాథ్, ఆర్ నారాయణమూర్తి, మాదాల రంగారావులాంటివాళ్ళుమాత్రం వాళ్ళ ట్రెండుని వాళ్ళేనమ్ముకుని చిత్రాలుతీసారు తీస్తున్నారు

సినిమారచయితలు, దర్శకుల ట్రెండుకీ, నటీనటుల శైలికీ, నిర్మాతలకోరికలకీ తలవంచుతూ వెళ్ళాల్సిన పరిస్థితులు ఈ మధ్య మరీ పెరిగిపోయాయి

సినిమామాధ్యమం సామాన్యమైన ప్రభావాన్ని కలిగిలేదు అనేది జగమెరిగిన సత్యం అలాంటి మాధ్యమాన్ని ఆధారం చేసుకున్న సినిమాసాహిత్యరచయితలు వారివారి బాధ్యతలను గుర్తెరగాలి ఈ మబ్బు తొలగిపోతుంది అని రష్యాలో ఒకసామెత ఉంది అలాగే తెలుగు సినిమాసాహిత్యానికి కమ్మిన పాశ్చాత్యమబ్బుకూడా తొలగిపోయే సమయం దగ్గరలోనేఉంది

తెలుగుసినీసాహితీరచయితలందరూ మళ్ళీ స్వర్ణయుగాన్ని సాధించటానికి కంకణం కట్టుకుంటారన్న ఆశయంతో, ఆశతో ముగిస్తూ-

ఇది ముగింపుకాదు ప్రారంభంఅనితెలియచేస్తున్నాను ఎవరయినా పరిశోధన చెయ్య దలచుకుంటే తెలుగుసినిమాసాహిత్యం ఒక మహాసముద్రం! ఈ మహాసముద్రంలో ఉన్న రత్నాలను, వెతికి వెలికితీసే మహానుభావులెందరోరావాలని ఆశిస్తున్నాను వారికి స్వాగతం చెబుతున్నాను

